శ్రీమతే రామానుజాయ నమః



## శ్రీకూరేశ ప్రణీతము

# సుందరబాహు స్తవము

భావనావ్యాఖ్య- డా॥ శ్రీమాన్.ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు

పరిష్కరణము

న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్, ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు

**సుందరబాహుస్తవము - శ్రీ కూరేశులు**

భావనావ్యాఖ్య - డా॥ శ్రీమాన్.ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు

ప్రథమముద్రణము - ఏప్రియల్, 2007-సర్వజిత్, మేషము

ఆవిష్కరణము - భగవద్రామానుజుల వారి అవతారోత్సవ సందర్భము

ప్రతులు-500

వెల-రూ. 50/-



**(ఈ గ్రంథము ఉ.వే. శ్రీమాన్.ఎన్.వి.ఆర్.ఎల్. రంగనాథ అయ్యంగార్ స్వామివారు సమర్పించిన పవిత్రద్రవ్యముతో ముద్రింపబడినది.)**

ప్రతులకు

**శ్రీమతి ఈ. జయలక్ష్మి**

18-3-58/7, శాంతినగర్

కె.టి. రోడ్, తిరుపతి 517 507

ఫోన్- 0877- 2232091

**అక్షరయోజనము**

అన్నపూర్ణ గ్రాఫిక్స్

53/4, ఆర్.ఎస్. గార్డెన్స్

తిరుపతి. ఫోన్-0877-2235006

ఆచార్య.ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు

సంపాదకులు, భక్తినివేదన

5-94, మధ్యవీథి, సింహాచలం,

విశాఖపట్టణం.

## సౌందర్యమందాకిని

మన పూర్వాచార్యులయిన యామున, కూరేశ, భట్టారక, దేశిక ప్రభృతు లను గ్రహించిన స్తుతి ప్రబంధములు మధురభక్తి రసకలశములు, అనర్ఘసంప్రదాయ రత్నాకరములు. కల్పనానల్పసౌందర్య మందాకినులు, హృద్యానవద్య శిల్పాభిరామములు, భావమసృణములు, రసపిచ్ఛిలములు, మృదుశయ్యాసముపలాలితములు, క్వాచిత్కముగ శాస్త్రకంటకప్రచురాధ్వదుర్గమారణ్యానులూను, ఆ పెద్దలు మన ముంగిట గుట్టగ నెనరున నిలిపిన నిక్షేపములీ నిస్తుల స్తుతిప్రబంధములు.

పేరెన్నికగన్న ఆ మిన్నలలో **'నడయాడు పాతంజలము'**గా విఖ్యాతి గాంచినవారు శ్రీకూరేశ మిశ్రులు. భగవద్రామానుజులకంఠరంగవర్తులు. శ్రీ సంప్రదాయస్తుతి వాఙ్మయసామ్రాజ్యమూర్ధాభిషిక్తులు వీరు. **"సాహిత్యే సుకుమారవస్తుని దృఢన్యాయ గ్రహగ్రంథిలే తర్కే వా మయి సంవిధాతరి"** - అని శ్రీహర్షుడన్నమాట అక్షరాలా వీరి ననువర్తిస్తుంది.

శ్రీ కూరేశుల **'పంచస్తవి'** శ్రీసంప్రదాయ వల్లభులకు సిగపూవు.

దక్షిణవృషగిరిగా వినుతిగాంచిన **'తిరుమాలిరుమ్‌శోలై'** దివ్యక్షేత్రాన వెలసిన సుందరబాహుస్వామినిగూర్చి శ్రీకూరత్తాళ్వానులు కావించిన భావనం, మధురవేదనం, భక్తినివేదనం ఈ స్తుతి. ఈ సుందరబాహుస్వామి **'అ౧కర్'**గా తమిళనాట, సాహిత్యాన ప్రసిద్ధుడు.

వృషగిరిని, అటనెలకొన్న అ౧కర్‌ను కొండపైనుండి ప్రవహించు నూపురగంగను, భగవదాత్మకమైన అచటి చేతనాచేతన ప్రకృతివిలాసాన్ని దివ్యోదాత్తంగా, పరమరమణీయంగా సుమారు 130 శ్లోకాలలో కీర్తించారు శ్రీవత్స చిహ్నమిశ్రులీస్తవంలో.

సుందరభుజసౌందర్యమధునిపానమత్త కూరేశచిత్తమూ ఉత్తమకవితారూపాన ఆ నూపురగంగలాగే అందాలు చిందుతూ ఒయ్యారాలొలికిస్తూ, ప్రవాహాలుగా సాగుతుంది.

**క్వచి త్త్వరితగామినీ, క్వచన మందమందాలసా,**
**క్వచిత్ స్ఖలితవిహ్వలా, క్వచన ఫేనిలా సారవా ।**
**పతంత్యపి కిల క్వచిత్ వ్రజతి నూపురాహ్వానదీ**
**సుసుందరభుజాహ్వయం మధు నిపీయ మత్తా యథా ॥**

ఇదొక రతనాల ఖని. నిగూఢంగా ఉన్న రతనాలను తవ్వి తలకెత్తువారు కావాలి. మెఱుగులుపెట్టి ప్రకాశింపజేసేవారు కావాలి. తేనెపట్టులోని తేనెను ఈగల నుంచి మరలించి, యీవలకు తెచ్చి, మైనాన్ని ప్రక్కపెట్టి, తేర్చి తేటగా చేసి, దోసిళ్ళ నింపువారు కావాలి.

ఇందుకు పర్యాప్త పరికరాన్ని సమగ్రంగా సంతరించుకొన్నవారు వ్యాఖ్యాతృ శిరోమణులు, సుహృన్మణులు, ఉ.వే.శ్రీమాన్.డా.ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు. ఉభయ వేదాన్తముల పారము ముట్టినవారే కారు, లోతు నంటినవారును. విశ్లేషించి ఆళువారుల దివ్యభావనలను మసకలేని చూపుల ఆచ్చపు రూపున కనగల దార్శనికులువారు. సంస్కృత సాహిత్యంతోపాటు ద్రావిడభాషాసాహిత్యాలను, ఛందోవ్యాకరణాలంకారాది పరికరంతోపాటు పుక్కిట పట్టినారు. పూర్వాచార్యుల స్తుతిపద్యములు చెవి సోకగానే తత్సంవాది దివ్యసూరిభావచిత్రాన్ని, పదచిత్రాన్ని మది నిలుపుకోగల ప్రజ్ఞావంతులు, కూరేశభట్టారక స్తుతిప్రబంధ వ్యాఖ్యాతగా సంప్రదాయపరులకు పరిచితపూర్వులు. ఇట్లా సర్వవిధపరికరదక్షులయిన ఉ.వే.శ్రీమాన్. డా.ఈ.ఏ.శింగరాచార్యస్వామివారు కూరేశ మిశ్రుల యీ సుందరబాహుస్తవానికీ వ్యాఖ్యానాన్ని ఘటించటం నిజంగా ఆంధ్రుల అదృష్టఫలం.

పంచస్తవికి సంస్కృతంలో మూడు, తమిళంలో రెండు వ్యాఖ్యానాలు వెలసినవి. తెలుగునా ప్రతిపదార్థ తాత్పర్యములతో పద్యానువాదమూ వచ్చినది. సమగ్రము, సర్వాంగీణము అయిన వ్యాఖ్య ఇంతవరకు తెలుగున రాలేదు. శ్రీసింగరాచార్యకృత భావనావ్యాఖ్య ఆ లోటును తీరుస్తుందనటంచో సందేహం ఏమీ లేదు.

ఇప్పటికి వచ్చిన వ్యాఖ్యానాలన్నిటినీ దృష్టిలో పెట్టుకొని, ఆచార్యులవలన తాము పొందిన సదర్థాలను సందర్భోచితంగా సమన్వయిస్తూ ఋషుల, దివ్యసూరుల, దేశికోత్తముల అంతరంగాల చెలిమిని, ఐకరస్యాన్ని, ఐకముఖ్యాన్ని ఆర్జవంతో ఆవిష్కరిస్తూ నిస్తులాచ్ఛంగా, నిసర్గరమణీయంగా సాగినది భావనావ్యాఖ్యానం. వీరి వ్యాఖ్యాన విధానానికి ఒకటి రెండు ఉదాహరణలు.



5వ శ్లోకంలో **'భిదురితసప్తలోకసువిశృంఖలశంఖరవమ్'** అన్నచోట **'అదిర్కురల్ శజ్గత్తు అÇకర్'** – అన్న ఆవాకారుల శ్రీసూక్తిని స్మృతికి తేవటం. సంఘకాలపు పండితుడుగా సుందరబాహువు శంఖధ్వానం కావించిన విషయాన్ని చరిత్రసంపుటాల్లోంచి తవ్వి తలకెత్తటం – ఇటు సంప్రదాయాగౌరవాన్ని, అటు చారిత్రకసౌరభాన్ని ప్రకటిస్తాయి.

**సుందరదోర్ద్విర్వ్యాఙ్ఞాలంభనకాతరవశానుయాయిని కరిణి ।**
**ప్రణయజకలహసమాధి ర్యత్ర వనాద్రి స్స ఖలు సుందరదోష్ణః ॥**

ఈ శ్లోకం చెవిసోకగానే దివ్యసూరిసూక్తి సరస్వతిని జిహ్వాగ్రసింహాసనముల నెలకొల్పుకొనిన వారి తలపున మెరిసేది పెరియాళువారుల

**కరువారణమ్ తన్ పిడి తురన్దోడ క్కడల్వణ్ణన్**
**తిరువాణై కూఱ త్తిరియుమ్ త్తణ్తిరుమాలిరుమ్ శోలైయే** – అన్న శ్రీసూక్తి.

వనాద్రిని తిరుగుతున్నాయి ఏనుగులు. ఆడ–మగల నడుమ ప్రణయకలహం. ప్రణయరోషాన ఆడఏనుగు మగ ఏనుగును వీడి దూరంగా పోను బయలుదేరుతుంది. అంత మగ ఏనుగు "నన్ను కనుక నీవు వదిలి వెళ్ళిపోతే మన సుందరబాహుస్వామిపై ఆన సుమా" అంది. అంతే, ఆడఏనుగు ఆగిపోయింది. దివ్యప్రబంధదృశ్యాలు సదా దృగ్గోచరాలు కానివారిట్లా వ్రాయలేరు.

గజమిథునాలు ప్రణయకలహాలలో సుందరబాహుస్వామిపై ఆనపెట్టినట్లే, ఎన్నో ప్రణయమిథునాలు, తిర్యక్కులే కానీండి, ఆనలు పెడతాయి.పక్షులు గరుడునిపైన, పాములు శేషునిపైన, వానరాలు హనుమపైన, భల్లూకాలు జాంబవంతునిపైన, గద్దలు జటాయువుపైన, ఏనుగులు గజేంద్రునిపైనా ఆనపెట్టుకుంటాయి. ఆదిగజదంపతులు ఆన సుందరబాహువుల పైన. తదాది తిర్యక్కులన్నీ స్వకులపతులపైన ఆనలు పెట్టుకొని తమ శేషత్వాన్ని భాగవతపర్యంతం ప్రకటించుకొంటాయి. ఈ కులపతులలో దాస్యకులపతులు కానివారెవరు?

పరమాద్భుతభావన!

**వకుళధరసరస్వతీవిషక్త స్వరరసభావయుతాసు కిన్నరీషు ।**
**ద్రవతి దృష దపి ప్రసక్తగానాస్విహ వనశైలతటీషు సుందరస్య ॥**

సుందరబాహుసేవాగతలైన కిన్నర స్త్రీలు శఠకోపులు వనాద్రినిగూర్చి పాడిన

దశకమును సస్వరంగా, సాభిప్రాయంగా, రసవత్తరంగా పాడుతున్నారట. వారి గానానికి అచటి రాళ్ళు కరిగి నీరవుతున్నాయట. అదేనట నూపురగంగాప్రవాహం! ఎంత అద్భుతమైన భావనం! సుందరబాహుస్తవం ఒక సౌందర్యమందాకిని. దాని లోతులు తాకాలంటే భావనలోకి దిగాలి మతి!

సౌందర్యమందాకినిలో తత్త్వవిచారధార–

**సద్బ్రహ్మాత్మపదై స్త్రయీ శిరసి యా నారాయణోక్త్యా.....**

పరబ్రహ్మను శ్రుతి, స్మృతి – సూత్రప్రమాణాలతో అఖిలహేయప్రత్యనీకుడుగా, కల్యాణగుణైకతానుడుగా, అప్రాకృతదివ్యమంగళ విగ్రహుడుగా నిరూపిస్తూ. ఈ శ్లోకాలను ఉదాత్త గంభీరంగా హృద్యానవద్యంగా వ్యాఖ్యానించిన తీరు సర్వథా ప్రశస్యతరం.

ఇట్లాకంటకిత శాస్త్రసరణులామృదుపద్యలు నెలకొల్పినారు వ్యాఖ్యాతలు.

సుందరబాహుస్తవాన్ని బహుసుందరంగా ఆంధ్రజాతి కందించిన ఉ.వే.శ్రీమాన్. డా.ఈ.ఏ.శింగరాచార్యస్వామివారు శ్రీవత్సాంకమిశ్రుల ఇతర స్తవాలనీ తెలుగులకు తేటతెల్లం కావించాలని, అందుకు వారికి తగిన ఆయురారోగ్యభాగ్యములను శ్రీనివాసుడు ప్రసాదించేటట్లు భాగవతమంగళాశాసనం వారికి లభించాలనీ కోరుకుంటూ, విరమిస్తున్న–

భాగవతవిధేయుడు
శ్రీరామచంద్రాచార్య



# ప్రవేశిక

**కిళరొళియిళమై క్కెడువదన్మున్నమ్ వళరొళి మాయోన్ మరువియ కోయిల్**
**వళరిళమ్ పొళ్‌ిల్ శూళ్ మాలిరుఞ్జోలై తళర్విలరాకిల్ శార్వదు శదిరే**

(తిరువాయ్ – 2-10-1)

(నిరంతరం వృద్ధిచెందే, జ్ఞానప్రకాశం కల్గిన లేతవయస్సు నశించడానికి ముందే ఏ మాత్రం సంకోచంలేని తేజస్సును కల స్వామి నిత్య నివాసంచేసే ఆలయం, వృద్ధిచెందే లేలేత తోటలతో చుట్టబడిన తిరుమాలిరుమ్‌శోలై పర్వతాన్ని కొంచెం కూడా అనర్థంలేని వారమై ఆశ్రయించడమే ఆత్మకు స్వరూపానురూపం)

**శ్రీమద్వనాద్రిపథనూపురనిమ్నగాంతే దేశే స్థితో వృషభపర్వతచందనాఢ్యే ।**
**ధర్మేక్షిత స్సుమలయధ్వజపాండ్యదృష్టః ప్రాగాసనో లసతి సుందరబాహునాథః ॥**
**సోమసుందరవిమానమధ్యగః సుందరోపపదవల్లికాయుతః ।**
**విష్ణుచిత్తకలిజిత్పరాంకుశైః గోదయా మణిమహర్షిణా స్తుతః ॥**

**– (దివ్యదేశవైభవప్రకాశికా–మహావిద్వాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారు)**

**పణిన్దేన్తిరుమాలై పామాలై తాళిల్**
**అణిన్దేన్ అరుట్టఙ్గమాక – త్తుణిన్దే**
**న్తిరుమాలిరుమ్‌శోలై శేర్న్దేన్ ఎనక్కు**
**వరుమాలిరుఞ్జోతి వాన్ పా** (నూత్రెట్టు త్తిరుపతియన్దాది)

(తిరుమాలిరుమ్‌శోలై అనే దివ్యదేశాన్ని చేరాను. శ్రియఃపతి అయిన అచటి స్వామిని సేవించాను. ద్రావిడ పాశురమాలికను స్వామి శ్రీపాదాలలో అలంకరించాను. ఆ స్వామి కరుణనే శరణంగా నమ్మి ఉన్నాను. అటువంటి నాకు పరంజ్యోతిస్స్వరూపమైన పరమపదం తప్పక లభిస్తుంది).

సంస్కృతవాఙ్మయనందనోద్యానంలోని స్తోత్రకల్పకం ఫలించిన అమృతఫలమే కూరేశుల సుందరబాహుస్తవం. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాభేదాలతో ఐదు విధాలైన భగవద్రూపాలలో అర్చారూపాన్ని స్తుతించేది ఈ కృతి. భగవద్యామునుల స్తోత్రరత్నం శ్రీరంగంలోని అర్చామూర్తి శ్రీరంగనాథుని గూర్చి రచింపబడిందనే అభిప్రాయం కొంతమందికి ఉన్నా, ఆ స్తోత్రంలో దానికి తగిన స్పష్టమైన నిర్దేశం లేదని, బహుశః అది పరరూపానికి చెందినదే కావచ్చునని మతికొందరు భావిస్తున్నారు. అందువల్ల అర్చారూపాలను గూర్చిన మొట్టమొదటి శ్లోకరూప స్తోత్రం కాంచీపూర్ణుల దేవరాజాష్టకం అని భావిస్తే, ఈ సుందరబాహుస్తవం రెండవది అని చెప్పవలసియున్నది. అర్చామూర్తి స్తుతుల్లో కాలాన్నిబట్టి ద్వితీయమైనా, మిగిలిన అన్ని రీతుల్లో అద్వితీయమైన ఈ స్తోత్రరాజం

వనగిరి అనబడే తిరుమాలిరుమ్‌శోలై లోని సుందరబాహుస్వామిని గూర్చి రచింపబడింది. ఈ స్తుతిలోని విశేషాలను సంగ్రహంగా ప్రస్తుతించడానికి ముందుగా ఆ దివ్యక్షేత్రానికి సంబంధించిన కొన్ని విశేషాలు సంక్షిప్తంగా ప్రస్తావింపబడుతున్నాయి.

**"అఴకర్ కోయిల్"** అనే దివ్యక్షేత్రం పాండ్యదేశంలోని క్షేత్రాలలో ప్రధానమైనది. మధురకు ఈశాన్యదిశలో 12 మైళ్ళదూరంలో ఉన్న ఈ క్షేత్రం ఎత్తైన పర్వతశ్రేణుల పాదప్రదేశంలో ఉన్నది. **'అఴకర్'** అనే పదం ప్రకృతిసౌందర్యానికి నిలయమైన ఈ పర్వతాన్ని, ఇచట స్వామిని నిర్దేశిస్తున్నది. ఈ ఆలయం సుమారు 300 ఎకరాల విస్తీర్ణంలో నిర్మింపబడి, ఈ నాటికి మిగిలిన శిథిల ప్రాకార అవశేషాలతో పరివృతమై ఉన్నది. ప్రస్తుతం కనిపించే ఎత్తైన, అందమైన ప్రవేశద్వారగోపురాన్ని పాండ్యరాజు ఒకడు నిర్మించాడు. అందమైన పూపొదలతో, దట్టమైన అడవులతో, లెక్కలేనన్ని కొండవాగులతో, జలపాతాలతో చూచేవారి కన్నులకు, మనస్సుకు పండుగగా తోచే ప్రకృతిరామణీయకంతో విలసిల్లుతున్నది. ఇచట పర్వతాన్ని సాక్షాత్తు భగవత్స్వరూపంగానే కొందఱు భావిస్తారు. 700 సం॥లకు పూర్వం రచింపబడ్డ, ప్రాచీన తమిళ గ్రంథమైన పరిపాడల్‌లో ఈ కొండ భగవానుని ప్రతిరూపంగానే వర్ణింపబడినది. ఈ పర్వతసౌందర్యాని భట్టనాథులు వర్ణిస్తూ – **"ఆయిరమ్‌తోళ్ పరప్పి ముడియాయిరమ్ మిన్నిలక ఆయిరమ్ పైన్దలైయ అనన్దశయనన్ ఆళుమ్ మలై ఆయిరమ్ ఆఱుకళుమ్ శునైకల్ పలవాయిరముమ్ ఆయిరమ్ పూమ్బొఴిలుముడై మాలిరుమ్‌శోలైయదే"** (4–3–10) అని సాయించారు.

శతాబ్దాల చరిత్రగల్గిన, అతిప్రాచీనమైన ఈ క్షేత్రంగూర్చి పలు పురాణాలు, పలు దివ్యసూరిసూక్తులు అభివర్ణిస్తున్నవి. దీనికి సంప్రదాయంలో **"తిరుమాలిరుమ్‌శోలై"** – అంటే – శ్రీవల్లభుడు నివసించే వనం – అని, **"వనగిరి"** – అంటే, అందమైన వనాలను కల్గిన పర్వతం అని, **"వృషభాద్రి"** (ఈ కొండ రూపంలో వృషభాన్ని, దీని చుట్టు ఉన్న చిన్నచిన్న కొండలు గోవులను (ఆవులను) పోలి ఉన్నవి కాబట్టి) అని పేరు కల్గినదని పెద్దలంటారు. మహాభారతంలో – ధర్మరాజు తీర్థయాత్ర చేస్తూ ఈ క్షేత్రాన్ని దర్శించినట్లు తెలుపబడినదని, అపుడు దీనిపేరు వృషభాద్రి అని కొందఱి అభిప్రాయం. వామనపురాణం ఇచటి స్వామి మహిమను, గంగోత్పత్తిని, వైభవాన్ని కీర్తిస్తున్నది. బ్రహ్మాండపురాణం వృషభాద్రి మహిమను నూపురగంగను అభివర్ణించగా, వరాహపురాణం ఇచట ఉన్న పలు తీర్థాల విశేషాలను, కొండవైభవాన్ని వర్ణిస్తున్నది. సనత్కుమారసంహిత, బ్రహ్మసంహిత – మొదలైన ఆగమగ్రంథాలు, పూదత్తాఴ్వార్లు, పేయాఴ్వార్లు, నమ్మాఴ్వార్లు, పెరియాఴ్వార్లు, తిరుమంగై ఆఴ్వార్లు, గోదాదేవి – అనే ఆఱుగురు పాడిన 128 పాశురాలు, కూరేశకృత సుందరబాహుస్తవంవంటి సంస్కృత స్తోత్రాలే కాక, పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ రచించిన అష్టప్రబంధంలోని అఴకర్ అన్దాది, వేమ్బత్తూర్ స్వామి కవి కళారుద్రర్ రచించిన అఴకర్ పిళ్ళైత్తమిఴ్, కవికుంజరమ్ అయ్యర్ కృతమైన అఴకర్ కలమ్బకమ్, బాలపట్టి చొక్కనాథన్ పులవర్ కవికుంజర భారతి ప్రణీతమైన శోలైమలైక్కుఱవఞ్జి – వంటి కృతులు ఈ



దివ్యక్షేత్రవైభవాన్ని, ఇచటి కొండను, స్వామిని పొగడుతున్నాయి. కోయిల్ ఒఴుకు అనే శ్రీరంగాలయ చరిత్రను తెలిపే సంప్రదాయగ్రంథం – మహమ్మదీయుల దండయాత్రల సమయంలో కొంతకాలం రంగనాథుని అర్చామూర్తి ఇచటి బావిలో దాచబడినదని పేర్కొంటున్నది. సుమారు 2000 సంవత్సరాలకు ముందు ఒకానొక సిద్ధుడు ఇచట సిద్ధవైద్యశాల నెలకొల్పినట్లుకూడ చెప్పబడుతూ ఉండడంవల్ల ఈ క్షేత్రం ప్రాచీనతేకాక, ఇచట పలువిధాలైన ఔషధాలు, మూలికలు విరివిగా దొరుకుతాయనికూడా వెల్లడి అవుతున్నది, ప్రాచీనతమిళకావ్యమైన శిలప్పదికారంలో ఈ క్షేత్రాన్ని, ఇచటి తీర్థాలన్నీ, స్వామిని గూర్చిన వైభవాన్ని ఒక బ్రాహ్మణుడు నాయకీనాయకులైన కణ్ణకి, కోవలన్‌లకు తెలియజేస్తాడు. (ఈ సందర్భంలో పేర్కొనబడ్డ ఇష్టసిద్ధి, భావకరిణి, పుణ్యశ్రవణ – అనే మూడు తీర్థాలు ఈనాడు కన్పించడం లేదు)

ఇచటి కొండలో చాలా గుహలున్నాయి. సుమారు రెండువేల సంవత్సరాలకు పూర్వం బౌద్ధజైనమతాలు ఈ ప్రాంతంలో విస్తృతప్రచారాన్ని పొందినపుడు, బౌద్ధజైన మతాలకు చెందిన మతప్రవక్తలు ఈ గుహలో నివసించారని ప్రతీతి. అపుడు వారు గుహలలో చెక్కించిన పలు శిలాశాసనాలు ఈ నాటికీ నిలచిఉన్నాయి. వామన పురాణంలో తెలుపబడిన వృషభాద్రి (వనగిరి) మాహాత్మ్యాన్నిబట్టి, ఇచట మార్కండేయ మహర్షి, అంబరీషుడనే ప్రభువు ఈ కొండ మీద సుమారు 350 సం॥లు తపస్సు చేయగా, వారిని అనుగ్రహిస్తూ స్వామి ఉభయదేవేరులతో గరుడవాహనాధిరూఢుడై ప్రత్యక్షమయ్యాడు. మార్కండేయ మహర్షికి చిరంజీవిత్వాన్ని, అంబరీషునకు ముక్తిని ప్రసాదించాడు. అనే ఈ కథను జనకుడు వామదేవునకు చెప్పినట్లు ఆ పురాణంలో ఉన్నది.

ఇచట స్వామి ప్రాఙ్ముఖుడు. స్థానకమనే నిలుచున్న భంగిమలో స్వామి వేంచేసి ఉన్నాడు. మూలమూర్తి, ఉత్సవమూర్తి – పంచాయుధ హస్తులు. బాహువులోఉన్న సుదర్శనం ప్రయోగసన్నివేశంలో ఉన్నది. మూలమూర్తికి అఴకర్. కళ్ళఴకర్, మాలలఙ్గారర్, మాలిరుమ్‌శోలైనమ్బి అనే తిరునామాలు కూడా ఉన్నాయి. **"ఏఱు తిరువుడైయాన్"** అనే చిన్న ఉత్సవమూర్తి కూడా ఉన్నది. ఉత్సవమూర్తి సుందరబాహుస్వామి; దేవేరి సుందరవల్లి. ఈ దివ్యదేశంలోని స్వామి సమస్తకల్యాణగుణాకరుడైనా, భక్తవ్యామోహమనే గుణం స్వామిలో అతిశయించి ఉంటుందని ఆచార్య హృదయకారులు – **"త్యాజ్యదేహవ్యామోహమ్ మరుళ్‌కళ్‌కడియుమ్ మయల్ మికుపొఴిలిలే తఴైక్కుమ్"** అనే సూత్రం ద్వారా అనుగ్రహించగా, శ్రీమద్వరవరమునులు ఈ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ – ముముక్షువులకు త్యాజ్యమైన వారి దేహంలో, అది చరమ దేహం కావడంవల్ల, మహిషియొక్క ఉచ్ఛిష్టాన్ని అభిలషించే రాజపుత్రునివలె **"వఞ్జక్కళ్‌వన్"** (వంచించే మోసగాడు) మనస్సులో, ప్రాణంలో కలిసిపోయి, **"మాయవాక్కై యితనుళ్‌పుక్కు"** (అసత్యమైన ఈ శరీరంలో ప్రవేశించి) అన్నట్లు దీనిలోని దోషాన్ని చూడకుండా లోపలకు ప్రవేశించి, **"తిరుమాలిరుమ్ శోలైమలైయే"** అన్నట్లు అభిమాన స్థలాలు అన్నిటిలో చూపే ఆదరాన్ని ఇందులోని ఏకదేశంలోనే కల్గి

ఉండి **"మజ్జవొట్టు"** అన్నట్లు కాళ్ళను కట్టి పడవేసేరీతిలో అతనికి ఉన్న వ్యామోహం **"మరుళ్‌కళ్ కడియుమ్ మవోమలై"** అన్న రీతిలో అందటి అజ్ఞానాన్ని సవాసనగా పోగొట్టేదిగా, **"మయల్ మికుపొళ్లిల్ శూళ్మాలిరుమ్‌శోలై"** – అన్నట్లు భోగ్యతాతిశయంతో భోక్తలకు పిచ్చెక్కించగల తోటలను కల్గిన దక్షిణ తిరుమలలో సమృద్ధిగా ఉంటుంది."– అని వివరించారు.

ఇచటి స్వామి విషయంలో గోదాదేవి **"నాఱునఱుమ్ పొళ్లిల్ మాలిరుమ్‌శోలై నమ్బిక్కు నాన్ నూఱుతడావిల్ వెణ్ణెయ్ వాయ్ నేర్‌న్దు పరావి వైత్తేన్"** అని నూఱు గంగాళాలవెన్నను సమర్పించాలని ఆశపడగా, శ్రీరామానుజులు ఆవిధంగానే సుందరబాహుస్వామికి నూఱుగంగాళాల వెన్నను అర్పించారని, అందువల్ల గోదాదేవి చాలా ఆనందించి, రామానుజులను సంప్రదాయ చరిత్ర గ్రంథకధనం. తిరుమంగై ఆళ్వార్లు ఇచటి స్వామి **"తెన్నానై"** (దక్షిణ దిగ్గజం)గా స్తుతించారు. ఇచటి ప్రధానతీర్థం నూపురగంగ. స్థలవృక్షం చందనం. ఇచటి విమానం పేరు సోమసుందరవిమానం. ఇచటి అర్చామూర్తి శుద్ధబంగారంతో – అంటే – అపరంజితో చేయబడింది. ఇటువంటి ఇంకొక విగ్రహం తిరువనంతపురంలో మాత్రమే ఉన్నదని అంటారు. ఈ ఉత్సవమూర్తికి అభిషేకాన్ని నూపురగంగానదీజలంతో మాత్రమే చేస్తారు. చైత్రమాసంలో జరిపే ఉత్సవసమయంలో స్వామి తిరువండియూర్‌కు వేంచేసినపుడు కూడా అచట నిర్వహించే అభిషేకం నిమిత్తం నదీతీర్థాన్ని మోసుకొని వెడతారు. విశేషమేమంటే, వేఱొక జలంతో అభిషేకం జరిపితే, ఈ విగ్రహం రంగు నల్లగా అయిపోతుందట. ఈ మూర్తిలోని అద్భుత శిల్పకళాసౌందర్యం ఎటువంటివారి దృష్టిని అయినా ఆకర్షిస్తుంది.

ధర్మరాజు తీర్థయాత్ర చేస్తూ భూలోకవైకుంఠం అయిన ఈ క్షేత్రానికి వచ్చి ఇచటి ప్రకృతి సౌందర్యానికి, పర్వతశోభకు ముగ్ధుడై, ఇచటనే చిరకాలం నివసించి, తపస్సు చేశాడట. సుందరరాజస్వామి అతనికి ప్రత్యక్షమైనపుడు నూపుర గంగానదీతీరంలో నివసిస్తూ, లోకులను అనుగ్రహించమని స్వామిని అతడు ప్రార్థించగా, అతని వేడికోలును మన్నించిన స్వామి అక్కడనే వెలిశాడు. ధర్మరాజు అపుడు స్వామికి ఆలయగోపురప్రాకారాదులను నిర్మింపజేశాడు. ఒకనాటి రాత్రి ఆకాశంలో పూర్ణచంద్రుణ్ణి చూచిన ధర్మరాజు ఆలయవిమానాన్ని ఆ పూర్ణచంద్రుని ఆకారంలో విశ్వకర్మ ద్వారా నిర్మింపజేశాడట. ఆ విధంగా నూపురగంగాతీరంలో స్వామి ఉభయదేవేరులతో నిత్యవాసం ఉంటూ, ఈనాటికీ భక్తులను తరింపజేస్తున్నాడు. వామనపురాణంలోని మలయధ్వజవృత్తాంతాన్ని భట్టనాథులు పరోక్షంగా ప్రస్తావించగా, దాన్ని శ్రీవరవరమునులు తమ వ్యాఖ్యానంలో ఉట్టంకించారు. ఇచటి మండూక తీర్థంగూర్చిన కథ ఒకటి ఉన్నది. సుతపస్సు అనే మహర్షి నీటిలో మునిగి తపస్సు చేస్తూండగా, అతని వద్దకు దుర్వాసమహర్షి వచ్చాడు. అతని రాకను ఎంతసేపటికీ సుతపస్సు గమనించకపోవడంతో ఆగ్రహించిన దూర్వాసుడు ఆ ఋషిని మండూకం కాగలవని శపించాడు. అపుడు సుతపస్సు బయటికి వచ్చి, ప్రార్థించగా, అతడు



వరాహ (వన) గిరిలో పండ్రెండు ఏండ్లు నివసించి, స్వామిని సేవిస్తే అతని శాపానికి విమోచనం కల్గి, నిజరూపం ప్రాప్తిస్తుందని అన్నాడు. సుతపస్సు ఆవిధంగానే చేసి, శాపవిముక్తుడయ్యాడట. అందువల్ల ఈ పర్వతానికి మండూకపర్వతమని, నూపురగంగకు మండూక తీర్థమని పేరు వచ్చింది. ఈనది కొండలో ఏ చోటునుండి పుట్టిందో సరిగా గుర్తించలేము. మాధవీమండపానికి సమీపంలోని గోముఖినుండి పెల్లుబికివస్తుండే ఈ నదీతీర్థం కొండ క్రిందకు చేరి, పలుప్రాంతాలలో వ్యవసాయానికి ఉపయోగిస్తున్నది. ఈ నదీతీర్థంలో ఇనుము, రాగి, మొదలైన గైరిక ధాతువులు కలసి ఉండటంవల్ల ఔషధగుణాన్ని కల్గి ఉన్నది. తేనెవలె తీర్థం తీయగా ఉన్నందున ఈ నదికి తేనీర్ అని పేరు. ఇంకా ఈ కొండపై హనుమత్తీర్థం, గరుడ తీర్థం, పాండవతీర్థం, ఉత్తరనారాయణబావివంటి తీర్థాలు చాలా ఉన్నాయి.

## ఆలయాలు – విశేషాలు

ఇచట కన్పించే పలు ఆలయాలలో భైరవుని ఆలయం ఒకటి. ఈ భైరవుడు క్షేత్రపాలకుడు. సామాన్యంగా శివాలయాలలో మాత్రమే కన్పించే ఈ మూర్తి ఈ వైష్ణవాలయంలో నెలకొని ఉండడం విశేషం. ఇది మతసామరస్యానికి ప్రతీక అని కూడా కొందఱి భావన.

తాయార్ సన్నిధి వేరొక ప్రసిద్ధమైన ఆలయం. ఇది చాలా అందమైనది. గోదాదేవి కోవెలలోని ఉత్సవమూర్తి కూర్చున్న సన్నివేశంలో వేంచేసి ఉండడం విశేషం. గోదాదేవిమూర్తి ఈ భంగిమలో వేఱెక్కడ ఉన్నట్లు తోచదు. గోదాదేవి పరిణయోత్సవంనాడు సుందరబాహు స్వామి ఉభయదేవేరులతో, కల్యాణసుందరవల్లితో వేంచేస్తాడు. ఈ సేవ చాలా అపూర్వమైనది. ఇచటి శ్రీసుదర్శనుని కోవెల చాలా ప్రత్యేకతను, ప్రభావాన్ని కల్గినది. అందులోనున్న యోగనరసింహస్వామిమూర్తి చాలా ఉగ్రమైన రూపంలో వేంచేసి ఉన్నాడు. ఆ మూర్తి శిరస్సునుండి ఉద్గతమైన కోపం పైకిపోవడం కోసం ఆలయం పైభాగంలో ప్రవేశం కల్పించబడిందట. అంతేకాక, స్వామి ఆగ్రహాన్ని ఉపశమింపజేయడానికి ప్రతిదినం పాలతో, పెరుగుతో, తైలంతో అభిషేకం చేయబడుతుంది. దీనికి అవసరమైన సొమ్ము కోసం సుమారు 110 సం॥ల క్రితం పచ్చైయప్ప ముదలియార్ అనే భక్తుడు దానం చేశాడట. ఈ విషయం పడిగోపురం దగ్గర చెక్కబడిన శాసనంలో ఉన్నది. అదే విధంగా, సప్తమాతృకల ఆలయంకూడా విశిష్టమైనది. ఇందులో బ్రాహ్మీ, మహేశ్వరి, కుమారి, వైష్ణవి, వారాహీ, మహేంద్రి, చాముండి – అనే ఏడుగురు మాతృకల మూర్తులు ఉన్నాయి. ఇది కాక, కరుప్పణ్ణ స్వామి ఆలయం, ఆదిదేవత ఆలయంకూడా పేర్కొనదగినది. ఈ కరుప్పణ్ణ స్వామి ఆలయం ముందు ఎవరూ అసత్యం చెప్పడానికి, అసత్యప్రమాణాన్ని చేయడానికి సాహసించరట. నేరం చేసినట్లు అనుమానింపబడేవారు ఈ ఆలయంముందు ప్రమాణంచేసి, తాము నేరం చేయలేదని నిరూపించుకుంటారట. మధుర, రామనాథపురం, తిరునల్వేలి జిల్లా ప్రాంతాలకు చెందిన పలువురు నేరం చేసినట్లు అనుమానింపబడ్డవారు తమ పవిత్రతను నిరూపించుకోవడం

కోసం ఈ ఆలయంముందు ప్రతిజ్ఞ చేయడం ఈనాటికిని గమనించవచ్చు. సుందరబాహుస్వామి అభిషేకానికి నూపురగంగనుండి తీసికొనిపోయే తీర్థాన్ని ముందుగా ఈ ఆలయంముందు అర్చకులు ఉంచి, ఆ తీర్థం నూపురగంగ నుండి తీసికొనివచ్చినదేనని ప్రమాణం చేస్తారట. శ్రీ సుందరరాజస్వామిమూర్తికి తరువాత, ఇచట మిక్కిలి భక్తితో ఆరాధింపబడే దైవం కరుప్పణ్ణస్వామి. ఈ దైవం ఉత్తరదేశంనుండి తీసికొని రాబడినదని చెబుతారు. అందువలనే ఈ దేవతకు ఆరాధన ఉత్తరదిఙ్ముఖంగా నిలబడి చేయబడుతున్నదట. ఈ దేవతకు పెరియ కరుప్పన్, శిటియకరుప్పన్, మండైకరుప్పన్, కుముట్టి కరుప్పన్, పఴైవాయకరుప్పన్ – ఈ విధంగా చాలా రూపాలున్నాయి. ఈ రూపాలన్నిటిలో తిరుమాలిరుమ్ శోలైలో ఆరాధింపబడే పదినెట్టమ్‌పడి కరుప్పణ్ణస్వామి మూర్తి చాలా విశిష్టమైనది. ఈ మూర్తికి ఇదమిత్థమైన రూపం లేకపోవడం గమనింపతగినది. మణిగోపురానికి వెళ్ళేదారిలో 18 మెట్లు ఉన్నాయి. ఆ గోపురం తలుపులే కరుప్పణ్ణ స్వామిగా ఆరాధింపబడుతున్నవి. ఈ తలుపులు చందనపుచక్కతో చేయబడినవి. కుంకుమపుష్పాదులతో, కర్పూరాదులతో ప్రతిదినం ఆరాధన చేయబడిన తర్వాత, పొంగలి, వడలు, కొబ్బరికాయలు నివేదనచేయబడతాయి. అழకర్ కోవెలలోని అర్చకులు ఈ ఆరాధనను చేయరు. కుయవర్‌కులానికి చెందిన, ప్రధానఆలయంలో పనిచేసే సేవకులు ఇచటి ఆరాధనను నిర్వహిస్తారు. 18వ మెట్టు దగ్గరఉన్న ఈ తలుపులు చాలా అరుదుగా తెరువబడుతాయి.

ఈ పదినెట్టమ్‌పడి కరుప్పణ్ణ దైవానికి సంబంధించి కథ ఒకటి ప్రచారంలో ఉన్నది. ఒకానొక సమయంలో, కేరళప్రభువు ఒకడు సుందరరాజస్వామిని తన దేశానికి తీసికొనిపోయి, అచట ఆరాధించాలని భావించాడు. అழకర్ కోయిల్ కోట చాలా దృఢంగా ఉండడంవల్ల అతడు కపటంతో తన కార్యాన్ని సాధించాలని అనుకొని, 18 మంది సమర్థులైన మాంత్రికులను సుందరరాజస్వామి విగ్రహాన్ని అపహరించమని పంపాడు. కాని వారికది వీలుకాలేదు. అపుడు వారు మంత్రశక్తిని ఉపయోగించి, సుందరరాజస్వామి విగ్రహంలోని తేజస్సును వేఱొక విగ్రహంలో ప్రవేశపెట్టి, దాన్ని తీసికొనిపోవాలని చూచారు. ఈ ప్రయత్నాన్ని పసిగట్టిన అచటి అర్చకులు, స్థానికులు వారిని పట్టుకొని ఒక్కొక్కరిని ఒక్కొక్క మెట్టు క్రింద భూస్థాపితం చేశారట. అపుడు ఆ మాంత్రికులకు సహాయంగా వచ్చిన క్షుద్రదేవతలలో ఒకరు తన మనసును మార్చుకొని, తాను అచట గోపుర ద్వారానికి ముందు స్థిరంగా ఉండి, దేవాలయ సంపదను సురక్షితం చేస్తానని శపథం చేశాడు . దానికి ప్రతిగా ప్రతిరోజు ఆ స్వామికి సమర్పించిన నిర్మాల్యాన్ని, నివేదిత ప్రసాదాన్ని తనకు సమర్పించాలని కోరాడు. ఆలయ భట్టర్‌స్వాములు దానికి అంగీకరించారు. ఈనాటికి ఈ ఆచారం పాటింపబడుతున్నది. ఈ కరుప్పణ్ణస్వామి దేవాలయరక్షకుడు కావడంవల్ల చిత్తిర(చైత్ర)మాసంలో జరిగే ఉత్సవంవంటిసమయాలలో ఎపుడు స్వామి ఆలయాన్నిదాటి బయటకు వేంచేసినా, స్వామికి అలంకరించిన ఆభరణాల వివరం కరుప్పణ్ణస్వామి ముందు



నివేదించడమే కాక, తిరిగి వచ్చినపుడుకూడా పరిశీలించిన తరువాతనే స్వామి లోపలకు వేంచేస్తాడు. ఆలయ బొక్కసం బీగాలు ప్రతిరోజు రాత్రి కరుప్పణ్ణ స్వామిముందుపెట్టి, మరునాడు ఆరాధనకు ఆలయానికి వెళ్ళేటపుడు అచటినుండి తీసికొనే అలవాటు ఈ నాటికికూడా ఉన్నవి. ఎవరూ ఆ బీగాలను తీసికోవడానికి సాహసించరు. తీస్తే కరుప్పణ్ణ స్వామి ఆగ్రహానికి గురి కావలసి వస్తుందని చాలా బలమైన విశ్వాసం ఇప్పటికీ జనంలో ఉన్నవి. ఆడిమాసంలో (ఆషాఢంలో) అమావాస్య, పున్నమి దినాలలో కరుప్పణ్ణ స్వామికి ప్రత్యేకమైన ఉత్సవాలు జరుగుతాయి.

తిరుమాలిరుమ్‌శోలై ఆలయం పరిసరాలలో దర్శనీయాలైన స్థలాలు చాలా ఉన్నాయి. వానిలో మాధవి మంటపం ఒకటి. నూపురగంగకు పోయే దారిలో హనుమత్తీర్థం, గరుడతీర్థం దాటిన తర్వాత ఈ మంటపం ఉన్నది. దీనికి ఎదురుగానే నూపురగంగ. ఉన్నది. ఇచటి ప్రకృతి సౌందర్యం మనస్సును దోచుకొన గల్గేది. ఒకానొక సమయంలో ఈ మండపం మాధవీలతలతో నిండి ఉండేదట. ఈ మండపంలో చెక్కబడిన పలుశిలా శాసనాలు దీని ప్రాచీనతకు నిదర్శనాలు. పాండ్య ప్రభువులచే, నాయక రాజులచే ఇది పునరుద్ధరింపబడింది. దీనికి సూచనగా ఆ కాలానికి చెందిన పలు శాసనాలు ఈ మండపంలో కన్పిస్తాయి. అழకర్ కోయిల్‌కు తూర్పున అరమైలు దూరంలో ఉన్న గుహ ఇది. ఇచటికి పోయే మార్గం సుగమం కాదు. కొన్ని చోట్ల వంగి, మరికొన్ని చోట్ల పాకివెళ్ళాలి. ఈ గుహ పర్వతపైభాగంలో **"కழుకుమలై"** (గద్దకొండ) ఉన్నది. ఇచట పెద్ద మఱ్ఱి చెట్టు ఉన్నది. ఈ ఎత్తైన చోటునుండి పరిసరాలను గమనిస్తే కన్పించే అందం వర్ణనాతీతం. ఈ గుహలోపల అయిదు పెద్ద రాతి పలకలు ఉన్నాయి. రెండు మూడు అడుగులు వెడల్పును, అ నుండి 9 అడుగుల పొడుగును కల్గిన వీనిపై పాండవులు శయనించారని కథనం. ఈ గుహలోపల బ్రాహ్మీలిపిలో 3వ శతాబ్దికి చెందిన కొన్ని శాసనాలు కన్పిస్తాయి. దీనివల్ల ఇది జైనులకు, బౌద్ధులకు ఒకప్పుడు నివాసమని, వారు వ్రాయించినవే ఈ శాసనాలని చెప్పబడుతున్నది.

ఈ ఆలయంలో జరిగే పలు ఉత్సవాలలో చిత్రాపౌర్ణమి ఉత్సవం పేర్కొనదగినది. ఇదే రోజున మధురలో మీనాక్షి – సుందరేశ్వరుల కల్యాణోత్సవంకూడా జరుగుతుంది. ఒకప్పుడు మే నెలలో జరుగుతూ ఉండే ఈ ఉత్సవం, మధురను పాలించిన తిరుమల నాయకుడు యాత్రికులు సౌకర్యార్థం ఈ రెండు ఉత్సవాలు ఒకే సమయంలో జరగాలని నిర్ణయించడం వల్ల, చిత్రాపౌర్ణమినాడు జరుపబడుతున్నది. ఈ చిత్తిర మాసోత్సవం తొమ్మిది రోజులు జరుగుతుంది. మొదటి మూడుదినాలు తిరుమాలిరుమ్ శోలైలో జరిగిన తర్వాత, నాల్గవరోజు స్వామి మధురకు వేంచేసిన 9వ రోజుకు తిరిగి స్వస్థానానికి వేంచేస్తాడు. వేగైనదీతీరంలో మూడురోజులపాటు వేంచేసి ఉంటాడు. ఈ చిత్తిర ఉత్సవానికి సంబంధించిన ఒక వృత్తాంతం. జనశ్రుతిలో ఉన్నది. సుందరబాహుస్వామి తన సోదరి పార్వతి వివాహం సుందరేశ్వరునితో జరుగుతున్నదని తెలిసి, దానిని చూడడానికై తన ఆలయంనుండి బయలుదేరాడట. అపుడు స్వామి కళ్ళழకర్ వేషాన్ని దాల్చి బయలుదేరాడు. మధురకు

తిరుమాలిరుమ్‌శోలైకు మధ్యగల దూరం సుమారు 12 మైళ్ళు. మార్గమధ్యంలో స్వామి దివ్యవాహనం మణిమంటపం దగ్గర  ఆగింది. చివరకు తళ్లకుళంలోని భగవదాలయాన్ని చేరుకుంది. ఈ సందర్భానికి గుర్తుగా ఈనాటికి జనసమూహం స్వామి రాకకై ఎదురుచూస్తూ తళ్ళకుళంలో ఉంటారు. దీనికే **"కళ్ళఴకర్ ఎదిర్‌సేవై"** అని పేరు. మరునాటి ఉదయాన్నే స్వామి అశ్వవాహనాన్ని అధిరోహించి వేగైనది వద్దకు బయలుదేరేముందు, శ్రీవిల్లి పుత్తూరు గోదాదేవి ఆలయంనుండి వచ్చిన తులసీమాలను స్వామికి సమర్పిస్తారు. వేగైనది వద్దకు సుందరబాహుస్వామి చేరినపుడు మధురలోని వీరరాఘవస్వామి సుందరబాహుస్వామిని స్వాగతిస్తాడు. ఈ ఉత్సవానికి **"అఴకర్ ఆఱ్ఱిల్ ఇరఙ్గుదల్"** అని పేరు. లక్షలాదిజనం ఈ ఉత్సవాన్ని తిలకిస్తారు. తర్వాత స్వామి నదీతీరంలో పయనించి, వణ్డియూర్ చేరి, ఆ రాత్రి అక్కడే విడిది చేస్తాడు. అపుడు **"ఇళైప్పారి శైత్యోపచారమ్"** అనబడే అలసటను తీర్చే శైత్యోపచారోత్సవం జరుగుతుంది. మరునాడు శేషవాహనాన్ని అధిరోహించిన స్వామి తేనీర్‌మండపాన్ని చేరిన తర్వాత, అక్కడ బంగారు గరుడవాహనాన్ని ఎక్కి, మండూక మహర్షికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఆ రాత్రికి రామరాయర్ మండపాన్ని చేరి, అచట దశావతారాల అలంకారాల్లో భక్తులను స్వామి కటాక్షిస్తాడు. మరునాడు అఴకర్ మోహినీ అవతారవేషంలో మైసూర్ మండపాన్ని చేరతాడు. తరువాత కళ్ళఴకర్ వేషంలో పూలపల్లకిని ఎక్కి, మరునాటి ఉదయానికి తిరుమాలిరుమ్ శోలై ఆలయానికి చేరతాడు. అచట జరిగే శాత్తుముఱైతో చిత్తిర ఉత్సవాలు పూర్తి అవుతాయి. అఴకర్ కోయిల్‌లో జరిగే వేరొక ప్రధానఉత్సవం మార్గఴి త్తిరునాళ్. పగల్‌పత్తు. రాపత్తు ఉత్సవాలు. జరిగే ఈ సందర్భంలో 8వ రోజు బంగారు అశ్వవాహనాన్ని అధిరోహించి భక్తులను అనుగ్రహిస్తాడు.

**శిల్పకళాసంపద:–** ఇచటి శిల్పకళా నైపుణ్యం మాటలకు అందనిది. తిరుమలరాయ మండపంలో అద్భుతంగా మలచబడిన తిరుమలరాయల విగ్రహం అతని. భార్య, సోదరుని విగ్రహాలే దీనికి సాక్షీభూతాలు, గజవాహనమండపంలో స్వామి అవతారాల అందమైన శిల్పాలు మధురమీనాక్షీ దేవి ఆలయంలోని శిల్పాలకంటె నాణ్యమైనవని శిల్పశాస్త్రజ్ఞుల అభిప్రాయం.  ఇచటి శిల్పంలో నృసింహమూర్తి, శ్రీకృష్ణుడు, చిలుకను అధిరోహించిన రతీదేవి, మన్మథులు, గరుడవాహనారూఢుడైన విష్ణువు రూపాలు ప్రధానమైనవి. ఇచటి కల్యాణమండపంలో ఆ దేశాలను పాలించిన ప్రభువుల శిల్పాలు ఉన్నాయి. అవి కూడా చాలా అందమైనవి. ఈ వివరాలు కేవలం దిఙ్మాత్రాలు.

**శాసనాల సంపద:–** తిరుమాలిరుమ్‌శోలైలోని శాసనాలు పలు ప్రభువులు పలు సమయాలలో వ్రాయించినవి. ఇవి ఈ క్షేత్రప్రాచీనతకు చిహ్నాలు. బ్రాహ్మీలిపిలో వ్రాయబడిన అతిపురాతన శాసనాలు కొన్ని అశోకునికి కాలానికి చెందినవని చారిత్రకుల భావన. పంచపాండవుల గుహలో కూడా ఇట్టి శాసనాలు ఉన్నాయి. అజ్జనంది అనే జైనగురువు, అతని శిష్యులు ఈ ప్రాంతంలో నివసించారని వినికిడి. సుందరపాండ్యమండపంలోకూడా పలు అమూల్యాలైన



శాసనాలు అనేక చారిత్రక విశేషాలను ఆవిష్కరిస్తు న్నాయి. ఇంకా పలుశాసనాల వివరాలు ఎమ్.యస్.రమేష్‌గారి **"108 Sri  Vishnava Divya Desams"–(Vol - II)** అనే గ్రంథంలో చూడవచ్చు.

పూర్వాచార్యస్తోత్రాలన్నీ ద్వయార్థాన్ని అనుసంధిస్తున్నవి అన్నది సర్వసమ్మతం. ఆరీతిలోనే ప్రకృత స్తోత్రంసైతం ద్వయార్థప్రతిపాదకమన్నది స్పష్టం. అందుకు ప్రారంభశ్లోకమే సాక్షి. **"శ్రీరామావరజమునీంద్రలబ్ధబోధః"** అనడంద్వారా సదాచార్యసమాశ్రయణపూర్వకంగా భగవదాశ్రయణం కర్తవ్యమని, **"శ్రీమంతౌ హరిచరణౌ సమాశ్రితః"** – అని అనడంద్వారా లక్ష్మీపురుషకారపురస్సరంగా శరణాగతిని చేయాలని, ఈవిధంగా చేసిన శరణాగతికి ఫలం **"సుందరోరుబాహుం స్తోష్యే"** అనడంద్వారా భగవత్కైంకర్యమేనని తెలుపబడింది. ఈ భగవత్కైంకర్యంకూడ **"తచ్చరణవిలోకనాభిలాషీ"** అనడంద్వారా ఆచార్యసేవాపూర్వకమైనదిగా ఉండాలనికూడా స్పష్టీకరించబడింది. ఇచట తెలుపబడ్డ కాయిక, వాచికకైంకర్యాలు మానసిక కైంకర్యానికిని  ఉపలక్షకాలు. ఈరీతిలో మొదటిశ్లోకంలోనే ద్వయార్థం సమగ్రంగా అనుసంధింపబడడం గమనించవచ్చు. భగవానుడే ఉపాయోపేయాలని తలచడం ప్రథమ పర్వనిష్ఠ. భాగవతులే ఉపాయోపేయాలని తలచడం, మధ్యమపర్వనిష్ఠ, ఆచార్యులే ఉపాయోపేయాలని తలచడం చరమపర్వనిష్ఠ అని అణ్ణావప్పఙ్గార్ అనే పూర్వాచార్యులు వరవరముని శతకవ్యాఖ్యలో వివరించారు. ఈ చరమపర్వనిష్ఠకూడా మొదటి శ్లోకంలో ప్రతిపాదింపబడింది. **"నిన్ తిరువెట్టెఴుత్తుమ్ కఱ్ఱయు నానుఱ్ఱంతు ఉన్నడియార్‌క్కడిమై"** అని అంటూ తిరుమఙ్గైమన్నన్ అష్టాక్షరీసారం భాగవతసేవేనని అన్నారుకదా! ఆ భాగవతసేవకు పరమావధి ఆచార్యసేవ కాబట్టి, ఆ ఆచార్యకైంకర్యం ప్రకృతప్రబంధప్రారంభంలో, అదేవిధంగా **"శ్రీరంగధామని యథాపుర మేష సోఽహం రామానుజార్యవశగః పరివర్తిషీయ"** అంటూ చివరకూడా ప్రార్థించినందువల్ల – ఈ ప్రబంధంలో అష్టాక్షరీమంత్రసారంకూడా ప్రతిపాదితమని చెప్పవచ్చు. ఆ రీతిలోనే, **"సుందర భవంత మాశ్రయే"** అని శరణాగతిని చేసి, **"శ్రీరంగశ్రియ మన్వహం ప్రగుణయన్ త్వద్భక్తభోగ్యాం కురు, ప్రత్యక్షం సునిరస్త మేవ విదధత్ ప్రత్యర్థినాం ప్రార్థనమ్"** అంటూ –అనిష్టనివారణాను ప్రార్థించడంచేత, చరమశ్లోకార్థంసైతం ఉపబృంహితమైనదని చెప్పవచ్చు. అంతేకాక, **"అగతి రితి చ క్షుద్ర ఇతి చ క్షమస్వ"** ఇత్యాదిగా పలుసందర్భాల్లో **"య మేవైష వృణుతే తేన లభ్యః"** ఇత్యాది శ్రుతులచే ప్రతిపాదింపబడిన భగవానుని కృప నిర్హేతుకమనే సత్సంప్రదాయరహస్యంకూడా స్పష్టం చేయబడింది.

అలంకారశాస్త్రదృష్టిలోకూడ ఈ స్తుతి ప్రబంధం ఒక మధురభక్తి రసపిచ్ఛిలమైన కావ్యం. ఇందులో ఉపమ, ఉత్ప్రేక్ష, శ్లేష, అతిశయోక్తి, నిరుక్తి, ఉదాత్త, స్వభావోక్త్యాద్యలంకారాలు ప్రయుక్తాలు. ఆ వివరాలు ఆయా సందర్భాలలో వివరింపబడ్డాయి. విభిన్న వృత్తప్రయోగంలోకూడ కూరేశులు చతురులనే విషయాన్ని ఈస్తుతి నిరూపిస్తున్నది. శార్దూల, వసంతతిలక, స్రగ్ధర, మాలిన్యాదులు, వికృతిఛందస్సుకుచెందిన అశ్వలలితమనే

వృత్తం (92), నాల్గు పాదాలు భిన్నభిన్నగణాలతో కూడిన అపూర్వమైన విషమవృత్తభేదం (60) ఇందుకు కొన్ని ఉదాహరణాలు. పర్వతశిఖరనివాసి అయిన నృసింహమూర్తిని శిఖరిణీ వృత్తంలో స్తుతించడం, మధురభాషిగా కీర్తింపబడే శ్రీరాముని మంజుభాషిణీ వృత్తంలో కీర్తించడం – ఇత్యాది విశేషాలు సందర్భోచితంగా వృత్తాలను ప్రయోగించడంలోని కౌశలాన్ని చాటుతున్నవి. ఈ వైలక్షణ్యాన్ని, శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవంలో అనుసరించడమేకాక, మెఱుగులు కూడ దిద్దారు. ఇట్టి విశేషాలు ఇంకా పలు ఉన్నా విస్తరభీతిచేత విన్నపించడంలేదు.

పూర్వాచార్యస్తోత్రాలలోని పలుశ్లోకాలు దివ్యసూరుల ప్రబంధాలలోని భావాలను అనుసరిస్తున్నవనే విషయానికి ఇందులోని పెక్కు శ్లోకాలు నిదర్శనాలు. ఈఅంశాన్ని 5,8,92 మొదలైన అనేక శ్లోకాలలో గమనించవచ్చును. ఈ విషయంలో వక్తవ్యాంశాలు చాల ఉన్నా ప్రస్తుతించడం లేదు. కూరేశుల స్తుతులను తదనంతరకాలీనులైన పలువురు పూర్వాచార్యులు పలురీతుల్లో అనుసరించారు. కూరేశులు చేసిన భగవానుని వివిధదివ్యాంగవర్ణనం, కల్యాణగుణవర్ణనం, దశావతార వర్ణనం, మొదలైన అంశాలను భట్టరు, దేశికులు మొదలైన పలువురు ఆచార్యులు అనుసరించారన్నది స్పష్టం. వీని వివరాలుకూడా విస్తృతి సాపేక్షాలు కాబట్టి విస్తర భయంచేత పేర్కొనబడడంలేదు. పలు శ్లోకాల్లో (17,18,19,20,21, మొదలైనవి) వేదాంతార్థ ప్రస్తావనతో పాటు పరమతనిరసనం, స్వమత విశదీకరణం కన్పిస్తుంది.

ఈ అద్భుతసుందరస్తుతికి సంస్కృతభాషలో శ్రీనివాసాచార్యవ్యాఖ్య, గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య, వేంకటనివాసవ్యాఖ్యలు ఉన్నాయి. వీటిలో శ్రీనివాసాచార్యవ్యాఖ్య మాత్రం ప్రచారంలో ఉన్నది. రామానుజాచార్యవ్యాఖ్య సుమారు నూఱు సంవత్సరాలకు ముందు ప్రచురింపబడినదని చెప్పబడుతున్నా, ఆ ప్రతి లభించడంలేదు. ఇక, వేంకటనివాస వ్యాఖ్య ఇంతవరకు వెలుగు చూడనేలేదు. ద్రావిడభాషలో ప్రాతః స్మరణీయులు మహావిద్వాన్, కాంచీ. ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు కృపజేసిన వ్యాఖ్య ఆవశ్యకసర్వవిషయపూర్ణమైనది, సుందరమైనది. ఇది పలుమార్లు ముద్రింపబడింది. సుమారు 15 సం॥లకు ముందు విశిష్టాద్వైతప్రచారిణీసభ (చెన్నై) వారిద్వారా శ్రీవత్సాంకాచార్యస్వామివారి సౌందర్యానుభవమనే ద్రావిడవ్యాఖ్య ప్రచురింపబడింది. తెలుగులో శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యులవారి టీక, శ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి టీక – మొదలైన పలు వివరణాలున్నాయి. కాని, తెనుగులో సమగ్రమైనవ్యాఖ్య ఏదీ ఇంతవరకు రాకపోవడం ప్రస్తుతభావనావ్యాఖ్యాన ప్రయత్నానికి కారణమైనది. ఈవ్యాఖ్య ప్రధానంగా శ్రీకాంచీ ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య, శ్రీనివాసాచార్య, గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య, శ్రీవత్సాంకాచార్యవ్యాఖ్యలను అనుసరించి వ్రాయబడింది.

ప్రస్తుత వ్యాఖ్యాముద్రణనుగూర్చి అవశ్యం విన్నపించవలసిన విషయం ఒకటి ఉన్నది. సద్గుణసంపన్నులు, చరమపర్వనిష్ఠాగరిష్ఠులు, దాసునకు అత్యంతం ఆప్తులు,



శ్రేయోభిలాషులు, ఉ.వే.శ్రీమాన్ డా.ఎన్.వి.ఆర్.ఎల్. అయ్యంగార్ స్వామివారే ఈ ప్రచురణకు మూలం. దాసుని శ్రీరంగరాజస్తవము – పూర్వశతక వ్యాఖ్యానం వరివస్యను చూచి, చాలా ఆనందించి, ఎంతో ఆదరంతో కూరేశుల పంచస్తవానికికూడ వ్యాఖ్యలను విన్నవించవలసినదిగా పలుమార్లు ప్రేరేపించి, ప్రోత్సహిస్తూ ముద్రణకు అవసరమైన ఆర్థికభారాన్ని తాము భరిస్తామని చెప్పడమే కాక, తమపేరు ఏవిధంగాకూడా వ్యక్తం కాకూడదని కోఱిన నిరాడంబరులు వీరు. దాసుని మాతులపాదులు, ఉ.వే.శ్రీమాన్. కిడాంబి వేంకటాచార్యస్వామివారి సన్నిధిలో సంప్రదాయగ్రంథాలను అధికరించి, వారి విషయంలో అత్యంత ప్రావణ్యాన్ని కలిగి ఉండడమే కాక, నరసాపురం భగవద్రామానుజుల అవతారోత్సవాలలో అన్ని విధాల సహాయపడుతూ, దివ్యప్రబంధగోష్ఠిలో అన్వయించేవారు దాసుని పితృపాదులు, న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ రంగాచార్యస్వామివారి విషయంలో పరిపూర్ణమైన శ్రద్ధాభక్తులను కల్గిన పరమసాత్త్వికమూర్తులు. దాసుని అతిమానుషస్తవ–భావనా వ్యాఖ్యను తమ కాలక్షేపాచార్యులైన శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి విషయంలోను, అమృతఫలావళి స్తోత్రవ్యాఖ్యను పెంటపాడు ఉభయవేదాంత సభద్వారా తమ జ్యేష్ఠ సోదరుల విషయంలోను స్మారకంగా ముద్రింపచేశారు. వీరి ధర్మపత్నికూడ వీరిని అన్ని రీతులలో సహకరిస్తూ, ప్రోత్సహించిన సద్గుణశీల, సత్సంప్రదాయనిష్ఠను కలవారు. శ్రీమాన్ అయ్యంగారి శ్వశురపాదులు శ్రీమాన్ ముడుంబి సత్యనారాయణాచార్యులవారిని నేను సాక్షాత్తు సేవించాను. వారూకూడా చక్కని సంప్రదాయనిష్ఠను కల్గిన గుణగరిష్ఠులు మహనీయులు. శ్రీమాన్ అయ్యంగార్ మఱదలు శ్రీమతి సుశీలారాణిగారు దాసునకు చిన్నతనంలో సహాధ్యాయిని. ఈవిధంగా శ్రీమాన్ అయ్యంగారితో, వారి బంధువులతో దాసునకు ఘనిష్ఠమైన ఆత్మసంబంధం ఉన్నది. శ్రీమాన్ అయ్యంగారి ప్రోద్బలంతోనే 2005వ సం॥లో నర్సాపురంలో జరిగిన భగవద్రామానుజులవారి ఉత్సవాల్లో అతిమానుషస్తవ భావనావ్యాఖ్య. ముద్రింపబడింది. 2006సం॥లోజరిగిన శ్రీస్తవప్రచురణకుకూడా వీరే ప్రోత్సాహకులు. ఈ సంవత్సరం ఏప్రియల్‌లో నర్సాపురంలో జరుగబోయే భగద్రామానుజ అవతారోత్సవాల్లో తప్పకుండా సుందరబాహుస్తవవ్యాఖ్యానం ఆవిష్కరింపబడాలని, క్రమంగా మిగిలిన వరదరాజస్తవ – వైకుంఠస్తవాలకుకూడా వ్యాఖ్యానాలు ఈరీతిలోనే రాబోయే రెండు సంవత్సరాల్లో శ్రీరామానుజుల అవతారోత్సవసందర్భంలో ప్రచురించాలని ఎంతో ఆశపడ్డారు. కాని, వారి ఆశ పూర్ణంగా కార్యరూపం దాల్చడానికిముందే వారు హఠాత్తుగా స్వాచార్యపాదసన్నిధిని చేరడం చాలా శోచనీయం. వారు లేని లోటు దాసునకు తీరేది కాదు. ఆమహనీయుల స్మృతి చిహ్నంగా, వారి కోఱికమేరకు ఈ ఏడు భగవద్రామానుజుల అవతారోత్సవాల్లో శ్రీసుందరబాహుస్తవానికి సిద్ధంచేసిన భావనావ్యాఖ్య ముద్రింపబడుతున్నది. నన్ను ఎల్లప్పుడూ ప్రోత్సాహిస్తూ, శ్రేయస్సు కలగాలని ఆశించి, ఆశీర్వదించిన శ్రీమాన్ అయ్యంగార్ విషయంలో ఇంతకంటే వేఱే ఏ రీతిలో కృతజ్ఞతను ప్రకటించుకోగలను? శ్రీమాన్ అయ్యంగార్‌నుగూర్చిన కొన్ని

విశేషాలు ఇందులో సంగ్రహంగా అనుబంధంగా నివేదింపబడ్డాయి. ఈ వివరాలను నేను కోఠినవెంటనే నాకు వానిని వారి ఛాయాచిత్రంతోపాటు అందించిన వారి సతీమణిగారికి, వారి కుమార్తెలకు హార్దిక ధన్యవాదాలను తెలుపుతున్నాను. ఈ ముద్రణను శ్రీమాన్ అయ్యంగార్ వారి ఉత్తారకాచార్యుల స్మృత్యంకంగా చేయాలని వారు కోరడంచేత, వారి ఆచార్యుల సంగ్రహ పరిచయంతోపాటు, వారి ఛాయాచిత్రంకూడ ప్రచురింపబడుతున్నది.

గడచిన సంవత్సరం శ్రీరామానుజులవారి ఉత్సవసమయంలో ఈ భావనావ్యాఖ్య మొదటి 16పేజీలను ఆవిష్కరించిన పరమకారుణికులు, పరమహంసపరివ్రాజకార్యులు, శ్రీభాష్యకార్యసిద్ధాంతపీఠ నిర్వాహకులు, శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీరామచంద్రరామానుజ జీయర్‌స్వామివారి దివ్యసన్నిధిలో సప్రశ్రయంగా కార్తజ్ఞ్యాన్ని నివేదించుకుంటున్నాను. ఈ వ్యాఖ్యాన ప్రయత్నంలో నన్ను సర్వదా ప్రోత్సహించి, ఆశీర్వదించి, మార్గదర్శకులైన అస్మత్పితృపాదులు, **న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** సన్నిధిలో సవినయంగా, కృతజ్ఞతాపూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. నా ప్రార్థనను మన్నించి, తమ కాలాన్ని వెచ్చించి, భావనావ్యాఖ్యను కటాక్షించి, తమ మంగళాశాసనాన్ని ఆనందమందాకిని అనే పేరుతో అనుగ్రహించిన వాత్సల్యమూర్తులు, విశేషించిన నా విషయంలో అవ్యాజమైన ప్రేమను కల ఉ.వే.శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామివారి సన్నిధిలో సాంజలిబంధంగా ప్రణమిల్లి, కృతజ్ఞతా నివేదనాన్ని చేసికొంటున్నాను. వ్యాఖ్యను డి.టి.పి. చేయడంలో సహకరించిన మన్మిత్రం శ్రీశర్మగారికి, (అన్నపూర్ణాగ్రాఫిక్స్) కుమారి విజయలలితగారికి ధన్యవాదాలు. నీరక్షీరన్యాయంతో ఇందులోని దోషాలను క్షమించి విడచి, గుణాలుంటే స్వీకరించవలసినదిగా హృదయపాఠకహంసలను వేడుకొంటూ విరమిస్తునాను. స్వస్తి.

తిరుపతి — ఇట్లు
25-1-07 — భాగవతవిధేయుడు

**ఈ.ఏ.శింగరాచార్యులు**

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీకూరేశప్రణీతమైన

# శ్రీసుందరబాహుస్తవము - భావనావ్యాఖ్యానము

భగవద్రామానుజుల శ్రీపాదసన్నిధిలో పవిత్రస్థానీయులై అంతరంగకైంకర్యమును నిర్వహించుచు, **"మొழிయైక్కడక్కుమ్ పెరుమ్ పుకழాన్"** (వాచామగోచరమహాగుణగరిష్ఠులు) అని సమకాలీనులచే పొగడబడిన కూరేశులు చోళరాజు సభకు వెడలి **"శివాత్ పరతరం నాస్తి"** అను వాదమునకు బదులుగా పరిహాసపూర్వకముగా **"ద్రోణ మస్తి తతః పరమ్"** అనుచు వ్రాసి, పిమ్మట ఇతిహాసపురాణ ప్రమాణములను శతసహస్రములుగా పేర్కొనుచు ఉపన్యసించి, శ్రీమన్నారాయణుని పారమ్యమును స్థాపించిరి. వీరశైవుడగు ఆ చోళరాజు వారిపై మిక్కిలి ఆగ్రహించి, కూరేశుల నేత్రములను పెకలింపుడని భటులను ఆజ్ఞాపింపగా, కూరేశులు తమ నేత్రములను తమ గోళ్ళతో తామే తీసివేసికొనిరి. అపుడు తమకు కల్గిన శారీరక బాధను సహించి, శ్రీరంగమునకు తిరిగివచ్చిరి. కాని, అప్పటికే రామానుజులవారు తమ శిష్యులతో కలసి మేల్‌నాడు (మేల్కోటై) ప్రాంతమునకు వెడలిపోయిరి అని తెలిసికొనిన కూరేశులు తాము ఇక అచట నివసించుటకు ఇష్టపడక, తిరుమాలిరుమ్‌శోలై (వనగిరి) అను దివ్యదేశము నివసింపవలయునని తలచి అచటికి బయలుదేరిరి. దారిలో తమకు కల్గిన క్లేశములు ఏమియు మనస్సున స్మరణకు రాకుండునట్లు భగవానుని స్వరూప, రూప, గుణ, విభూతి, చేష్టితాదులను అనుసంధించుకొనుచు, కాలక్షేపమును చేయదలచి, కొన్ని స్తోత్రములను ధారావాహికముగా అనుగ్రహించిరి. మొదట శ్రీవైకుంఠస్తవమును, పిమ్మట అతిమానుషస్తవమును రచించిరి. ఆ పిమ్మట తిరుమాలిరుమ్‌శోలై దివ్యదేశమును చేరి, అచటి అర్చామూర్తి అగు సుందరబాహుస్వామి సర్వాంగసౌందర్యమును ఆంతరనేత్రముతో దర్శించి, ఆ అనుభవపరీవాహరూపముగ ప్రస్తుతస్తోత్రమగు సుందరబాహుస్తవమును ఆశువుగా అనుగ్రహించిరి.

ఈ స్తుతి శబ్దగాంభీర్యమున, అర్థపౌష్కల్యముననను సాటిలేని వేటి. శ్రుతీతిహాసపురాణాదులయందు, దివ్యప్రబంధసూక్తులయందును గాఢమైన పరిచయమును కల్గినవారికిగాని అవగతము కాని అపూర్వదివ్యరస్యరహస్యార్థములెన్నియో ఇందు ఇమిడియున్నవి. **"సకలశ్రుత్యంతతత్త్వార్థరాశిం ప్రకాశయితుమ్"** అను శ్రీనివాసాచార్యవ్యాఖ్యా సూక్తి దీనిని తెలుపుచున్నది. ప్రతి శ్లోకము అపూర్వార్థరత్నఖని అనుటలో సందేహములేదు. ఈ స్తుతి చివరలో కూరేశులు **"విజ్ఞాపనాం వనగిరీశ్వర! సత్యరూపామ్"** అనుచు ప్రారంభించి నాల్గు శ్లోకములలో తెలిపిన అంశములను పరిశీలించినచో కూరేశులు తమ శ్రీరంగవాసమునకు విశ్లేషము కల్గుటవలన ఏర్పడిన బాధయే ఈ స్తుతిగా పరిణమించినదనుట స్పష్టమగును. శ్రీరంగక్షేత్రమున ఏర్పడిన పీడను తొలగించి, మంచిని కల్గించి, భగవద్భక్తులందఱు అచట కలసి సుఖముగానుండునట్లు చేసి, భగవద్రామానుజుల శ్రీపాదచ్ఛాయలో దాసవర్గము పూర్వమువలెనే

జీవించునట్లు కటాక్షింపుమని భగవానుని ప్రార్థించుచు ఈ స్తవము కూరేశులచే ముగింపబడుట గమనింపతగినది. – అని శ్రీ అణ్ణాస్వామివారి వ్యాఖ్య. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో కూడ – **"అయ మర్థః – విజ్ఞాపనాం వనగిరీశ్వర! సత్యరూపా మంగీకురుష్వ కరుణార్ణవ! మామకీనామ్, శ్రీరంగధామని యథాపుర మేష సోఽహం రామానుజార్యవశగః పరివర్తిషీయ–ఇత్యుపసంహారేఽపి స్పష్టః"** అనుచు ఈ అంశము స్పష్టీకరింపబడినది. స్తోత్ర ప్రారంభములోగల **"తచ్చరణవిలోకనాభిలాషీ"** అను ప్రయోగ మీవిషయమును తెలుపుచున్నదనుట **"ప్రాస్తావే ఏవ భాష్యకారచరణనలినావలోకన మేవ ఫలత్వేన సంకల్ప్య"** అనుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో స్పష్టము చేయబడినది.

## కూరేశుల తనియన్

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

ఎవరి సూక్తులు వేదము అను కాంతయొక్క కంఠమునందు మంగళ సూత్రములుగా అగుచున్నవో, అట్టి శ్రీవత్సచిహ్నులను మహనీయులకు నమస్కారమును పలికెదము. (ఈ శ్లోకములోని విశేషార్థములను శ్రీరంగరాజస్తవ పూర్వశతక వ్యాఖ్య వరివస్యలో గమనింప ప్రార్థన)

**1. శ్రీమంతౌ హరిచరణౌ సమాశ్రితోఽహం శ్రీరామావరజమునీంద్రలబ్ధబోధః ।**
**నిర్భీక స్తత ఇహ సుందరోరుబాహుం స్తోష్యే తచ్చరణవిలోకనాభిలాషీ ॥**

**సుందరబాహుస్తోత్రం శ్రీకూరాధిపగురుప్రణీత మిదమ్ ।**
**వివృణోతి శింగరార్యో భక్త్యా రుచిరం ప్రపన్నజనసేవ్యమ్ ॥**

శ్రీరామావరజమునీంద్ర = భగవద్రామానుజమునీంద్రులవలన, లబ్ధబోధః = జ్ఞానమును పొందినవాడను, తతః = ఆ పిమ్మట, శ్రీమంతౌ = లక్ష్మీదేవితో నిత్యసంబంధమును కల్గినవగు, హరిచరణౌ = శ్రీమన్నారాయణుని పాదములను, సమాశ్రితః = ఉపాయముగా ఆశ్రయించినవాడను అగు, అహమ్ = నేను, నిర్భీకః = సంసారభయము లేనివాడనై, ఇహ = ఇచట, సుందర + ఉరు + బాహుమ్ = అందమైన, బలిష్ఠమైన బాహువులను కల్గిన స్వామిని, తత్ + చరణవిలోకన + అభిలాషీ = ఆ రామానుజుల శ్రీ పాదములను సేవింపవలెనను కోరికను కలవాడనై, స్తోష్యే = స్తుతించెదను.

భగవద్రామానుజులను సేవింపవలెనను. ఆశతో ఈ స్తోత్రమును విన్నవించు చున్నానని, ఈ స్తుతి ఫలముగా తమకు శ్రీరామానుజుల శ్రీపాదముల సమీపమున



ఉజ్జీవనము లభింపవలెనని కూరేశులు ఇందు తెలుపుచున్నారు

**(శ్రీమంతౌ హరిచరణౌ సమాశ్రితః అహమ్) – "తిరుప్పొలిన్ద శేవడి"** అను ఆళ్వార్ల శ్రీసూక్తిని **"శ్రీమంతౌ"** అను విశేషణము పరామర్శించుచున్నది. ఈ శ్లోకములోని పూర్వార్థము ద్వయమంత్రములోని పూర్వఖండార్థమును స్మరింపజేయుచున్నదని వ్యాఖ్యానాంతరము. స్తోత్రప్రారంభములో శ్రీశబ్దప్రయోగము మంగళాచరణార్థము. **"అదౌ శ్రీశబ్దప్రయోగ ఏవ ప్రబంధస్య మంగళాచార ఇతి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇచట హరిశబ్దము స్వామి సమస్తపాపములను హరించువాడు – అని తెలుపుచున్నది. **"హరణా దేవ దుః ఖానాం హరి రిత్యభిధీయతే"** అను హరిశబ్దవ్యుత్పత్తిని ఇచట స్మరింపనగును. **"హరి ర్హరతి పాపాని"** అని కదా సూక్తి. **(శ్రీరామావరజమునీంద్రలబ్ధబోధః)** – శ్రీరామానుజులవద్ద చైతన్యమును పొందినవాడను అని భావము. ఆ స్వామి శ్రీపాదములనే ఆశ్రయించి, సకలార్థములను విని, సత్తను పొందుటకూడ దీనిచే వ్యక్తీకరింబడినది. ఇందువలన ఆచార్యసంబంధమే సకలశ్రేయోదాయకమనియు తెలిపినట్లయినది.

**(తతో నిర్భీకః)** – రామానుజసమాశ్రయణానంతరము భయము తీరినవాడనై – అని అర్థము. **"గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వాఽపి వరాంగనా, నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా"** అనురీతిలో సీతాదేవి శ్రీరామచంద్రుని బాహువులను ఆశ్రయించిన బలముచే దేనికిని భయపడలేదు. అట్లే, వీరును రామానుజుల పాదసమాశ్రయణబలముచే భీతి తొలగినవారయ్యిరి. **"అథ సోఽభయంగతో భవతి"** ఇత్యాదిగా వేదములో తెలుపబడిన రీతిలో జన్మయే భయస్థానము అని, భగవానునకు, భక్తులకు, ఆచార్యులకు, విచ్ఛేదములేకుండ కైంకర్యమును చేయుటయే అభయస్థానమనియు దీనివలన వ్యక్తము. సదాచార్యసంబంధము పొందునంతవరకే భయము**;** పిమ్మట భయము లేదనుటయును స్పష్టము.

**(ఇహ సుందరోరుబాహుం స్తోష్యే)** – **"శున్దరత్తోళుడైయాన్"**, **"శున్దరత్తోళానే"** ఇత్యాదిగాగల ఆళ్వార్ల శ్రీసూక్తులయందు కూరేశులకుగల అభినివేశమును ఈ నామము తెలుపుచున్నది. **"సుందరోరు"** అనునపుడు **"ఊరు"** అని విడదీసి, అందమైన ఊరువులను కలవాడనియు కొందఱు వ్యాఖ్యానించిరి. కాని ఇది వ్యాకరణవిరుద్ధము, దివ్యసూరిసూక్త్యననుగుణమును. దివ్యసూరుల సూక్తులలో ఊరుప్రసక్తి లేదుకదా!

**(తచ్చరణవిలోకనాభిలాషీ)** – తచ్ఛబ్దము రామానుజులను పరామర్శించును. భగవద్రామానుజులనెడి. అస్మదాచార్యసార్వభౌముల శ్రీపాదములను కన్నులార దర్శింపవలెనను ఆశను కలవాడనై ఈ స్తుతిని చేయుచుంటినని భావము. ఈ స్తుతిచివరలోగల **"శ్రీరంగధామని యథాపుర మేష సోఽహమ్"** ఇత్యాదిసూక్తి స్మరణీయము.

మొదటి రెండు పాదములలో తెలుపబడిన విషయము **"నిర్భీకః"** అని ప్రతిపాదింపబడిన నిర్భయత్వమునకు హేతువు. కావున ఇచట కావ్యలింగాలంకారము కలదు. (పరమాత్మ బాహువులనెడి) కోటలో నున్నవారికి భయముండునా!" అని శ్రీ అణ్ణాస్వామివారి శ్రీసూక్తి. వృత్తము ప్రహర్షిణి. **"మ్నౌజ్రౌ గస్త్రి దశయతిః ప్రహర్షిణీయమ్"** – అని దీని లక్షణము. భగవన్మనఃప్రహర్షిణి, భక్తమనఃప్రహర్షిణి అగు ఈ స్తుతిని కవి ప్రహర్షిణీవృత్తముతో ప్రారంభించుట యుక్తమే కదా! **"సుందరోరుబాహుం స్తోష్యే ఇతి వస్తునిర్దేశో వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో తెలుపబడగా, **"హరిచరణౌ సమాశ్రిత ఇత్యనేన ప్రబంధాధౌ కర్తవ్యా నమస్క్రియా కృతేత్యనుసంధేయమ్"** అని శ్రీగార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. ఈవిధముగా **"మంగళాదీని...."** ఇత్యాదిగా విధింపబడిన కావ్యమర్యాద పాటింపబడినట్లయినది. కూరేశపుత్రులగు పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవపూర్వశతకములో **"శ్రీరంగరాజకమలాపదలాలితత్వం యద్వాఽపరాధ్యతి మమ స్తుతిసాహసేఽస్మిన్"** అని పల్కుటకు ఈ శ్లోకము మూలమనవచ్చును. **"భగవత్సమాశ్రితానామ్ భాష్యకారకృపావతాం చ భగవత్స్తుతౌ న కాచిత్ భీతిః, స్తోత్రాధికార శ్చ పరిపూర్ణ ఇతి భావః"** అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. పూర్వాచార్యప్రణీతస్తోత్రములన్నియు ద్వయార్థ ప్రతిపాదకములు. ఈ అంశమును ప్రస్తుతస్తుతిలోని మొదటి శ్లోకము నిరూపించుచున్నది. **"శ్రీమంతాహరిచరణౌ సమాశ్రితోఽహమ్"** అని ద్వయపూర్వఖండార్థము ప్రతిపాదింపబడగా, **"తచ్చరణవిలోకనాభిలాషీ"** అనుచు ఉత్తరఖండార్థమనుసంధింపబడినది. భగవదాశ్రయణ ఫలము భగవద్భాగవతకైంకర్యమే కదా!

**2. సుందరాయతభుజం భజామహే వృక్షషండమయ మద్రి మాస్థితమ్ ।**
**యత్ర సుప్రథితనూపురాపగా తీర్థ మర్థితఫలప్రదం విదుః ॥**

యత్ర = ఏ తిరుమాలిరుమ్ శోలైపర్వతములో, సుప్రథిత = మిక్కిలి ప్రసిద్ధమైన, నూపుర + ఆపగా = నూపురగంగ **(శిలమ్బాఱు)** యొక్క, తీర్థమ్ = పరిశుద్ధజలము, అర్థిత = ప్రార్థించిన, ఫలప్రదం = ఫలమును ఇచ్చునదిగా, విదుః = పెద్దలు తెలియుదురో, అట్టి, వృక్షషండమయం = వృక్షములతో, దట్టమైన తోటలతో చుట్టబడియున్న, అద్రిమ్ = పర్వతమును, ఆస్థితమ్ = ఆశ్రయించినవాడును, సుందర + ఆయతభుజమ్ = అందమైన, దీర్ఘములైన బాహువులనుకల స్వామిని, భజామహే = భజింతును.

నూపురగంగ ప్రవహించు తిరుమాలిరుమ్ శోలైపర్వతమును అధివసించియున్న స్వామి సేవింతుననుచున్నారు ఇందు కూరేశులు. భగవానుడు త్రివిక్రమావతారము నెత్తినపుడు స్వామి శ్రీపాదములకు అలంకారమైయున్న నూపురమునుండి పుట్టినదగుటచే ఈ నదికి **"నూపురగంగ"** అను పేరు కల్గినది. ఈ నది కోఱిన ఫలములను ఇచ్చునది అగుటచే **"ఇష్టసిద్ధి"** అను పేరుతో స్థలపురాణమున ప్రసిద్ధిచెందినది.



**(వృక్షషండమయమ్ అద్రిమ్ ఆస్థితమ్)** – **"శన్దొడు కారకిలుమ్"** అని, **"కదళవకుళజంబూపూగమాకంద"** ఇత్యాదిగా కీర్తింపబడిన పలు విధములైన వృక్షసమూహముతో దట్టమై, గొప్పతోటగా నుండుటచేతనే ఈ క్షేత్రమునకు **"తిరుమాలిరుమ్ శోలై"** అని పేరు. సంస్కృతమునందును దీనికి **"వనగిరి"** అని వ్యవహారము. **"ఆశ్రితమ్"** అను పాఠభేదము కలదు. ఈ క్షేత్రమహిమను ఉత్తరార్ధము తెలుపుచున్నది.

**(యత్ర సుప్రథితనూపురాపగాతీర్థమ్)** – **"శిలమ్బాఱు పాయుమ్ తెన్‌తిరుమాలిరుమ్‌శోలైయే"** అని పెరియాళ్వార్లు, **"శన్దొడు కారగిలుమ్ శుమన్దు తడఙ్గళ్ పొరుదు వన్దు ఇఴియుమ్ శిలమ్బాఱుడైయ మాలిరుమ్‌శోలై"** ఇత్యాదిగా తిరుమఙ్గైమన్నన్ పల్కుట ఇచట స్మరణీయములు. ఆరోగ్యము, సంతానము, ఐశ్వర్యము, మోక్షము – ఇత్యాదిగా చెప్పబడు సకలపురుషార్థములను వారి వారి ప్రార్థనలను అనుసరించి ఇవ్వగల్గినది – అని పురాణ పౌరాణికులచే పొగడబడినదగు నూపురగంగచే అలంకరింపబడిన వనగిరిలో వేంచేసియున్న శ్రీ సుందరబాహుస్వామిని భజింతునని శ్లోకభావము. **"తదాక్రమణకాలే తు బ్రహ్మణా క్షాళితం పదమ్...త్రివిక్రమ– పదాశ్లిష్టమణినూపురపూరితమ్, జలం తచ్చోదనా దభ్రాత్ గిరిమూర్ధ్ని సమాపతత్"** అనుచు పురాణములలో నూపురగంగోత్పత్తి వర్ణింపబడినది.

**"సుందరాయతభుజ మితి తత్రత్ర్యవిష్ణునామధేయం,తథా వృక్షషండమయ మద్రి మితి తత్పర్వతనామధేయం చ"** అని రామానుజాచార్యవ్యాఖ్య. శ్లోకములోని **"ఆయత"** అను విశేషణ స్వారస్యానుగుణముగా **"ఆయతా శ్చ సువృత్తా శ్చ"** అను శ్రీరామాయణసూక్తిని స్మరింపనగును. **"ఆయతా శ్చ సువృతా శ్చ – ఇత్యాది"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్యానము. వృత్తము రథోద్ధత. **"రో నరా విహ రథోద్ధతా లగౌ"** అని దీని లక్షణము. **"భుజ – భజ, నూపురాపగా, తీర్థమ్ – అర్థిత"** – ఇత్యాది వర్ణముల ఆసకృదావృత్తిచే అనుప్రాసాలంకారము కలదు. ఇట్టి శబ్దాలంకారములను ఈ స్తోత్రములో పలుచోట్ల గమనింపవచ్చును. స్తోత్రమున సర్వత్ర విభిన్నవృత్తప్రయోగమును కూడ కాననగును. ఇందు ప్రసిద్ధార్థపదప్రయోగము చేయబడుటచే ప్రసాదమను గుణము కలదు.

**3. క్వచి త్త్వరితగామినీ క్వచన మందమందాలసా**
**క్వచిత్ స్ఖలితవిహ్వలా క్వచన ఫేనిలా సారవా ।**
**పతంత్యపి కిల క్వచిత్ వ్రజతి నూపురాహ్వా నదీ**
**సుసుందరభుజాహ్వయం మధు నిపీయ మత్తా యథా ॥**

నూపుర + ఆహ్వానదీ = (ఈ) నూపురగంగ అనునది, సుసుందరభుజాహ్వయం = మిక్కిలి అందమైన, సుందరబాహుస్వామి అనెడి, మధు = మధువును, నిపీయ = బాగుగా తాగి, (దానివలన), మత్తా యథా = మదమును పొందిన దాని (స్త్రీ) వలె, క్వచిత్ = ఒక చోట, త్వరితగామినీ = వేగముగా పోవునదియై, క్వచన = వేఱొకచోట, మందమందాలసా = మిక్కిలి మెల్లగా పోవునదియై, క్వచిత్ = ఇంకొకచోట, స్ఖలితవిహ్వలా = అడ్డగింపబడి, తడబడి, సుడులను కల్గినదియై, క్వచన = మఱియొకచోట, ఫేనిలా =

నుఱుగును కల్గినదియై, సారవా = శబ్దము చేయునదియై (అట్టహాసమును చేయునదియై), క్వచిత్ = ఇంకొకచోట పతంతీ అపి = (జలపాతరూపమున) క్రిందపడునదిగాకూడ, వ్రజతి కిల = వెడలుచున్నది కదా! ఆశ్చర్యము!

పూర్వశ్లోకములో నూపురగంగానదీ తీర్థమహిమ ప్రస్తుతమగుటచే, ఆ దివ్యనదిగతి విశేషములిందు వర్ణింపబడుచున్నవి. నదులను స్త్రీలతో పోల్చి, వర్ణించుట కవిసమయము. **"భూమివిద్యుత్సరిల్లతావనితాభిధానాని"** అని పాణిని మహర్షియు పల్కెను. మద్యపానమును చేసిన స్త్రీ ప్రవర్తన ఎట్లుండునో ఆవిధముగానే నూపురగంగగతికూడ ఉన్నదట. ఆ మద్యము ఏది? అనగా – **(సుసుందరభుజాహ్వాయం మధు నిపీయ మత్తా)** – సుందరబాహుస్వామియే ఒక అలౌకికమైన మధువు. **"మాధవో మధుః"** అని విష్ణుసహస్రనామస్తోత్రములో స్వామి మధు (170) శబ్దవాచ్యుడుగా కీర్తింపబడెనుకదా! ఈ నామమును పరాశరభట్టరువారు **"లబ్ధవిద్యేభ్యః స్వదమానత్వాత్ మధుః....యథా "మధ్వ ఉత్సః", "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ ఇతి చ"** అని వివరించిరి. అనగా – ఉపాసనమును చేయువారికి తేనెవలె తీయనైనవాడు కావున భగవానుడు మధువు అనబడుచున్నాడని భావము. ఇచట తీయగానుండుట అనునది రసనేంద్రియజ్ఞానమునకు కాదు. మనస్సుకు సంబంధించినది. తేనెను భుజించినవానికి దాని రుచి ఎట్లు మధురముగా నుండునో, ఆవిధముగానే భగవదుపాసకునకు ఆ ఉపాసనము మధురమైయుండునని తాత్పర్యము. నిజమునకు **"మధురాధిపతే రఖిలమ్ మధురమ్"** అని కీర్తింబడు స్వామి మాధుర్యములోని అత్యల్పాంశము లౌకిక మధువులో ఉన్నందున దానికాపేరు కల్గినదనవలెను. దివ్యసూరులును **"ఎనక్కుత్తేనే పాలే"** ఇత్యాదిగా సుందరబాహుస్వామిని మధుపదార్థస్వరూపునిగా కీర్తించిరి. వేదాంతశాస్త్రములో భగవానుని మధురూపునిగా ఉపాసించు మధువిద్య తెలుపబడుట సుప్రసిద్ధము. శ్రీరామాయణములో మధువనవృత్తాంతమును పరమాత్మానుభవముగా పెద్దలు వ్యాఖ్యానించిరి. **"మన్యతే సర్వత్ర మధుః"** – అంతట గౌరవింపబడువాడు కావున మధువు, **"మధునా పుష్పరసేన యోగాద్వా మధుః"** – మధువనెడి పుష్పరసమును కలవాడు కావున మధుశబ్దవాచ్యుడు, **"మన్యతే అభిలష్యత ఇతి మధుః"** – అభిలషింపబడు కావున మధువు, **"మాద్యంత్యనేనేతి మధుః"** వీనిచే మదమును పొందుచున్నారు కావున మధువు, – ఇత్యాదిగా చెప్పబడు మధుశబ్దవ్యుత్పత్తులన్నియు భగవానునిపట్ల పొసగును కదా! లోకములో మధుపానము చేసి మత్తెక్కినవారి గతి, ఈ నదిగతియు ఒక్కటిగా నుండుటచే **"మధు నిపీయ మత్తా యథా"** అని అనబడినది. ఈ గతి ఎట్లున్నదనగా –

**(క్వచిత్ త్వరితగామినీ)** – కొన్ని చోట్ల వేగముగా ప్రవహించుచున్నది. మార్గములో ఎక్కడను అడ్డులేకున్నచో నదీప్రవాహము వేగముగా పోవునుకదా! మత్తెక్కిన స్త్రీగతియు అట్టిదే.

**(క్వచన మందమందాలసా)** – కొన్ని చోట్ల పెద్దపెద్ద శిలలు అడ్డగించినపుడు తొట్రుపడుచు,



సుడులు తిరుగుచు నూపురగంగ మెల్లగా ప్రవహించుచున్నది. **"సా ప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ"** అను రామాయణ సూక్తి ఇచట స్మరణీయము. మత్తెక్కిన గమనము కూడ ఒకసారి మందముగానే ఉండును.

**(క్వచిత్ ఫేనిలా)** – కొనిచోట్ల నుఱుగులను కక్కుచున్నది. మద్యమును సేవించిన స్త్రీ కూడ ఉద్గారమును చేయును.

**(క్వచన సారవా)** – కొన్నిచోట్ల గర్జనలతో (శబ్దించుచు) ప్రవహించుచున్నది. మధువును త్రాగిన స్త్రీకూడ అస్పష్టముగా జల్పించుట సహజము.

**(క్వచిత్ పతంతీ వ్రజతి)** కొన్నిచోట్ల ఎత్తైన చోట్లనుండి క్రిందకు పడుచు ప్రవహించుచున్నది. మదించిన స్త్రీ తొట్రు పడుచు నడచుటయును సహజమే. ఇట్లు పలు రీతులలోని విభ్రమములతో ప్రవహించు నూపురగంగ గతివిశేషములను గమనించినచో, లోకములో మద్యపానమును చేసి మదించిన స్త్రీ గతులు స్మరణకు వచ్చుచున్నవి. మధువుగా చెప్పబడిన భగవానుడే ఈ క్షేత్రములో సుందరబాహుస్వామి రూపమున వేంచేసియుండుటచే, ఈస్వామిని అనుభవించుట (దర్శించుట) వలన, మధువును తాగినవారి గతివిశేషములు ఈ నదికి కల్గినది కాబోలు! – అనుచు కూరేశులు ఇట్లు ఉద్భావించిరి. శ్లోకములోని నదీవిశేషణములన్నింటిలో అభంగశ్లేష కలదు. **"యథా"** అనుననది ఉపమావాచకము.

**"విభ్రమం మధుమదప్రమాదానాం ధాతులీన ముపసర్గ ఇవార్థమ్"** అనుచు మాఘ కవి మదించిన స్త్రీల విభ్రమములనుగూర్చి పల్కెను, నూపురగంగకు సంబంధించిన విశేషములెన్నియో ఉండగా ఆ నది గతివిశేషములను కూరేశులు ఇచట ఇట్లు ప్రస్తావించుటలో ఏమి తాత్పర్యము? అనినచో, **"క్వచి దుపలక్షితా.....క్వచిద భంగురగూఢగతిః** – అనుచు దేశికులు దయాశతకములో శ్రీనివాసుని దయను, సరస్వతిని కలిపి స్తుతించినట్లే, ఈ నూపురగంగలో స్నానము చేయు భాగ్యమును పొందినవారి విషయములో – వారు వారు చేసిన కర్మలకు తగినట్లు, వేగముగా, మెల్లగా, **"పంగోరుపరి యది గంగా నిపతతి"** అనునట్లు తనకు తానే అజ్ఞాతసుకృతాదిఫలముగా కొందఱి పైపడి ఫలించుచున్నదని, ఇట్లు పలువురి పట్ల పలు రీతులలో ఈ నదీస్నానము ఫలించు ప్రకారమును కూరేశులు ఇట్లు తెలిపిరని చెప్పవచ్చును – అని వ్యాఖ్యానాంతరము. దృప్తప్రపన్న, ఆర్త ప్రపన్న, ఐశ్వర్య, కైవల్యార్థులను కవి **"క్వచన, క్వచిత్"** పదములతో నిర్దేశించిరనియు అచటి వివరణము. **''స్ఖలితవిహ్వలా''** అనునది విశేషణోభయకర్మధారయము, వృత్తము పృథ్వి. **"జసౌ జసయలా వసుగ్రహయతి శ్చ పృథ్వీ గురుః"** అని లక్షణము. **"వృక్షషండమయ మద్రి మాశ్రితమ్"** అనునది పూర్వశ్లోకమునుండి అధ్యాహారము చేసికొనవలెనని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఈ శ్లోకమున మధువును సేవించిన స్త్రీ ధర్మములు నూపురనదీయందు గమనమున ఆరోపించుటచే అచేతనమందు

చేతనధర్మారోపమును చేయుట అను సమాధి గుణము కలదు.

**4. ఉదధిగమందరాద్రిమథిమంథనలబ్ధపయో -
మధురరసేందిరాహ్వాసుధసుందరదోఃపరిఘమ్ ।
అశరణ మాదృశాత్మశరణం శరుణార్థిజన -
ప్రవణధియం భజేమ తరుషండమయాద్రిపతిమ్ ॥**

ఉదధిగ = సముద్రములో ప్రవేశించిన, మందర + అద్రి = మందరపర్వతమనెడి, మథి = కవ్వముచే (చేయబడిన), మంథన = మథనమువలన, లబ్ధ = పొందబడిన, పయోమధురరస = క్షీరసారమగు అమృతము, ఇందిరా + అహ్వాయ = ఇందిర=అను (లక్ష్మీదేవి అనెడి), సుధ = అమృతము - అను వీనినికల, సుందర అందమైన దోః పరిఘమ్ = పరిఘలవంటి బాహువులను కలవాడు, అశరణమాదృశశరణం=దిక్కులేని నావంటివారికి గొప్పదిక్కు, శరణార్థిజన=శరణాగతజనులపట్ల, ప్రవణధియమ్=మిక్కిలి అభినివేశమును కలవాడు, తరుషండమయ+అద్రిపతిమ్ = వృక్షసమూహమునుకల తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు అధిపతియగు సుందరబాహుస్వామిని, భజేమ=సేవించెదము.

గోదాదేవి తిరుమాలిరుమ్‌శోలైలోని అழகర్‌స్వామినిగూర్చి వర్ణించునపుడు నాయ్చ్చియార్ తిరుమొழிలో **"మన్దరమ్ నాట్టి యన్ఱు మదురక్కొழுఞ్ఞారు కొణ్డ శున్దర త్తోళుడైయాన్"** అని పల్కిరి. ఈ పాశురములోని **"మదురక్కొழுఞ్ఞారు కొణ్డ"** అను ప్రయోగము లక్ష్మీదేవిని తెలుపుచున్నదని భావించి, ఈ శ్లోకమును కూరేశులు అనుగ్రహించిరి. **"విణ్డవ రముదుణ అముదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ వెమ్బెరుమానే"** అని తిరుమఙ్గైమన్నన్ కూడ అనుగ్రహించిరి కదా! దేవతలకు వారు కోఱిన అమృతమును ఇచ్చుటకై స్వామి సముద్రమును చిలికిన వృత్తాంతము వ్యాజము మాత్రమే. **"ఫలేగ్రహి ర్హి కమలాలాభేన సర్వశ్రమః"** అని పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవములో అనుగ్రహించినరీతిలో లక్ష్మీదేవిని పొందుటయే సముద్రమథనపరమప్రయోజనము అని అనుటలో ఔచిత్యము కలదు. కావున **"మన్దరమ్ నాట్టి యన్ఱు మదురక్కొழுమ్ శారు కొణ్డ"** అను శ్లోక పూర్వార్ధము తెలుపుచున్నది.

**(ఉదధిగ......పరిఘమ్)** - పూర్వార్ధమంతయు ఒకే సమాసము. సుందరబాహుస్వామికి విశేషణము. భగవానుడు సముద్రమున చిలికిన వృత్తాంతమును వేదము - **"వాయురస్మా ఉపామంథత్ పినష్టిస్మా కున్నమా, కేశీ విషస్య పాత్రేణ యద్రుద్రేణాపిబత్ సహ"** - అని కీర్తించినది అని వ్యాఖ్యానాంతరము. **"పయోమధురరస"** అనగా క్షీరముయొక్క మధురరసమైన అమృతమని, **"ఇందిరాహ్వాసుధ"** అనగా లక్ష్మీదేవి అనెడి అమృతమనియు అర్థము. గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్యలో **"మధురస ఏవేందిరాహ్వేతి వ్యాఖ్యేయమ్"** అని



వివరింపబడినది. అనగా సముద్రమథనములో లభించినది నిజమైన అమృతము కాదని, లక్ష్మీదేవియే నిజమైన అమృతమని భావము.

**(సుందరదోఃపరిఘమ్)** - అందమైన, పరిఘలవంటి బాహువులను కలవాడు. దీని తాత్పర్యమేమనగా - తన బలిష్ఠములైన సుందరబాహువులతో, మందరమనెడి కవ్వముతో సముద్రమును చిలికి, దేవతలకు వారి అమృతమగు ఉప్పుచాఱును, **"శీదక్కడలుళ్ళముదు"** అనునట్లు తనకు అమృతమగు ఆ లక్ష్మీదేవిని గ్రహించెనని - అని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(శరణార్థిజనప్రవణధియమ్)** - **"ప్రవణధియమ్"** అనుటను **"అభిముఖ్యమాత్రతృప్తక మిత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య వివరింపగా, **"పరతంత్రధియమ్"** అని గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్య వివరించినది. **"ప్రవణః క్రమనిమ్నోర్వ్యాం ప్రహ్వే"** అని అమర నిఘంటువు. దీనిని బట్టి, ప్రవణశబ్దము పల్లపు ప్రదేశమును నిర్దేశించునని తెలియుటచే, నీరు పల్లపుప్రదేశమునకు చేరి, అచటి నుండి కదలిపోకుండునట్లే, సుందరబాహుస్వామియు తనను ఆశ్రయించినవారిని చేరుటయేగాక, వారినుండి ఏనాడు దూరముకాడను అర్థము ధ్వనించును. **"క్రమనిమ్నమహీభాగోదారప్రహ్వేషు"** అను మేదినీ నిఘంటు సూక్తినిబట్టి శరణాగతుల పట్ల ఉదారుడనియు చెప్పవచ్చును. అనగా అభిముఖ్యము మాత్రముతోనే తృప్తి పడి, అతనిపట్ల తాను పరతంత్రుడై ప్రవర్తించునని భావము. అలంకారము రూపకము, వృత్తము నర్కుటకము. **"యదిభవతో నజౌ భజజలాగురు నర్కుటకమ్"** అని లక్షణము. వికటాక్షర బంధరూపమైన ఔదార్యమనుగుణ మిందు కలదు.

**"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** అనురీతిలో భగవానుడు చూపు దయకు తగినట్లు మనవద్ద పలు దోషములున్నను, **"నాన్ శెయ్‌ద కుఱ్ఱమ్ నఱ్ఱమాకవే కొళ్ ఞాలనాదనే"** అని తిరుమழிశైప్పిరాన్ ప్రార్థించిన రీతిలో, మన తప్పులను కాచి, మన పట్ల వాత్సల్యాతిశయముతో అభినివేశమును పొంది, **"పారిత్తు ఎన్నై ముఱ్ఱ ప్పరుకినాన్"** అనునట్లుండు తిరుమాలిరుమ్‌శోలై స్వామిని సేవించెదము - అని భావము" - అని వ్యాఖ్యానాంతరము. పూర్వార్ధములో **"సుధ"** అనునది అపపాఠమని, **"సుధి"** అనునదియే ప్రాచీన పాఠమని, అదియే యుక్తమనియు అందు తెలుపబడినది - **"సుధ ఇత్యపపాఠః, సుధిః ఇతి తాలకోశేషు పాఠః, ఉపసర్గే ఘోః కిః - ఇతి సూపపదాత్ ఘుజో కిః, సుధాః సుధా, "ఉపధిః ఉప ఇతివత్ ఉభయం సాధు, అభిన్నార్థకం చ"** అని అచటి వివరణము. శిష్టప్రయోగసంగ్రహమను గ్రంథములో **"తత్ర సుధా ఇతి స్త్రీలింగత్వాత్ ఇందిరాహ్వా యా సుధా తస్యాః సుందరదో రేవ పరిఘః-అర్గళః-రక్షక యస్య తథాభూత మిత్యర్థః, తథా చ సుధాశబ్దస్యాత్ర ఛందోభంగావహత్వాత్ సుధ ఇతి అప్రయోజ్యత్వాత్,**

**సుధి ఇతి ప్రయుక్తం భవేత్. ఉపసర్గే ఘోః కిః ఇతి కర్మణి ప్రత్యయాంతః పుల్లింగ ఇతి జ్ఞేయమ్. విధిః నిధి ఇత్యాదివత్, అతః సుధ ఇత్యపపాఠః"** అని విమర్శింపబడినది. ఈ వివరణమును బట్టి పూర్వార్ధమునకు– మందరపర్వతమువలన క్షీరసాగరమునుండి పుట్టిన అమృతమును, లక్ష్మి అను సుధను రక్షించు సుందరబాహువులను కలవాడను భావము చెప్పనగును. ఇచట భగవానుడు అమృతమును రక్షించుట అనగా మోహినీ వేషమును దాల్చి అసురులకు దానిని అందకుండా కాపాడుటయే.

**5. శశధరరింఖణాధ్యశిఖ ముచ్ఛిఖరప్రకరం**
**తమిరనిభప్రభూతతరుషండమయం భ్రమదమ్ ।**
**భిదురితసప్తలోకసువిశృంఖలశంఖరవం**
**వనగిరి మావసంత ముపయామి హరిం శఱణమ్ ॥**

శశధరరింఖణ = చంద్రుని సంచారములచే, అధ్యశిఖమ్ = ఉన్నతమైన శిఖాభాగములను కల్గినది. ఉచ్ఛిఖరప్రకరమ్ = మిక్కిలి ఎత్తైన శిఖరములను కల్గినదియు, తిమిరనిభ = చీకటితో సమానమైన, ప్రభూత = అధికముగానున్న, తరుషండమయమ్ = వృక్షసమూహముతో నిండినదియు, (కావుననే), భ్రమదమ్ = (ఇది వృక్షముల సమూహమే, కొండ కాదు అను) భ్రమను కల్గించునదియును అగు, వనగిరిమ్ = వనాద్రియందు, అవసంతమ్ = నివసించునట్టి, భిదురిత = బ్రద్దలు చేయబడిన, సప్తలోక = ఏడులోకములందు, సువిశృంఖల = ఏ మాత్రము అడ్డులేని, శంఖరవమ్ = పాంచజన్యమనెడి శంఖముయొక్క ధ్వనిని కల, హరిమ్ = సుందరబాహుస్వామిని, శరణమ్ = శరణముగా, ఉపయామి = పొందుచున్నాను.

తిరువాయ్‌మొ౸ి ప్రబంధములోని **"మదితవ౸్ కుడుమి మాలిరుమ్‌శోలై"** అని, **"అదిర్‌కురల్ శఙ్గత్త౸కర్ తఙ్కోయిల్"** అనియుగల సూక్తులను అనుసరించుచు కూరేశులు రచించిన ఈ శ్లోకమెంత మధురమో కదా !

**(శశధరరింఖణాధ్యశిఖమ్) "మదితవ౸్కుడుమి మాలిరుమ్ శోలై"** (2-10) అనుచు నమ్మా౸్వార్లు పల్కినరీతిలో చంద్రసంచారముతో కూడినది. **"తిఙ్గళ్‌తన్ మాముకిల్ శేర్ తిరుమాలిరుమ్ శోలై"** అనుచు తిరుమఙ్గైమన్నన్‌కూడ పల్కిరి. దీనివలన చంద్రమండలపర్యంతరము వృద్ధిచెందిన పర్వతముయొక్క ఔన్నత్యము వర్ణింపబడినది. కావున అతిశయోక్త్యలంకారము కలదు. **"సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశంతి విధుమండలమ్"**, **"వైదర్భీకేలిశైలే మరకతశిఖరా దుత్థితై రంశుదర్భైః"** ఇత్యాది మహాకవి ప్రయోగములును ఈ సందర్భమున స్మరణీయములు.



**(ఉచ్ఛిఖరప్రకరమ్)** మిక్కిలి, ఎత్తైన శిఖరముల సమూహమును కల్గినది. **(తిమిరనిభప్రభూతతరుషండమయమ్)** – చీకటి ఘనీభవించినట్లును, అపరిమితముగనునున్న వృక్షసమూహప్రాచుర్యమును కల్గినది. ఇచటి **"మయట్"** ప్రత్యయము ప్రాచుర్యార్థకము. **(భ్రమదమ్)** – "ఇది వృక్షసమూహముకాదు, పర్వతమే" అను భ్రాంతిని కల్గింపగల్గినది. **"మయల్‌మికు పొ౸ిల్‌శూ౸్ మాలిరుమ్‌శోలై"** అను నమ్మా౸్వార్ల శ్రీసూక్తిని ఇచట స్మరింపనగును.

**(భిదురితసప్త......శంఖరవమ్) "అదిర్‌కురల్ శఙ్గత్తు అ౸కర్"** అను ఆ౸్వార్‌ల ప్రయోగమునుబట్టి ఇట్లు ప్రయుక్తము. దీనిని తిరుమాలిరుమ్‌శోలైకు కూడ విశేషణముగా కూడ అన్వయింపవచ్చును. "దీనికి మూలమైన **"అదిర్ కురల్"** అను తిరువాయ్‌మొ౸ి శ్రీసూక్తి కూడ పర్వతవిశేషణముగను, భగవానునకు విశేషణముగను అన్వయించు అవకాశముండుట గమనింపతగినది" అని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్యానము. దీనిని మూడవ పాదముగా పఠించువారును కలరు. "మధురలో తమిళసంఘమును పోషించిన పాండ్యప్రభువుసభలో సుందరబాహుస్వామియు ఒక పండితుడుగానుండి, తమిళమును గ్రహించి, పరిశీలించి, శంఖనాదమును చేసిన వృత్తాంతమును ద్రావిడలక్ష్యప్రబంధములలో గమనింపవచ్చును" – అని వేఱొక వ్యాఖ్య. భగవానుని పాంచజన్యముయొక్క తొలిమ్రోతవలన సప్తలోకస్థితములగు పదార్థములు భిన్నములైనవి; మలిమ్రోతవలన సప్తలోకములే భిన్నములైనవి – అను భేదమును ఇచట గ్రహింపనగును – అని ఇంకొక వివరణము. **"భిదురాః పదార్థాః అస్య సంజాతాః భిదురితాః, భిదురాః కృతాః భిదురితాః. ప్రథమయోజనాయాం సుందరబాహుపాణిస్థపాంచ జన్యధ్వనినా సప్తలోకస్థాః పదార్థా భిన్నా భవంతీత్యర్థః. ద్వితీయయోజనాయాం సప్తలోకా ఏవ భిన్నా భవంతీతి భేదః. పూర్వశ్లోకే "ఉదధిగమందరాద్రీ" త్యాదివిశేషణాని, ఏతచ్ఛ్లోకస్థ "శశధరరింఖణే" త్యాది విశేషణాన్యపి దివ్యప్రబంధానుసారేణేతి ద్రష్టవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"శశధరేతి, భిదురితేతి చ వర్ణనం దివ్యప్రబంధేఽభిహితమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **(వనగిరిమ్ అవసంతమ్)** – ఇచట సప్తమీవిభక్త్యర్థమున ద్వితీయ ప్రయోగింపబడినది. **"అత్యంతసంయోగే ద్వితీయా"** అను సూత్రార్థము స్మరణీయము. వృత్తము పూర్వమువలె నర్కుటకము.

**6. యత్తుంగశృంగవినిషంగిసురాంగనానాం**
**న్యస్తోర్ధ్వపుంద్రముఖమండనమండితానామ్ ।**
**దర్పణ్యభూ ధ్ధృతమపాంకశశాంకపృష్ఠమ్**
**తద్ధామ సుందరభుజస్య మహాన్ వనాద్రిః ॥**

న్యస్త = చక్కగా ధరింపబడిన, ఊర్ధ్వపుంద్ర = ఊర్ధ్వపుంద్రములనెడి, ముఖమండన

= ముఖాలంకారములచే, మండితానాం = అలంకరింపబడినవారగు, యత్తుంగశృంగ = ఏ తిరుమాలిరుమ్‌శోలై పర్వతముయొక్క ఉన్నత శిఖరములందు, వినిషంగి = వచ్చి చేరిన, సుర + అంగనానాం = దేవతాస్త్రీలకు, ధృతమ్ = వారి చేతిలో ధరింపబడిన, అపాంక = కళంకములేని, శశాంక = చంద్రునియొక్క, పృష్ఠమ్ = వెనుకభాగము, దర్పణ్యభూత్ = అద్దము అయ్యెనో, తత్ ధామ = అట్టి దివ్యదేశము అగు, సుందరభుజస్య = సుందరభుజస్వామియొక్క, వనాద్రిః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతము, మహాన్ = చాల గొప్పది.

పూర్వశ్లోకమువలెనే, ఈ శ్లోకమునకూడ పర్వతముయొక్క ఔన్నత్యాతిశయమును వర్ణించుటచే అతిశయోక్త్యలంకారము కలదు. తిరుమాలిరుమ్‌శోలైలోని స్వామిని సేవించుట కొఱకు దేవలోకములోని స్త్రీలు ఆ పర్వతమునకు వత్తురు. **"శిలమ్బు ఆర్క్క వన్దు దెయ్‌వమకళిర్‌కళోడుమ్ శీర్ శిలమ్బాఱు పాయుమ్ తెన్ తిరుమాలిరుమ్‌శోలైయే"** అని పెరియాళ్వార్లు సాయించిరి కదా. అట్లు వచ్చిన స్త్రీలు తమ లలాటము ఊర్ధ్వపుండ్రమును ధరింపకుండ స్వామిని సేవింపరు. కావున, అచటి కొండయొక్క ఉన్నతమైన శిఖరములోనున్న, నిర్మలమైన చంద్రమండలమునే అద్దముగా చేసికొని, ముఖాలంకారమును చేసికొందురని భావము. చంద్రమండలము వరకు ఈపర్వతశిఖరములు వ్యాపించినవని పల్కుటవలన ఈ పర్వతముయొక్క ఔన్నత్యము స్పష్టము.

**(న్యస్తోర్ధ్వపుండ్ర.....మండితానామ్)** ఇది సురాంగనావిశేషణము. దేవతాస్త్రీలు ధరించిన ఊర్ధ్వపుండ్రము వారి లలాటమునకొక అపూర్వాలంకారము. ఈ విశేషణము సాభిప్రాయకము. కావున పరికరాలంకారము కలదని కొందరి వ్యాఖ్య.

**(యత్తుంగశృంగి.....సురాంగనానామ్) "దేశమెల్లామ్ వణఙ్గుమ్ తిరుమాలిరుమ్ శోలైనిన్ఱ కేశవనమ్బితన్నై తేవర్‌కళ్ నాయకనై", "తిరుమాలిరుమ్‌శోలై నిన్ఱ కోవలర్ కోవిన్దనై"** ఇత్యాది దివ్యప్రబంధసూక్తులు ఇచట అనుసంధేయములు.

**(ధృతమ్ అపాంక.....దర్పణ్యభూత్)** చంద్రునిలోని కళంకమును కవులు **"అంకం కేఽపి శశంకిరే జలనిధేః పంకం పరే మేనిరే. సారంగం కతిచిచ్చ సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే"** అనువిధముగా ఉల్లేఖించిరికదా! వాస్తవమునకు చంద్రనిలో మచ్చకు కారణము దేవతాంతరసంబంధమే. అది ఈ దివ్యదేశమునకు లేదు. కావున చంద్రుడు అపాంక శశాంకుడైనాడు. ఈ విషయమును అనంతర శ్లోకములో **"దేవతాంతరసమాశ్రితా"** అను సూక్తిద్వారా కూరేశులు స్పష్టీకరించిరి. ఆళ్వార్ల **"మల మఱు మదిశేర్ మాలిరుమ్‌శోలై"** అను దివ్యసూక్తినిబట్టి ఈ ప్రయోగము చేయబడినది. చంద్రుడు తిరుమాలిరుమ్ శోలైను సేవించి, తనకుగల దోషమును నివారించుకొనెనని భావము. **"కళంకిత్వేనోక్తస్య శశస్య చంద్రోత్సంగత్వాత్ పృష్ఠ మపాంకం భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అనగా, కళంకము చంద్రమండలము మధ్యలో కలదు, కావున వెనుక భాగమున కళంకము లేదని



భావము.

**(ధృతమ్......దర్పణ్యభూత్)** అకలంకచంద్రమండలము దేవతా స్త్రీల హస్తములలో అద్దము అయ్యెను. **"దర్పణ్యభూత్"** అనునది ఒకే పదమని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"దర్పణీ – అభూత్"** అని వేఱ్వేరు పదములుగా గ్రహించి అర్థమును చెప్పువారును కలరు. **"దర్పణీ"** శబ్దములోని స్త్రీలింగమును **"స్త్రీ స్యాత్ కాచిత్ మృణాళ్యాదిః వివక్షాపచయో యది"** అను లక్షణమునుబట్టి సమర్థించిరి. **"పూర్వశ్లోకే – శశధరరింఖణాధ్యశిఖమ్ – ఇత్యుక్తమ్. తతోఽపృత్తుంగశృంగస్థానాం సురాంగనానాం నిమ్నశృంగసంచారాత్ చంద్రపృష్ఠం దర్పణీ భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(మహాన్)** ఇదియు సాభిప్రాయవిశేషణమే. ఔన్నత్యముచేత, భగవత్సంబంధమును కల్గియుండుటచేతను గొప్పది ఈ పర్వతము. **"వనగిరినామకం సుందరబాహువాసస్థానం దివ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యాసూక్తి, వృత్తము వసంతతిలక. దేవతాస్త్రీలు తమ లలాటమున ధరించు తిలకమును గూర్చి వసంతతిలక వృత్తమున స్తుతించుట ఒక విధమైన వృత్తౌచితి. వర్గపంచమాక్షరముల సంయోగముతో కూడిన రచన ఈ శ్లోకమున కన్పించుచున్నది కావున సౌకుమార్యం అను కవితాగుణము కలదు. ఇచటి శబ్దవృత్తి ఉపనాగరిక.

**7. యదీయశిఖరాగతాం శశికలాం తు శాఖామృగా**
**నిరీక్ష్య హరిశేఖరీభవన మామృశంత స్తతః ।**
**స్పృశంతి న హి దేవతాంతరసమాశ్రితేతి స్ఫుటం**
**న ఏష సుమహాతరుప్రజగిరిః గృహం శ్రీపతేః ॥**

యదీయ = ఏ పర్వతముయొక్క శిఖర + ఆగతాం = శిఖరమునకు చేరిన, శశికలాం = చంద్రరేఖను, నిరీక్ష్య = చూచి, హరశేఖరీభవనం = శివుని తలకు ఆభరణమై యుండుటను, అమృశంతః = గమనించినవియై, శాఖామృగాః తు = కోతులు (వానరములు), తతః = పిమ్మట, దేవత + అంతరసమాశ్రితా = వేఱొక దేవతను ( ఈ చంద్రకళ) ఆశ్రయించినది, ఇతి = అను కారణమువలన, న స్పృశంతి హి = తాకుటలేదు కదా, స్ఫుటం = ఇది నిశ్చయము, అట్టి, స ఏషః = అట్టి, సుమహాతరుప్రజగిరిః = తిరుమాలిరుమ్ శోలై పర్వతము, శ్రీపతేః = భగవానునకు, గృహమ్ = వాసస్థానము.

తిరుమాలిరుమ్‌శోలై పర్వతముపై వానరములు సంచరించుచుండును. అవి చంద్రమండలమునకు సమీపమున సంచరించుచున్నను, ఆ చంద్రుని తాకుటలేదు. ఎందుచేత? అనినచో, **"పిఱై తఙ్గు శడైయాన్"** అని, **"చంద్రశేఖరః"** అనియు పేర్లను కల్గియుండుటకు తగినట్లు చంద్రుడు శివుని శిరస్సునకు ఆభరణము అగుటచే, దేవతాంతర

స్పర్శమును పొందిన చంద్రకళను భగవానునియందు ఆనన్యభక్తినికల మనము స్పృశింపరాదని తలచి శాఖామృగములు చంద్రకళను స్పృశించుటలేదు – అని ఉత్ప్రేక్షించుట ఈ శ్లోకములోని విషయము. చంద్రమండలమువరకు వృద్ధిచెందిన శిఖరములను కల్గినది ఈ పర్వతము అనుటచే పర్వతముయొక్క ఉన్నతత్వము చెప్పబడినది.

**(శాఖామృగా స్తు)** – ఇచటి **'తు'** అను అవ్యయము పూర్వశోక్లములో ప్రస్తావింపబడిన దేవతాస్త్రీలను వ్యావర్తించుచున్నది. వారు శ్రీవైష్ణవలక్షణపూర్తిని కలవారు కారు. కావున దేవతాంతరస్పర్శనుకల చంద్రమండలమును తాకి, తమ కార్యమును నిర్వహించుకొనుచున్నారు. కాని, ఈ వానరములు వారికంటె విలక్షణమైన స్వభావమును కల్గినవి – అని తాత్పర్యము.

ఇచట వ్యాఖ్యానాంతరములో ఈ క్రింది విధముగా విస్తృతమైన విచారము చేయబడినది. పేయాళ్వార్లు తమ మూన్ఱామ్ తిరువన్దాదిలో (58) **"తెళిన్ద శిలాతలత్తిన్ మేలిరున్ద మన్ది అళిన్ద కడువనైయే నోక్కి – విళఙ్గియ వెణ్మదియమ్ తా ఎన్నుమ్ వేఙ్గడమే మేలొరునాళ్ మణ్ మదియిల్ కొణ్డుకన్దాన్ వాళ్వు"** అనుచు వేంకటాచలముపైనున్న ఆడవానరము, మగవానరమును చూచి చంద్రుని ఇమ్మని కోఱినదని పల్కిరి కదా! ఇచట వానరములు చంద్రుని తాకుట లేదని కూరేశులు పల్కుట అందులకు విరుద్ధముగా నున్నదే! అని శంకింపవద్దు. పేయాళ్వార్ల పాశురములో **"వెణ్మదియమ్"** అనుటచే పూర్ణచంద్రుడు ప్రస్తావింపబడెనే కాని, కళామాత్రావశిష్టచంద్రుడు కాదు. తదియ నాటి చంద్రకళకు మాత్రమే దేవతాంతర సంబంధమున్నది. పూర్ణచంద్రునకు కాదు. మఱియు, **"చంద్రమా మనసో జాతః"** అను శ్రుతినిబట్టి భగవానుని మనస్సునుండి పుట్టిన చంద్రుడు ఒకడు**;** పాలసముద్రమునుండి పుట్టిన చంద్రుడు వేఱొకడు**;** అత్రినేత్రసముద్భూతుడు ఇంకొకడు – అనుటచే చంద్రబహుత్వము కలదని తెలియుచున్నది. వేంకటాచలములో ఆళ్వార్లు ప్రస్తావించినది భగవానుని మనస్సునుండి జన్మించిన చంద్రుని గూర్చి. చంద్రబహుత్వమును గూర్చి అధికరణసారావళిలో (50వశ్లో), శ్రీపరమపదసోపానములో దేశికులు ప్రస్తావించిరి. ఏతావతా, తిరుమాలిరుమ్శోలైలోని వానరముల పారమైకాంత్యము సిద్ధము. పూదత్తాళ్వార్లును తమ ఇరణ్డామ్ తిరువన్దాదిలో – **పోదఱిన్దు వానరఙ్గళ్ పూమ్శునై పుక్కు ఆఙ్గలర్న్ద పోదరిన్దు కొణ్డు ఏత్తుమ్ పోదు, ఉళ్ళమ్ పోదు మణి వేఙ్గడవన్ మలరడిక్కే శెల్ల అణివేఙ్గడవన్ పేరాయ్న్దు"** (72) అనుచు ఆ అంశమును తెలిపిరి. **"అడఙ్గ చ్చెన్దు ఇలఙ్గైయై ఈడళిత్త అనుమన్ పుకళ్పాడి తఙ్కుట్టన్కళై కుడఙ్గైక్కొణ్డు మన్దికళ్ కణ్వళర్త్తుమ్ కోవర్త్తనమెన్నుమ్ కొఱ్ఱక్కుడైయే"** అనుచు పెరియాళ్వార్లు సాయించిన రీతిలో పరమవిలక్షణమైన పారమైకాంత్యమును వానరములు కల్గియున్నవి.



మూడవపాదములో చివరగల **"స్ఫుటమ్"** అను పదమును ఉత్రేక్షావాచకముగా శ్రీ అణ్ణాస్వామివారు వివరించిరి. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో, రామానుజాచార్యవ్యాఖ్యలో గృహవిశేషణముగా అన్వయింపబడినది. **"స్ఫుటం ప్రసిద్ధం గృహమ్"**, **"స్ఫుట మితి గృహవిశేషణమ్"** అనియు వరుసగా ఆ వ్యాఖ్యలలోని వివరణములు.

**(స ఏష....గిరిః)** శ్లోకములోని శాఖామృగశబ్దము వానరముల అత్యంతచాపలమును సూచించును. ఒక్క క్షణమైనను స్థిరముగానుండకుండ, ఒక కొమ్మనుండి వేఱొక కొమ్మకు దుముకు చంచలస్వభావమును కల్గినవని తాత్పర్యము. ఇట్టి చంచలములైన వానరములనుకూడ పరమైకాంతులుగా చేయగల్గిన మహిమను ఈ పర్వతము కల్గినదను భావము ఇచటి సర్వనామశబ్దములచే ద్యోతితము. వృత్తము పృథ్వి. **"స్ఫుటమ్ గృహమ్"** అనునపుడు. **''ఇందిరేశమందిరత్వేన సర్వత్ర ప్రసిద్ధేష్వపి ప్రసిద్ధమ్''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**8. సుందరదోర్దివ్యాజ్ఞాలంభనకాతరవశానుయాయిని కరిణి ।**
**ప్రణయకలహసమాధి ర్యత్ర వనాద్రి స్స ఏష సుందరదోష్ణః ॥**

యత్ర = ఏ పర్వతములో, కరిణి = మగఏనుగు, సుందరదోఃదివ్యాజ్ఞా = సుందరబాహుస్వామి దివ్యాజ్ఞయొక్క, ఆలంభన = స్పర్శచేత, కాతర = భయపడిన, వశా = ఆడ ఏనుగును, అనుయాయిని = అనుసరించునది కాగా, ప్రణయకలహ = (వానిమధ్య సంభవించిన) ప్రణయకలహముయొక్క, సమాధిః = పూర్తి (ఏర్పడిచున్నదో), స ఏషః = అట్టి ఈ, వనాద్రిః = తిరుమాలిరుమ్ శోలై పర్వతము, సుందరదోష్ణః = సుందరబాహుస్వామిది.

పెరియాళ్వార్ తిరుమొళిలోని **"కరువారణమ్ తన్ పిడి తురన్దోడ క్కడల్వణ్ణన్ తిరువాణై కూఱ త్తిరియుమ్ త్తణ్మాలిరుమ్శోలైయే"** అను పాశురము ఈ శ్లోకముగా పరిణమించిన తీరు అత్యంతము మధురము. ఆపాశురములోని ఉత్తరార్ధము మాత్రము ఇచట గ్రహింపబడినది. పర్వతముపై ఒక మగఏనుగునకు తన ఆడఏనుగులతో క్రీడించు సమయమున వానిమధ్య ప్రణయకలహము సంభవించినది. అపుడు ఆడఏనుగు మగఏనుగును వదలి దూరముగా పోవుటకు ప్రయత్నింపగా, మగ ఏనుగు "నన్ను వదలి పోయినచో సుందరబాహుస్వామిపై ఆన" అని ఒట్టు పెట్టినది. అపుడు ఆడ ఏనుగు ఆ ఒట్టును దాటి ముందుకు పోలేక, భయపడి నిలచినది. అంతటితో వాటిమధ్యగల ప్రణయకలహము సమసినది – అని శ్లోకభావము. దీనివలన తిరుమాలిరుమ్శోలై పర్వతమునందలి తిర్యక్కులకును సుందరబాహుస్వామిపైగల భక్తి ప్రపత్తులు ఎంతటివో వ్యక్తమగుచున్నవి.

**(యత్ర)** – ఏ తిరుమాలిరుమ్‌శోలై పర్వతముపై –

**(కరిణి)** – ఇది సతి సప్తమి – వనగజము.

**(సుందర....అనుయాయిని సతి)** – మగఏనుగు **"సుందరబాహుస్వామిపై ఆన"** అని పల్కి, స్వామిపై ఆనపెట్టగా, ఆడఏనుగు వదలిపోలేక, భయపడి నిలచినది. అపుడు మగఏనుగు
కరిణిని అనుసరించినది. **"లంభన"** మనుటకు బదులు **"లంఘన"** మను వేఱొక పాఠము కలదు. రెండును అర్థవంతములే. **"లంభన"** పాఠమున **"లంభనేన కాతరా"** అని తృతీయా సమాసమును, **''లంఘన''** మను పాఠమున **''లంఘనాత్ కాతరా''** అను పంచమీసమాసమును చెప్పనగును. **"వశా"** అనగా ఆడ ఏనుగు. **"వశా స్త్రీ కరిణీ వంధ్యా"** అని అమరము. తమిళమున **"పిడి"** అందురు. గజములకు స్వామివిషయమున అంతటి భక్తి ఉన్నదా? అనినచో, **"పురిన్దు మదవేழ్మ్ మాప్పిడి యోడు ఊడి తిరున్దు"** అనురీతిలో గజదంపతులు పరస్పరము ప్రణయకలహమాడినను, **"పుకుమదత్తాల్ వాయ్ పూశిక్కీழ్ తాழ్న్దు, అరువి ఉకుమదత్తాల్ కాల్ కழువి క్కైయాల్ మికుమదత్తేన్ విణ్డమలర్ కొణ్డు విలల్ వేழ్గదవనైయే కణ్డు వణజ్గమ్ కళిఱు"** అని పూదత్తాழ్వార్లు సాయించిన రీతిలో భగవానుని ఆరాధించును కదా! కొండపైనున్న తిర్యక్కుల ప్రణయకలహము సైతము సుందరబాహుస్వామి దివ్యాజ్ఞవలన తీఱెనని చెప్పుటచే, దివ్యక్షేత్రము సకలజంతువులకు సమీచీనజ్ఞానమును కల్గించు స్వభావమును కల్గినదని తెలియజేయబడినది – అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **''తత్రత్యతిరశ్చా మపి ప్రణయకలహసమాధానసాధనం సుందరదోర్దివ్యాజ్ఞైవేతి దివ్యాస్థానస్య సకలజంతుజాత సమీచీనజ్ఞానప్రదాయిత్వ ముక్తం భవతీతి మంతవ్యమ్"** అని అందలి సూక్తి. పృథ్వీ వృత్తము. లక్షణము పూర్వోక్తము.

**9. స ఏష సౌందర్యనిధే ర్ధృతశ్రియో వనాచలో నామ సుధామ యత్ర హి ।**
**భుజంగరాజస్య కులస్య గౌరవా న్న ఖండితాః కుండలిన శ్శిఖండిభిః ॥**

యత్ర = ఏ పర్వతముపై, కుండలినః = సర్పములు, భుజంగరాజస్య = సర్పప్రభువుయొక్క కులస్య = వంశముయొక్క, గౌరవాత్ = గౌరవమువలన, శిఖండిభిః = నెమళ్ళచే, న ఖండితాః = ఖండించబడివనికావో, స ఏషః = అట్టి ఈ, వనాచలః నామ = తిరుమాలిరుమ్‌శోలై పర్వతము అను, సౌందర్యనిధేః = అందమునకు నిలయుడగు సుందరబాహుస్వామియొక్క, ధృతశ్రియః = లక్ష్మీధరుడగు భగవానునియొక్క, సుధామ హి = గొప్పనివాసము కదా!

ప్రసంగవశమున ఈ శ్లోకమునుండి మూడు శ్లోకములలో తిరుమాలిరుమ్‌శోలై పర్వతములోని తిర్యక్కుల చర్యావిశేషములను కూరేశులు ప్రస్తుతించుచున్నారు. నెమళ్ళు



సహజముగానే సర్పములను ఖండించు స్వభావమును కల్గినవి. కాని, ఈ పర్వతములోని నెమళ్ళు **"శెన్టాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిజ్గాశనమామ్ నిన్టాల్ మరవడియామ్ నీళ్‌కడలుళ్ ఎన్టుమ్ పుణైయామ్ అణివిళక్కామ్ పూమ్‌పట్టామ్ పుల్‌కుమణైయామ్ తిరుమాఱ్కరవు"** అను పొయ్‌కై ఆழ్వార్ల సూక్తిరీతిలో, **"నివాసశయ్యాసనపాదుకాంశుకోపధాన–వర్షాతపవారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాం గతై ర్యథోచితం శేష ఇతీరితే జనైః"** అను భగవద్యామునుల సూక్తిరీతిలో భగవానునకు సకలవిధ – సర్వదేశ – సర్వకాల – సర్వావస్థలయందు సేవలను చేయు ఆదిశేషునిపట్లగల గౌరవాతిశయముచే, అతని కులములో పుట్టినవానిని మనము బాధింపరాదను భావమును కల్గినవై, సర్పములను ఖండించుట లేదు – అని భావము. **"ఇలైవేయ్ కురమ్బై త్తవమామునివర్ ఇరున్దార్ నడువే శెన్టు ఆనార్ శౌఱియ క్కొలైవాయ్‌చ్చినై వేజ్గైకళ్‌నిన్టుఱజ్గుమ్"** అను పెరియాழ్వార్ శ్రీసూక్తి ఇచట స్మరణీయము. **"తత్సన్నిధౌ వైరత్యాగః"** అను యోగసూత్రప్రకారము యోగాభ్యాసమును చేయు మహనీయుని సమీపములోనున్న సహజశత్రువులగు పులి – గోవులువంటివికూడా తమ సహజవైరమును విడుచునని చెప్పబడుచుండగా, భగవానుని సన్నిధిలో ఇట్టి ప్రకృతిని కల్గియుండుటలో ఆశ్చర్యమేమున్నది? **"భుజంగరాజకులీనతారూపరాజకులమాహాత్మ్యాత్ కుండలినః శిఖండిభిః న ఖండితాహీత్యనేన వనాచలస్య నిసర్గవిరోధినా మపి నిర్వైరత్వాపాదకత్వరూపశోభనతా ప్రసిద్ధేతి భావః"** – అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. నెమళ్ళకు, సర్పములకు మధ్యగల సహజవైరమును పోగొట్టి, భగవానుడు కృపతో ఆ రెండింటిని దగ్గఱకు చేర్చినట్లు తెలుపబడుటచే కూరేశులు ఇట్లు అనుగ్రహించిరని – వ్యాఖ్యానాంతర వివరణము.

**(ధృతశ్రియః)** – ఈ విశేషణము **''ఏఱు తిరువుడైయాన్''** అనుచు గోదాదేవి సుందరబాహుస్వామిని గూర్చి పల్కిన సూక్తిని స్మరింపచేయుచున్నది. **"ఆరూఢ శ్రీ రితి సుందరబాహోః నామాంతరమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వంశస్థము **"జతౌ తు వంశస్థ ముదీరితం జరౌ"** అని దీని లక్షణము.

**10. వృషగిరి రయ మచ్యుతస్య యస్మిన్ స్వమత మలంఘయితుం పరస్పరేభ్యః ।**
**భగవతి చరణౌ ఖగాః శపంతే భుజగపతే ర్భుజగా శ్చ సర్వ ఏవ ॥**

యస్మిన్ = ఏ కొండపై, సర్వే ఖగాః = పక్షులన్నియు, స్వమతం = తమకు తమకు అభిమతమగు ప్రతిజ్ఞను, అలంఘయితుం = దాటకుండుటకు, ఖగపతిచరణౌ = పక్షిరాజు అగు గరుత్మంతుని పాదములను, పరస్పరేభ్యః = ఒకరికి వేఱొకరు, శపంతే = ఆనపెట్టుకొనుచున్నవో, భుజగాః చ = సర్పములును, భుజగపతేః (చరణౌ) = సర్పప్రభువు అగు ఆదిశేషుని పాదములను, శపంతే = ఆనపెట్టుకొనుచున్నవో, అట్టి, అయమ్ = ఈ వృషగిరిః = ధర్మగిరి అగు పర్వతము, అచ్యుతస్య ఏవ = ఆశ్రయించినవారి చేయివిడువని

భగవానునకు చెందినదియే.

8వ శ్లోకమున గజదంపతుల ప్రణయకలహమునుగూర్చి ప్రస్తావింపబడగా, ఇందు పక్షులకు ప్రణయకలహము ఏర్పడినచో అవి గరుత్మంతుని పాదములపై ప్రమాణము చేయుటనుగూర్చి కూరేశులు ప్రస్తావించుచున్నారు.

**(స్వమతమ్ అలంఘయితుమ్)** – తమకు తమకు ప్రతిజ్ఞాతమైన అంశమును అతిక్రమించి, నడువకుండుటకు – అని అర్థము.

**(భుజగా శ్చ సర్వే భుజగపతే రేవ చరణౌ శపంతే)** – ఇచట కూడ **"స్వమత మలంఘయితుమ్"** అను ప్రయోగమును అనుషంగికము చేసికొనవలెను. **(అయం వృషగిరిః అచ్యుతస్య ఏవ)** – **"వృషో హి భగవాన్ ధర్మః"** అనునట్లు అట్టి ధర్మస్వరూపమే ఈ పర్వతము – అని భావము. **"అచ్యుతస్య ఏవ"** అనునపుడు **"ఏవ"**కారముచే ఈ పర్వతములో అన్యదేవతాసంబంధమేమియు లేదని ఏర్పడుచున్నది. తనను ఆశ్రయించినవారిని ఏనాడును విడువడు కావున స్వామి అచ్యుతుడనబడుచున్నాడు. **"యస్మా న్నచ్యుతపూర్వోఽహ మచ్యుత స్తేన కర్మణా"** అను ప్రమాణమును ఉదాహరించి, శ్రీపరాశరభట్టర్‌వారు అచ్యుత నామమును వివరించిరి. మిగిలిన దేవతలు తమను నమ్మినవారిని విడువవచ్చును కాని, భగవానుడేనాడును విడువడు. **"చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేంద్రవరుణాదిషు, యస్మా న్న చ్యవసే స్థానాత్ తతో సంకీర్త్యసేఽచ్యుత"** ఇత్యాది ప్రమాణములు స్మరణీయములు. దేశికులును తాత్పర్యచంద్రికలో – **"ఆశ్రితాన్ న చ్యావయతి, అతః చ్యుతోఽస్య నాస్తి"** (1–21) అని వివరించుటయు స్మరింపతగినది. పూర్వశ్లోకములోని **"సుధామ"** అను పదమును ఇచటకూడ ఆకర్షింపకొనదగును. **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః – ఇతి ప్రతిజ్ఞాచ్యవనహీనస్య భగవత్ వాసస్థాన మిత్యర్థః"** అనుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో భక్తులపట్ల చేసిన ప్రతిజ్ఞకు చ్యుతిలేనివాడను అర్థమే ప్రకృతమున వివక్షితమని తెలుపబడుటయేకాక, **"అత్ర తిరశ్చా మపి స్తోమేన స్వస్వప్రతిజ్ఞతా–నుల్లంఘనాయ స్వస్వస్వామిచరణా వుద్దిశ్య శపథస్య క్రియమాణత్వాత్, సర్వస్వామినః సుందరబాహోః సత్యప్రతిజ్ఞత్వ మేవ అచ్యుతపదేన వివక్షిత మితి సంప్రదాయః"** అనుచు ప్రస్తుతమున తిర్యక్కులన్నియు తమ తమ ధర్మములను ఉల్లంఘింపకుండుటకై తమ తమ ప్రభువులను ఉద్దేశించి ప్రతిజ్ఞ చేయుటచే, సర్వస్వామియగు సుందరబాహు స్వామి యొక్క సత్య ప్రతిజ్ఞత్వమే ప్రకృతమున అచ్యుతపదముద్వారా వివక్షితమనుట తెలుపబడినది. వృత్తము పుష్పితాగ్ర. **"అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగా శ్చ పుష్పితాగ్రా"** అని దీని లక్షణము. **"వదంత్యపరవక్త్రాఖ్యం వైతాలీయం విపశ్చితః – పుష్పితాగ్రాభిధం కేచి దౌపచ్ఛందసికం తథా"** అను వృత్తరత్నాకర సూక్తిని బట్టి ఈ వృత్తమునకు ఔపచ్ఛందసికము, అపరవక్త్ర అను పేర్లు కలవనియు



తెలియుచున్నది. ఈ శ్లోకము, అనంతరశ్లోకమును ఒకే అన్వయమును కల్గినది. కావున యుగము, లేక, యుగ్మకమనబడును.ౢా **"ద్వాభ్యామ్ యుగమ్"** అని సమన్వయప్రదీప సూక్తి.

**11. హరికుల మఖిలం హనూమదంఘ్రిం స్వకులపజాంబవత స్తథైవ భల్లాః ।**
**నిజకులపజటాయుష శ్చ గృధ్రా స్స్వకులపతే శ్చ గజా గజేంద్రనామ్నః ॥**

అఖిలం = సమస్తమైన, హరికులమ్ = వానరకులము, హనూమదంఘ్రిం = హనుమానుని పాదములను, భల్లాః = భల్లూకములు, స్వకులప = తమ కులప్రభువు అగు, జాంబవతః = జాంబవంతునియొక్క (అంఘ్రిం = పాదమును), గృధ్రాః చ = గ్రద్దలును, నిజకులప = తమకులమునకు నాయకుడగు, జటాయుషః చ = జటాయువుయొక్క, (అంఘ్రిం = పాదమును), గజాః = గజములు, స్వకులపతేః = తమకుల ప్రభువైన, గజేంద్రనామ్నః = గజేంద్రాళ్వాన్ యొక్క (అంఘ్రిం = పాదమును), తథైవ = పూర్వశ్లోకమున తెలిపిన రీతిలోనే, శపంతే = శపథము చేయుచున్నవి.

పూర్వ శ్లోకములోని **"స్వమత మలంఘయితుం పరస్పరేభ్యః శపంతే"** అను భాగమును ఈ శ్లోకమునందు ప్రతిపాదములోను అన్వయింపవలెననుట శ్లోకములోని **"తథైవ"** అను ప్రయోగము ద్వారా వ్యక్తము. ఆవిధముగానే, **"వృషగిరి రయ మచ్యుతస్య"** అనునదికూడా పూర్వశ్లోకమునుండి అనుషంగము చేసికొనవలెను.

**(హరికుల మఖిలం హనూమదంఘ్రిమ్)** – తిరుమాలిరుమ్‌శోలైలోని వానరములన్నియు ప్రతిజ్ఞచేయవలసి వచ్చినపుడు హనుమానుని శ్రీపాదములపై ఆన – అని అనును.

**(స్వకులప....భల్లాః)** – భల్లూకములు అన్నియు తమకు కూటస్థుడగు జాంబవంతునిపై ఆన పెట్టునట.

**(గృధ్రా జటాయుషః)** – గ్రద్దలన్నియు తమ కులపతియైన జటాయువుపై ఆనపెట్టును.

**(గజాః గజేంద్రనామ్నః)** – గజములన్నియు తమకులప్రభువగు గజేంద్రునిపై ప్రతిజ్ఞ చేయును.

మొదటి పాదములోని అంఘ్రిపదము వ్యస్తపదము కాకున్నను, సమాసఘటితమైనను అర్థస్వారస్యమునుబట్టి తరువాతి పాదములలోనున్న షష్ఠ్యంతవిశేష్యపదములందును అన్వయింపనగును. **"జాంబవతః అంఘ్రిమ్"** – అని అన్వయము. జటాయుశబ్దమును కూరేశులు అతిమానుషస్తవమున **"ప్రాదా స్తదా పరగతిం హి కథం జటాయోః"** అని ఉకారాంతముగా ప్రయోగించినను, ఇచట షకారాంతముగా ప్రయోగించుటచే, రెండు రూపములును కలవని తెలియనగును. అమృతమథనమును చేసిన సమయమున అనేక మూలికలను తెచ్చి పాలకడలిలో వేసినవాడును, భగవానుడు

త్రివిక్రమరూపమున లోకములను కొలిచినపుడు అతని శ్రీపాదములకు ప్రదక్షిణమును చేసినవాడును, భగవానుని పలు అవతారములలో అంతరంగకైంకర్యమును చేసినవాడును అగు జాంబవంతుని పేరున భల్లూకములు ఆనపెట్టుట, **"అవధీర్య చతుర్విధం పుమర్థం భవదర్థే వినియుక్తజీవిత స్సన్"** అనుచు దేశికులు సాయించినరీతిలో భగవత్కైంకర్యమే పరమపురుషార్థముగా తలచి, సీతాపిరాట్టికొఱకు ప్రాణములను అర్పించిన జటాయువుపై భల్లూకములు ఆనపెట్టుట, పరమైకాంతియగు గజేంద్రునిపై ఏనుగులు ఆనపెట్టుటయును ఈ పర్వతముయొక్క భాగవతభక్తిసమృద్ధిప్రదత్వమును తెలుపుచున్నవి. **"శ్లోకద్వయేనాపి దివ్యస్థానస్య భాగవతభక్తిసమృద్ధిప్రదత్వ ముక్తం భవతి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము పుష్పితాగ్ర.

**12.** **వకుళధరసరస్వతీవిషక్తస్వరరసభావయుతాసు కిన్నరీషు ।**
**ద్రవతి దృష దపి ప్రసక్తగానాస్విహ వనశైలతటీషు సుందరస్య ॥**

వకుళధర = నమ్మాళ్వార్ల, సరస్వతీవిషక్త = తిరువాయ్‌మొழி ప్రబంధసూక్తుల సంబంధమును కల, స్వరరసభావయుతాసు = నిషాదాదిస్వరములలోని శృంగారాదిరసములతో విభావాది, భావములతో కూడిన, కిన్నరీషు = కిన్నరస్త్రీలు, ప్రసక్తగానాసు = గానము చేయుటకు ప్రారంభించినవారు కాగా, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క, ఇహ = ఇచటి, వనశైలతటీషు = తిరుమాలిరుమ్‌శోలై పర్వతములోని, దృషద్ + అపి = రాళ్ళుకూడ, ద్రవతి = కఱుగుచున్నవి.

తిరుమాలిరుమ్‌శోలై పర్వతములో ప్రవహించు నూపురగంగకు ద్రావిడభాషలో **"శిలమ్బాఱు"** అని పేరు. నూపురమను సంస్కృతపదమునకు **"శిలమ్బు"** అను ద్రావిడపదము సమానవాచకమనుట సర్వవిదితమే. అయినను **"శిలమ్బు"** అనెడి ద్రావిడపదమునకు పర్వతమను అర్థముకూడ చూడామణి ఇత్యాది ద్రావిడభాషానిఘంటువులలో ప్రసిద్ధముగా కలదు. మూన్ఱామ్ తిరువన్దాదిలోని **"వేజ్గడమే తీఱ్కుழల్ వాయ్‌వైత్తాన్ శిలమ్బు"** అనెడి పాశురములో పర్వతమను అర్థములో ఈ పదము ప్రయోగింపబడుటను కాననగును. కూరేశులు ప్రస్తుతమున ఈ అర్థమును మనస్సున నుంచుకొని ఈ శ్లోకమును అనుగ్రహించిరి అనదగును. **"శిలమ్బు"** అనెడి పర్వతమే నదిగా కఱిగి ప్రవహించుటచేతనే ఈ నది **"శిలమ్బాఱు"** అనబడుచున్నది కాబోలు – అను ఈ ఉల్లేఖమే కూరేశుల మనస్సులోని అభిప్రాయము. ఇట్లు పర్వతము నదిగా కఱిగి ప్రవహించుటకుగల కారణ మేమియో శ్లోకమున తెలుపబడుచున్నది – అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వివరణము.



కిన్నరస్త్రీలు సుందరబాహుస్వామిని సేవించుటకొఱకు ఈ పర్వతములోని సానువులలో వచ్చి చేరి, నమ్మాళ్వార్ల ఈ దివ్యదేశవిషయమున అనుగ్రహించిన **"కిళరొళియిళమై"**, **"ముడిచ్చోదియాయ్"**, **"శెజ్జొఱ్కవికాళ్"** అనెడి తిరువాయ్‌మొழி సూక్తులను సస్వరముగా, రసవత్తరముగా, సాభిప్రాయముగా పాడుదురు. **"మరజ్గళు మిరజ్గుమ్ వకై మణివణ్ణ వో వెన్ఱు కూవుమాల్"** అను రీతిలో పాశురములను పాడునపుడు రాళ్ళును కఱిగి నీరగుచున్నవి. అట్లు కఱిగిన నీరే నూపురగంగానదిగా ప్రవహించినది కాబోలు – అని ఇచటి భావము. శబ్దమునకు (గానమునకు) రాళ్ళు కఱుగునా? అనినచో, **"అపి గ్రావా రోదితి"** అనుచు మహాకవి భవభూతి శ్రీరాముని విలాపములను వినిన రాళ్ళుసైతము కఱిగిపోయెననెను కదా! వేదాంతదేశికులును **"దేహల్యధీశ! దృషదోఽపి విలాపయంతీమ్"** అని దేహళీశస్తుతిలో పల్కిరి. ఇక ఆర్ద్రహృదయులగు ఆళ్వార్ల సూక్తులకు కఱుగకుండునా? ఇంచుమించు ఇట్టి భావమును దృష్టిలో నుంచుకొనియే పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములో **"పున్నాగతల్లజ మజస్రసహస్రగీతిసేకోత్థదివ్యనిజసౌరభ మామనామః"** (49) అని వచించిరి. భగవానుడే స్వయముగా ఆళ్వార్లకు వాడని పొగడపూమాలను బహూకరించెను. కావున ఆళ్వార్లకు వకుళధరులు, వకుళాభరణులను పేర్లు కల్గెనని సంప్రదాయము. **"నాట్కమழ் మకిழ்మాలై మార్బినన్"** అని ఆళ్వార్లనే స్వయముగా తమను నిర్దేశించుకొనిరికదా! **"తత్రత్య కిన్నరాంగనా మపి ద్రవిడోపనిషదనుభవ స్తాదృశ ఇతి దివ్యస్థానస్య జ్ఞానప్రదత్వ ముక్త మితి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవివరణము. పర్వతములందు కిన్నరస్త్రీలు చేయు తిరువాయ్‌మొழி సూక్తుల గానము రాళ్ళను సైతము కఱిగించుచున్నదనుటచే, ఈ క్షేత్రముయొక్క జ్ఞానప్రదత్వము చెప్పబడినది. అనుభవము పొందనిదే రాళ్ళు కఱిగి నీరు కావుగదా! వృత్తము పూర్వమువలె పుష్పితాగ్ర.

**13.** **భృంగీ గాయతి హంత తాళనిభృతం తత్పుష్ణతీ కోకిలాఽ**
**ప్యుద్గాయ త్యథ వల్లితల్లజముఖా దాస్రం మధు స్యందతే ।**
**నిష్పందస్తిమితా కురంగతతయః శీతం శిలాసైకతం**
**సాయాహ్నే కిల యత్ర సుందరభుజ స్తస్మిన్ వనక్ష్మాధరే ॥**

యత్ర = ఏ పర్వతమందు, సాయాహ్నే = సాయంకాలములో, హంసతాళనిభృతం = హంసగతి అనెడి తాళమునకు తగినట్లు, భృంగీ = ఆడుతుమ్మెద, గాయతి = గానము చేయుచున్నదో, తత్ = ఆ గానమును, పుష్ణతీ = పోషించునట్టి, కోకిలా అపి = ఆడుకోకిల కూడ, ఉద్గాయతి = ఉచ్చైఃస్వరముతో పాడుచున్నదో, అథ = ఈ పాటను వినిన పిమ్మట, వల్లితల్లజముఖాత్ = అందమైన పూలతీగల (గుత్తుల) నుండి, మధు = తేనెయే, అస్రం = కన్నీరుగ, స్యందతే = స్రవించుచున్నదో, కురంగతతయః = జింకల గుంపులు, నిష్పందస్తిమితా

= కదలకుండ, కనురెప్పలు వాల్చకుండ, స్తిమితముగా నిలచినవి అయినవో, శిలాసైకతమ్ = శిలలు, ఇసుక తిన్నెలును, శీతమ్ = ( ఈపాటవలన) చల్లనివి అయినవో, తస్మిన్ = ఆ, వనక్ష్మాధరే = తిరుమాలిరుమ్శోలైపర్వతమునందు, సుందరభుజః = సుందరబాహుస్వామి ఉన్నాడు.

పూర్వశ్లోకములో తిరువాయ్మొழி పాశురగానము ప్రసక్తమగుటచే, ఇచటకూడ తుమ్మెదలు ఆళ్వార్ల సూక్తులను గానము చేయుచున్నట్లు, హంసల నడకలు, రవములు ఈ గానమునకు తాళమై అమరినట్లును, దీనిని అలకించిన కోయిలలు ఆనందముతో ఉచ్చైస్స్వరముతో కూసినట్లును, ఆ పాటను విని ఆనందించు లతల పూలగుత్తులనెడి కన్నులనుండి తేనె అను ఆనందాశ్రువులు స్రవించినట్లును, కదలకుండ మెదలకుండ నిలచి, తెప్పపాటు లేకుండ జింకల గుంపులు స్తిమితములైనట్లును, రాళ్ళు, ఇసుక, తిన్నెలును గానము విని చల్లనివి అయినట్లును, ఇట్టి వైలక్షణ్యమునుకల పర్వతములో స్వామి వేంచేసియున్నాడనియు కూరేశులు ఇందు వల్కుచున్నారు. **''పూర్వశ్లోకే కిన్నరీకృతద్రమిడోపనిషద్గానస్య ప్రసక్తత్వాత్ అత్రాపి భృంగీభిః ద్రమిడోపనిష దేవ గీయతే ఇతి హార్దో భావః''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. భగవానుడు అర్చారూపమున దివ్యక్షేత్రములలో వేంచేసియుండగా, స్వామిసేవకొఱకు నిత్యముక్తులు దేవమానవతిర్యక్ స్థావరరూపములను సైతము ధరింతురనుటను **''అహృతసహజదాస్యాః సూరయః స్రస్తబంధా విమలచరమదేహా ఇత్యమీ రంగధామ దివిజమనుజతిర్యక్ స్థావరత్వా శ్రయంతే''** అను శ్లోకముద్వారా పరాశరభట్టర్ సెలవిచ్చిరి కదా! కావున, ఈ శ్లోకములో ప్రసక్తములైన భృంగాదులు కేవల తిర్యక్కులు కావు. నిత్యసూరి – ఆచార్యవర్గమేనని భావింపనగును. **''నాథయామునర్పోల్వారై అన్న మెన్నుమ్'', ''మునివాహనర్ తమ్బిరాన్మార్ పోల్వారై వణ్డు తుమ్బి ఎన్నుమ్'', ''నమ్బిక్కన్బర్, తలైమీదడిప్పొడి ఉడైయవరుడైయార్ పోల్వారై క్కిళిప్పూవైకుయిల్ ఎన్నుమ్''** ఇత్యాదిగాగల ఆచార్యహృదయసూక్తు లిచట అనుసంధేయములు. ఇచట **''భృంగీ''** అనునది **''అఱుకాల చ్చిఱువణ్డు''** అని కీర్తింపబడిన మాలాధరులు, తిరుమాలైయాణ్డాన్ మొదలగువారిని, **''హంస''** శబ్దము హంససందేశములో శ్రీ దేశికులు వ్యంగ్యముగా సూచించినరీతిలో పరమహంసపరివ్రాజకాచార్యులగు రామానుజులవంటివారిని, భగవానుని కీర్తించిన గోదాదేవివంటివారు, లేక, **''వందే వాల్మీకికోకిలమ్''** అను రీతిలో వాల్మీక్యాదులును కోకిలా శబ్దముచే సూచించినవని వ్యాఖ్యానాంతరము. **''వల్లీతల్లజ''** మనునది లక్ష్మీదేవిని తెలుపుచున్నది. బిడ్డల పాటలను విని ఆనందాశ్రువులను స్రవించుటయేగాక, ఆశ్రయణవేళలో భగవానునివద్ద పురుషకారిణియై యుండుటయేకాక, కైంకర్యసమయమున ఉద్దేశ్యమైయుండునది ఇచటి పంకజవల్లితాయార్కదా! ఆదిభరతునివంటివారు కురంగశబ్దముచేత సూచింపబడిరి అనియు ఆ వ్యాఖ్యలో తెలుపబడినది. పూర్వశ్లోకములో



గల **''కిన్నరీ''** శబ్ద స్త్రీలింగస్వారస్యానుగుణముగా ఇచటను **''భృంగీ, కోకిలా''** శబ్దముల స్త్రీ లింగస్వారస్యమును గమనింపతగును. **(హంసతాళనిభృతా)** ఇది క్రియావిశేషణము. హంసగతి తాళముగను, భృంగీరవము సంగీతముగను అగుచున్నవి. హంసగతినివలె, హంసస్వనమునుకూడ తాళముగా చెప్పవచ్చును. **''భృంగాంగనాగానే హంసగతి స్తాలత్వేన పర్యవస్యతీత్యర్థః''** అని, **''హంసస్వనస్యాపి తాళస్వనానుకారిత్వం కేచి దూచుః''** అనియు శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(అథ వల్లీతల్లజముఖాత్ మధు అస్రం స్యందతే)** చెవులకు ఇంపైన పాటను పాడువారున్నపుడు ఆ గానమును విని ఆనందించి, ఆనందానుభవపరీవాహరూపముగా కన్నీటిని విడుచువారును ఉందురు కదా! అట్లే ఇచటను కలరు. వారెవ్వరనగా – గొప్ప అందమైన లతలే. వాని పూలగుత్తులనుండి స్రవించు తేనెయే ఆనందాశ్రువులు. **'అథ'** అను పదము పూర్వోక్తసంగీతప్రవృత్తికి అనంతరము – అను అర్థము నిచ్చును. **(కురంగతతయః నిష్పందస్తిమితాః)** – గొప్పగానమును విని, స్తంభీభూతులగువారు ఉండునట్లే, ఇచటను నిశ్చేష్టులైనవారు కలరు. శ్రీకృష్ణుడు వేణుగానమును చేసినపుడు – **''మరుణ్డు మాన్ కణఙ్గళ్ మేయ్కై మఱన్దు మేయ్న్దపుల్లుమ్ కడైవాయ్ వழிశోర, ఇరణ్డు పాడున్తులుఙ్గా పుడైపెయరా ఎழுదు శిత్తిరఙ్గళ్పోల్ నిన్దనవే''** అనురీతిలో జింకలు నిశ్చేష్టము లైనట్లే, ఇచటకూడ నిశ్చేష్టత్వమును పొందినవి. నిష్పందత్వమనగా కరచరణాది చలనము లేకుండుట. స్తిమితత్వమనగా – కనుతెప్పల కదలికలు మొదలగునవి లేకుండుట. **''నిష్పందశబ్దేన కరచరణాదిస్పందరాహిత్యం, స్తిమితశబ్దేన అక్ష్యాదిస్పందరాహిత్యం చోచ్యతే''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **''నిష్పంద ఇతి షత్వం చింత్యమ్''** అను వామనుని సూక్తినిబట్టి **''నిస్పంద''** అను పాఠమే సాధువు – అని వ్యాఖ్యానాంతరము. **(శిలాసైకతమ్) – ''సర్వో దంద్వో విభాషయైకవత్ భవతి''** అను పరిభాషనుబట్టి **''శిలాసైకతమ్''** అను ఏకవచనము ఉపపన్నమగును. **(ఏవం సాయాహ్నే యత్ర వనక్ష్మాధరే భవతి తస్మిన్ సుందరభుజః విలసతి)** ఈ విధముగా సాయంసమయమున ఏ పర్వతముపై సంభవించుచున్నదో ఆ గిరిలో సుందరబాహుస్వామి విలసిల్లుచున్నాడు. లేక. **''యత్ర సుందరబాహు రస్తి, తస్మిన్ వనక్ష్మాధరే సాయాహ్నే ఏవం భవతి''** అనియు అన్వయింపవచ్చును. **''తాదృశాచేతనానా మపి శైత్యావహం గానసౌభాగ్య మితి భావః''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. సాయంసమయమున దివ్యప్రబంధానుసంధానము చేయబడినదని చెప్పుటచే ఇది దివ్యస్థలమని చాటబడినదని వ్యాఖ్యానాంతరము. వృత్తము స్రగ్ధర.

**14. పీతాంబరం వరదశీతలదృష్టిపాత మాజానులంబిభుజ మాయతకర్ణపాశమ్ ।**
**శ్రీమన్మహావనగిరీంద్రనివాసదీక్షం లక్ష్మీధరం కిమపి వస్తు మమాఽవిరస్తు**

పీత + అంబరం = పచ్చని వస్త్రమును దాల్చినది, వరద = కోరిన వరములను

ఇచ్చునది, శీతల = చల్లనివి అగు, దృష్టిపాతమ్ = కటాక్షములను కల్గినది, అజానులంబి = జానుపర్యంతరము దీర్ఘములై వేలాడు, భుజమ్ = భుజములను కల్గినది, ఆయతకర్ణపాశం = విస్తృతములైన, అందములైన కర్ణములను కల్గినది, శ్రీమత్ = గొప్పమహిమ కల, మహాగిరీంద్ర = గొప్ప తిరుమాలిరుమ్శోలై పర్వతమునందు, నివాసదీక్షమ్ = నివసించుట అను దీక్షను కల్గినది, లక్ష్మీధరమ్ = వక్షఃస్థలమున లక్ష్మీదేవిని ధరించినది అగు, కిమ్ అపి = ఇట్టిది అని మనస్సుతో, వాక్కుతో తెలియుటకు సాధ్యముకాని, వస్తు = వస్తువు (పరబ్రహ్మ), మమ = దాసుడనగు నాకు, ఆవిరస్తు = సాక్షాత్కరింపవలెను.

ఇంతవరకు ఈ స్తుతికి పీఠిక అనదగిన 13 శ్లోకములలో పర్వతము స్తుతించిన కూరేశులు ఈ శ్లోకమునుండి సుందరబాహుస్వామిని వేదాంతోక్తక్రమమున వర్ణింప ప్రారంభించి, మొట్టమొదటగా స్వరూపగుణాదులకు ఆధారమై, శుభాశ్రయమైన దివ్యమంగళరూపముయొక్క వైశిష్ట్యమును స్తుతించుచున్నారు. ఈ శ్లోకములోని మూడవపాదము తప్ప మిగిలిన పాదములు మూడును వైకుంఠస్తవములోని 5వశ్లోకమునందలి మూడు పాదములతో సరిపోవుచున్నవి.

**(కి మపి వస్తు మమాఽవిరస్తు)** – సుందరబాహుస్వామి అనెడి పరంజ్యోతి నాకంటిముందు, మనస్సున ప్రకాశింపవలెను. ఏవిధముగా అనగా – **(పీతాంబరమ్) "తస్య మహారజనం వాసః"**, అని **"పీదకవాడై పిరానార్"** అనియు కీర్తించు రీతిలో పీతాంబరధారియై యుండవలెను. **(వరద.....దృష్టిపాతమ్)** – వరదపదము దృష్టిపాతవిశేషణము. **"వరం వరయ తస్మా త్త్వం యథాభిమత మాత్మనః, సర్వం సంపత్స్యతే పుంసాం మయి దృష్టిపథం గతే"** అనునట్లు, **"వేణ్డిర్రెల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్వళ్ళల్ మణివణ్ణన్"** అనునట్లుండవలెను, చల్లనివియును అగు కటాక్షములను కలవాడుగా నుండవలెను.

**(ఆజానులంబిభుజమ్)** – **"ఆయతా శ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః"** అని కీర్తించురీతిలో, **"కల్పకక్కావన నల్పలతోళ్"** అని కీర్తించురీతిలో బాహువులుండవలెను. **(ఆయతకర్ణపాశమ్)** – పాశశబ్దము ప్రశస్తవాచకము. **"పాశ స్తు మృగపశ్వాదిబంధనే, కర్ణాంతే శోభనార్థః"** అని హైమ నిఘంటువు. భుజపర్యంతము వేలాడు, దీర్ఘములైన కర్ణములను కలవాడైయుండవలెను.

**(శ్రీమత్...దీక్షమ్)** – దేశికుల **"నిత్యావాసం వృషభ మచలం సుందరాఖ్యస్య విష్ణోః"** అను సూక్తి ఇచట స్మరణీయము. భగవానుని స్వయంవ్యక్త క్షేత్రములలో గొప్పది అగుటచే మహచ్ఛబ్దము ఇచట ప్రయుక్తము. **"శ్రీమన్మహచ్ఛబ్దాభ్యాం – సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః – ఇత్యత్ర సుభగగిరిరాజోపమశబ్దౌ సూచ్యేతే"** అని శ్రీనివాసాచార్యవాఖ్య. శుభాశ్రయమునుగూర్చి చెప్పునపుడు శుద్ధి లక్ష్మీదేవివలననే ఏర్పడెననుచు – శ్రీసాత్త్వతసంహితలోని శ్రీపతిరూపధ్యానమున – **"య మాలంబ్య సుఖేనేమం దుస్తరం**



**హి గుణోదధిమ్, నిస్తరం త్యచిరేణైవ వ్యక్తం ధ్యానపరాయణాః"** అని చెప్పబడుటనుబట్టి, **"లక్ష్మీధరమ్"** అని ప్రయోగించిరి–అని వ్యాఖ్యానాంతరము. **"పూవార్ తిరుమకళ్ పుల్కియ మార్భన్"** అను దివ్యసూరిసూక్తియు ఇచట స్మరణార్హము.

**(మమ అవిరస్తు)** – **"న తే రూపమ్ న చాకారో నాయుధాని న చాస్పదమ్, తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే"** అను రీతిలో భక్తుడనగు నాకు నీ రూప, స్వరూపాదులను సాక్షాత్కరింపజేయుమని భావము. ఈ శ్లోకమును అనుసరించియే భట్టరు శ్రీరంగరాజస్తవములో **"అస్తి వస్త్విదమిత్థంత్వప్రసంఖ్యానపరాఙ్ముఖమ్"** అని పల్కిరనదగును. వృత్తము వసంతతిలక. శ్రవణసుభగములగు పదములను కూర్చుట అను ప్రేయోగుణమిందు కలదు.

**15. జనిజీవప్యయవిముక్తయో యతో జగతా మితి శ్రుతిశిరస్సు గీయతే ।**
**తదిదం సమస్తదురితైకభేషజమ్ వనశైలసంభవమహః భజేమహి ॥**

జగతాం = లోకములోని స్థావరజంగమములయొక్క, జని = పుట్టుక, జీవన = రక్షణము, అప్యయ = లయము, విముక్తయః = మోక్షము అనునవి, యతః ఇతి = ఏ పరబ్రహ్మవలన కల్గుచున్నవని, శ్రుతిశిరస్సు = వేదాంతములలో, గీయతే = కీర్తింపబడుచున్నదో, తత్ = అట్టిది, సమస్తదురిత = అన్ని పాపములకును, ఏకభేషజమ్ = అద్వితీయమైన మందును, వనశైలసంభవమ్ = తిరుమాలిరుమ్శోలై పర్వతమున ఆవిర్భవించినదియు అగు, ఇదం మహః = ఈ సుందరబాహుస్వామి అను పరంజ్యోతిని, (అహం) భజే = (నేను) భజింతును.

ఇకపై వేదాంతప్రక్రియలో సుందరబాహుస్వామిని కూరేశులు స్తుతించుటకు ప్రారంభించుచున్నారు. **"యత"** అను శ్లోకములోని ప్రయోగము **"యతో వా ఇమాని"** అనెడి ఉపనిషద్వాక్యమును పరామర్శించును. **(జగతామ్.....అప్యయవిముక్తయః) "తిష్ఠతి గచ్ఛతి ఇతి జగత్"** అను వ్యుత్పత్తిద్వారా జగచ్ఛబ్దము స్థావరజంగమాత్మకచరాచరములను తెలుపును. **"యతో వా ఇమాని భూతాని"** ఇత్యాది శ్రుతివాక్యములో ఇట్టి చరాచరముల సృష్టిస్థితి సంహారములు మాత్రము తెలుపబడినను **"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** ఇత్యాది గీతాసిద్ధమైన విముక్తినికూడ చేర్చి **"జని.....విముక్తయః"** అని పలుకబడినది. దీనిని స్ఫురింపచేయుట కొఱకే శ్లోకమున **"గీయతే"** అని ప్రయోగింపబడినది. **"త మేవం విద్వాన్ అమృత ఇహ భవతి"** అనుచు వేదము తెలిపినది. **"మోక్షదో భగవాన్ విష్ణుః", "మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్"** అని మహర్షులును పల్కిరి. భగవానుకుకల మోక్షప్రదత్వమును స్థితి సంహారములలో దేనియందైనను అంతర్భవింపజేయుటకు వీలున్నను, **"వీడామ్ తెళితరు నిలైమైయదు ఒళివిలన్"** అనుచు ఆళ్వార్లు ఆ మోక్షప్రదత్వమును ప్రత్యేకముగా కీర్తించుటను

అనుసరించుచు ఆచార్యులును దానిని వేరుగానే అనుగ్రహించిరి. **“త్వదాశ్రితానాం జగదుద్భవస్థితిపణాశసంసారవిమోచన”** అను శ్రీయామునుల సూక్తియు ఇచట అవధేయము.

**(సమస్తదురితైకభేషజమ్)** భగవానుడు **“భేషజం భిషక్”** అని, **“ఔషధం జగత స్సేతుః”** అనియు, **“మరున్దుమ్”** అనియును గొప్ప ఔషధముగా కీర్తింపబడినాడు. ఔషధనామమును భట్టరు వివరించుచు – **“దేవా దేవర్షయ శ్చైవ యం విదుః దుఃఖభేషజమ్”**, **“ఏకాగ్రతామూల్యబలేన లభ్యం భవౌషధం త్వం భగవాన్ కిలైకః”** అను ప్రమాణములను చూపుట ఇచట అనుసంధేయము. ఒకడు చేసిన పాపములు మేరు, మందరపర్వతములవలె గొప్పవి అయినను, అతడు కేశవుడు అను వైద్యుని ఆశ్రయించినచో, సమర్థుడగు వైద్యునిచే పోగొట్టబడిన వ్యాధులవలె, వాని పాపములు నశించును – అను అర్థము నిచ్చు **“మేరుమందరమాత్రోఽపి రాశిః పాపస్య కర్మణః, కేశవం వైద్య మాసాద్య దుర్వ్యాధి రివ నశ్యతి”** అను గారుడవచనముకూడ స్మరింపతగినది. వేదము భగవానుని **“భిషక్తమం త్వాం భిషజాం వృణీమహే”** అని కీర్తించుట వీని కన్నిటికిని మూలము. దివ్యసూరులుకూడ **“మరుత్తువనాయ్ నిన్ఱ మామణివణ్ణా”** అని, **“మరున్దుమ్ పొరుళుమ్”** అని, **“నచ్చుమామరున్దు”** అనియు పల్కిరి. **“సర్వపాపేభ్యో మోక్షయిష్యామీతి స్వసంకల్పేన సర్వదుష్కర్మనివర్తకమ్”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇచటి **“ఏక”** శబ్దముచే తోచు అపథసహమైన మందు అను భావము ద్వారా లోకవిలక్షణమగు ఔషధమనియు ధ్వనించును. ఇట్టి భావమే **“నచ్చుమామరున్దు”** అను ఆళ్వార్ల సూక్తికి వ్యాఖ్యాతలు తెల్పిరికదా!

**(త దిదం మహః)** **“నారాయణః పరో జ్యోతిః”** ఇత్యాద్యుక్తమైన, సన్నిహితమగు దివ్యతేజస్సును భజింతుము. ఇట్లు, సకలజగములకు సృష్టిస్థితిసంహారకారకుడుగా, సర్వపాప నివారణపూర్వకమోక్ష ప్రదానమునకును నిర్వాహకుడుగా సకలవేదాంతప్రసిద్ధుడైన పరంజ్యోతి స్వరూపుడు తిరుమాలిరుమ్‌శోలైలో కట్టెదుటగా వేంచేసియున్నాడని భావము. వృత్తము మంజుభాషిణి. **“సజసా జగౌచ కిల మంజుభాషిణీ”** అని లక్షణము.

**16.** **సద్బ్రహ్మాత్మపదై స్త్రయీశిరసి యో నారాయణోక్త్యా తథా**
**వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధవిషయానన్యత్వబోధోజ్జ్వలైః ।**
**నిస్తుల్యాధిక మద్వితీయ మమృతం తం పుండరీకేక్షణం**
**ప్రారూఢశ్రియ మాశ్రయే వనగిరేః కుంజోదితం సుందరమ్ ॥**

త్రయీశిరసి = వేదాంతములో (ఉపనిషత్తులలో), గతిసామ్య = గతిసాదృశ్యన్యాయముచేత (సర్వశాఖాప్రత్యయన్యాయముచేత, సామాన్యవిశేషన్యాయము చేతను), లబ్ధ = పొందబడిన, విషయ + అనన్యత్వబోధ = ఒకే విషయము అను జ్ఞానముచే,



ఉజ్జ్వలైః = ప్రకాశించుచున్న, సత్ + బ్రహ్మ + ఆత్మపదైః = సత్, బ్రహ్మము, ఆత్మ మొదలైన పదములతోను, తథా = అట్లే, నారాయణ + ఉక్త్యా = నారాయణుడను పదముచేతను, యః = ఏ సుందరబాహుస్వామి, వ్యాఖ్యాతః = వ్యాఖ్యానింపబడెనో, తం = అట్టి, నిస్తుల్య + అధికమ్ = తనకు సాటి అగువారు, మించినవారును లేనివాడును, అద్వితీయమ్ = సాటిలేని, అమృతం = అమృతము అయినవాడు, పుండరీక + ఈక్షణమ్ = ఎఱ్ఱతామరలవంటి కన్నులను కలవాడును, ప్రారూఢశ్రియమ్ = **“ఏఱు తిరువుడైయాన్”** అని కీర్తింపబడిన రీతిలో స్థిరముగా నివసించు లక్ష్మీదేవిని కలవాడును, వనగిరేః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతముయొక్క, కుంజ + ఉదితమ్ = పూపొదరింటిలో ఉదయించినవాడును అగు, సుందరం = సుందరబాహుస్వామిని, ఆశ్రయే = శరణముగా ఆశ్రయించుచున్నాను.

పరబ్రహ్మయొక్క స్వరూప – రూప – గుణ – విభూత్యాదులను సంశయ విపర్యయ రహితముగా నిర్ణయింపవలసినపుడు సకలశాఖాప్రత్యయన్యాయముద్వారా, సకలవేదాంతప్రత్యయన్యాయముద్వారా ఆ నిర్ణయమును చేయవలెను. అందు, సకలశాఖాప్రత్యయన్యాయ మనగా – వేదములోని ఒకశాఖలోగల ఒకవాక్యమునకు ఒకానొక అర్థమును చెప్పునపుడు, దాని అంగోపాంగములను సాక్షాత్తు తెలియుటకై, శాఖాంతరము లన్నిటియందు పరిశీలించి, వానియందు చెప్పబడు అర్థములను గ్రహించి, ఆ అర్థముల (విషయముల) మధ్యతోచు అన్యోన్యవిరోధములను తీర్చి, తనకు అభిమతమైన అంగితో (ప్రధానార్థముతో) పొసగువానిని చేర్చుట. పూర్వమీమాంసాశాస్త్రమునకు చెంది ఈ న్యాయమే ఉత్తరమీమాంసయందున ఉపయోగింపబడినది. ఇక, సకలవేదాంతప్రత్యయన్యాయమనగా – ఒక ఉపనిషత్తులోని ఒక వాక్యమునకు ఒక అర్థమును చెప్పునపుడు, మిగిలిన వేదాంతములందుకూడ పరిశీలించి, వానిలో చెప్పబడు అర్థములకు అన్యోన్యవిరోధము కలుగకుండునట్లు విషయవిభాగము చేసి, తనకు అభిమతమైన అర్థములతో చేరువానిని గ్రహించుట. ఇట్టి న్యాయములే ఈ శ్లోకములోని గతిసామ్యపదముచే వివక్షితములు.

ఛాందోగ్యములో **“స దేవ సోమ్య ఇద మగ్ర అసీత్ ఏకమేవాద్వితీయమ్”** అనుచు కారణవస్తువు సచ్ఛబ్దముచే నిర్దేశింపబడినది. ఇందు **‘సత్’** అను శబ్దము ఒక వ్యక్తి విశేషమును తెలుపకుండ, **“ఉన్నవస్తువు”** అను అర్థమును మాత్రమే తెలుపుచున్నది. ఆ పిమ్మట వాజసనేయములో **“బ్రహ్మ వా ఇద మేవ అగ్ర అసీత్”** అనుచు కారణవస్తువు బ్రహ్మ శబ్దముతో నిర్దేశింపబడినది. ఇదికూడ ఏ వ్యక్తివిశేషమును నిర్దేశించు శబ్దముకాదు. పెద్ద

వస్తువు అను అర్థమును మాత్రమే ఇచటి బ్రహ్మశబ్దము తెలియపఱచును. ఛాందోగ్యమున **'సత్'** అను శబ్దముచే నిర్దేశింపబడిన కారణవస్తువు చిన్నదా? పెద్దదా! అను సందేహము కలుగగా, అది చిన్నది కాదు, చాలా పెద్దదే – అను అర్థము మాత్రమే వాజసనేయవాక్యములో తెలుపబడినది. అచట సర్వశాఖాప్రత్యయన్యాయముద్వారా కారణవాక్యములన్నిటికిని ఏకవిషయకత్వము చెప్పవలయును, కావున **''పశుమ్ ఆలభేత''** అనునపుడు సామాన్యపశుశబ్దము **"ఛాగో వా మంత్రవర్ణాత్"** అనెడి సూత్రములలోని విశేషోపస్థాపకమగు (విశేషార్థ ప్రతిపాదకమగు) ఛాగపశువులో పర్యవసింపజేసి నిర్ణయించినట్లే, ఇచటకూడ సామాన్యమగు సచ్ఛబ్దమునకు వాచ్యమగు కారణవస్తువు విశేషోపస్థాపకమగు బ్రహ్మశబ్దవాచ్యమని నిశ్చయింపబడుచున్నది. ఈ బ్రహ్మశబ్దము **"మమ యోనిః మహత్ బ్రహ్మ''** అని, **''తత్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్''** అని చెప్పురీతిలో చేతనాచేతనసాధారణమగుటచే, కారణవస్తువు చేతనమా? లేక అచేతనమా? అను సందేహము తీరలేదు. ఐతరేయము – **"ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్ కించన?"** అనుచు చేతనునకే అసాధారణవాచకమైన ఆత్మశబ్దముతో కారణవస్తువును విశేషించి తెలిపినది. ఈ ఆత్మశబ్దము ఏవ్యక్తియొక్క విశేషనిర్ణాయకమును కాదు. కావున ఆత్మలలో జగత్కారణభూతుడు ఎవడు? అనుచు సందేహము మఱల కలుగును. ఇంద్రుడా? అగ్నియా? ఆదిత్యుడా? చంద్రుడా? లేక, వైశ్రవణుడా? ఇత్యాదిగా సందేహము కలుగగా. వారెవ్వరును కారు, నారాయణుడు మాత్రమే అను విషయమును నారాయణానువాకము, సుబాలోపనిషత్తు మొదలుగునవి నిష్కర్షించి తేల్చిచెప్పినవి. ఈ అంశమే ఈ శ్లోకములోని పూర్వార్ధమున ప్రస్తుతింపబడినది. కారణవస్తువును విచారించు వాక్యములలో అన్నిటి యందు **"అగ్ర ఆసీత్"** అను గతి సమానముగా నుండుటచే, ఆ వాక్యములనన్నటిని కలిపి చేర్చి, పరిశీలించి, చివరలో నారాయణుడే కారణవస్తువని నిర్ణయించుటచే ఈ న్యాయమునకు గతిసామ్యన్యాయమని పేరు. దీనిని బ్రహ్మసూత్రములో **"గతిసామాన్యాత్"** (1-1-11) అను సూత్రమున గమనింపవచ్చును. నారాయణశబ్దము విషయమున పూర్వము ప్రసక్తములైన శబ్దములలోవలె సందేహము కలుగదు. శ్రీమన్నారాయణునిమాత్రమే అది తెలుపును. కావున అతడే జగత్కారణమను విషయము సంశయవిపర్యయరహితముగా నిర్ధారింపబడినది. ఈ విషయమునే దేశికులు వరదరాజపంచాశత్‌లోని **"సామాన్యబుద్ధిజనకా శ్చ సదాదిశబ్దాః తత్త్వాంతరభ్రమకృత శ్చ శివాదివాచః, నారాయణే త్వయి కరీశ! వహంత్యనన్య మన్వర్థవృత్తిపరికల్పిత మైకకంఠ్యమ్"** అను శ్లోకములో ప్రస్తావించిరి.

**(గతిసామ్య....బోధోజ్జ్వలైః)** **"గతిసామాన్యం నామ సకలవేదాంతవాక్యానాం నానాతాత్పర్యం పరిత్యజ్య ఏకత్ర తాత్పర్యనిశ్చయః"** అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. కారణవాక్యముల కన్నిటికిని విషయము ఒక్కటియే కావలసియున్నది కావున, కారణవస్తువును



చెప్పుసందర్భములందు అంతట సచ్ఛబ్ద – బ్రహ్మశబ్ద – ఆత్మశబ్దములతో సామాన్యముగా చెప్పబడిన కారణవస్తువు **"ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః"** ఇత్యాది వాక్యములలో సుస్పష్టము అగు నారాయణశబ్దముచే విశేషించి విశదీకరింపబడినది. ఆ నారాయణుడే ఇపుడు తిరుమాలిరుమ్‌శోలైలో సాక్షాత్కరించుచున్నాడు – అను అర్థము శ్లోకము ఉత్తరార్ధమున వ్యక్తము. **"ఏష ఈశ ఇతి నిర్ణయమ్ త్రయీ భాగధేయరహితేషు నో దిశేత్, హస్తిధామని న నిర్ణయేత కః దేవరాజ మయ మీశ్వర స్త్వితి"** అని వరదరాజస్తవములో కూరేశులు అనుగ్రహించినరీతిలో వేదాంతములలో పరతత్త్వనిర్ణయము మనకు ఆయాససాధ్యమైనను, దివ్యదేశములలోని అర్చామూర్తుల విషయమున అది అత్యంతసులభమని నిరూపించుటయే ఈ శ్లోకముయొక్క పరమతాత్పర్యమని శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానసూక్తి. పూర్వార్ధములోని భావమును విశదీకరించుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్య – **"ఏత దుక్తం భవతి – సదేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్ – ఇత్యత్ర సూక్ష్మవిభుసాధారణ్యేన సన్మాత్రవాచకసచ్ఛబ్దః – బ్రహ్మేవేత్యాదివాక్యే బ్రహ్మశబ్దః సూక్ష్మస్య కారణతాం నిరస్య, చేతనాచేతనసాధారణ్యేన విభువస్తునః కారణత్వం వక్తి. ఆత్మశబ్ద స్తు చేతనమాత్రవాచిత్వాద్యస్య కస్యాపి చేతనస్య కారణత్వం గృహ్ణాతి, నారాయణశబ్దస్య భగవన్మాత్రవాచిత్వం సర్వప్రమాణశరణావిగీతమ్, అతో నారాయణశబ్దేనైవ నిర్ణయో జాత ఇతి"** అని తెలిపినది.

**(నిస్తుల్యాధికమ్)** **"న తత్సమ శ్చాభ్యధిక శ్చ"** ఇత్యాదిగా సంస్కృత వేదము, **"తన్నొప్పార్ ఇల్లప్పన్"** అని, **"ఒత్తార్ మిక్కారై యిలైయాయ మామాయా"** అని ద్రావిడవేదమును తెలిపిన రీతిలో భగవానుడు సాటివారు, మించినవారును ఎవరు లేనివాడు. **"ఒత్తార్"** అనుచు సాటివారులేరు అన్నంతమాత్రముననే **"న త్వత్సమో౽భ్యధికః కుతో౽న్యః"** అనునట్లు కైముతికన్యాయముద్వారా మించినవారు లేరని ఏర్పడుచుండగా, **''మిక్కారై''** అనవలసియున్నదా? అనినచో, సంస్కృతవేదము **"న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే"** అనుచు పల్కినందున, దానిని అనుసరించుచు ఆళ్వార్లు ఇట్లు పల్కిరని పెద్దలందురు. అయినచో, ఉపనిషత్తు అట్లు ఏల పల్కినది? అనినచో, అలంకారశాస్త్రములో అనన్వయము అను ఒక అలంకారము కలదు. **"ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః"** అనునది ఆ అలంకారలక్షణము. **"ఇందు రిందు రివ శ్రీమాన్", "గగనం గగనాకారం సాగర స్సాగరోపమః, రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ"** ఇత్యాది లక్ష్యములును దానికి చెప్పబడినవి. ఆ క్రమములోనే "భగవానునకు భగవానుడే సాటి" అని పల్కుటలో విప్రతిపత్తిలేదు. ఆళ్వార్లును **"తానే తనక్కు ఉపమన్"** అని, **"తన్నొప్పాన్ తానే యుళన్ కాణ్"** అనియు ఈ రీతిలోనే పల్కిరి. ఇట్లు సదృశ్యవ్యక్తి సిద్ధి ఒకచో ఉన్నను, అధికవ్యక్తిసిద్ధి లేదనుటయే పై ఉపనిషత్‌సూక్తిహృదయము.

**(అద్వితీయమ్ అమృతమ్)** – అద్వితీయపదము అమృతవిశేషణము. **"రసో వై సః"** అనియు,

**“ఎనక్కు త్తేనే పాలే కన్నలే అముదే తిరుమాలిరుమ్‌శోలై క్కోనే”** అనియును పల్కురీతిలో విలక్షణదివ్యామృతమువలె స్వామి పరమభోగ్యుడు. **“ఏకమేవాద్వితీయమ్”**, **“ఏతదమృతమ్”** అను వైదిక సూక్తులలోని పదముల యోజనను ఇచట గమనింపనగును. **“అమృతం షడ్భావవికారశూన్యమ్”** అని రామానుజాచార్యవ్యాఖ్య. వేదమును **“స తే అంతర్యామ్యమృతః ”** అనుచు అమృత శబ్దముతో భగవానునకు చేతనాచేతనగతములగు స్వభావ స్వరూప వికారము లేమియు లేవని తెలిపినది కదా!

**(పుండరీకేక్షణమ్)** – నారాయణశబ్దమువలె భగవానునకు అసాధారణనామ మిది. **“తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ”**, **“తామరైపోఱ్కణ్ణానై”** ఇత్యాది పరశ్శతప్రమాణములు స్మరణీయములు. **(ప్రారూఢశ్రియమ్)** – **“నాఱునఱుమ్బొళిల్ మాలిరుమ్‌శోలై నమ్బిక్కు”** అను పాశురములో **“ఏఱుతిరువుడైయాన్”** అనుచు గోదాదేవి అనుగ్రహించిన నామమునకు సంస్కృతీకరణమే ఈ పదము. ముందు శ్లోకములలో ఇదియే **“అరూఢశ్రీః”** అని, **“అరూఢలక్ష్మా హరేః”** అనియు నిర్దేశింపబడినది. **“పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షః స్థలం హరేః”** అనునట్లు లక్ష్మీదేవి స్వయముగా వచ్చి చేరిన స్వామికదా ఇతడు. **“ప్రారూఢశ్రియ మితి సుందరభుజస్య నామాంతరమ్”** అని రామానుజాచార్యవ్యాఖ్య. **“ఏఱుతిరువుడైయాన్”** అను ప్రయోగములోని వర్తమానకాలికప్రత్యయార్థమును పెరియవాచ్చాన్‌పిళ్ళై–**“నాట్చెల్ల నాట్చెల్ల ఏఱివరుకిఱ సమ్పత్తై యుడైయవన్. నిరపేక్షనాకైయాలే ఇవన్ ఇడుకిఱ ద్రవ్యత్తిల్ తారతమ్యమ్ పారానాయ్‌త్తు”** (దినములు గడువగా, గడువగా మరింత వృద్ధి చెందు సంపత్తును కలవాడు. నిరపేక్షుడు. కావుననే భక్తుడు సమర్పించు ద్రవ్యములోని తారతమ్యమును గమనింపడు) అని వ్యాఖ్యానించిరి. కావున ప్రకృత ప్రయోగములోని **“ప్రారూఢ”** శబ్దమునందలి ఉపసర్గలకు ఇట్టి వర్తమానార్థమును చెప్పుటలో స్వారస్యమున్నది కదా. **(వనగిరౌ కుంజోదితమ్)** – భగవానుని స్వయంవ్యక్తక్షేత్రమని దీనివలన స్పష్టమైనది. **“ఆశ్రయే – సమాశ్రయామి”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము స్రగ్ధర.

**17. పతిం విశ్వస్యాత్మేశ్వర మితి పరం బ్రహ్మపురుషః**
**పరంజ్యోతి స్తత్త్వం పర మపి చ నారాయణ ఇతి ।**
**శ్రుతిః బ్రహ్మేశాదీం స్తదుదితవిభూతీం స్తు గృణతీ**
**య మాహారూఢశ్రీ స్స వనగిరిధామా విజయతే ॥**

విశ్వస్య = అంతటికిని, పతిమ్ = ప్రభువు, ఆత్మేశ్వరమ్ = తనకు తానేస్వామి, ఇతి = అని, పరంబ్రహ్మ = పరంబ్రహ్మ అని, పురుషః = పరమపురుషుడు అని, పరంజ్యోతిః = పరంజ్యోతి అని, తత్త్వమ్ = పరతత్త్వమని, అపి చ = మఱియు, పరమ్ = ఉత్కృష్టుడని, నారాయణ ఇతి = నారాయణుడని, బ్రహ్మ + ఈశాదీన్ తు = బ్రహ్మ, ఈశ్వరుడు



మొదలగువారిని అయితే, తత్ + ఉదితవిభూతీన్ = ఆ భగవానుని విభూతులుగానే (భగవానునివలన పొందిన సంపదను కలవారినిగానే), గృణతీ = పల్కునది అగు, శ్రుతిః = వేదము, యమ్ అహ = ఏ సుందరబాహుస్వామిని పల్కినదో, సః వనగిరిధామా = ఆ, తిరుమాలిరుమ్‌శోలైను నివాసముగాకల స్వామి, విజయతే = సర్వోత్కర్షతో వెలుగొందుచున్నాడు.

ఈ శ్లోకములోని పూర్వార్ధము ఉపనిషద్వాక్యమయము. **“పతిం విశ్వస్యాత్మేశ్వరమ్”** అని, **“నారాయణ పరం బ్రహ్మ”** అని, **“విశ్వ మేవేదం పురుషః”** అనియు, **“పరంజ్యోతి రుపసంపద్య”** అనియు, **“తత్త్వం నారాయణః పరః”** అనియు, **“నారాయణ ఏవేదం సర్వమ్”** అనియుగల శ్రుతివాక్యములలోని పదములతో కూర్చబడిన శ్లోకము యొక్క సౌందర్యము సహృదయ హృదయావర్జకము.

**(పురుషః ఇతి)** – **“తత్పురుష”** అను పదమునకు పరాశరభట్టర్ వివరణమును అనుగ్రహించుచు **“తస్య మహాపురుషస్య పురుషః శేషః”** అని పల్కిరి. రుద్రగాయత్రి మొదలగువానిలో తత్పురుషశబ్దము ఉండుట, విష్ణుగాయత్రిలో ఈ పదము లేకుండుటయును గమనింపతగును – అని వ్యాఖ్యానాంతరము.

**(తదుదితవిభూతీన్ గృణతీ)** – బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలను భగవద్విభూతికులుగా శ్రుతి పల్కుచున్నది. భగవానునివలన పొందిన సంపద కలవారనియు వేఱొకవ్యాఖ్య. **“తస్య భాసా సర్వ మిదం విభాతి”** ఇత్యాది సూక్తులిందులకు అనుగుణముగా స్మరింపనగును.

**(య మాహ)** – **“నారాయణాత్ బ్రహ్మ జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే”** ఇత్యాది శ్రుతులచే బ్రహ్మాదులు భగవద్విభూతికులుగానే చెప్పబడుచున్నారుకదా! **“నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్”** వంటి ద్రావిడ వేదసూక్తులను ఇచట గ్రాహ్యములు.

**(సః అరూఢశ్రీః వనగిరిధామా విజయతే)** – వేదాంతోదితమైన ఆ పరతత్త్వమే **“ఏఱు తిరువుడైయాన్”** అనెడి నామముతో ఈ దివ్యక్షేత్రమున సర్వోత్కర్షశాలిగా వెల్గుచున్నాడు. **“పరత్వశంకాస్పదీభూతానాం బ్రహ్మరుద్రాదీనా మపి యద్విభూతిత్వం, యస్య చ సర్వస్మాత్పరత్వం శ్రుతి రేవాహ స ఏవ సర్వోత్కృష్ట ఇత్యర్థః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **“శ్రుతిః బ్రహ్మేశాదీన్ తస్మా న్నారాయణాత్ ప్రాప్తైశ్వర్యాన్”** అని గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము శిఖరిణి. **“రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ”** అని లక్షణము.

**18. పృథివ్యాద్యాత్మాంతం నియమయతి య స్తత్త్వనికరం**

**తదంతర్యామీ తద్వపు రవిదిత స్తేన భగవాన్ ।**
**స ఏష స్వైశ్వర్యం నవిజహ దశేషం వనగిరిం**
**సమధ్యాసీనో నో విశతు హృదయం సుందరభుజః ॥**

యః = ఏ భగవానుడు, పృథివీ + ఆది = పృథివిని మొదలుకొని, ఆత్మాంతం = జీవాత్మవరకు గల, తత్త్వనికరం = తత్త్వసమూహమును, తదంతర్యామీ = వానియందు అంతర్యామిగానున్నవాడై, తద్వపుః = వానిని శరీరముగా కలవాడై, తేన = ఆ తత్త్వసమూహముచే, అవిదితః = తెలిసికొనబడనివాడై, భగవాన్ = జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు – అను అఱు గుణములను కలవాడై, నియమయతి = (వానిని అన్నిటిని) నియమించుచున్నాడో, సః ఏషః = అట్టి ఇతడు, అశేషం = సకలమైన, స్వ + ఐశ్వర్యం = తన ఐశ్వర్యమును, నవిజహత్ = విడువకుండ, వనగిరిమ్ = వనగిరిని, సమధ్యాసీనః = నివాసస్థానముగా కల్గినవాడైన, సుందరభుజః = సుందరబాహుస్వామి, నఃహృదయం = మన హృదయమును, విశతు = ప్రవేశించునుగాక (నివాసస్థానముగా కల్గియుండునుగాక).

ఈ శ్లోకమునందుకూడ పూర్వార్ధములో ఉపనిషద్వాక్యార్థము అనుసంధింపబడినది. బృహదారణ్యకములో అంతర్యామిబ్రాహ్మణమను భాగము ఒకటి కలదు. రాజసభలో యాజ్ఞవల్క్యుని చూచి ఉద్దాలకుడు ప్రశ్నింపగా, ఆ ఋషికి యాజ్ఞవల్క్యుడు సమాధానమును చెప్పురీతిలోనున్నది ఈ ప్రకరణము. విశిష్టాద్వైతసిద్ధాంతమునకు మిక్కిలి అనుకూలమైన భాగమిది. **"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా మంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివ్యా మంతరో యమయతి"** అని ప్రారంభించి, **"య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరో య మాత్మా వేద యస్యాత్మా శరీరం య మాత్మాన మంతరో యమయతి"** అనునంతవరకు అంతర్యామిబ్రాహ్మణములో చెప్పబడినరీతిలో భగవానుడు పృథివిమొదలు ఆత్మవరకుగల తత్త్వములను ప్రవృత్తినివృత్తులకు శక్తిని కల్గియుండునట్లు చేయుచున్నాడు. అదెట్లనగా – ఒక్కొక్క తత్త్వమునందు అంతర్యామియై యుండి, ఆ తత్త్వమును శరీరముగా కల్గియుండియు, ఆయా తత్త్వసమూహములచే తెలియబడనివాడైయుండియు, వానిని నియమించుచున్నాడు. ఇట్లు ఉపనిషత్ ప్రతిపాదితుడగు భగవానుడు తన పారమేశ్వరస్వభావమును దేనిని విడువకుండ తిరుమాలిరుమ్‌శోలై పర్వతములో నిత్యనివాసమును ఏర్పరచుకొనియున్నాడు. ఆ స్వామి మన హృదయములలో ప్రవేశించి, స్థిరముగా వర్తించును గాక ! అని భావము. **(యః భగవాన్ పృథివ్యాది ఆత్మాంతం తత్త్వనికరం తదంతర్యామీ సన్ తద్వపు స్సన్ తేన అవిదిత స్సన్ నియమయతి)** ఏ భగవానుడు అంతర్యామి బ్రాహ్మణములో తెల్పిన రీతిలో పృథివి మొదలు ఆత్మవరకుగల తత్త్వములన్నిటియందు అంతర్యామియై, వానిని శరీరముగా కలవాడై, వానికి తాను శరీరియై, వానిచే "ఇతడు మనలో ప్రవేశించియున్నాడు" అని తెలియబడనివాడై, వాని ప్రవృత్తి నివృత్తులకు నిర్వాహకుడై యున్నాడో – అని భావము. ఇచట కూరేశులు **"తత్త్వనికరమ్"** అనుచు స్పష్టముగా తత్త్వములను మాత్రము సాక్షాత్తుగా నిర్దేశించినను, ఉపనిషత్తులోని తత్త్వములకు సంబంధించిన పలు వస్తువులుకూడ చెప్పబడుటచే, తత్త్వపదముచే అవి కూడ ప్రకృతమునను ఉపలక్షితములు. ఈ అంశము శ్రీభాష్యములోని అంతర్యామ్యధికరణములో స్పష్టము. సుబాలోపనిషత్తులోకూడా ఈ విధముగానే **"నేవేహ కించనాగ్రే అసీత్ అమూల మనాధార మిమాః ప్రజాః ప్రజాయంతే దివ్యో దేవ ఏకో నారాయణః, చక్షు శ్చ ద్రష్టవ్యం చ నారాయణః"** అను రీతిలో మొదలిడి, **"అంత శ్శరీరే నిహితో గుహాయామ్ అజ ఏకో నిత్యః యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరే సంచరన్ యం పృథివీ న వేద"** అనుచు పలు వస్తువులను ప్రస్తావించి, అన్నిటికిని భగవానుడే అంతర్యామి అని తెలిపినది. **"అంతఃప్రవిష్టః శాస్తా జనానాగ్ం సర్వాత్మా"** అనెడి ఉపనిషత్ వాక్యమును కల్పసూత్ర వ్యాఖ్యాతయగు పెరియాళ్వార్లు మొట్టమొదటగా గ్రహించి బ్రహ్మయజ్ఞప్రకరణములో ఆపస్తంబసూత్రవృత్తివ్యాఖ్యానములో ఉట్టంకించి వివరించినట్లే శ్రీరామానుజులును శ్రీభాష్యములో పలుచోట్ల దీనిని ఉదాహరించుటచే, కూరేశులును అంతర్యామ్యధికరణమును ఇచట వ్యాఖ్యానించిరి – అని వ్యాఖ్యానాంతరము. **(స ఏషః)** ఇట్లు శ్రుతిప్రతిపాదితుడగు భగవానుడు, **(స్వైశ్వర్యమశేషం నవిజహత్)** భగవద్గీతలోని 4వ అధ్యాయములో గల **"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా"** అని పల్కినరీతిలో, **"ఆదియమ్ శోదియురువై అజ్ఞువైత్తిఙ్గు ప్పిఱన్ద"** అనియు పల్కిన రీతిలో తనకు సంబంధించిన పారమైశ్వరప్రకారములను విడువకుండ – అని భావము. **'నవిజహత్'.** అనునపుడు నశబ్దముతో సమాసము. అర్చావతారములోకూడ భగవానుడు **"పూర్ణషాడ్గుణ్యవిగ్రహః"** అనునట్లు పూర్ణషాడ్గుణ్యుడు – అని విష్ణుధర్మములో శౌనకముని తెలుపుటచే ఇచట కూరేశులు భగవచ్ఛబ్దమును ప్రయోగించిరి – అని వ్యాఖ్యానాంతరము.



**(నః హృదయం విశతు)** మన హృదయములో ప్రవేశించి వర్తించునుగాక ! మన హృదయములలో స్వామి ఎల్లప్పుడు ఉండగా, ఇన్నాళ్ళుగా స్వామి లేనట్లు, ఇకపై ఉండగలడు? అను అర్థము వచ్చునట్లు పల్కుటలో ఏమి అంతర్యము? అనినచో, **"రాగాదిదూషితే చిత్తే నాస్పదీ మధుసూదనః, న బధ్నాతి రతిం హంసః కదాచిత్ కర్దమాంభసి"** అనునట్లు కామక్రోధాది దూషితమైన కాలమున నాలోనున్న స్వామిని తెలిసికొన లేకుంటిని. ఇపుడు అవి బయటకు పోవుటచే, భగవానుడు ఇక సుఖముగా నుండవచ్చును – అని భావము. **"తిరుమాలిరుమ్‌శోలైమలై ఎన్ఱేన్ ఎన్న తిరుమాల్ వన్దు ఎన్ నెఞ్జు నిఱైయ పుకున్దాన్", "మలైమేల్ తాన్ నిన్ఱు ఎన్ మనత్తుళిరున్దానై"** అను ఆళ్వార్ల సూక్తుల భావమును,

**"అఙ్గుత్తై వాసమ్ ఇఙ్గుత్తై సాధ్యమ్"** అను శ్రీవచనభూషణసూక్తి భావమును ఇచట స్మరణీయములు. వృత్తము పూర్వమువలెనే శిఖరిణి. **"సర్వాంతర్యామిత్వే సాధారణేఽపి ఆశ్రితానుగ్రహాయ విగ్రహవిశిష్టస్సన్ సన్నిధత్తా మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. కావున అంతర్యామిత్వము సర్వసాధారణమైనను, ఇచట కూరేశులు అభిలషించినది విగ్రహవిశిష్టాధిష్ఠానమని తెలియనగును.

**19.** **ప్రత్యగాత్మని కదాఽప్యసంభవత్ భూమభూమి మభివక్తి యం శ్రుతిః ।**
**తం వనాద్రినిలయం సుసుందరం సుందరాయతభుజం భజామహే ॥**

శ్రుతిః = వేదము, ప్రత్యగాత్మని = జీవునియందు, కదా అపి = ఏ సమయమునందైనను, అసంభవత్ = సంభవింపని (సాధ్యముకాని), భూమభూమిం = గొప్పతనమునకు ఉత్పత్తి స్థానముగా, యం = ఏ భగవానుని, అభివక్తి = పల్కుచున్నదో, తం = అట్టి, వనాద్రినిలయం = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును నిత్యనివాసముగా కలవాడు, సుసుందరం = మిక్కిలి అందమైన వాడగుటచే **'అழகర్'** అను పేరును కలవాడు, సుందర + ఆయతభుజం = అందమైన, దీర్ఘములగు బాహువులను కలవాడును అగు స్వామిని, భజామహే = సేవింతుము.

పూర్వశ్లోకములో భగవానుని సకలచేతనాచేతనముల అంతర్యామిత్వమును తెలిపిన కూరేశులు, భగవానుడట్లు సర్వాంతర్యామిగానున్నను, ఆ చేతనాచేతనముల దోషములు అంటనివాడై యుండుట అనెడి హేయప్రత్యనీకత్వమును, కల్యాణైకతానత్వమును కలవాడని, జీవాత్మకు ఏ సమయమునందైనను అవి అసంభావితములై, భగవానునకే అసాధారణములై యుండుననియు ఈ శ్లోకములో తెలుపుచున్నారు - అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి శ్లోకావతారిక. శ్రీనివాసాచార్య వ్యాఖ్యలోకూడ ఇట్లే కలదు.

శ్లోకములో **"భూమభూమిమ్"** అని ప్రయోగింపబడుటచే ఇచట భూమాధికరణ ప్రమేయము ప్రస్తుతమని కొందఱు వ్యాఖ్యానించిరి. **"పతిం విశ్వస్య"** అనెడి శ్లోకములో జ్యోతిరధికరణప్రమేయము, **"గతిసామ్యలబ్ధ"** అనుట ద్వారా 16వ శ్లోకములో ఈక్షత్యధికరణ ప్రమేయమును ప్రస్తుతింపబడగా, ముందు శ్లోకములో అంతర్యామ్యధికరణప్రమేయము ప్రస్తుతింపబడినదని, ప్రస్తుతశ్లోకములో భూమాధికరణ విషయవాక్యశోధనము చేయబడిచున్నదని వ్యాఖ్యానాంతరము. గార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో కూడ - **"యత్ర నాన్యత్ పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్య ద్విజానాతి స భూమా, యత్ర అన్యత్ పశ్యతి, అన్యచ్ఛృణోతి, అన్య ద్విజానాతి తదల్పమ్ - ఇతి శ్రుత్యర్థ మనుసంధధానః స్తౌతి"** అని తెలుపబడినది.

**(శ్రుతిః) - "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో**



**నారాయణః"** ఇత్యాది ఉపనిషద్వాక్యములు ఇచట శ్రుతిశబ్దవివక్షితములు. **"పూర్వస్మిన్ శ్లోకే సర్వచేతనాచేతనాంతర్యామిత్వ ముక్తమ్, అంతర్యామిత్వేఽపి తద్గతసర్వదోషై రసంస్పృష్టత్వరూపహేయప్రత్యనీకతాం కల్యాణైకతానత్వం చ జీవాత్మన్యసంభావితతయా - ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణ - ఇతి శ్రుతి రాహేతి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. వ్యాఖ్యానాంతరముప్రకారము **"యత్ర నాన్యత్"** ఇత్యాది ఉపనిషద్వాక్యము ఇచట వివక్షితము. **(కదాఽపి)** ముక్తదశలోకూడ అని అర్థము. **"మోక్షదశాయా మపి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. జీవాత్మకు ముక్తదశలో సంభవింపని మహిమకు ఎవడు స్థానమైనవాడై యున్నాడో, **(తం వనాద్రిగిరిమ్)** - అతడే వనగిరిలో నిత్యనివాసమును కల్గియున్నాడు - అని భావము.

భూమవిద్య ఛాందోగ్యోపనిషత్తులో కలదు. నారదుడు సనత్కుమారుని ప్రశ్నింపగా, **"తరతి శోక మాత్మవిత్"** (పరమాత్మను తెలిసినవాడు ఈ ప్రకృతిమండలమును దాటి, భగవానుని పొందుచున్నాడు) అని ప్రారంభించి, అతడు నారదునకు సమాధానము చెప్పురీతిలో ఈ విద్య కలదు. అందు **"భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః"** అనుభాగము ఇచట వివక్షితము. ఈ వాక్యములో మొదట నామము మొదలు ప్రాణమువరకును ఉపదేశించి, **"ప్రాణో హ పితా ప్రాణో హ మాతా"** అనుచు ఈ ప్రాణశబ్దవాచ్యుని భూమను (గొప్పతనమును) విశదముగా ఉపనిషత్తు తెలిపినది. కావున ప్రాణవాయువుతో కలసియుండు జీవుడే ఇచట భూమ అనబడు మహిమను కలవాడను పూర్వపక్షము రాగా, దానిని ఖండించుచు, పరమాత్మకు మాత్రమే ఇట్టి మహిమ కలదని తెలుపుటయే ఈ అధికరణప్రమేయము. **"భౌమగుణవిశిష్టో న ప్రత్యగాత్మా, అపి పరమాత్మా"** ఇత్యాది శ్రీభాష్యసూక్తి ఇచట అనుసంధేయము, వృత్తము రథోద్ధత. **"రోనరా విహ రథోద్ధతా లగౌ"** అని లక్షణము.

**20.** **వందేయ సుందరభుజం భుజగేంద్రభోగ-**
**సక్తం మహావనగిరిప్రణయప్రవీణమ్ ।**
**యం తం విదు ర్దహర మష్టగుణోపజుష్ట**
**మాకాశ మౌపనిషదీషు సరస్వతీషు ॥**

యమ్ = (అందమైన) ఏ సుందరబాహుస్వామిని, ఔపనిషదీషు సరస్వతీషు = ఉపనిషత్తులకు సంబంధించిన వాక్యములందు (దహరవిద్యలో), దహరం = చిన్నది అగు (హృదయమనెడి) చోటును నివాసస్థలముగా కల్గినవానినిగను, అష్టగుణ = అపహతపాప్మత్వము - మొదలగు ఎనిమిది గుణములతో, ఉపజుష్టం = ఎల్లప్పుడు కూడినవానినిగను, ఆకాశమ్ = చక్కగా యోగులకు ప్రకాశించువానినిగను, విదుః = (విజ్ఞులు) తెలిసికొనుచున్నారో, తమ్ = అట్టివాడు, భుజగ + ఇంద్రభోగసక్తమ్ = ఆదిశేషుని ఒడిలో శయనించియున్నవాడును,

మహావనగిరి = గొప్ప తిరుమాలిరుమ్‌శోలైపర్వతమున నివసించుటలో, ప్రణయప్రవీణం = ప్రేమను కల్గివారిలో గొప్పవాడును అగు, సుందరభుజం = సుందరబాహుస్వామిని, వందేయ = సేవింతును.

ఈ శ్లోకములో కూరేశులు దహరాధికరణవిచారమును చేయుచున్నారు. **"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్ అంతర ఆకాశః తస్మిన్ యదంత తదన్వేష్టవ్యమ్, తద్వావ విజిజ్ఞాసితవ్యమ్, తస్మిన్ కామాః సమాహితాః"** అనుచు దహరవిద్య ఛాందోగ్యోపనిషత్తు చివరలో విశదీకరింపబడినది. "ఈశరీరము పరబ్రహ్మము నివసించుటకు తగిన పురము కావున బ్రహ్మపురమనబడును. ఈ శరీరములో హృదయకమలములోని అత్యంతసూక్ష్మమైన చోటును తన నివాసస్థలముగాగొని, ఎల్లప్పుడు వెల్గుచు ఆకాశ శబ్దవాచ్యుడైన పరమాత్మ ఉన్నాడు. అట్టి భగవానుడు తెలియదగినవాడు. (ఉపాసింపతగినవాడు). అతనియందున్న కల్యాగుణములను తెలిసికొని, వానియందు అభినివేశమును పొందవలెను" అనునది ఈ శ్రుత్యర్థము. ఇచట మొదట శరీరమునుగూర్చి పల్కి, దానిలోనున్న హృదయములో నివసించు ఆత్మనుగూర్చి పలుకుటచే, ఈ వాక్యము జీవుని గూర్చియే పల్కుచున్నది. పరమాత్మను గూర్చి కాదు – అనునది పూర్వపక్షము. ఉపాసకులను అనుగ్రహించుటకై **"దహరకుహరే దేవ స్త్విష్మన్ నిషద్వరదీర్ఘికానిపతితనిజాపత్యదిత్సావతీర్ణపితృక్రమాత్"** అను రీతిలో, బురదలో పడిన తన కుమారుని పైకి తీయదలచిన తండ్రి తన గొప్పతనమును, తాను ధరించిన వెలకట్టుటకు వీలుకాని వస్త్రాభరణాదులను గమనింపకుండ, ఈ బురదలో దిగి, బిడ్డను పైకి తీయురీతిలో, భగవానుడును **"న తతో విజుగుప్సతే"** అని శ్రుతితెలిపిన విధమున, వాత్సల్యముతో చాల సూక్ష్మమైనచోట జీవునితో పాటు కలసియుండును. ఆ భగవానుడే ఇచట చెప్పబడుచున్నాడనునది సిద్ధాంతము. ఇట్లు భగవానుడు ఈ హీనమైన చోట మనతో కలసి, నివసించుచున్నను, ఈ స్వామి కల్యాణగుణములు, తేజస్సును ఏ మాత్రము ప్రకాశము కోల్పోవు – అని తెలుపగోరియే **"ఆకాశః"** అని శ్రుతివాక్యమున ప్రయోగింపబడినది. ఈ విషయము శ్రీ భాష్యాదులలో విరివిగా ప్రస్తావించబడినది. ఈ విధముగా ఆకాశాధికరణప్రమేయముకూడ ఈ శ్లోకములో సంగ్రహముగా సూచింపబడినదనదగును.

ఇట్టి పరమాత్మ సహజమగు గుణాష్టకమును కల్గి ప్రకాశించును. ఆ ఎనిమిది గుణములు ఏవి? అనినచో, **"అశనాయాపిపాసే, శోకమ్, మోహమ్, జరమ్, మృత్యుమ్"** అని ఉపనిషత్తు పల్కినట్లు షడూర్మ్ములు అనబడు బద్ధజీవులయందున్న అఱు హేయగుణములు. పరమాత్మయందు లేవు. అతడు (1) సత్యకాముడు – అనగా తలచినది తలచినపుడే, తలచిన చోటనే పూర్తి చేయగలవాడు, (2) సత్య సంకల్పుడు – అతడు కోఱిన దానిని పొందుటలో ఆటంకమేమియు లేకుండుటచే, సత్య సంకల్పుడు–అని వేదము



ఘోషించినది. ఇట్టి గుణములు సహజముగానే పరమాత్మకు ఒక్కనికే కలవు. బద్ధులకు – **"ఆవిర్భూతస్వరూప స్తు"** అనునట్లు భగవానుని చేరిన మోక్షదశలో ఈ గుణములు వికసించును. నిత్యులకు ఈ గుణములు స్వాభావికముగా నున్నను, అవి భగవదధీనములు. కావున సోపాధికములు. ఇట్టి ఈ పరమాత్మయే దహరవిద్యలో తెలుపబడుచున్నాడని భావము. **అపహతపాప్మత్వ**మనగా – పాపసంబంధములేకుండుట. ఇచట **"హత"** శబ్దము ప్రధ్వంసాభావమును తెలుపదు. అత్యంతాభావమునే తెలుపును. **విజరః** – అనగా ముసలితనము లేనివాడు. **విమృత్యుః** – మృత్యువు లేనివాడు. **విశోకః** – శోకము లేనివాడు. **విజిఘత్సః** – ఆకలి లేనివాడు. **అపిపాసః** – దాహము లేనివాడు. **సత్యకామః** – నిజమైన కల్యాణ గుణములను కలవాడు.**"సత్యాః కామాః సమాహితాః"** అను సూక్తి ఇచట అవధేయము. **"కామ్యంత ఇతి కామాః కల్యాణగుణాః"** అని శ్రీభాష్యములోని వివరణము. **సత్యసంకల్పః** – అనగా కోఱిన దానిని కోఱినట్లు, తలచినపుడు తలచినచోట పూర్తి చేయగలవాడు. ఇవియే ఎనిమిది గుణములు.

**(తం సుందరభుజం వందేయ)** – ఆ పరమపురుషుడే సుందరబాహువు రూపమున సేవను అనుగ్రహించుచున్నాడు. ఆ సుందరబాహుస్వామి ఎట్టి వాడు? అనినచో –

**(భుజగేంద్రభోగసక్తమ్)** – శ్రీ వైకుంఠమునుండి పాలసముద్రమునకు వచ్చి, అచట శ్రమను తీర్చుకొని, భుజగేంద్రభోగశయనముతోపాటు ఇచటకు స్వామి నిత్యనివాసమును చేయుటకై **"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"** అనుచు హరివంశములో తెలిపిన రీతిలో అవతరించుటను ఈ ప్రయోగమును సూచించుచున్నదని వ్యాఖ్యానాంతరము. ఈ వివరణము పరత్వాదిరూపముల ధర్మ్యైక్యమునుబట్టి చేయబడినది. ఈ దివ్యక్షేత్రమున నిలుచున్న భంగిమలోకదా స్వామి ఉన్నది. శయనించిన సన్నివేశములో నున్నపుడు కదా **"భుజగేంద్రభోగసక్తమ్"** అనుచు ఆదిశేషునిపై పవళించియున్నవానినిగా సేవింతునని పల్కుట తగును? అనినచో, కూరేశులు నిలుచున్న భంగిమలోనున్న వరదరాజస్వామిని స్తుతించునపుడును **"నీలమేఘనిభమ్.....అనంతశయం త్వామ్"** అనినట్లే, అచటను పల్కిరని కొందఱు సమాధానించిరి. కాని, ప్రస్తుతశ్లోకము సుందరబాహుస్వామియొక్క పంచబేరములలోని శయనబేరమును దృష్టిలోనుంచుకొని సాయించినది. కావున పై సందేహమునకు అవకాశము లేదు. ఈ రీతిలోనే దేశికులును వరదరాజ పంచాశత్‌లో **"అశిథిలపరిరంభై రాహితా మిందిరాయాః.....ఫణిపతిశయనీయా దుత్థిత స్త్వం ప్రభాతే, వరద సతత మంతర్మానసం సన్నిధేయాః"** అనుచు శయనాలంకార సేవలోని వరదరాజస్వామిని స్తుతించిరి కదా! అంతియేకాక, శిలప్పదికారములోని ఆయ్‌చ్చియర్‌కురవై ఈ దివ్యదేశములోని పర్వతమునుగూర్చి పల్కునపుడు కవి ఇళఙ్కోవన్ అడిగళ్ శ్రీకృష్ణుడును, బలరాముడును

(వెళ్ళి) ఇచట నిత్యనివాసము చేయుదురని చెప్పుటనుబట్టియు ఇట్లు కూరేశులు పల్కియుండవచ్చును. ఇటియు, ఈ దివ్యదేశములోని మూలాస్థానములో శ్రీకృష్ణుడు, ప్రద్యుమ్నుడు, బలరాముడును, అనిరుద్ధుడును కలిసియే సేవను అనుగ్రహించుట వలన కూడా, అచటి సంకర్షణునిగూర్చి ఇట్లు పల్కియుండవచ్చును" – అను ఈ వివరణమంతయు వ్యాఖ్యానాంతరములో కలదు. శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామియు **"అణిమణియిన్ తుత్తిశేర్ నాకత్తిన్ మేల్ తుయిల్వాన్"** అని పూదత్తాళ్వార్లు స్తుతించుట వంటిదే ఇదియును అని సమర్థించిరి. **(మహావనగిరి) – "కుళిర్ మామలై తిరుమాలిరుమ్ శోలైమలైయదే"** అను పెరియాళ్వార్ల సూక్తిలోని మహచ్ఛబ్దము ఇచట అనుసంహితము. **(ఔపనిషదీషు సరస్వతీషు)** – ఇచటి **"ఔపనిషదీషు"** అను బహువచనముయొక్క తాత్పర్యమేమనగా – ఈ దహరవిద్య బృహదారణ్యకము, తైత్తిరీయము మొదలగు పలుచోట్ల ఉండుటచే, ఛాందోగ్యములోవలెనే ఇచటను వ్యాఖ్యానమును గ్రహింపనగును అని సూచించుటయే" అని వ్యాఖ్యానాంతరము. వృత్తము వసంతతిలక.

**21. యత్ స్వాయత్తస్వరూపస్థితికృతికనిజేచ్ఛానియామ్యస్వశేషా –**
**నంతాశేషప్రపంచ స్తత ఇహ చిదివాచిద్వపుర్వాచిశబ్దైః ।**
**విశ్వైః శబ్దైః ప్రవాచ్యో హతవృజినతయా నిత్య ఏవానవద్యః**
**తం వందే సుందరాహ్వం వనగిరినిలయం పుండరీకాయతాక్షమ్ ॥**

యత్ = ఏ కారణమువలన, స్వాయత్త = తన ఆధీనములోనున్న, స్వరూప = (జీవుల) స్వరూపము, స్థితి = స్థితి, కృతిక = ప్రవృత్తులను కలవాడై, నిజ + ఇచ్ఛా = తన సంకల్పముతో, నియామ్య = నియమింపతగినవి, స్వశేష = తనకు శేషములైయున్నవి అగు (తన ఇచ్ఛానుసారముగ ఉపయోగింప వీలగు సొత్తుగా నున్నవి అగు), అనంత = అంతులేని, అశేష = సమస్తమైన, ప్రపంచః = లోకమును కలవాడుగా నున్నాడో, తతః = అందుచే, ఇహ = ఈలోకములో, అచిద్వపుర్వాచిశబ్దైః = అచేతనపరిణామమును పల్కు పదములతో, చిత్ ఇవ = జీవునివలె, విశ్వైః శబ్దైః = సమస్తశబ్దములతో, ప్రవాచ్యః = ప్రధానవాచ్యార్థముగా తెలుపబడువాడు, హతవృజినతయా = అపహత పాప్మత్వముచే (పాపసంబంధము ఏమాత్రము లేకుండుటచే), నిత్యం = ఎల్లప్పుడు, అనవద్యః ఏవ = దోషరహితునిగానే యుండువాడును, తం = ఇట్టి గొప్పతనములను కలవాడు, వనగిరినిలయమ్ = తిరుమాలిరుమ్శోలైలోని పర్వతమును నివాసముగా కలవాడు, పుండరీక + ఆయతాక్షమ్ = పుండరీకాక్షుడును అగు, సుందరాహ్వయమ్ = సుందరుడు **(అళకర్)** అను తిరునామమునుకల భగవానుని, వందే = సేవించుచున్నాను.

ఈ శ్లోకములో కూరేశులు అద్వైతశ్రుతినిర్వాహమును చూపుచున్నారు. **"తదేవాగ్నిః తద్వాయు స్తత్ సూర్య స్తదు చంద్రమాః"** అనియు, **"జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు ర్వనాని విష్ణు ర్గిరయో దిశ శ్చ"** అనియును **"మునియే నాన్ముకనే ముక్కణ్ణప్పా"** అనియును సర్వపదార్థసామానాధికరణ్యముతో భగవానుని నిర్దేశించిన సందర్భములలో విశిష్టాద్వైతప్రక్రియద్వారా తెలిసికొనదగిన నిర్వాహము ఇదియే కదా! లోకములో దేవమనుష్యాదిశరీరములను చెప్పగల్గిన శబ్దములతో శరీరియైన ఆత్మను నిర్దేశించుటను చూచున్నాము. **"దేవోఽహమ్, మనుష్యోఽహమ్"** ఇత్యాది వ్యవహారములు ప్రసిద్ధములు కదా! ఇచట దేవమనుష్యశబ్దములు దేవశరీర, మనుష్య శరీరములను తెలుపగల్గినవియే తప్ప, ఆత్మస్వరూపమును తెలుపగల్గినవి కావు. అహమర్థభూతుడగు ఆత్మను గూర్చి **"దేవః, మనుష్యః"** ఇత్యాదిశబ్దములను ప్రయోగించుట ఎట్లు తగును? అనిచో, **"దేవశరీరవిశిష్టః, మనుష్యశరీరవిశిష్టః"**, అని చెప్పదగును. కావున దోషములేదు – అని కదా అర్థమును నిర్వహింపవలెను. రీతిలోనే, భగవానుని విషయమునందును శరీరశరీరిభావప్రయుక్తముగా వస్తువులతో అభేదవ్యపదేశము తగును – అనునదియే మన విశిష్టాద్వైతదర్శనములోని సారార్థము. ఇదియే ప్రస్తుత శ్లోకములోని ప్రమేయము – అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి రస్యవ్యాఖ్య.

**"స్వాధీనత్రివిధచేతనాచేతనప్రవృత్తిభేదమ్"** అనుచు భగవద్యామునులు, భగవద్రామానుజులును అనుగ్రహించుటను అనుసరించుచు కూరేశులు ఈ శ్లోకములో సిద్ధాంతార్థములను ఒక చోట చేర్చి, హృద్యముగ అందించుచున్నారు.

లోకములో బలిసిన శరీరమును కలవానిని **"స్థూలః"** అని, చిక్కిన శరీరమును కల వానిని **"కృశః"** అని, తెల్లనివానిని **"శ్వేతః"** అని, నల్లనివానిని **"కృష్ణః"** అని వ్యవహరించుచున్నాము. ఇవి అన్నియు ఆత్మస్వరూపమునకు చెందని, వారు వారు ధరించిన శరీరములకు మాత్రము చెందిన ధర్మములు. అయినను లోక వ్యవహారములో ఇట్టి అభేద నిర్దేశము చేయబడుచున్నది కదా! ఈ రీతిలోనే ఘటపటాది అచేతనములను నిర్దేశించు పదములు, దేవమనుష్య జంతు వృక్ష, పశు పక్ష్యాది ప్రాణులను తెల్పు పదములును, భగవానునిచే లోపల అనుప్రవేశింపబడి, సృష్టింపబడి, నిర్వహింపబడు ఆ చేతనాచేతనములను నిర్దేశించునవి అగుటచే వాస్తవమునకు పరమాత్మపర్యంతబోధకములు. ఇట్లు పదములన్నియు పరమాత్మవరకు బోధించుటను వేదాంతములో అపర్యవసానవృత్తి అని అందురు. వైయాకరణులును **"సర్వే సర్వార్థవాచకాః"** అని చెప్పుదురు. **"నతాః స్మ సర్వవచసాం ప్రతిష్ఠా యత్ర శాశ్వతీ"** అని మహర్షియు పల్కిరి. **"శుక్ల, కృష్ణః"** ఇత్యాది నిష్కర్షకములగు శబ్దములు తప్ప మిగిలినవి అన్నియు సాక్షాత్ పరమాత్మవాచకములే అను విషయము **"సాక్షా దప్యవిరోధం జైమినిః"** అను సూత్రభాష్యములో స్పష్టము. **"రసోఽహ మప్సు కౌంతేయ"** అనుచు శ్రీకృష్ణభగవానుడు అనుగ్రహించిన రీతిలో కొన్నిచోట్ల నిష్కర్షకశబ్దములును భగవానునే తెలుపుచున్నవని చెప్పినను దోషములేదని ఉ.వే.శ్రీమాన్

ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు పరమార్థభూషణమను గ్రంథములో తెల్పిరి – అని వ్యాఖ్యానాంతరము. ఇది శబ్దములనుగూర్చిన వ్యవస్థ.

సర్వత్రప్రసిద్ధ్యధికరణములో సర్వవస్తుసామానాధికరణ్యము భగవానునకు నిరూపింపబడినది. **"సర్వం ఖలిద్వం బ్రహ్మ, తదే వాగ్ని స్తద్వాయుః తత్ సూర్య స్తదు చంద్రమాః", "విశ్వ మేవేదం పురుషః"**, **"అయ మాత్మా బ్రహ్మ"**, **"పురుష ఏవేదమ్ సర్వమ్"**, **"ఆత్మై వేదం సర్వమ్"**, **"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః"** **"జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణుః"** అను మొదలగు శ్రుతిస్మృతి పురాణాదివాక్యములను గొని, అన్నియు ఆ పరమాత్మచే కటాక్షింపబడి, అతనిచే స్థితిని పొంది, అతని అధీనములోనున్న ప్రవృత్తులను కల్గినవి అగుటచే, అతడే అన్నియు అనెడి స్థితి వీనిది అను శాస్త్రార్థము తెలియజేయబడినది. ఇదియే విశిష్టాద్వైత సిద్ధాంతసారము. **"సర్వగత్వా దనంతస్య స ఏవాహ మవస్థితః"** అను శ్రీ ప్రహ్లాదుని సూక్తినిబట్టి, **"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్"** అను సూత్రముయొక్క శ్రీ భాష్యమునుబట్టియు ఈ అంశమును తెలిసికొననగును.

ఇట్టి నిహీనములగు చేతనాచేతనముల తాదాత్మ్యముచే, వీనియందు అంతర్యామిగా నుండుటచేత భగవానునకు ఎట్టి దోషము అంటదు – అనుటను **"సంభోగప్రాప్తి రితి చేన్న, వైశేష్యాత్"** అనుచు అత్రధికరణములో తెలుపబడినది. ఇంతవరకు అంగీకరించిన పిమ్మటను, కొందఱు దివ్యాత్మస్వరూపమును ఒప్పుకొనిరే తప్ప, దివ్యమంగళవిగ్రహమును అంగీకరింపలేదు. బ్రహ్మసూత్రములో అంతరాదిత్యవిద్యను విచారించునపుడు ఛాందోగ్యోపనిషత్తులో తెలుపబడిన క్రమమున **"తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అనుచు పుండరీకదళామలాయతేక్షణునిగానే మునులు నిశ్చయించిరి.

**(అచిద్వపుర్వాచిశబ్దైః చిత్ ఇవ)** – అచిత్పరిణామభూతములగు దేవమనుష్యాది శరీరములను చెప్పునట్టి శబ్దములతో జీవాత్మ ఏవిధముగా నిర్దేశింపబడుచున్నాడో, ఆ విధముగా – అని అర్థము, అనగా, **"స్థూలోఽహమ్, కృశోఽహమ్"** ఇత్యాది వ్యవహారములలో స్థూలత్వము, కృశత్వము ఆత్మయందున్నవి కాక, శరీరమునకు మాత్రమే చెందినవి అయినను, **"అహం స్థూలః, అహం కృశః"** అని శరీరదృష్ట్యా పల్కుచున్నట్లేనని అర్థము. ఈ దృష్టాంతమును గొనుటద్వారా సాధింపబడు అంశమేమి? అనినచో, **(విశ్వైః శబ్దైః ప్రవాచ్యః)** భగవానుడు సకలశబ్దవాచ్యుడు అని. దీనికి నిమిత్తమేమి? అనగా, **(యత్ స్వాయత్తస్వరూప....ప్రపంచః తతః)** **"యత్"** శబ్దమునకు ఏకారణమువలన – అని అర్థము. అనంతమైయున్న అశేషప్రంపచమును. స్వాయత్తస్వరూపస్థితి కృతికమై – అనగా – భగవానుని అధీనములోనున్న స్వరూప, స్థితి, ప్రవృత్తులను కల్గినదై, ఆస్వామి తన ఇచ్ఛతో నియమింప వీలయినదై, ఆ భగవానునకే శేషమై యుండుటచే – అని భావము. **"యస్య చేతనస్య యత్ ద్రవ్యం సర్వాత్మనా స్వార్థే నియంతుం ధారయితుం చ శక్యం,**



**తచ్ఛేషతైకస్వరూపం చ, తత్తస్య శరీరమ్"**. అనునది శరీరలక్షణమగుటచే, ఈ లక్షణము సమస్త ప్రపంచమునందు అన్వయించును. **"స్వాధీనత్రివిధచేతనాచేతనస్వరూపస్థితిప్రవృత్తిభేదమ్"** అను గద్యత్రయసూక్తి ప్రకారము సకలప్రపంచముయొక్క నియమనము ఆ భగవానుని ఇచ్ఛాధీనమగుటచేత, ఇవి అన్నియు అతనికే శేషములగుటచేతను సకలప్రపంచము శరీరలక్షణసమన్వయమును పొందినది. **(తతః విశ్వైః శబ్దైః ప్రవాచ్యః)** – కావున సర్వపదార్థవాచకములగు సకలశబ్దములతో భగవానుని సమానాధికరణము చేయటలో లోపములేదు – అని భావము. సమానవిభక్తిలో నిర్దేశించుట సమానాధికరణనిర్దేశమనియు, వేఱ్వేరు విభక్తులతో నిర్దేశించుట వ్యధికరణనిర్దేశమనియు చెప్పబడును. **"సకలం జగత్ భగవతః శేషభూతమ్"** అనినచో ఇది వ్యధికరణ నిర్దేశము. **"సకలమ్ జగత్ భగవాన్"** అనినచో, ఇది సమాధికరణము నిర్దేశము. నిజమునకు వ్యధికరణ నిర్దేశము ప్రాప్తమై (తగినదియై) యుండగా, సమానాధికరణ నిర్దేశము. ఎట్లు తగును? అను శంక వేదాంతవ్యుత్పత్తి లేనివారికి కల్గును. **"సర్వం ఖల్విదం బ్రహ్మ"**, **"ఐతదాత్మ్య మిదం సర్వమ్"**, **"తత్త్వ మసి"** అను మొదలుగాగల శ్రుతులను నిర్వహించు తీరును తెలిసినవారికి సమానాధికరణనిర్దేశము, వ్యధికరణనిర్దేశము అను భేదము లేక, రెండును సమానమే అని స్ఫురించును. భట్టరు శ్రీరంగరాజస్తవ – ఉత్తర శతకములో **"దేహో దేహిని కారణే"**, **"స్థిత్యుత్పత్తిప్రవృత్తి"** అను రెండు శ్లోకములో ఈవిషయమును సువిశదముగా ఉపదేశించుట గమనింపతగినది. **(హతవృజినతయా నిత్య మేవానవద్యః)** – **"అపహతపాప్మ"**దగుటచే ఎల్లప్పుడు హేయప్రత్యనీకుడుగనే యుండును – అని అర్థము. వృజిన మనగా పాపము. ఈ పదము ఇచట కేవలము పాపమును కాకుండ, హేయ సామాన్యమును తెలుపును. **"హత"** అనునది ప్రధ్వంసాభావమును తెలుపదు. అత్యంతాభావమునే తెలుపును. కావుననే భగవానునకు ముక్తపురుషునికంటె వ్యావృత్తి కల్గుచున్నది. **(తమ్ వనగిరినిలయమ్ పుండరీకాయతాక్షం సుందరాహ్వాం వందే)** కావున ఇట్లు వేదాంతవేద్యుడగు భగవానుడు పుండరీకదళాయతాక్షుడై, వనగిరిలో సేవను అనుగ్రహించుటను దర్శించితినని భావము.

ఈ శ్లోకములోని మొదటి పాదములోని **"కృతి"** శబ్దము ప్రవృత్తిని తెలుపును. తిరువాయ్ మొழ்ిలోని **"ఉయర్వఱ వుయర్నల"**మనెడి మొదటి దశకములో **"తామవనివనువన్"**, **"అవర్వర్ తమతమదు"**, **"నిన్ఱనర్ ఇరున్దనర్"** అనెడి మూడు పాశురములతో సకలచేతనాచేతనములయొక్క స్వరూప – స్థితి – ప్రవృత్తులు భగవదధీనములనుటను వరుసగా తెలిపి, తదనంతర పాశురములో **"ఉడన్ మిశై యుయిరెన"** అనుచు జీవాత్మను దృష్టాంతముగా చేసి, **"ఉళన్ శుడర్మికు శురుదియుళ్"** అనుచు నిగమించిరి (ముగించిరి). ఆ ఛాయలోనే ఈ శ్లోకము రచింపబడియుండుట

గమనింపతగినది. **''అయం భావః - చేతనాచేతనప్రపంచస్య భగవదధీనస్వరూపస్థితిప్రవృత్తితయా, తన్నియామ్యతయా చ తచ్ఛరీరకత్వ మంగీకర్తవ్యమ్, శరీరవాచకానాం శబ్దానాం శరీరపర్యంతత్వం చ లోకే వ్యుత్పత్తిసిద్ధమ్.తథా చ, దేవతిర్యఙ్మనుష్యాదిశరీరపరాణాం శబ్దానాం యథా చేతనశరీరపర్యంతత్వం, తథా చిదచిద్వాచకానాం శబ్దానాం సర్వశరీరిభగవత్పర్యంతత్వ మితి సర్వశబ్దవాచ్యో భగవా నితి"** ఇత్యాదిగా ఈ శ్లోకభావము గార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో తెలుపబడినది. **"కృత్స్నచిదచిచ్ఛరీరకత్వం, తన్నిర్వాహకత్వం, తద్గతదోషాసంస్పృష్టత్వం, కల్యాణగుణాకరత్వం చ వనాద్రినాథదివ్యవిగ్రహ ఏవ స్ఫురంతీతి హార్దో భావః"** అనుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఈ శ్లోకతాత్పర్యమును తెల్పినది. వృత్తము స్రగ్ధర.

**22. గుణజం గుణినో హి మంగళత్వం ప్రమితం ప్రత్యుత యత్స్వరూప మేత్య ।**
**త మనంతసుఖావబోధరూపం విమలం సుందరబాహు మాశ్రయామః ॥**

గుణినః = సద్గుణములను కలవానియొక్క, మంగళత్వమ్ = శుభప్రదత్వము, గుణజం = (అతని యందున్న) గుణములచే ఏర్పడుచున్నవి, ప్రమితం హి = ఇది లోకములోని ప్రమాణములచే నిరూపింపబడినదికదా, యత్ స్వరూపం = ఏ భగవానునియొక్క దివ్యాత్మ స్వరూపమును, ఏత్య = పొంది, ప్రత్యుత = దీనికి విరుద్ధమైన స్థితిలో, ప్రమితం = ఇది లెక్కింపబడినదో, తం = అట్టి మహిమను కలవాడు, అనంత = త్రివిధపరిచ్ఛేదరహితమైనది, సుఖ = ఆనందరూపమైనది, అవబోధ = జ్ఞానపూర్ణమైనది అగు, రూపమ్ = దివ్యాత్మ స్వరూపమును కల్గినవాడు, విమలం = ఎట్టి దోషము లేనివాడును అగు, సుందరబాహుం = సుందరబాహుస్వామిని, ఆశ్రయామః = ఆశ్రయించుచున్నాము.

లోకములో కొన్నిటిని మంచిపదార్థములని ఆదరించుట దేనివలన? అనినచో, వానిలో మంచిగుణములు ఉండుటచేతనే. మణిద్యుమణిచందనచంద్రచంపక అరవిందాదులను మంగళవస్తువులుగా మనము పల్కుట వానిలో ప్రకాశించు కాంతి, చల్లదనము, సువాసన - ఇత్యాది మంగళగుణములు ఉండుటచేతనేకదా. కావున లౌకికవస్తువులకు చెప్పు మంగళస్వభావము వాని మంగళగుణవత్త్వాప్రయుక్తమని ఏర్పడినది. ఈ క్రమము భగవానుని విషయమున మాత్రము వ్యత్యస్తమగుచున్నది. సహజముగానే మంగళస్వరూపుడగు భగవానునియందు ఏవేవి ఉన్నవో, అవి అన్నియును భగవానుని ఆశ్రయింపగల్గిన రాజకులమాహాత్మ్యముచేతనే మంగళములైనవి. భగవత్సంబంధఫలముచేతనే వీనికి మంగళత్వము కల్గినదే తప్ప, వీని సంబంధముచే భగవానునకు మంగళత్వము కల్గెననుట సరికాదు - అనెడి తత్త్వార్థము ఈశ్లోకముద్వారా తెలియజేయబడినది - అని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారి మధురవ్యాఖ్య.



**(గుణినః మంగళత్వం గుణజం హి ప్రమితమ్)** - లోకములో సామాన్యముగా గుణములు కల్గినదిగా చెప్పబడుచున్న వస్తుసమూహమునకు మాంగలికత్వము గుణసంబంధనిబంధనముగాకదా భావింపబడుచున్నది. **"ప్రమితమ్"** అనునది మధ్యమదీపన్యాయమున ముందు వెనుకలలో అన్వయింపనగును.

**(ప్రత్యుత యత్స్వరూప మేత్య)** - ఆ లోకన్యాయము ఇచట విపరీతము. భగవత్స్వరూపమును ఆశ్రయించియే ఆయా గుణములు శోభిల్లుచున్నవని భావము. లోకవిలక్షణముగాకదా భగవత్స్వరూపము ఉండును.

**(అనంతసుఖావబోధరూపమ్) - "అనంతరూపమ్, సుఖరూపమ్, అవబోధరూపమ్" -** అనుచు రూపపదమును సర్వత్ర అన్వయింపపగును. దేశపరిచ్ఛేద, కాలపరిచ్ఛేద వస్తుపరిచ్ఛేదములను లేకుండుటయే అనంతత్వము. సుఖరూపమనగా ఆనందరూపమని అర్థము. అవబోధరూపమనగా జ్ఞానమయమని అర్థము.

**(తం విమలం సుందరబాహు మాశ్రయామః)** - అఖిలహేయప్రత్యనీకుడైయున్న ఆ సుందరబాహువును ఆశ్రయింతును.

శ్రీవైకుంఠస్తవములోని **"సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వమ్"** అనెడి శ్లోకము, వరదరాజస్తవములోని **"గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదమ్"** అను శ్లోకమును సమానార్థకములు. ఇట్లు ఈ అర్థమును అసకృత్ అనుగ్రహించుటలో ఒక వైలక్షణ్యము కలదు. భగవానునకు పరదుఃఖదుఃఖిత్వము మొదలగునవి గుణములుగా అనుసంధింపబడుచున్నవి. దుఃఖిత్వమనునది దోషమేతప్ప గుణము కాదు కదా! ఇది ఎట్లు కల్యాణగుణముగా అనుసంధింపబడుచున్నవి? అని సందేహపడుటకు ఏమాత్రము తావు లేకుండుటకొఱకు ఈవిధముగా అసకృత్ చెప్పబడినది. భగవానుని ఆశ్రయించినది ఏది అయినను శుభగుణమగునే తప్ప వేఱు కాదు - అని తెలిపినట్లయినది. **"సత్యస్య సత్యం, జోతిషాం జ్యోతిః", "పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్" ఇత్యాది శ్రుతిస్మృతిప్రతిపాదితం గుణాయత్తం గుణానాం చ మంగళత్వమ్. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, అపహతపాప్మా విజరః - ఇత్యాద్యా శ్చ శ్రుతయోఽనుసంధేయాః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

లోకములో ఒక వస్తువు ఒక సమయమున ఒక చోట ఆ వస్తువు ఆ రూపములోనే యుండును. దీనికే కాలపరిచ్ఛేదము, దేశపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదమని క్రమముగా పేరు. ఈ మూడు విధములైన పరిచ్ఛేదములును భగవానునకు లేవు. **"అథైతస్యైవాంతో నాస్తి యద్బ్రహ్మ"** అని తైత్తిరీయము దీనిని తెల్పినది. **"నాస్త్యంతో విస్తరస్య మే"** అని గీతాచార్యుడును నుడివెను. మఱియు, **"తస్యైవ బ్రహ్మణః సుఖరూపస్య నిరతిశయవిపులతా జ్ఞాతవ్యేతి భూమేత్యేవ విజిజ్ఞాసితవ్య ఇత్యుపదిశ్య"** అని భూమాధికరణములో శ్రీరామానుజులు అనుగ్రహించిన రీతిలో అంతులేని ఆనందమయుడగుటచే ఈ పరమాత్మస్వరూపము

ఆనందమయమైనది. ఈ అంశము ఆనందమయాధికరణములో స్పష్టము. శ్లోకములో అనంతశబ్దమును **"సుఖ, అవబోధ"** అను రెండు శబ్దములతో అన్వయించియు అర్థమును చెప్పవచ్చును. వాక్యములో కల్గు విరోధమేమియు లేదు. అవబోధ మనునది జ్ఞానమును తెలుపును. **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "విజ్ఞాన మానందం బ్రహ్మ"** ఇత్యాది శ్రుతిసూక్తులను ఇందులకు అనుగుణముగా గమనింపనగును. ఇవి అన్నియు పరబ్రహ్మస్వరూపమునకు ధర్మములుగా శ్రీ భాష్యములో నిర్ణయింపబడినవి.

లోకములోని వ్యక్తులలో సద్గుణములతో పాటు దుర్గుణములును కనుపించునట్లుగా భగవానునియందు కన్పించవు – అను వైలక్షణ్యమును **"విమల"** పదము తెలుపును – అనుచు **"అమలనాదిపిరాన్......విమలన్"** అను తిరుప్పాణ్ ఆళ్వార్ ప్రణీతమైన అమలనాది పిరాన్ ప్రబంధములోగల మొదటిపాశురములో **"విమల"** అను విశేషణమును దేశికులు వివరించుచు మునివాహనభోగమను వ్యాఖ్యానములో వివరించుట ప్రకృతములో అనుసంధేయము. దీనివలన అవతారములలో తన దివ్యగుణములను మఱుగుపఱుచుకొని, భగవానుడు అజ్ఞానము కల్గినవానివలె, ఇతరుల దుఃఖమును చూచి తానుకూడ దుఃఖితునివలె అభినయించుటను బట్టి, భగవానునియందు అజ్ఞత్వమును ఆరోపించువారి వాదమును కూరేశులు నిరసించినట్లయినది. మనవలె దోషములును, అజ్ఞానమును భగవానునకు కలవు – అని భావించు పక్షము **"క్రీడావిధి ర్బత విలక్షణలక్షణ స్తే"** అను కూరేశుల అతిమానుషస్తవసూక్తికి, శ్రీ భాష్యాదిసిద్ధాంతమునకును అనుగుణము కాదు. **"సుందరబాహుమ్"** అనునది దివ్యాత్మస్వరూపము మాత్రమేకాక, దివ్యమంగళవిగ్రహము కూడ భగవానునకు కలదు అనుటను తెలుపును అని వ్యాఖ్యానాంతరము. వసంతమాలిక అను అర్ధసమవృత్తములో ప్రస్తుతశ్లోకము నిబద్ధము – **"విషమే ససజా గురు స్సమే చేత్ సభరా య శ్చ వసంతమాలికా స్యాత్"** అని దీని లక్షణము.

**23. అతిపతితావధిస్వమహిమానుభవప్రభవత్ –**
**సుఖకృతనిస్తరంగజలధీయితనిత్యదశమ్ ।**
**ప్రతిభట మేవ హేయనికరస్య సదాఽప్రతిమం**
**హరి మిహ సుందరాహ్వ ముపయామి వనాద్రితటే ॥**

అతిపతిత + అవధి = అవధిని అతిక్రమించిన, స్వమహిమా = తన మహిమయొక్క, అనుభవ = అనుభవముచే, ప్రభవత్ = పుట్టుచున్న, సుఖ = గొప్ప ఆనందముచే, కృత = కల్గిన, నిస్తరంగజలధీయిత = కెఱటములు లేని సముద్రమువంటి, నిత్యదశమ్ = ఎల్లప్పుడు ఉండు స్థితిని కల్గివాడు, సదా = ఎల్లప్పుడు, హేయనికరస్య = నిషేధింపతగిన దుర్గుణముల సమూహమునకు, ప్రతిభటమ్ ఏవ = విరుద్ధమైన స్థితిలోనే నుండువాడును, సదా ఏవ = ఎల్లప్పుడును, అప్రతిమమ్ = తనకు సాటివాడు లేనివాడును అగు, సుందరాహ్వమ్ =



సుందరుడును (అழகర్ అను) పేరును కల, హరిమ్ = ప్రళయకాలములో అన్నిటిని హరించుట వలన హరిశబ్దవాచ్యుడును అగు స్వామిని, ఇహ వనాద్రితటే = ఈ వనగిరి తటములో, ఉపయామి = శరణు పొందుచున్నాను.

పాంచరాత్రములో, వైఖానసములో భగవానునకు నిత్యోదిత, శాంతోదిత దశలనెడి రెండు దశలు తెలుపబడినవి. తన వైభవమును తానే అనుభవించుచూ, సంతోషించు దశ నిత్యోదితదశ అనబడును. తన విభూతిని అనుభవించుచూ, ఆనందించు దశ శాంతోదిత దశ అనబడును. ఈ రెండిటిలో మొదటిది అగు నిత్యోదిత దశ ఇందు ప్రస్తావింపబడుచున్నది. **"భగవతః నిత్యోదితదశా, శాంతోదితదశా చేతి దశాద్వయ మస్తి, తయోః ప్రథమా స్వవై – భవానుభవదశా, ఇతరా తు విభూత్యనుభవదశా. అత్ర నిత్యదశా విశిష్టతయాఽనుసంధత్తే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(అతిపతితావధి...నిత్యదశమ్)** పూర్వార్ధమంతయు ఒకే సమస్తపదము. **'అతిపతిత'** అనునది **"స్వమహిమా"** అనుదానికి విశేషణము. అవధిదాటిన ఏ తన వైభవము కలదో, దానిని అనుభవించుటవలన కల్గిన ఆనందముచే కెఱటములు లేని సముద్రమువంటి దశను పొందిన వాడై స్వామియుండును. వరదరాజస్తవములోని **"ప్రశాంతానంతాత్మానుభవ"** ఇత్యాది శ్లోకము, దాని అర్థమును ఇచట స్మరణీయములు. **"జలధీయిత"** – అనగా సముద్రమువంటి అని అర్థము. **"నిత్యదశా"** అనగా నిత్యోదితదశ.

**(సదైవ హేయనికరస్య ప్రతిభటమ్)** – చీకటికి తేజస్సువలె, సర్పములకు గరుడుని వలె, హేయమైన ఆవద్యసమూహములకు ప్రతిభటుడైయుండువాడు. **"అఖిలహేయ ప్రత్యనీకనాకైయావతు – తమస్సుక్కు తేజస్సు పోలేయుమ్, సర్పత్తుక్కు గరుడనైప్పోలేయుమ్ వికారాదిదోషఙ్గళుక్కు ప్రతిభటమాయిరుక్కై"** అనుతత్త్వ త్రయసూక్తి, దానికి శ్రీవరవరమునుల వ్యాఖ్యానమును స్మరణీయము. అందలి **"హేయప్రత్యనీకత్వమావతు ఆశ్రితరుడైయ హేయనిరాసకత్వత్తుక్కు అడియాన హేయప్రతిభటత్వమెన్నువుమామ్"** అను యోజనావిశేషముకూడ అనుసంధేయము. దీనివలన హేయసామానాధికరణ్య అసహిష్ణుత్వము తెలుపబడినదని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. దీనిచే స్వామికి నిత్యముక్తవ్యావృత్తి సిద్ధించుచున్నది. హేయప్రత్యనీకత్వము ముక్తులకు సంసారిదశలో లేదు. నిత్యులకు అది భగవదిచ్ఛాధీనము. కావున స్వాభావికము కాదు. **"సదేత్యనేన భగవత్సంకల్పాయత్తాపహతపాప్మత్వాదికా నిత్యముక్తా వ్యావృత్తాః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(అప్రతిమమ్)** – పూర్వోక్తమే కారణముగా సాటిలేనిదియై యుండుట. **"అత ఏవ అప్రతిమమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(సుందరాహ్వం హరిమ్ ఇహ వనాద్రితటే ఉపయామి)** – ఇట్టి మహిమనుకల సుందరబాహు

స్వామిని వనగిరి తటములో సేవించుచున్నాను.

తనయొక్క అంతులేని గొప్పతనమును తలచి, నిశ్చలమైన సముద్రమువలె నుండుటకు నిత్యోదితదశ అని పేరు. **"తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్"** అని, **"అచింత్యదివ్యాద్భుతనిత్యయౌవనస్వభావలావణ్యమయామృతోదధిమ్"** అనియు గల శ్రీయామునుల సూక్తులు, **"ఆత్మానాం వాసుదేవాఖ్యం చింతయన్"** ఇత్యాది ప్రమాణములును ఇచట అనుసంధేయములు. సముద్రతీరములో కెఱటములుండునుగాని, మధ్యలో నుండవు. కావున కెఱటములు లేని సముద్రమువలె – అను ఈ ప్రయోగము అభూతోపమ కాదు. ఈ నిత్యోదిత, శాంతోదిత దశలు రెండు పర – వ్యూహ – విభవ– అర్చా – అంతర్యామి రూపములనెడి అయిదు విధములైన దివ్యమంగళ విగ్రహములలోను కలవు – అని వ్యాఖ్యానాంతరము.

అంతర్యామి బ్రాహ్మణములో ప్రతి వస్తువులో భగవానుడు అనుప్రవేశించియున్నను, వానితో అట్లు సంబంధమును కల్గియుండుటవలన ఏర్పడుటకు అవకాశముకల, ఏ హేయబంధమును స్వామి కల్గియుండడనుటను **"స త ఆత్మా అంతర్యామ్యమృతః"** అనుచు ప్రతిమాఱు పల్కుటద్వారా వేదము (అమృతశబ్దముద్వారా) వ్యక్తము చేసినదని భాష్యకారులు పల్కుటను బట్టి ఇచట **"ప్రతిభటమ్"** అని కూరేశులు ప్రయోగించిరి.

**"న తస్య ప్రతిమాన మస్తి", "న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "తస్మాద్ధాన్యన్న పరం కించనాస", "తేనార్హతి బ్రహ్మణా స్పర్ధితుమ్ కః, తేన కోఽర్హతి స్పర్ధితుమ్"** ఇత్యాది శ్రుతులను అనుసరించుచు **"అప్రతిమమ్ సదా"** అని ప్రయోగించిరి. **"హరిం హరంత మనుయంతి దేవాః"** అను వైదికప్రయోగమును దృష్టిలో నుంచుకొని, అదే రీతిలో కూరేశులు **"హరి ముపయామి"** అనుచు ప్రయోగించిరి కాబోలు అని వేఱొక వ్యాఖ్య. **"మాలిరుమ్ శోలైమలై పుఱమలై శార ప్పోవదు కిఱియే"** అను ఆళ్వార్ల సూక్తినిబట్టి కూరేశులు – **"వనాద్రితటే"** అని పల్కిరి – అను ఈ వివరణమంతయు వ్యాఖ్యానాంతరములో కలదు. వృత్తము **"యది భవతో నజౌ భజజలా గురు నర్కుటకమ్"** అని లక్షణము.

**24.** **సదా షాడ్గుణ్యాఖ్యైః పృథులబలవిజ్ఞానశకన –
ప్రభావీర్యైశ్వర్యై రవధివిధురై రేధితదశమ్ ।
ద్రుమస్తోమక్ష్మాభృత్పరిసరమహోద్యాన ముదితం
ప్రపద్యేఽధ్యారూఢశ్రియ మిమ మహం సుందరభుజమ్ ॥**

అవధివిధురైః = అంతులేనివి, షాడ్గుణ్యై + ఆఖ్యైః = షడ్గుణములు – అను పేరును కల్గినవి అగు, పృథుల = మిక్కిలి గొప్పది అయిన, బల = అన్నిటిని ఏ శ్రమలేకుండ ధరించుట అనెడి బలము, విజ్ఞాన = అన్నిటిని అన్ని సమయములలో అన్నివిధములుగా



తెలియుట అనెడి జ్ఞానము, శకన = ఏ పనిని అయినను ఏ రీతిలోనైనను పూర్తి చేయగల్గుట అనెడి శక్తి, ప్రభా = ఇతరులను భ్రమింపజేయు తేజస్సు, వీర్య = తాను ఎట్టి మార్పును పొందకనే, ఇతరులకు వికారమును కల్గించుట అనెడి వీర్యము, ఐశ్వర్యైః = ఉభయవిభూతినాథుడై యుండుట అనెడి ఐశ్వర్యము – అను వీనితో, సదా = ఎల్లప్పుడు, ఏధితదశమ్ = ప్రకాశించు స్థితిని కలవాడు, సదా = నిత్యము, ద్రుమస్తోమక్ష్మాభృత్ వృక్షసమూహమును కల్గిన పర్వతముయొక్క, పరిసర = కొండచఱియలోని, మహోద్యాన = గొప్ప ఉద్యానవనమగు తిరుమాలిరుమ్‌శోలై అను దివ్యదేశములో, ముదితమ్ = ఆనందించినవాడై వేంచేసియుండువాడు, ఆధ్యారూఢశ్రియమ్ = **"ఏఱు తిరువుడైయాన్"** అను పేరును కలవాడు, సుందరభుజమ్ = **"శున్దరత్తోళుడైయాన్"** అను పేరును కలవాడును అగు, ఇమమ్ = ఈ స్వామిని, అహం = దాసుడనగు నేను, ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

భగవానుని షాడ్గుణ్యసంపత్తిని కూరేశులు ఇందు స్తుతించుచున్నారు. జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు – అను ఆఱు గుణములు షాడ్గుణ్య మనబడును. వీనికి భగమని పేరు. **"జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః"** అని పరాశరసూక్తి. **"షణ్ణామ్ భగ ఇతీరణా"** – అని కదా సూక్తి. ఈ ఆఱు గుణములను కలవాడగుటచేతనే భగవానుడు పేరు స్వామికి కల్గినది. అస్మదాదులకును జ్ఞానబలైశ్వర్యములున్నను, అవి చాల అత్యల్పములైయుండును. అనల్పములై, అవధిలేనివియై యుండునది భగవానునకు మాత్రమే – అను విషయము స్ఫురించునట్లు **"పృథుల, అవధివిధురైః"** అను విశేషణములు ప్రయోగింపబడినవి.

భగవానుడు **"అనంతకల్యాణగుణోదధిః"** అని కీర్తింపబడుచున్నను, జ్ఞానము, శక్తి బలము, ఐశ్వర్యము, వీర్యము తేజస్సు – అను ఆఱు గుణములలో మిగిలిన కల్యాణ గుణములన్నియు అంతర్భవించునని మహర్షులు తెలిపిరి. భగవానుని దివ్యదేహములో సకలచేతనాచేతనములు అణగియున్నట్లే, ఈ ఆఱుగుణములలో అన్యగుణములన్ని యున్నవని షాడ్గుణ్యవివేకమను గ్రంథములో తెలుపబడినదనుచు దేశికులు **"తవానంతగుణస్యాపి షడేతే ప్రథమే గుణాః, యై స్త్వయేవ జగత్కుక్షా వన్యేఽప్యంతర్నివేశితాః"** అను అందలి వచనమును తత్త్వటీకలో ఉదాహరించిరి. కరుణ అను గుణములో సౌశీల్యము, వాత్సల్యము మొదలగు అంతర్భవించునట్లే, ఇదియును. కావున ఒక వైపు **"అనంతకల్యాణగుణోదధి"** అని, వేఱొక వైపు **"పూర్ణషాడ్గుణ్య"** దనియు స్వామిని కీర్తించుట పరస్పరవిరుద్ధము కాదు. చేతనుడనగా జ్ఞానమును కలవాడని అర్థము. ఇది అచేతనమగు జడమునుండి ఇతనిని వేఱుచేయును.

బిచ్చమెత్తు వానివద్ద చిల్లర ఉన్నను, ఆ చిల్లరకు ధనమని పేరున్నను, అతనిని ధనికుడని వ్యవహరించుట లేదు కదా! అట్లే, మనవద్ద కించిత్తు జ్ఞానాదులున్నను, సహజముగా అన్నిటిని, అన్ని కాలములందున్న వస్తువులను యథాతథముగా తెలియగల శక్తి మనకు లేదు. ఇట్టి శక్తి భగవానునకు ఒక్కనికి మాత్రమే కలదు. కావున **"స్మరతి చ భగవాన్ పాణినిః"** ఇత్యాది ప్రయోగములలోని భగవచ్ఛబ్దము ఔపచారికము మాత్రమే. ఈ విషయము శ్రుతప్రకాశికాదులలో స్పష్టము – అని వ్యాఖ్యానాంతరము.

**(షాడ్గుణ్యాఖ్యైః)** – షడ్గుణములే షాడ్గుణ్య మనబడును.

**(పృథులబల.....వీర్యైశ్వర్యైః)** అపరిమితమైన బలము, జ్ఞానము, శక్తి, తేజస్సు, వీర్యము, ఐశ్వర్యము అను వీనినిగూర్చి భట్టరు శ్రీరంగరాజస్తవ – ఉత్తర శతకములో **"యుగపదనిశమక్షె ణ్ణః"** అని ప్రారంభించి ఏడు శ్లోకములలో నిరూపించిరి. అట్లే, ఈస్తుతికర్తయు వరదరాజస్తవములో **"ప్రకృష్టం విజ్ఞానం"** ఇత్యాది శ్లోకములో వీనినిగూర్చి ప్రస్తావించిరి.

**(అవధివిధురైః)** అవధిలేనివి – అని అర్థము. అనందవల్లిలో ఆనందగుణమునకు తెలుపబడిన ఇయత్తారాహిత్యము సర్వగుణసాధారణము – అని ఇచటి బహువచనభావము. **"పృథుల"** అను పదమునకు ఒక్కొక్క గుణములోని ప్రకారవిశేషములు, వాని ఫలములు, వాని లక్షణములును భావించుటకుకూడ సాధ్యము కానివి – అని తాత్పర్యము. **"పృథులపదేన చేతననిష్ఠపరిమితజ్ఞానశక్త్యాదయో వ్యావర్త్యంతే, అవధివిధురై – రిత్యనేన ఆనందవల్ల్యా నికృష్టమానందగుణేయత్తారాహిత్య మేవ స్థాలీపులాకన్యాయేన సకలగుణసముదాయస్య సమాన మితి సూచితమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"షాడ్గుణ్యాద్యైః"** అని కొన్ని తాళపత్రప్రతులలో పాఠభేదము కలదు. ఈ పాఠము **"తేజోబలైశ్వర్యమహావబోధసువీర్యశక్త్యాదిగుణైకరాశిః"** అను పరాశరమహర్షిసూక్త్యనుగుణము.

ఈ షాడ్గుణ్యానుసంధానము పర, వ్యూహ, విభవ, హార్ద, అర్చలను అయిదురూపములందును కలదనుటను **"సదా"** అను పదము తెలుపుచున్నది సంకర్షణ – ప్రద్యుమ్న – అనిరుద్ధ స్వరూపములలో రెండు రెండు గుణములను అనుసంధించుటకు కారణము – అవి ఆ స్థితులలో కార్యోపయోగులుగా సంహితలలో అనుసంధింపబడుటయే. **"సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధనిష్ఠగుణయుగక్రమేణ బలవిజ్ఞానేత్యాదిక్రమోక్తిః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **''భవాన్ సర్వత్రైవ హ్యగణితమహామంగళగుణః''** అను వరదరాజస్తవసూక్తి ఇచట స్మరణీయము. **"ఏధితదశమ్"** అనునపుడు వర్తమానే క్త ప్రత్యయము. భూతకాలిక ప్రత్యయముగా గ్రహించినచో **"సదా"** అను ప్రయోగము పొసగదు. **"మాలిరుమ్‌శోలై పుఱమలై శార ప్పోవదు కిఱియే"**, **"అయన్‌మలై యడైవదు అదు కరుమమే"** అను ఆళ్వార్ల శ్రీసూక్తులను బట్టి **"ద్రుమస్తోమక్ష్మాభృత్‌పరిసర"** అని ప్రయోగింపబడినది. ఇది ఉద్యానభోగ్యతను తెలుపుచున్నది. **"తాదృశీ తదుద్యానభోగ్యతేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఏఱు తిరువుడైయాన్"** అను గోదాదేవిసూక్తిని అనుసరించి **''ఆరూఢశ్రియమ్''** అని, **''శున్దరత్తోళనే తాలేలో''** అను భట్టనాథసూక్త్యనుగుణముగా **"సుందరభుజమ్"** అనియు ప్రయుక్తములు – అని వ్యాఖ్యానాంతరము వృత్తము శిఖరిణి.



**25. సౌశీల్యాశ్రితవత్సలత్వమృదుతాసౌహార్దసామ్యార్జవైః**
**ధైర్యస్థైర్యసువీర్యశౌర్యకృతితాగాంభీర్యచాతుర్యకైః ।**
**సౌందర్యాన్వితసౌకుమార్యసమతాలావణ్యముఖ్యైః గుణైః**
**దేవః శ్రీతరుషండశైలనిలయో నిత్యస్థిత స్సుందరః ॥**

సౌశీల్య = తక్కువవారితోకూడ కలియుట అనెడి సౌశీల్యము, ఆశ్రితవత్సలత్వ = ఆశ్రయించిన వారిపట్ల దోషభోగ్యత్వమనెడి వాత్సల్యము, మృదుతా = మృదుస్వభావము, సౌహార్ద = అందఱిపట్ల మంచిభావన అనెడి సౌహార్దము, సామ్య = (గొప్పవారు, తక్కువవారు అను భేదములేక) అందఱిచే ఆశ్రయింపబడుట అనెడి సౌమ్యము, అర్జవైః = ఋజుస్వభావము – అనెడి గుణములచే, ధైర్య = వికారరాహిత్యమనెడి ధైర్యము, స్థైర్య = ఎవరిచేతను మార్చుటకు వీలుకాని మనోనిశ్చయమును కల్గియుండుట అనెడి వీర్యము, శౌర్య = ఏ సహాయము లేకుండగనే శత్రుపక్షములోనికి నిర్భయముగా పోయి, ఎదిరింపగల స్వభావము అనెడి శౌర్యము, కృతితా = ఆశ్రితులను మంచి స్థితిని పొందించి ఆనందించుట అనెడి కృతజ్ఞత, గాంభీర్య = ఇతని భావమేమి? అని ఇతరులచే గ్రహించుటకు వీలుకాకుండనుండు స్థితి అనెడి గాంభీర్యము, చాతుర్యకైః = చతురతతో ప్రవర్తించుట అను మొదలగు, గుణైః = దివ్యాత్మస్వరూపగుణములచేతను, సౌందర్య = ప్రత్యవయవశోభతో (ఒక్కొక్క అవయవము యొక్క శోభతో), అన్విత = కూడిన, సౌకుమార్య = శ్రమను ఏ మాత్రము సహింపలేని దేహస్థితిని అనెడి సౌకుమార్యము, సమతా = దివ్యాంగములు ఒకదానితో వేఱొకటి సమపరిమాణములో నుండుట అనెడి సమత్వము, లావణ్యముఖ్యైః = దివ్యాంగముల సముదాయశోభ అనెడి లావణ్యము మొదలగు, గుణైః = దివ్యమంగళవిగ్రహగుణములతో, దేవః = ప్రకాశించువాడగు, సుందరః = సుందరబాహుస్వామి, శ్రీతరుశైలషండనిలయే = తిరుమాలిరుమ్‌శోలై దివ్యదేశములలో, నిత్యం = ఎల్లప్పుడు, స్థితః = సాన్నిధ్యమును కల్గియున్నాడు.

పూర్వశ్లోకములో ప్రస్తావింపబడిన షాడ్గుణ్యముయొక్క పరిణామరూపములు అగు పలు కల్యాణగుణములు స్వామికి కలవు. వానిలో కొన్నిటిని కూరేశులు ఈ శ్లోకములో

ప్రస్తావించుచున్నారు. భగవద్గుణములను పలు రీతిలో పెద్దలు వర్గీకరింతురు. స్వరూపనిరూపక గుణములని, నిరూపితస్వరూపవిశేషణములని ఒక వర్గీకరణము. ఆశ్రయణసౌకర్యాపాదక గుణములని, ఆశ్రితకార్యాపాదకగుణములని వేఱొక వర్గీకరణము. దివ్యాత్మస్వరూపాశ్రిత గుణములని, దివ్యమంగళవిగ్రహాశ్రితగుణములని ఇంకొక వర్గీకరణము. ఇట్లు పలు రీతులలో అనుసంధింపబడు దివ్యగుణవిభాగములలో దివ్యాత్మస్వరూపాశ్రితగుణములు, దివ్యమంగళవిగ్రహాశ్రితగుణములు – అను విభాగమే ప్రకృతమున దృష్టిలో నుంచుకొనతగినది. **"సౌశీల్యాభిః స్వరూపగుణైః, సౌందర్యాదిభిః దివ్యవిగ్రహగుణై శ్చ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. సౌశీల్య, వాత్సల్యాది గుణములు స్వరూపాశ్రితగుణములు. సౌందర్యసౌకుమార్యాదులు విగ్రహాశ్రిత గుణములు. **"తవ వరదరాజోత్తమగుణా విసీమానోఽసంఖ్యాకాః ప్రణతజనభోగం ప్రసువతే"** అనుచు కూరేశులు వరదరాజస్తవములో అనుగ్రహించినట్లు ఈ గుణములన్నియు అనుభవరసికులకు పరమభోగ్యములు – అని శ్రీప్ర.భ.అణ్ణాస్వామివారి భోగ్యమైన వ్యాఖ్య.

భగవద్రామానుజులు శరణాగతిగద్యలో అనుగ్రహించిన క్రమమును, శ్రీయామునులు స్తోత్రరత్నములో **''త్వాం శీలరూపచరితైః''** అనుచు చేసిన గుణవర్గీకరణక్రమమును దృష్టిలో నుంచుకొని కూరేశులు ఈ శ్లోకమును అనుగ్రహించిరని వేఱొక వ్యాఖ్య.

**(సౌశీల్య) – "మహతో మందై స్సహ నీరంధ్రేణ సంశ్లేషః"** అనునది ఈ గుణనిరుక్తి. శీలమన్నను సౌశీల్యమన్నను, ఒక్కటే. ఒక మహానుభావుడు తన గొప్పతనమును కొంచెము కూడ లెక్కింపకుండ, తనకంటె చాల తక్కువవారితోకూడ ఎట్టి తారతమ్యభావన లేకుండ కలసిపోవుటయే శీలము. భగవానుని ఈ గుణము గుహుడు మొదలగువారి విషయమున వ్యక్తము. **"వశీ వదాన్యో గుణవాన్"** అను శ్లోకములో యామునులు అనేకగుణములను నామతః పేర్కొనునపుడు మధ్యలో ఏ గుణమని తెలియవీలులేనట్లు సామాన్యముగా **"గుణవాన్"** అని పల్కినను, అచటి గుణశబ్దమునకు సౌశీల్యమే అర్థమనుచు స్తోత్ర భాష్యములో దేశికులు – **"గుణ్యతే ఇతి గుణః అభ్యసనీయః అనుకూలతమత్వేన శీలనీయ ఇత్యర్థః. ఈదృశత్వం చ సౌశీల్యస్య గుణాంతరేభ్యః సమధికమ్"** అని పల్కిరి. ఇట్టి ప్రాధాన్యమును బట్టియే కూరేశులు మొదటగా సౌశీల్యశబ్దమును ప్రయోగించిరి. శ్రీరామాయణ ప్రారంభశ్లోకములోని **"కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్"** అను సూక్తిలోని గుణశబ్దమునకు వ్యాఖ్యాతలు సౌశీల్యము అను అర్థమునే తెల్పుట స్మరణీయము. **"యద్వా ఈశ్వరత్వబుద్ధ్యా యథా ఆశ్రితానాం సాధ్వసం న స్యాత్, యథా చ స్వయ మపి స్వస్య పరత్వబుద్ధ్యా విలక్ష స్స్యాత్ తథా శీలత్వమ్ సౌశీల్యమ్"** అని శ్రుతప్రకాశికాచార్యులవారి వేఱొక నిర్వచనము.

ఈ సందర్భమున అష్టశ్లోక వ్యాఖ్యాత అప్పన్ శ్రీనివాసాచార్యులవారు చేసిన



సౌశీల్యగుణ వివరణము ప్రస్తుతింపబడుచున్నది. "సౌశీల్యమనగా – **"మహతో మందై స్సహ నీరంధ్రేణ సంశ్లేషస్వభావత్వమ్"** అను రీతిలో, గొప్పవాడు తనకంటే చాల చిన్నవానితో కలియునపుడు తన గొప్పతనము ఇద్దఱి మనస్సులలోను స్ఫురింపకుండునట్లు ఎట్టి తారతమ్యము లేకుండ కలియుట. అనగా – **"ఆనందో బ్రహ్మ"**, **"ఆనందం బ్రహ్మణో విద్వాన్"**, **"ఉణర్ ముఴునలమ్"**, **"ఎల్లైయిలన్నలమ్"**, **"ఉయర్వఱ వుయర్నలముడైయవన్"**, **"ఎప్పాలెవర్క్కుమ్ నలత్తాయుయర్న్దుయర్న్దప్పాలవన్"** అనెడి నిరతిశయానందమైన స్వరూపస్వభావములను, **''తేజసాం రాశి మూర్జితమ్''**, **''పంచశక్తిమయవపుః''**, **"మణియురువిల్ పూతమైన్దాయ్"** అనునట్లు అప్రాకృతభూతపంచకమును ఉపాదానముగా కల్గినది కావున నిరవధిక తేజోరూపమై, **''పూర్ణషాడ్గుణ్యవిగ్రహమ్''** అనునట్లు స్వరూపగుణములకు, జ్ఞానశక్త్యాదులకు ప్రకాశమై, **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** అని ఇచ్ఛచే పరిగ్రహింపబడినదియై, అందువలననే స్వరూపగుణములకంటెను అభిమతమైయుండు దివ్యమంగళవిగ్రహమును అనుభవించి, **"అవాక్యనాదరః"** అను గొప్ప పరత్వమును కలవాడై, అంతకుమించి, **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"**, **"తిరుమకళార్ తనిక్కేళ్వన్ పెరుమైయుడైయ పిరానార్"** అనునట్లు శ్రియఃపతిత్వము చేతను, **"అయర్వఱు మమరర్కళదిపతి''**, **''వానోర్ తనిత్తలైవన్''**, **''విణ్ణవర్క్కెణ్ణలరియాన్''** అనెడి నిత్యవిభూతియోగముచేతను, **"ఇన్బుఱు మివ్విళైయాట్టుడైయానై"**, **"నళిర్మామలరున్ది వీట్టైప్పణ్ణి విళైయాడుమ్ విమలన్''** అనెడి లీలావిభూతియోగముచేతను కల్గిన నిరంకుశైశ్వర్యమును కల్గినవాడైయుండు భగవానుని **"న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే"**, **"యస్మా త్పరం నాపర మస్తి కించిత్"**, **"న త్వత్సమోఽభ్యధికః కుతోఽన్యః"**, **"ఇననిలన్"**, **"మికునరైయిలన్"** అనెడి సమాభ్యధికరాహిత్యమనెడి వైభవమును అనుసంధించి, **"నాకణైమిశై నమ్బిరాన్"**, **"శెల్వర్ పెరియర్ శిఱుమానిడ వరనామ్"**, **"అమ్మా నాఴిప్పిరాన్ అవనెవ్విడత్తాన్ యానార్"** అనుచు ఆశ్రయించుటకు భయపడవలసిన అవసరములేనట్లు **"వానవర్శిన్దైయుళ్ వైత్తు చ్చొల్లుమ్ శెల్వనై శొల్లువన్ పావియేన్"**, **"వానోరిణైయై కళవేఴ్ వెణ్ణెయ్ తొడువుణ్డ కళ్వా వెన్బన్"** – అనెడి ఆశ్రితులను విడచినచో తనకు తోచనట్లు దగ్గఱకు చేర్చుకొన్నట్లును, **"అఴుక్కుడమ్బెచ్చిల్ వాయాల్ తూయ్మైయిల్ తొణ్డనే నాన్ శొల్లినేన్ తొల్లైనామమ్"**, **"ఎన్గణ్జ్ఞానార్క్కణ్జలెన్డు కావిపోల్ వణ్ణర్ వన్దెన్ కణ్ణుళే తోన్ఱినార్"** అనునట్లు అందఱితో సమానముగా అభినివేశముతో కలసి, **"హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి"** అనునట్లు అతని గొప్పతనమును, తన నైచ్యమును తన మనస్సులో పడకుండునట్లు, నీరు నీటితో కలియు రీతిలో, కలియుట.

దాని సౌష్ఠవమనగా – మందునితో సంశ్లేషించు దశలోకూడ మహత్త్వ బుద్ధిలేకుండుట. **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"**, **"అహం వో బాంధవో జాతః"** అనుచు సజాతీయుడై, పొందికగా సంశ్లేషించియుండుట.

**(ఆశ్రితవత్సలత్వ)** – **"ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్దారేల్ నన్ఱుశెయ్దారెన్బర్‌పోలుమ్"** అనునట్లు **"కున్ఱనైయ కుఱ్ఱమ్ శెయ్యినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** అని కీర్తించు రీతిలో కొండలంత పాపములను చేసినను, గుణముగానే గ్రహించుటయే వాత్సల్యము. **"దోషానాదరహేతుః స్నేహవిశేషః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అయినను, దోషభోగ్యత్వపర్యంతము అనుసంధికొనుటయే దివ్యసూరిసూక్తిసమ్మతము. ఈవ్యాఖ్యలోనే 30వ శ్లోకవ్యాఖ్యలో **"దోషేష్వపి భోగ్యతా బుద్ధిః వాత్సల్యమితి పర్యవసితమ్"** అని తెలుపబడినది.

వాత్సల్యమనగా – **"వత్సాం లాలయతి"** అనెడి వ్యుత్పత్తి ప్రకారము అపుడే పుట్టిన లేగదూడపట్ల ఆవుకు కల ఆదరము. అనగా – పాదముతో తొక్కిన గడ్డిని సైతము కాలితో ప్రక్కకు గెంటివేయు దశలోకూడ, తనవలన జన్మించుటయే కారణముగా తలచి, ఆవు దూడ దోషమును భోగ్యముగా అంగీకరించి, తన పాలతో పోషించి తనను ఎల్లప్పుడు తలచునట్లు చేసి, ముందు ఈనిన దూడను, గడ్డిని వేయుటకు వచ్చినవారిని సైతము కొమ్ములతో, గిట్టలతో ఎదిరించి కుమ్మి, రక్షించునట్టి స్వభావవిశేషము.

"ఆ రీతిలోనే ఈశ్వరుడును తనను ఆశ్రయించిన చేతనుల విషయమున **"ఇరుళ్తరుమాఞాల"**మైయున్న సంసారములో **"భగవత్స్వరూపతిరోధానకరీం స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధే ర్జననీమ్"** అనునట్లు భగవత్స్వరూపాదులను కప్పిపుచ్చి, తనపట్ల భోగ్యబుద్ధిని కల్గించుచున్న శరీరముతో సంబంధించియున్న చేతనుని దోషమును చూచుట అనునది మన దోషముకదా! **"తున్బము మిన్బము మాకియ"** అనునట్లు సంసారహేతువైన పుణ్యపాపరూపకర్మలుగాని, కర్మలను ఆర్జించు భూమి కాని, కర్త అగు చేతనుడు కాని, ఇవి అన్నియును నా అధీనములోనుండగా, వానిని నేను నివర్తింపజేయకుండ, **"నీ తన్ద వాక్కై", "శుమదుతన్దాయ్", "పలశమయ మతికొడుత్తాయ్", "ఉళ్ళమ్ పేతమ్ శెయ్‌తిట్టు"** అనునట్లు మతివిభ్రమములను కల్గించి, **"తానాఙ్గారమాయ్ ప్పుక్కు", "కరుమముమ్ కరుమపలను మాకియ కారణమ్", "శెయ్‌కిన్ఱ కితి యెల్లామ్ యానే యెన్ఱుమ్ శెయ్‌కైప్పయ నుణ్బేనుమ్ యానే"** అనునట్లు తన సత్త, కర్తృత్వ, ఫలిత్వాదులు నా స్వాధీనమైయున్న ఆత్మ వస్తువును, "అనాది అయిన అవిద్యాసంబంధముచే హైన్యమును పొందునట్లు చేసిన నా వలన వచ్చినకదా ఇది అంతయును" అని, **"పొయ్‌న్నిన్ఱ ఞానముమ్ పొల్లావొఴుక్కు మఴుక్కుడమ్బు మిన్నిన్ఱనీర్‌మై యిని యాముఱామై", "వన్‌శేఱ్ఱళ్ళల్ పొయ్‌న్నిలత్తఴున్దార్", "పిఱన్దుమ్ శెఱ్ఱుమ్ నిన్ఱిడరుమ్ పేతమై తీర్‌న్దొఴిన్దేన్", "శార్‌న్ద విరువల్వినైకళుమ్ శరిత్తు మాయప్పఱ్ఱఱుత్తు త్తీర్‌న్దు తన్బాల్ మనమ్ వైక్క త్తిరుత్తి"** అనునట్లు తన ఫలముగా తలచి పోగొట్టి, **"ఉరువము మారుయిరు ముడనే యుణ్డాన్", "ఎన్నె ముఱ్ఱ ప్పరుకినాన్", "ఎన్నె ముఱ్ఱముయిరుణ్డు"** అనునట్లు భోగ్యముగా స్వీకరించి, **"పాలేపోల్ శీరిల్ పఴుత్తొఴిన్దేన్", "తొల్‌శీరై నన్నెఞ్జే వోవాద వూణాక వుణ్", "తిరుమాలిన్‌శీర్**



**ఇఱప్పెతిర్‌కాలమ్ పరుకిలుమార్వనో"** అనునట్లు తన కల్యాణగుణములతో ధరింపజేసి, **"తాయ్‌నాడు కన్ఱేపోల్ తణ్డుఴాయానడియే పోయ్‌నాడికొళ్ళుమ్", "తాయై నినైన్ద కన్ఱేయెయొక్క వెన్నెయుమ్ తన్నైయే నినైక్కచ్చెయ్‌తు", "కఱవా మడనాకు తన్‌కన్ఱుళ్ళి నాపోల్ మఱివాతడియే నున్నైయే అఴైక్కిన్దేన్"** అని, **"కుమిఱుమ్"** అనునట్లు విడిచినచో నాలుక తడి ఆఱిపోవునట్లు నిరంతరము తలచునట్లు చేసి, **"దోషో యద్యపి", "న త్యజేయమ్"** అని ఆశ్రితునకు ఏ సమయమునను దోషము లేదు, ఉన్నను మనకు ఉపాదేయతమమే అగును. అతనిని విడువము" అని, **"సర్వభూతేభ్యః అభయం దదామి"** అని, **"త్వాం తు ధిక్ కులపాంసనమ్"** అనువారివలె రక్షణలో అతిశంకను చేసి, దోషమును ఉచ్చరించు వారితోపాటు, తనపట్ల ప్రీతితో **"వధ్యతామ్"** అను వారితోపాటు, నిరుపాధికస్వాతంత్ర్యముతో **"క్షిపామి", "న క్షమామి"** అనువారితోపాటు భేదము లేకుండ ఎవరివలనను ఏ భయమును రాకుండునట్లు అభయప్రదానమును చేయగలను – అనియు, **"కిం కార్యం సీతయా మమ"** అని నిత్యానపాయిని అయిన పిరాట్టిని కూడ ఒక ప్రక్కకు విడిచి, **"అనన్దన్ పాలుమ్ కరుడన్బాలు మైతునొయ్‌తాక వైత్తు ఎన్‌మనన్దన్నుళ్ళే వన్దుకి వాఴ్చ్చెయ్‌తాయెమ్బిరాన్"** అనునట్లు నిత్యసూరులపట్లకూడ నత్తామాత్రహేతువై, **"వడతడముమ్ వైకున్దముమ్ మతిళ్ తువరావతియుమ్ ఇడవకైకళిఴన్దిట్టు"** అని తాను అభిమానించిన దివ్యదేశములనుకూడ విడచి, **"పెణ్ణులామ్ శడైయినానుమ్ పిరమను మున్నై క్కాణ్బాన్ ఎణ్ణిలా వూఴి తవమ్ శెయ్‌దార్ వెళ్‌కినిఱ్ప, విణ్ణాళార్ వియప్ప వన్దు ఆనైక్కన్ఱరుళైయీన్ద", "శివనుమ్ పిరమనుమ్ కాణాతు తిరుమాల్ అరుమాలెయ్‌తి యడిపరవ వరుళైయీన్ద"** – అని ఉపాసకులు లజ్జించునట్లు వారి పట్ల ఉదాసీనముగా, రక్షించుటకు హేతువై, **"విదిత స్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః", "రిపూణా మపి వత్సలః"** అని శత్రువుల గోష్ఠిలోకూడ ప్రసిద్ధమై, **"యది వా రావణ స్స్వయమ్"** అని రావణుడు సైతము వచ్చినను గ్రహింతును అనునట్టి స్వభావవిశేషము. ఈ దోషనివృత్తి, ఉపాయాంతరభావి అయిన **"పాపేభ్యో మోక్షయిష్యామి"** అనెడి పాపవిమోచనవ్యాపారముతో విరోధింపదా! అనినచో, ఇచట చెప్పునది ఆశ్రయణవిరోధి నివృత్తిమాత్రమే కావున, విమోచనహేతువైన గుణానుసంధానము కావున **(అవ–రక్షణే–అను)** ధాతుసిద్ధమైన రక్షకత్వము ఇష్టానిష్టప్రాప్తిపరిహారములకు ఉపయుక్తమగునట్లు, పాపనివృత్తికి ఉపయోగపడునది అగుటచే విరోధింపదు." – అనుచు వాత్సల్య గుణమును గూర్చి అష్టశ్లోకీ వ్యాఖ్యాత అప్పన్ శ్రీనివాసచార్యస్వామివారు చేసిన వివరణము ఇచట స్మరణీయము.

**(మృదుతా)** – మార్దవమని అర్థము. **"ఆశ్రితవిశ్లేషాసహత్వమ్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య. ఈ గుణము స్వరూపగుణముగా, విగ్రహగుణముగా – రెండు విధములుగా అనుసంధింపబడుచున్నను, ప్రకృత శ్లోకమున సౌకుమార్యశబ్దము ప్రత్యేకముగా ప్రయోగింపబడుటచే, దానిని విగ్రహగుణముగా గ్రహించి, ఈ మార్దవమను పదమును

స్వరూపగుణముగా గ్రహించుట ఇచట యుక్తము. **"మహాత్మాభి ర్మా మవలోక్యతాం నయ క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః"** అనుచు యామునులు అనుగ్రహించిన రీతిలో ఆశ్రితవిశ్లేషమును సహింపలేని స్వభావమే ఇది. ఆచార్యహృదయగ్రంథములోని తృతీయప్రకరణములోని **"మహాత్మాక్కళ్ విరహమ్ సహియాద మార్దవమ్"** అను సూక్తి ఇచట అనుసంధేయము. **"తేష్వస్థానభయశంకిత్వమ్"** అని శ్రుతప్రకాశికాచార్యులవారి వేరొక నిరుక్తి. **"సాపరాధేషు శాసనోన్ముఖస్యాపి సామప్రధానత్వం వా, యథా – సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్"** అనునది దేశిక వివరణసూక్తి.

**(సౌహార్ద)** **''సుహృదం సర్వభూతానామ్''** అనునట్లు – శోభనశంసిహృదయశాలిత్వము సౌహార్ద మనబడును. అనగా, సర్వజనహితైషిత్వము. **"అరుళ్‌పురిన్ద శిన్దై అడియార్‌మేల్ వైత్తు"** అనుచు ఆళ్వార్లు గొప్పగా కీర్తించిన గుణమిది. **"ఆశ్రితానాశ్రితవిభాగాభావేన సకలహితైషిత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"సామాన్యతో విశేషత శ్చ సర్వహితైషిత్వమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"స్వసత్తానపేక్షితతద్రక్షాపరత్వం వా"** అని శ్రుత ప్రకాశికాచార్యులవారివ్యాఖ్య. **"అనుపకారిణ్యపి కిమస్య భవిష్యతి? కింకరవాణి? ఇతి శుభాశంసిశోభనహృదయత్వమ్"** అని పరాశరభట్టర్‌వారి నిర్వచనము.

**(సామ్య)** – భగవద్గీతలో **"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః"** అని భగవానుడు పల్కినట్లు అభిజనవిద్యావృత్తములలో తారతమ్యమును చూడకుండ, అందఱికిని ఆశ్రయింప వీలయినవాడైయుండుట. **"అభిజనవిద్యావృత్తానాదరేణ సర్వసమాశ్రయణీయత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఈ గుణము శబరి, గుహాదులలో వ్యక్తమని పెరియవాచ్చాన్ పిళ్ళై గద్యవ్యాఖ్య. **"ఏతేన స్వతో పక్షపాతిత్వమ్, ఆశ్రితేషు యథార్హ మాదరసంభావనాక్రమవైషమ్యరహితత్వం చ సిద్ధ్యతి. యదా కర్మఫలదాయిన ఈశ్వరస్యాశ్రయణౌపాధికపక్షపాతోఽపి సమత్వావిరోధీ"** అని దేశికుల గద్యభాష్యసూక్తి. **"తేష్వపి పరిచితాపరిచితతీవ్రమందసంవేగిత్వాది అవిగణయ్య గౌరవే సమః"** – అని పరాశరభట్టర్ వారి భాష్యము.

**(అర్జవ)** మనోవాక్కాయములనెడి కరణత్రయము ఒకటిగా నుండని, ఋజుత్వము లేని సంసారులతో కలసి ప్రవర్తించునపుడును వారివలె తానుకూడ కుటిలహృదయుడు కాకుండ, ఋజువుగా నుండుట అనెడి కరణత్రయసారూప్యము ఈ గుణము. **"అతావతు – అవర్‌కళుక్కు తన్నై నియమిత్తుక్కొడుక్కై"** అని పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానము. దేశికులు ఈ గుణమునుగూర్చి వివరించుచు – **"తేన సంశ్రితేషు విప్రలిప్సానుదయః"** అని నుడివిరి. **(ధైర్య)** – అనిష్టములు ఒకదానివెంట వేఱొకటి ఎదురైనను మనస్సులో కొంచెముకూడ వికారమును పొందకుండుట ధైర్యము. **"అత్యంతానిష్టప్రసంగేఽపి అప్రతిహతచిత్తవృత్తిత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః**



**"** అని మహాకవి సూక్తి. **"స్వస్మిన్ ప్రతిపక్షాగమే సత్యవికృతత్వమ్ – యథా – జటాజూటగ్రంథిం గ్రథయతి – ఇతి"** అని శ్రుతప్రకాశికాచార్యులవారి వివరణము. పెరియవాచ్చాన్ పిళ్ళై – ఆశ్రితుల రక్షణకు మూలమైన మనోదార్ఢ్యమనిరి. దేశికులు **"అప్యహం జీవితం జహ్యామ్ – ఇత్యాదిషూక్త మత్యంతాభిమతవియోగప్రసంగేఽప్యభిన్నప్రతిజ్ఞత్వమ్. భీష్మాద్యాశ్రితప్రతిజ్ఞా రక్షణాయ స్వప్రతిజ్ఞాభంగేఽప్యేతాదృశప్రతిజ్ఞాసిద్ధిః అత ఏవ – ద్యౌః పతేత్ పృథివీ శీర్యేద్ధిమవాన్ శకలీభవేత్, శుష్యే త్తోయనిధిః కృష్ణే న మే మోఘం వచో భవేత్"** ఇత్యాదిగా తనకు మిక్కిలి ఇష్టులైనవారి వియోగము కల్గినను తన ప్రతిజ్ఞను వదలకుండుట అని, **''అప్యహమ్ జీవితం జహ్యామ్''** అను మొదలుగాగల సూక్తులలో ఈ గుణము వ్యక్తమగుచున్నదని, భీష్మాదుల ప్రతిజ్ఞారక్షణకొఱకు తన ప్రతిజ్ఞను భంగము చేసికొనుటకు కూడ సిద్ధపడుటయు ఇందులకు తార్కాణమని వివరించి, ఈ గుణమును ప్రకారాంతరముగా కూడా ఈ క్రిందివిధముగా వివరించిరి. – **"వ్యత్యయేన వా స్థైర్యధైర్యే వ్యాఖ్యాతవ్యే, అతర్కితోపనత్వేఽపి బలవతి ప్రతిపక్షే సావజ్ఞదృఢచిత్తత్వం వా ధైర్యమ్ – యదాహ – కపోలే జానక్యాః – ఇత్యాది. జీవత్యపి మహాబలే రావణే, సాగరేఽప్యలంఘితే, విభీషణ మభిషించతా దర్శితోఽయం గుణః"** అని పల్కిరి. అనగా – మిక్కిలి బలవంతుడైన శత్రువు అనుకోకుండ ఎదురైనను ఏమాత్రము తొట్రుపాటు పడకుండనుండు మనఃస్థితి ధైర్యము. ఇది మహాబలుడగు రావణుడు జీవించి ఉండగనే, ఇంకను సముద్రము దాటకుండగనే, విభీషణునకు **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్"** అనురీతిలో పట్టాభిషేకమును చేయు సందర్భమున వ్యక్తమైనదని భావము. **"అత్యంతానిష్టప్రసంగేఽపి అభిన్నప్రతిజ్ఞత్వమ్''** అని రామానుజాచార్యవ్యాఖ్య. **(స్థైర్య)** – ఆశ్రితులను చేయివిడువకుండనుండవలెనను దృఢమైన అధ్యవసాయమును కల్గియుండుట. **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః", "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన", "ఏతద్వ్రతం మమ"** అను మొదలగు సూక్తులలో ఈ గుణము స్ఫుటము. **"శరణాగతవిషయే పురుషకారభూతలక్ష్మ్యా దోషోద్ఘాటనే కృతేఽపి అభగ్నప్రతిజ్ఞత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ప్రత్యూహశతైరప్యాశ్రితరక్షణప్రతిజ్ఞాభంగం న కరోతి"** అని పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్య. **"శరణాగతసంగ్రహే దోషప్రదర్శకై రంతరంగై రప్యకంపనీయత్వమ్"** అని దేశికులనిరి. **"ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱుశెయదార్ ఎన్బర్‌పోలుమ్"** ఇత్యాది భట్టనాథసూరిసూక్తి ఇచట స్మరణీయము. **''శరణాగతసంగ్రహే దోషప్రదర్శకైరంతరంగైరప్యకంపనీయత్వమ్''** అని రామానుజాచార్యవ్యాఖ్య. ఇచటి సంస్కృత వివరణములన్నియు ఉదాహృత భట్టనాథసూరి సూక్త్యనుగుణములు. **"తత్సంధానే తదపచారదుర్విచాల్యత్వాత్ స్థిరః"** అని పరాశరభట్టర్ స్థిరనామమును వివరించిరి. **"నిలైపేరాన్ ఎన్నైఞ్ఞత్తు ఎప్పొழுదు మెమ్బెరుమాన్''** (తిరువా10-6-6) ఇత్యాది దివ్యసూరి

సూక్తులీగుణమును స్తుతించుచున్నవి. **(సువీర్య)** – అపూర్వమైన యుద్ధము చేయవలసివచ్చినను ఏమాత్రము శ్రమపడకుండుట. **"అతిదుష్కరశ్రమకరణేఽపి అశ్రమత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. పూర్వశ్లోకములో ప్రస్తుతమైన వీర్యగుణముకంటె ఈ గుణము భిన్నము. **"విచిత్రయుద్ధకరణేఽప్యశ్రమత్వమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **''రక్షసామ్ అతిభయచలనహేతుత్వాత్ వీరః''** అను పరాశరభట్టర్ వారి సహస్రనామభాష్యసూక్తి. **(శౌర్య)** – రణరంగములో ప్రవేశించునపుడు ఎవరి సహాయమును అభిలషింపకుండ ఏకాకిగా వెడలి, ప్రవేశింపగల పటిమ. **"చతుర్దశసహస్రాణాం రక్షసాం భీమకర్మణామ్, ఏక శ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి"** అనుచు భీతిల్లు కాలమున **"అసహాయశూర, అనపాయసాహస"** అని కీర్తించు రీతిలోని నిర్భతిగా పరపక్షమున ప్రవేశించు సామర్థ్యమే ఇది – **"అసహాయస్యాపి అతిభయంకరపరిపంథిబృందనిశ్శంక ప్రవేశశక్తిః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"స్వగృహ ఇవ పరబలే ప్రవేశసామర్థ్యమ్"** అని శ్రుతిప్రకాశికాచార్యులవారు నిర్వచింపగా, **"ఆశ్రితవిరోధికళై అళియచ్చెయ్యవల్లనాయిరుక్కై"** అని పెరియవాచ్చాన్ పిళ్ళై వివరించిరి. దేశికులు **''యథా జనస్థానయుద్ధమూల బలనిబర్హణాదిషు"** అనుచు ఈ గుణము జనస్థానములో, శ్రీరాముని మూలబలనిరసనమున వ్యక్తమైనదనిరి. **"యద్విజిగీషుత్వం తదాహ శూర ఇతి"** అని పరాశరభట్టర్‌వారి సహస్రనామ భాష్య సూక్తి. **"నిశాశరర్రై వెన్నరకమ్ శేరావకైయే శిలై కునిత్తాన్"** (శిఱియ తిరుమదల్) ఇత్యాది దివ్యసూక్తులును ఇందులకు అనుగుణముగా స్మరణీయములు.

**(కృతితా)** – కృతార్థత్వమని భావము. దాసులకు చేయవలసిన దానిని నిర్వర్తించి పూర్తిచేయు గుణము. **"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ''** అను రీతిలో కృతకృత్యుడగుటయే ఇది. శ్రుతప్రకాశికాచార్యులువారు – **"ఆశ్రితకార్యపూరణేన కృతార్థత్వమ్"** అని పై విధముగనే నిర్వచించి, **"యద్వా, కృతమ్ – క్రియా, తద్వత్త్వమ్, ఆశ్రితకర్తవ్యస్య స్వయంకర్తృత్వమ్. యథా – అహం స్మరామి ఇతి"** అని ప్రకారాంతరమున వివరించిరి. అనగా, ఆశ్రితులు చేయవలసిన కర్తవ్యమును తానే నిర్వహించుట కృతిత్వము. ఇది **"అహం స్మరామి"** అను మొదలగు సూక్తులలో స్పష్టము – అని అని అర్థము. దేశికులు ఈ గుణమును – **"కృత మిహోపకారః, కృతజ్ఞతాదిశబ్దే తథా దృష్టేః. తద్వత్త్వం కృతిత్వమ్, ఉపకర్తృత్వ మిత్యర్థః, యద్వా – అభిషిచ్య చ లంకాయామ్ – ఇత్యాద్యుక్త మాశ్రితకార్యపూరణేన కృతకృత్యత్వమ్, కర్తవ్యశేషరహితేషు కృతిశబ్దప్రయోగాత్. న మే పార్థాస్తి కర్తవ్యమ్ – ఇత్యుక్తం విహితానుష్ఠాననైరపేక్ష్యం, ధర్మప్రవర్తనార్థానుష్ఠానత్వం వా వివక్షితమ్. తేనాఽపి పరోపకారార్థ మేవ ప్రవృత్తత్వ ముక్తం భవతి. శ్రూయతే చ – న కర్మణా వర్ధతే నో కనీయాన్–ఇతి. తథా చ శ్రుత్యంతరమ్ – స న సాధునా కర్మణా భూయాన్ నో ఏవాసాధునా**



**కనీయాన్ – ఇతి. అథవా – ఆదికర్మణి క్తః – కృతం కర్తవ్యత్వేనోపక్రాంత మాశ్రితానాం యద్ధితం తత్సర్వం పూర్వమేవాఽనేన ప్రయోజకకర్త్రా ప్రారబ్ధ మిత్యర్థ. స్వేన కృతం పరోపకారం ప్రత్యపి స్వస్యైవ శేషిత్వం వా కృతిత్వమ్"** అని గద్యభాష్యములో మిక్కిలి విశదముగా అయిదు ప్రకారములలో నిర్వచించిరి. అనగా, కృతమనుటకు గొప్ప ఉపకారమని అర్థము. లోకములో కృతజ్ఞతాది శబ్దములలోని కృతమను పదమునకు అట్టి అర్థమేకదా ఉన్నది. అట్టి మహోపకారమును చేయు గుణమును కలవాడని అర్థము. లేక, **"అభిషిచ్య చ లంకాయామ్"** అనునట్లు ఆశ్రితుల కార్యమును పూర్తిచేయు గుణము కృతిత్వము. లోకమునందుకూడ కృతిశబ్దము కర్తవ్యశేషము లేనివారను అర్థమున ప్రయోగింపబడుచున్నది. అనుష్ఠానమేమియు లేకుండుటగాని, ధర్మప్రవర్తనార్థము అనుష్ఠానమును చేయు గుణముగాని ఇచట చెప్పబడినదనవచ్చును. ఈ అర్థమునకూడ పరోపకారార్థము భగవానుడు ప్రయత్నించుటయే వ్యక్తమగుచున్నది. వేదములందును – సత్కర్మవలన, భగవానునకు అభ్యుదయము కలుగవలసిన అక్కఱలేదు, చేయకపోయినచో వచ్చు హానియు లేదు – అని తెలుపబడినది. లేక, కృతశబ్దములోని **"క్త"** ప్రత్యయము **"అది కర్మణి క్తః"** అను సూత్రప్రకారము వచ్చిన క్త ప్రత్యయముగా గ్రహించి, ఆశ్రితులకు కర్తవ్యముగా, హితముగా నున్నది అంతయు ఇంతకుముందే ప్రయోజకకర్త అగు భగవానునిచే ప్రారంభింపబడినదను అర్థమును చెప్పవచ్చును. లేక, తాను చేసిన ఉపకారమునుగూర్చి తానే శేషిగానుండు గుణము దీనిచే తెలుపబడినదనియు చెప్పవచ్చును – అని భావము. పెరియవాచ్చాన్‌పిళ్ళై **"ఇవర్‌కళ్ కర్తవ్యఙ్గళైయదైయ త్తానే యేఱిట్టు కొణ్డిరుక్కై యెన్నవుమామ్ – అది కర్మణి క్తిన్నంతః"** అని వివరించిరి. దీనినిబట్టి ప్రకృతమున **(కృతి శబ్దము) "క్తిన్"** ప్రత్యయాంతముగా కూడ చెప్పవచ్చునిని ఏర్పడుచున్నది. **"తచ్చ తేషాం సుకృత మస్మాదేవ ప్రసన్నాత్ ఇతి కృతిః. ఏష ఏవ సాధు కర్మ కారయతి త యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి"** అని కృతినామమును పరాశరభట్టర్ వ్యాఖ్యానించిరి. **"శెయ్‌వార్‌కళై చ్చెయ్‌వేనుమ్ యానే యెన్నుమ్"** (తిరువాయ్ 5–6–4), **"ఉమ్బరొరువనై ఎన్ ఉణర్‌వినుళ్ళే యిరుత్తినేన్ అదువుమ్ అవనదిన్నరుళే"** (తిరువాయ్ 8–8–3) ఇత్యాది దివ్యసూరి సూక్తులు సంభావ్యములు.

**(గాంభీర్య)** – మనస్సులో ఏమున్నదో ఇంగితజ్ఞులకు సైతము అంతుపట్టకుండనుండు గుణము. ఆశ్రితులకు చేయవలసి వానిని పూర్ణముగా నిర్వర్తించిన పిదపకూడ, **"ఉన్నడియార్‌క్కు ఎన్ శెయ్‌వన్ ఎన్ఱే యిరుత్తినీ"** (పెరియతిరువన్దాది – 53) అను రీతిలో ఇంకను ఏమి చేయుదును? అనియే తలచువాడు కావున అట్టి స్వామి మనస్సుయొక్క లోతు ఇతరులకు గ్రహింప సాధ్యము కాకుందును. **"దుర్విజ్ఞేయసహృదయత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"దుర్విజ్ఞేయస్వరూపస్వభావత్వమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **''ఆశ్రితవిషయే ఏవ మనేన చికీర్షితమ్ – ఇతి పరిచ్ఛేత్తు మశక్యత్వమ్,**

**దీయమానగౌరవసంప్రదానలాఘవై రనపేక్షత్వం వా"** అని శ్రుతప్రకాశికాచార్యులవారి నిరుక్తి. పెరియవాచ్చాన్‌పిళ్ళై – **"ఆతావతు – తన్‌కొడైయిన్ శీర్మైయుమ్, కొళ్ళుకిఱవనుడైయ శిఱుమైయుమ్ పారాతిరుక్కై, య ఆత్మదా బలదా"** అని వివరించిరి. అనగా, తన ఔదార్యముయొక్క గొప్పతనమును, ప్రతిగ్రహీత నైచ్యమును చూడని గుణము – అని భావము. దేశికులు గద్యభాష్యములో ఈ గుణమును **"భక్తానుగ్రహవదాన్యత్వాదే రామూలతో దురవగాహత్వమ్. ఆశ్రితాపరాధేషు ప్రతిగ్రహీతృనికర్షాదిషు సతోఽపి స్వజ్ఞానస్య గోపనేన దుర్జ్ఞానత్వం వా, తదభిప్రాయేణ సర్వజ్ఞస్యాప్యవిజ్ఞాతత్వోక్తిః"** అని నిర్వచించిరి. కావున ఈ గాంభీర్యగుణము సర్వజ్ఞుడగు స్వామియొక్క **"అవిజ్ఞాతా"** అను నామమునకు మూలము అని వ్యాఖ్యానాంతరము. **"గమనే భియం రాతి ఇతి గంభీరః"** అను వ్యుత్పత్తినిబట్టి శత్రువులకు మిక్కిలి భయమును కల్గించు స్వభావమని చెప్పుటకూడ యుక్తమేకదా! **"తదభివ్యక్తఐశ్వర్యమహాగాంభీర్యో గభీరః, తత్సం పృక్తో హి కతకసంకలిత మివ సలిలమ్, అనాద్యవిద్యాకలుషోఽపి సంసారీ ప్రసీదతి. కింపునః స్వభావదీప్రో భగవాన్"** అని పరాశరభట్టర్ గంభీరనామమును వర్ణించిరి. భగవానుని ఈ గాంభీర్యగుణము **"నీణ్డాయై వానవర్‌కళ్ నినైత్తేత్తి క్కాణ్బరిదాల్! అణ్డాయ్!"** (పెరియతిరు 7-2-5) ఇత్యాది సూక్తులలో దివ్యసూరులచే ప్రస్తావింపబడినది.

**(చాతుర్యకైః)** – ఇతరులచే మనస్సుతోకూడ భావించుటకు వీలుకాని అరుదైన, గొప్ప లీలలను మిక్కిలి అనాయాసముగా చేయుట. **"ఇతరదుశ్శకకృత్స్నకార్యనిర్మాణకుశలతా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"సర్వకార్యకుశలత్వమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"ఆశ్రితార్థేషు అజడక్రియత్వమ్, యథా – సానుబంధరావణవధేన విభీషణాభిషేకః యద్వా, ఆశ్రితదోషగోపనం వా చాతుర్యమ్, యథా పిత్రాదే రివ"** అని శ్రుతప్రకాశికాచార్యగద్యవ్యాఖ్య. పెరియవాచ్చాన్‌పిళ్ళై కూడ – **"ఆశ్రితదోషఙ్గళై ప్పిరాట్టియు మఱియాదపడి మఱైక్కై, ఆశ్రితరుడైయ అతిశంకైయై ప్పోక్కి రక్షిక్కై యెన్నవుమామ్"** అని వ్యాఖ్యానించిరి. దీనినిబట్టి ఆశ్రితుల దోషములను మఱుగు పఱచు గుణము, వారి మనస్సులలోని భయసందేహములను తీర్చు గుణము చాతుర్యమనియు చెప్పవచ్చును. దేశికులు – **"రక్షణీయేషు జనయన్ ప్రత్యయం తదా – ఇత్యాదిప్రసిద్ధ మతిశంకాశమన దోషగోపనాదిరూప మజడక్రియత్వమ్, యేన విభీషణసుముఖాదిషు విరుద్ధా నప్యకూలయతి, శుభాశ్రయస్వాకారప్రదర్శనాద్యయత్నేనాపాయై ర్విషయవైరాగ్యాదికం చ జనయతి"** అని వివరించిరి. **(సౌందర్య)** **"దృష్టిచిత్తాపహారిణమ్"** అనునట్లు కన్నులను, చిత్తమును అపహరింపగల్గిన దేహసౌందర్యము. **"శూదనాయ్ కళ్వనాకి తూర్‌త్తరోడిశైన్దకాలమ్ మాతరార్‌కయఱ్కణెన్నుమ్ వలైయుళ్ పట్ట౧న్దు వేనై, ప్పోదరే యెన్నుశొల్లి ప్పున్దియిల్ పుకున్దు తన్బాల్ ఆదరమ్ పెరుకవైత్త వ౧కు"** అని తొణ్డరడిప్పొడి యాళ్వార్లుసాయించిన, శిశుపాలునివంటి విముఖులైనవారిని సైతము అభినివిష్టచిత్తులను



చేయునట్టిది స్వామి అందము. **"దృష్టిచిత్తాపహారిణీ అవయవశోభా"** అని శ్రీనివాసాచార్య, రామానుజాచార్యవ్యాఖ్యలు. **"సౌందర్య మవయవశోభా, యేన – సాక్షాన్మన్మథమన్మథ – ఇత్యుచ్యతే"** అని దేశికవ్యాఖ్య. **"అ౧కియాన్ తానే"** అని పొగడబడినవాడు కదా స్వామి! **"సుతరా మాద్రియత ఇతి సుందరః"** – అను వ్యుత్పత్తియు ఇచట స్మరింపనగును. **"తద్దృష్టిమనోహరః"** – అని పరాశరభట్టర్ సూక్తి.

**(సౌకుమార్య)** – **"రంగభర్తు రపి లోచనచర్చాం సాహసావలిషు లేఖయమానమ్, పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్య మతి వాఙ్మనసం నః"** అని భట్టరు అనుసంధించు రీతిలోనున్న మార్దవము. **"పాదారుందతుద మేవ పంకజరజః"** ఇత్యాది సూక్తుల భావమును ప్రకృతముననను అన్వయింపనగును. **"త్వదంగమార్దవే దృష్టే కస్య చిత్తే న జాయతే, మాలతీశశభృల్లేఖాకదలీనాం కఠోరతా"** అనుచు ఒక కాముకకవి ఒక సామాన్యస్త్రీని వర్ణించెను. కొండను పూవుగా వర్ణించుటవంటి అసత్యమేకదా ఈ వర్ణన. **"వడివిణైయిల్లా మలర్‌మకళ్ మఱ్ఱైనిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** అనునట్లు దేవేరులును తాకుటకుకూడ భయపడునట్టి సౌకుమార్యము కదా స్వామిది! **"సౌందర్యాన్వితసౌకుమార్య"** అనగా సౌందర్యము, సౌకుమార్యము – అని అర్థము. **"మహాబలత్వేఽపి పుష్పహాస ఇతి నామ దుహానం మార్దవమ్, యథోక్తమ్ – సుకుమారౌ మహాబలౌ – ఇతి"** అని దేశిక గద్యభాష్యసూక్తి. **"పుష్పాదపి మృదుతరగాత్రత్వమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"సుష్ఠు కుమార్యతే ఇతి సుకుమారః, సుకామ్యతే ఇతి సుకుమారః"** అను వ్యుత్పత్తులవలన ఈ గుణమే భక్తుల మనస్సును అమితముగా ఆకర్షించునని తెలియుచున్నది.

**(సమతా)** – పూర్వము మొదటిపాదమున సామ్యమను ఆత్మగుణము ప్రస్తావింపబడినది, కావున ఇచట **'సమతా'** అనెడి ఈ పదము దివ్యమంగళవిగ్రహ గుణము అగు సమత్వమును తెలుపును. సాముద్రికశాస్త్రమున చెప్పబడినట్లు **"సమః సమవిభక్తాంగ"** అను రీతిలో సమపరిమాణమునుకల అవయవములను కల్గియుండుట – అని భావము. **"సాముద్రికోక్తసమపరిమాణత్వమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(లావణ్య)** – ప్రత్యవయవశోభకు సౌందర్యమని పేరు. సముదాయ శోభ – అనగా అవయవిశోభ లావణ్యమనబడును. శ్రీరంగరాజస్తవములోని **"ఏకైకస్మిన్ పర మవయవే"** ఇత్యాది శ్లోకభావ మిచట అనుసంధేయము. పెరియవాచ్చాన్‌పిళ్ళై ఈ గుణమును గద్యవ్యాఖ్యలో వివరించుచు – **"అతావతు, ఎఙ్గుమొక్క వ్యాపిత్తు నిన్ఱు, రసత్తై త్తరవఱ్ఱాయిరుక్కై"** అని నుడివిరి. దేశికులు గద్యభాష్యమున **"భూయిష్ఠం తేజ ఏవాద్భిః బహుళాభి ర్మృదూకృతమ్, చక్షురానందజననం లావణ్య మితి కథ్యతే – ఇత్యాహుః"** అని పల్కిరి.

**(ముఖ్యైః గుణైః)** – శ్లోకము పూర్తి అగుటచే ఛందోనిర్బంధమువలన ఇంతటితో

నిలువలసివచ్చినదే తప్ప, ఏతవన్మాత్రములు కావు స్వామి గుణములు. **"అసంఖ్యేయకల్యాణగుణగణౌఘ"** అనికదా గద్యసూక్తి. గద్యభాష్యములోని **"ఆదిశబ్దేన శుభాశ్రయాదిప్రకరణోక్తసర్వగుణసంగ్రహః, తత ఏవానంత్యమ్"** అను వివరణము ప్రకృతమునను అన్వయించును.

**(సుందరో దేవః శ్రీతరుషండశైలనిలయ స్సన్ నిత్యం స్థితః)** – సుందరబాహుస్వామి తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును నివాసముగా గొని, అవతారములవలె కాదాచిత్కము కాకుండ, నిత్యముగా వేంచేసియున్నాడు – అని అర్థము. **"శ్రీతరుషండశైలనిలయే"** అను సప్తమీవిభక్తిఘటిత పాఠమును కలదు. అపుడు ఈ పదము పర్వతపరముగా అన్వయింపనగును. ఈ శ్లోకవ్యాఖ్యలో వక్తవ్యాంశము లింకను చాల ఉన్నను విస్తృతి భీతిచే విరమింపబడినది. వృత్తము శార్దూల విక్రీడితము.

**26.** **యే ష్వేకస్య గుణస్య విప్రు డపి వై లోకోత్తరం స్వాశ్రయం**
**కుర్యా త్తాదృశవైభవై రగణితైః నిస్సీమభూమాన్వితైః ।**
**నిత్యై ర్దివ్యగుణైః తతోఽధికశుభత్వైకాస్పదాత్మాశ్రయైః**
**ఇద్ధం సుందరబాహు మస్మి శరణం యాతో వనాద్రీశ్వరమ్ ॥**

యేషు = పూర్వోక్తగుణములలోని, ఏకస్య గుణస్య = ఏ ఒక్క గుణముయొక్క విప్రుట్ అపి = ఒక అల్పాంశముకూడ, స్వ + ఆశ్రయమ్ = తనకు ఆశ్రయమైనవానిని, లోక + ఉత్తరమ్ = లోకములో గొప్పవానినిగా, కుర్యాత్ = చేయునో, తాదృశవైభవైః = అట్టి గొప్పతనమును కల్గినవి, నిత్యైః = ఎల్లప్పుడు ఉండునవి, తతః = ముందు తెల్పిన, లోకములో గొప్పదైన మంచిని కల్గించువానికంటె, అధికశుభత్వ = అధికమైన శుభమునకు, ఏక + ఆస్పద = ఒకే ఆధారమైన, ఆత్మాశ్రయైః = తన ఆత్మను ఆశ్రయించినవి అగు, గుణైః = గుణములతో, ఇద్ధం = ప్రకాశించువాడు, వనాద్రి + ఈశ్వరమ్ = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు అధిపతి అగు, సుందరబాహుం = సుందరబాహుస్వామిని, శరణం = శరణముగా, యాతః అస్మి = పొందినవాడనైయున్నాను.

పూర్వశ్లోకములో ప్రత్యేకముగా అనుసంధించిన కల్యాణగుణములను అన్నిటిని మనస్సున తలచి, వానిలో ఒక్కొక్క గుణముయొక్క మహిమ మనస్సునకూడ భావింప సాధ్యముకానిది కావున, ప్రతి ఒక్కగుణము అత్యంతాభినివేశమును కల్గింపగల్గినది కావున, ఇట్లు నిరతిశయములైన, అసంఖ్యాకములైన కల్యాణగుణములతో నిండిన భగవానుడు తన సేవను అనుగ్రహించు తీరు ఏమి ఆశ్చర్యకరము! ఏమి ఆశ్చర్యకరము! అనుచు మనస్సున కూరేశులు ద్రవించి పల్కుచున్నారు.

సత్యమును పల్కుటచే సత్యహరిశ్చంద్రుని, సమర్థవంతముగా పాలించుటచే



కార్తవీర్యార్జునుని, తన శరీరమును సైతము దానమిచ్చుటకు సిద్ధపడుటచే శిబిని, ఇంకను ఈ విధముగా పలువురను లోకము పొగడుట వారిలో కల్యాణగుణములలోని అత్యల్పాంశముండుటయే. ఇట్లుండగా, కల్యాణగుణములు అన్నియు నిరతిశయమహిమ కల్గినవియై ఎవరిలోనైన ఉండునా? అనిన, అట్లు ఒక్క భగవానునియందే దర్శింప వీలగును. **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** అనుచు వేదము భగవానుని శక్తి అను ఒక్క గుణమును గూర్చి పల్కుచు, అది ఎట్టిదో, ఎంతటిదో అని తెలియజెప్పలేక **"వివిధైవ"** అని మాత్రము పల్కి ఊరకున్నది. **"న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పర మంత మాప"** అనుచు ఋగ్వేదము భగవన్మహిమ అవధి లేనిది, ఎవరికిని పరిచ్ఛేదింప సాధ్యము కానిది అని అన్నది. కావుననే శ్రీయామునులును **"తత్త్వేన యస్య మహిమార్ణవశీకరాణుః శక్యో న మాతు మపి శర్వపితామహాద్యైః"** అనిరి.

**(యేషు లోకస్య గుణస్య విప్రుడపి స్వాశ్రయమ్ లోకోత్తరమ్ కుర్యాత్)** – పూర్వము కీర్తించిన గుణములలో, మిగిలిన గుణములలోను ఒక్కొక్క గుణమును గ్రహించి, ఆ గుణముకూడ పూర్తిగా ఉండవలసిన అవసరములేదు; అందు ఏకదేశములో యత్కించిదంశము చూచినను, దాని మహిమ వాచామగోచరముగా నుండును. విప్రుట్ అనగా బిందువు – అనగా – అత్యల్పాంశమని భావము.

**(తాదృశవైభవైః)** – ఏకదేశసంబంధమాత్రముచే స్వాశ్రయమునకు గొప్పతనమును కల్పించు వైభవము స్వామియొక్క ఒక్కొక్క గుణమునకు కలదు.

**(అగణితైః)** – అట్టి గుణములు లెక్కలేనివి. ఏటితీరములోని ఇసుకరేణువులను లెక్కింపగల్గినను వీనిని లెక్కింప వీలుకాదు. **"మతిక్షయాన్నివర్తంతే న తు గోవింద గుణక్షయాత్"** అని కదా సూక్తి.

**(నిస్సీమభూమాన్వితైః)** – **"తాదృశవైభవైః"** అనుచు ఇంతకుముందే వర్ణించినను, తృప్తిచెందకపోవుటచే మరల **"నిస్సీమభూమాన్వితైః"** అనుచున్నారు. **"యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా"** అని యుండుటచే, వేఱొక విషయమును చింతింపలేనట్లు వశీకరింపగల గొప్పతనము ఇచట వివక్షితము – అని స్ఫురించుటకొఱకు ఇచట భూమాశబ్దప్రయోగము చేయబడినదని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(నిత్యైః)** – ఈ గుణములన్నియు స్వరూపానుబంధులగుటచే నిత్యములు.

**(తతోఽధికశుభత్వైకాస్పదాత్మాశ్రయైః)** – ఈ శ్లోకములోని మొదటిపాదములో తెలిపిన విషయము ఒక వైపు ఉండగా, పూర్వము **"గుణజం గుణినో హి మంగళత్వమ్"** (22) అను శ్లోకములో ప్రస్తావించిన రీతిలో తమకంటె గొప్పదగు స్వాశ్రయమును –

అనగా దివ్యాత్మస్వరూపమును తెలుపబడినవి. ఈ విధములైన – **(దివ్యగుణైః)** – కల్యాణగుణములతో, – **(ఇద్ధమ్)** ప్రకాశించువానిని – **"ఇత్థమ్"** అనుచు ఇచట కొందఱు భ్రాంతపాఠమును పఠింతురు. కొన్ని ప్రతులలో ఆ పాఠము ముద్రింపబడినదికూడ. కాని ఆ పాఠము పొసగదు. **"ఇద్ధమ్"** అనునదియే తగిన పాఠము. **"ఇన్ధీ – దీప్తౌ"** అను ధాతువునుండి పుట్టిన క్త ప్రత్యయాంత రూపమిది.

**(వనాద్రీశ్వరం సుందరబాహుం శరణం యాతోఽస్మి)** – **"ఏతాదృశకల్యాణగుణ విశిష్టస్య సుందరబాహోః లోకోత్తరత్వస్య కిం పునర్న్యాయసిద్ధత్వాత్ స ఏవ శరణవిషయ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక, తథా గుణా శ్చ దేవస్య త్వసంఖ్యేయా హి చక్రిణః"**, **"చతుర్ముఖాయు ర్యది కోటివక్త్రో భవే న్నరః క్వాపి విశుద్ధచేతాః, స తే గుణానా మయుతైక మంశం వదే న్న వా దేవవర ప్రసీద"** ఇత్యాది ప్రమాణముల భావము ఈసందర్భమున భావ్యము. వృత్తము శార్దూలము.

**27.** **సదా సమస్తం జగ దీక్షతే హి యః ప్రత్యక్షదృష్ట్యా యుగపద్భువా స్వతః ।**
**స ఈదృశజ్ఞాననిధిః నిధి స్తు న స్సింహాద్రికుంజేషు చకాస్తి సుందరః ॥**

యః = ఏ సుందరబాహుస్వామి, సదా = ఎల్లప్పుడు, సమస్తం జగత్ = ప్రపంచమును అంతటిని (లోకములోని చేతనాచేతనములను అన్నిటిని), స్వతః = స్వయముగానే (ఇంద్రియసహాయములేకనే), యుగపద్భువా = ఒకే సమయమున కల్గు, ప్రత్యక్షదృష్ట్యా = నేరుగా దర్శింపతగిన జ్ఞానముతో, ఈక్షతే = చూచుచున్నాడో, హి = ఈ విషయము = ప్రసిద్ధమైనది కదా, ఈదృశజ్ఞాననిధిః + తు = ఇట్టి జ్ఞానమునకు నిధియైనవాడు కూడ, నః = మనకు, నిధిః = **'వైత్తమానిది'** అని పొగడునట్లు గొప్ప నిధియైన, సుందరః = సుందరబాహుస్వామి, సింహాద్రికుంజేషు = సింహాచలమను పేరునుగల తిరుమాలిరుమ్‌శోలై పర్వతములోని పొదరిండ్లలో, చకాస్తి హి = ప్రకాశించుచున్నాడు కదా!

పూర్వశ్లోకములో ప్రస్తావించిన కల్యాణగుణములలోని కొన్నిటిని గ్రహించి, కీర్తింపదలచిన కూరేశులు మొదటగా ఇందు షాడ్గుణ్యములో ప్రముఖమైన జ్ఞానగుణమును అనుభవించుచున్నారు. వేదముకూడ ఈ గుణమునుగూర్చి **"యః సర్వజ్ఞః సర్వవిత్"** అని పల్కినది. అన్ని వస్తువుల స్వరూపస్వభావములను అన్ని రీతులలో యథాతథముగా తెలియువాడని ఈ శ్రుతికి అర్థము. మనకు ఒక వస్తువును తెలిసికొనవలెనన్న దానిని గ్రహించు ఇంద్రియము ఆవశ్యకము. కన్నులు లేకుండ చూడ వీలుకాదు. చెవులు లేకుండ వినుటకు వీలుకాదు. కాని, భగవానుని జ్ఞానము ఈ విధముగా ఇంద్రియాధీనము కాదని శ్రుతి తెలుపుచున్నది. **"అపాణిపాదో జవనో గృహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః"** అనికదా శ్రుతి. జ్ఞానపదమును వ్యాఖ్యానించునపుడు భగవద్రామానుజులు – **"జ్ఞానపదం**



**నిత్యాసంకుచితజ్ఞానైకాకార మాహ, తేన కదాచిత్ సంకుచితజ్ఞానత్వేన ముక్తా వ్యావృత్తాః"** అని పల్కుట ఇచట స్మరణీయము. యోగసిద్ధివలన యోగులు దర్శింపగల్గినది వారు ధ్యానించు విషయమును మాత్రమే. అదియును నిత్యముగా కాదు. అన్నిటిని కాదు. ప్రత్యక్షముగా కాదు. **"చిరనిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్"** అని చెప్పబడుటచే అది ప్రత్యక్షసమానాకారముగా మాత్రమే ఉండును. ఒకే సమయమున అన్నిటిని సాక్షాత్కరింపజేసికొనుటయు వీలుకాదు. వారిది క్రమికజ్ఞానము మాత్రమే. నిత్యముక్తుల జ్ఞానమును స్వతఃసిద్ధముకాదు. భగవదిచ్ఛాధీనము. కావున వారిని **"సదా పశ్యంతి సూరయః"** (సర్వదా నిత్యసూరులు దర్శింతురు) – అని పల్కుటయును **"విపన్యవో జాగృవాంసః సమింధతే"** అను రీతిలో భగవానుని కీర్తించి, పాడుటవలన కల్గు మహిమను తెల్పుటయే అని వేదమే తెల్పినది. అందుచే వారి జ్ఞానము భగవదధీనము అనుట స్పష్టము. అందువలన భగవానుని జ్ఞానము మాత్రమే సహజమైనది, అన్ని విధముల పూర్ణమైనదియును. ఈ విషయమును తిరుమజైమన్నన్ **"ఎల్లామ్ అతివర్"** అనుచు సూచించిరి. ఈ శ్లోకమున కూరేశులు నాథమునుల **"యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"** అను సూక్తిలోని పదములను, భావమును యథాతథముగా గ్రహించిన తీరు అద్భుతము. ఇట్లే, దేశికులును **"యుగప దఖిలం ప్రత్యక్షేణ సతతం విదన్"** అను శ్లోకములో ఈ విషయమును ప్రస్తావించుట గమనింపనగును. కూరేశులే సాయించిన **"నయన శ్రవణో దృశా శృణోషి"** ఇత్యాది శ్లోకార్థమిచట స్మరణీయము.

**(ఈదృశజ్ఞాననిధిః సః)** – ఇట్టి యుగపత్ సర్వసాక్షాత్కార మనెడి జ్ఞానమునకు నిధియగు ఆ భగవానుడు, **(నః నిధి స్సన్)** – **"అంతర్విత్తో నిధి రసి త్వ మశేషపుంసామ్"** అని శ్రీవైకుంఠస్తవములో కీర్తించిన రీతిలో మనకు అక్షయనిధియై, **(సుందరః సింహాద్రికుంజేషు చకాస్తి)** – సుందరబాహుస్వామి తిరుమాలిరుమ్‌శోలై పర్వతములోని లతాగృహములలో సేవను అనుగ్రహించుచున్నాడు. ఈ పర్వతమునకు సింహాద్రి అనునది వేఱొక పేరు. **"మదజ్గళ్ నిన్ఱదిరుమ్ మాలిరుమ్‌శోలై"** అనుచు తిరుమజైమన్నన్ ఇచట సింహములు గర్జించుననుటచే ఈ పేరు ఏర్పడియుండవచ్చునని శ్రీఅణ్ణాస్వామివారి సూక్తి. **"కుంజేషు చకాస్తి"** అనునపుడు బహువచనముద్వారా భగవానుడు దేవేరులతోపాటు పలు లతాగృహములలో విహారములను చేయునని స్ఫురించుచున్నది.

శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో – **"అత్ర యుగపద్భువేత్యనేన క్రమేణ సర్వసాక్షాత్కారక్షమా శ్చేతనవిశేషా వ్యావృత్తాః, స్వత ఇత్యనేన యోగినో వ్యావృత్తాః, సదేత్యనేన ముక్తా వ్యావృత్తాః, యద్వా, సదేత్యనేనైవ యోగిముక్తవ్యావృత్తేః సిద్ధత్వాత్ స్వత ఇత్యనేన భగవత్సంకల్పాయత్తసర్వజ్ఞానా నిత్యా వ్యావృత్తాః స్వతో యుగపద్భువేతిపదాభ్యాం నయన శ్రవణో దృశా శృణోషి – ఇత్యుక్త ప్రకారేణ తత్తద్విషయగ్రహణం ప్రతి నియతకరణ –**

**నియమాభావః, కరణానపేక్షసాక్షాత్కార శ్చ గర్భితౌ"** అనుచు యోగి, ముక్త, నిత్యుల జ్ఞానములకంటె భగవానుని జ్ఞానమునకు గల వైలక్షణ్యమును శ్లోకములలోని పదములు తెలుపువిధము వివరింపబడినది. వృత్తము – ఉపజాతి

**28. ఐశ్వర్యతేజోబలవీర్యశక్తయః కీదృగ్విధా స్సుందరబాహుసంశ్రయాః ।**
**యోఽసా జగజ్జన్మలయస్థితిక్రియా స్సంకల్పతోఽల్పా దుపకల్పయత్యజః ॥**

యః అసౌ = ఏ ఈ, అజః = పుట్టుకనులేని సుందరబాహుస్వామి, జగత్ = లోకముయొక్క, జన్మ = పుట్టుక, లయ = లయము, స్థితి = రక్షణ, క్రియాః = ప్రవృత్తులకు, అల్పాత్ = స్వల్పమైన, సంకల్పతః = సంకల్పము వలన, ఉపకల్పయతి = నిర్వహించుచున్నాడో, అట్టి, సుందరబాహు = సుందరబాహుస్వామిని, సంశ్రయాః = ఆశ్రయించిన, ఐశ్వర్య = గొప్పఐశ్వర్యము (సంపదను నిర్వహించుట), తేజః = తేజస్సు, బల = అన్నిటి లోపల ఉండి, ధరించుట అనెడి బలము, వీర్య = వికారములేని స్వభావము అనెడి వీర్యము, శక్తయః = అన్నిటికిని మూలకారణమగుట అనెడి శక్తి – అనునవి, కీదృగ్విధాః = ఎట్టివో కదా!

షాడ్గుణ్యములో జ్ఞానము మాత్రము పూర్వము ప్రస్తావింపబడినది. మిగిలిన అయిదు గుణములు ఇందు సంగ్రహముగా కీర్తింపబడుచున్నవి. షాడ్గుణ్యమునకు జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములలో ఉపయోగము. కావున, ఈ అయిదు గుణములను గ్రహించి సృష్టి స్థితి సంహారక్రియలను అవలీలగా నిర్వహించు భగవానుని మహిమ ఎంతగొప్పదో కదా! అని ఆశ్చర్యముగా కూరేశులు తల పంకించుచు, పల్కుచున్నారు. **"సకలజగతః సృష్టిస్థితి ప్రవృత్తిసంహారాః యత్సంకల్పాత్ ప్రవర్తంతే తాదృశసంకల్పసుందరబాహుసమాశ్రితా ఐశ్వర్యాద్యాః అపరిచ్ఛేద్యవైభవా ఇతి భావః"** అని ఈ శ్లోక తాత్పర్యము శ్రీనివాసాచార్య వ్యాఖ్యలో తెలుపబడినది.

**ఐశ్వర్యము – "ఏష సర్వేశ్వరః", "పతిం విశ్వస్య"** ఇత్యాదిగా కీర్తింపబడిన రీతిలో అన్నిటిని ఎట్టి అవరోధము లేకుండ పాలించు సామర్థ్యము. **తేజస్సు – "అవాకీ అనాదరః"** అనుచు శాండిల్యవిద్యలో తెలుపబడిన గుణమిది. **"తేజస్త్వన్యానపేక్షతా"** అని దీనిని మహర్షులు నిర్వచించిరి. **"అనాదరః"** అను పదమును భగవద్రామానుజులు **"అవాప్తసమస్తకామత్వేన ఆదర్తవ్యాభావా దాదరరహితః"** అని వివరించిరి. మఱియు **"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్", "తస్య భాసా సర్వ మిదం విభాతి"** అనుచు వేదము పల్కినట్లు గొప్ప తేజస్సును కల్గియుండుట అనియు చెప్పనగును. దీనిని వివరించు దేశికులు సూర్యుని తేజస్సు చీకటి అనదగిన రీతిలో స్వామి తేజస్సు ఉండుననుచు **"పకలోన్ పకల్ విళక్కాక ప్పతఇజ్జుడర్ తోన్తియదే"** అని, **"మోహాంధకారవినివర్తనజాగరూకే దోషా దివాఽపి నిరవగ్రహమేధమానే, త్వత్తేజసి ద్విరదశైలపతే విమృష్టే శ్లాఘ్యేత సంతమసపర్వసహస్రభానోః"** అనియు వరదరాజస్వామి విషయమున పల్కుట ఇచట



స్మరణీయము. **బలము** అనగా – శ్రమ లేకుండ దేనినైనను సహించు సామర్థ్యము. **"ఏష సేతు ర్విధరణః, యత్ర విశ్వం భవత్యేకనీడమ్, అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషోఽంతః చరతే బహుధా జాయమానః"** అను మొదలుగునవి ఈ బలమును గుణము నిరూపించు శ్రుతులు. **వీర్యము** – అనగా – లోకములోని ఏ వస్తువునకు అయినను ఉపాదానకారణముగానుండు స్థితిలోనున్నను, లోకములోని ఉపాదానకారణము పొందు మార్పులేవియు పొందకుండుట. **"వికారవిరహో వీర్యమ్"** అను వీర్యగుణనిర్వచన మిచట భావనీయము. **శక్తి** అనగా – అన్నిటికిని మూలకారణమగుట. **"సర్వం ఖల్విదం బ్రహ్మ", "బ్రహ్మ వనం బ్రహ్మ స వృక్ష ఆసీత్"** ఇత్యాది వేదవాక్యములు ఈ గుణమును నిరూపించుచున్నవి. ఎవరికిని నిర్వహించుటకు సాధ్యము కాని కార్యమును అవలీలగాచేయు గుణమునకును **"వీర్య"** మని పేరు. దీనినే అఘటితఘటనాసామర్థ్యము అనియు అందురు. ద్రౌపదికి కౌరవసభలో వస్త్రమును అనుగ్రహించుట మొదలగు సందర్భములలో ఈ గుణము వ్యక్తము. దూదిని తెచ్చి, నూలును వడకి, మగ్గములోనేసి, అంచును చేర్చి, వస్త్రమును నిర్మించలేదుకదా స్వామి. **"సత్యకామః సత్యసంకల్పః"** అనునట్లు తన సత్యసంకల్పమే దీనికి మూలము. సృష్టిస్థితి సంహారక్రియలను నిర్వహించు సుందరబాహుస్వామిని ఆశ్రయించిన ఈగుణముల వైభవము అత్యంతము ఆశ్చర్యకరము కదా! అనుచు కూరేశులు విస్మయపడుచున్నారు. **"వక్తు మశక్యాః అవాఙ్మానసగోచరా ఇతి యావత్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము – ఉపజాతి.

**29. యత్కల్పాయుతభోగతోఽపి కృశతాం యాయా న్న తావ త్ఫలం**
**యేష్వేకస్య తథావిధైః సతతజై రంహోభి రుత్సీమభిః ।**
**అస్తాదా విహ సంసృతా వుపచితైః ఛన్నం సుసన్నం జనం**
**సన్నత్యా క్షమతే క్షణా ద్వనగిరిప్రస్థప్రియ స్సుందరః ॥**

యత్ = ఏ పాపకార్యము, కల్ప + అయుతభోగతః + అపి = బ్రహ్మకల్పములు పదివేలు అనుభవించినను, కృశతాం = క్షీణతను, నాయాయాత్ = పొందదో, తావత్ ఫలం = అంతటి ఫలము, యేషు = ఏ పాపములయందు, ఏకస్య = (ఏ) ఒక్కదానికే కలదో, తథావిధైః = ఆవిధములైనవి, సతతజైః = నిరంతరము కల్గునవి, ఉత్సీమభిః = లెక్కలేనివి, (అవధిలేనివి), అస్తాదౌ = ఎపుడు ప్రారంభమైనవి అని తెలియుటకు వీలుకాని (అనాదియైన), సంసృతౌ = సంసారమందు, ఇహ = ఈ కర్మభూమిలో, ఉపచితైః = వృద్ధియగుచున్నవి అగు, అంహోభి = పాపములచే, ఛన్నమ్ = ఆవరింపబడినవాడు (తనను తెలిసికొనలేనివాడు), సుసున్నం = మిక్కిలి దుఃఖించువాడును అగు, జనం = అవ్యపదేశ్యుడగు ప్రాణిని, వనగిరిప్రస్థప్రియః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతచఱియలలోని వాసమును ప్రియముగాకల, సుందరః = సుందరబాహుస్వామి, సన్నత్యా = నమస్కృతి మాత్రముచే, క్షణాత్ = క్షణకాలమున, క్షమతే = క్షమించుచున్నాడు.

ఇందు కూరేశులు **"యద్బ్రహ్మకల్పనియుతానుభవ్యేఽప్యనాశ్యం తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే"** అనునట్లు బ్రహ్మకల్పమువరకు అనుభవించినను తీరని పాపములను సైతము క్షమించు సుందరబాహుస్వామి క్షమాగుణవైభవమును స్తుతించుచున్నారు. ఒక్కొక్క పాపఫలము పదివేల కల్పకాలము అనుభవించినను తీరనిది – అనునట్టి పాపములను పెక్కింటిని నిత్యము ఈ లోకములోని జీవులు చేయుచున్నారు. అట్టి మహాపాపిజనములనుకూడ సుందరబాహుస్వామి వారినుండి ఒకేఒక్క ప్రణామమును గ్రహించుటద్వారా క్షమించుచున్నాడు. ఆహా! స్వామి కృపాగరిమ!

**(సన్నత్యా క్షణాత్ క్షమతే) – "ప్రణిపాతప్రతీకార స్సంరంభో హి మహాత్మనామ్"** అని కాళిదాసు పల్కినట్లే, ప్రణిపాత (నమస్కార) మాత్రమే అలంబనముగా గ్రహించి, క్షణములో స్వామి తన క్షమకు ఆశ్రితులను లక్ష్యము చేయును.

**"ఉపచితైః"** అనుటద్వారా సంచితపాపములు తెలుపబడినవి. **"సుసన్నమ్"** అనునది – **"క్షామ్యస్యహో తదభిసంధివిరామమాత్రాత్"** అనుచు వైకుంఠస్తవములో కూరేశులు పల్కిన రీతిలో తిరిగి పాపములను చేయరాదను నిశ్చయమును చేసికొని, ఉత్తరకృత్యమును సరిగా నిర్వర్తించునట్లు భగవత్కటాక్షమును పొంది, నిర్వేదపూర్తిని కల్గినవానిని నిర్దేశించును – అని వ్యాఖ్యానాంతరము. **''జనమ్''** అను నిర్విశేషప్రయోగము **"అనాలోచితవిశేషాశేషలోకశరణ్య"** అనుచు శ్రీరామానుజులు శరణాగతి గద్యలో అనుగ్రహించినట్లుగా "ఎర్రై ఏదలన్ కీళ్ మకన్" అని లెక్కింపక, **"యావరుమ్ వన్దడి వణజ్గ"** అనునట్లు అందఱు వచ్చి, ఆశ్రయించునట్లున్న స్థితిని తెలుపును. **"స తం నిపతితం భూమౌ"** అను రీతిలో అలసి సొలసి భూమిపైపడిన కాకాసురుని శరణాగతునిగా భావించి, రక్షించినవాడుకదా స్వామి. **"సన్నత్యా"** అనునది శరణాగతిని తెల్పును. **"రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** అనునట్లు చేతనుని ఆపేక్షను స్వామి ఎదురుచూచును కదా! లేనిచో సర్వముక్తి – నిత్యముక్తి ప్రసంగములు ఏర్పడును. భగవానునకు వైషమ్య. నైర్ఘృణ్యదోషములును ప్రాప్తించును. **"క్షణాత్ క్షమతే"** అనునది ఈ శరణాగతికి వేఱొక ఉపాయముల ఆపేక్ష లేకుండుటను, ఆశ్రితులను రక్షించుటలోని స్వామి తహతహను, ఆసక్తిని తెలుపును. **''సన్నత్యా''** అను ఏకవచనముద్వారా సకృన్నమస్య సూచింపబడినది – అని వ్యాఖ్యానాంతరము. వృత్తము శార్దూలము.

**30. యజ్జాతీయో యాదృశో యత్స్వభావః**
**పాదచ్ఛాయం సంశ్రితో యోఽపి కోఽపి ।**
**తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః**
**శ్లిష్యతేనం సుందరో వత్సలత్వాత్ ॥**



యజ్జాతీయః=దేవమనుష్యాది ఏజాతికిచెందినవాడైనను, యాదృశః = ఎట్టివాడైనను, యత్స్వభావః = ఎట్టి స్వభావమును కలవాడైనను, యః అపి కః అపి = వీడు ఇట్టివాడని నిర్దేశించుటకు వీలుకానివాడైనను, పాదచ్ఛాయం = (సుందరబాహుస్వామి) పాదముల నీడను, సంశ్రితః (చేత్) = ఆశ్రయించిన వాడైనచో, ఏనమ్ = ఇట్టివానినికూడ, వత్సలత్వాత్ = (అతనిపట్లగల) వాత్సల్యమువలన, సుందరః = సుందరబాహుస్వామి, తజ్జాతీయః = ఆ జాతికి చెందినవాడై, తాదృశః = వారి పుట్టుకవంటి పుట్టుకను కలవాడై, తత్స్వభావః = అట్టి స్వభావమునే కలవాడై, శ్లిష్యతి = కలసి వర్తించుచున్నాడు.

భగవానుడు తన భక్తులతో ఎట్టి తారతమ్యమును లేకుండ కలసి వర్తించు గుణవిశేషమును ఇందు, తరువాతి శ్లోకములోను కూరేశులు స్తుతించి, ఆనందించుచున్నారు. ఇందు **"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"** అను గీతాసూక్త్యర్థము అనుసంధింపబడు తీరు మనోహరము. **"ఎక్కుఱ్ఱవాళర్ ఎదుపిఱప్పేదియల్వాక నిన్ఱోర్"** అనునట్లు భక్తులు ఎట్టివారై యున్నను, **"కాదమ్ పలవుమ్ తిరిన్దుఴన్ఱేర్కు అజ్గోర్ నిఴలిల్లై, ఉన్ పాదనిఴలల్లాల్ మఱ్ఱోరుయిర్ ప్పిడమ్ నానెజ్గుమ్ కాణ్గిన్డిలేన్ తిరుమాలిరుమ్శోలై ఎన్దాయ్"** అని పెరియాళ్వార్లు వంటివారు అనుసంధించి పాదచ్ఛాయలో ఒదిగియున్నపుడు, వాత్సల్యము కారణముగా తానుకూడ వారితో సమానమైన పుట్టుకను, స్వరూపస్వభావములను, శీలాదులను కలవాడై కలసి ప్రవర్తించును – అని ఇందు పల్కుచున్నారు. **"పూర్వస్మిన్ శ్లోకే అపరాధసహిష్ణుతా క్షాంతి రితి పర్యవసితమ్, అస్మిన్ శ్లోకే దోషేష్వపి భోగ్యతాబుద్ధిః వాత్సల్య మితి పర్యవసితమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అనగా ముందు శ్లోకములో అపరాధమును సహించుట అనెడి క్షమాగుణము, ఇందు దోషములను సైతము భోగ్యములుగా గ్రహించుట అనెడి వాత్సల్యగుణమును కీర్తింపబడినవని భావము.

**(యజ్జాతీయః)** – దేవమనుష్యాది జాతులలో ఏ జాతికి చెందినవాడైనను,
**(యాదృశః)** – ఎట్టి ఆచారమును కలవాడైనను,
**(యత్స్వభావః)** – ఎట్టి జ్ఞానమును కలవాడైనను,
**(యోఽపి కోఽపి)** – అభిజన – విద్యా – వృత్తాదులలో ఎట్టివాడైనను,
**(పాదచ్ఛాయం సంశ్రితః)** – **"నివాసవృక్ష స్సాధూనామ్"** అని కీర్తింపబడినట్లు ఆశ్రితులకు నివాసవృక్షమువంటి స్వామిపాదమూలచ్ఛాయను ఆశ్రయించినవాడైనచో అని భావము. **"పాదసన్నిధానసమాశ్రయమాత్రం పర్యాప్త మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(ఏవం సుందరః వత్సలత్వాత్) – ''వత్సం లాలయతీతి వత్సల ఇతి నిర్వచనానుగుణ్యేన – దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్ – ఇతి సదోషేష్వపి**

**సమాశ్రితేషు ప్రీతిమత్త్వాత్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అనగా, అపుడే పుట్టిన దూడను తల్లి ఆవు నాలుకతో నాకి, లాలించుగుణమే వాత్సల్యమను నిర్వచనానుసారము, **"దోషో యద్యపి తస్య స్యాత్, సతా మేత దగర్హితమ్"** అనునట్లు దోషము లతనియందుండవలెను. ఇట్లుండుట సత్పురుషులకు సమ్మతమే – అనునట్లు దోషములుగల భక్తుల పట్లగల ప్రీతిచే – అని భావము.

**(తజ్జాతీయః తాదృశః తత్స్వభావః సన్) – "అహం వో బాంధవో జాతః", ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** అని ఇత్యాదిగా పల్కు రీతిలో ఆశ్రితుల ఆయా జాతి – విద్యా – వృత్తాదులకు అనుగుణమైన జాతి – విద్యా – వృత్తాదులను కలవాడై, ఎట్టి తారతమ్యమును లేకుండ కలసి, ప్రవర్తించును. ఎదుటివానికి చెందిన జాతి – ఆచార – స్వభావములందు పలు దోషములున్నను, వారితో కలసి వర్తించుట అసంగతము కదా! అను ప్రశ్నకు తావు లేకుండునట్లు **"వత్సలత్వాత్"** అను పదమును ఇచట కవి ప్రయోగించిరి. దోషములను అనాదరించుటయే కాక, వానిని గుణములుగా తలచు స్నేహవిశేషము భగవానునకు ఆశ్రితులపట్ల కలదు కావున ఇది అసంభావితము ఏమాత్రము కాదని భావము.

వాత్సల్యగుణమును **"అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే"** అను కఠోపనిషత్ సూక్తి నిర్వచించుచున్నదని దేశికులు స్తోత్రభాష్యములో తెలిపిరి. అందఱికంటె అధికుడైన భగవానుడు **"ఊనక్కురమ్బై"** అనునట్లు నిహీనమైన జీవుని దేహములో ప్రవేశించి, అంగుష్ఠమాత్రుడై ఉండుటకు ఏమి కారణము? ఏదైన ఒక సమయమును చూచి ఇతనిని ఉద్ధరించి, తరింపజేయవలెనను భావమేకదా. కారణము. ఇట్లున్నను, "అత్యంతము హీనమైన చోట ఉన్నాను" అను జుగుప్సను భగవానుడు పొందుటలేదు. – దీనినే ఆళ్వార్లు – **"పొయ్‌న్నిన్ఱ ఞానముమ్ పొల్లా ఒழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱనీర్మై ఇనియా ముఱామై ఉయిరళిప్పాన్ ఎన్నిన్ఱ యోనియుమాయ్ పిఱన్దాయ్! ఇమైయోర్ తలైవా!"** అనుచు సాశ్చర్యముగా పల్కిరి. ఈ అర్థమే ఈ శ్లోకమున ఇంచుమించుగా ప్రతిపాదింపబడినదని వ్యాఖ్యానాంతరము. **"తద్యథా తరుణవత్సా వత్సం, వత్సో వా మాతరమ్"** ఇత్యాది రహస్యామ్నాయసూక్తి, **"వత్సం గౌ రివ వత్సలా"** ఇత్యాది మహర్షివచనములును వాత్సల్యగుణమును వివరించుచున్నవి. పరాశరభట్టర్ **"వత్సలః"** అను (473) నామమును వివరించుచు **"స హి చిరం పరిచీయమానేష్వపి శరణాగతేషు కస్యాపి హేతోః సద్యః ప్రసూతేష్వివ వత్సేషు సహుంకారాః సపయఃసంస్నవవేదనాః కింకర్తవ్యతాకులధేనవ ఇవ సంభ్రామ్యతి ఇతి రావణేఽపి ప్రసిద్ధమ్. విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సల ఇతి"**. అని పల్కుటనుబట్టి, **"కున్ఱనైయ కుற்றమ్ శెయ్యినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** ఇత్యాది దివ్యసూరిసూక్తుల స్వారస్యమునుబట్టి **"న తతో విజుగుప్సతే"** ఇత్యాది



శ్రుతిప్రయోగములను బట్టియు వాత్సల్యము అనగా దోషములను గణింపకుండుట మాత్రమే కాదు. దోషములను భోగ్యములుగా తలచు ప్రీతివిశేషము కూడ – అని చెప్పుట యుక్తమని అభిజ్ఞులగు ఆచార్యులు నిర్ణయించిరి. వృత్తము శాలిని. **"శాలిన్యుక్తా మ్తౌ తగౌ గోఽబ్ధిలోకైః"**– అని లక్షణము. **"ఎన్‌కణ్ పాశమ్‌వైత్త పరఞ్జుడర్ శోదీ"** అనునట్లు భగవానునకు గొప్ప ఔజ్జ్వల్యమును కల్గించు వాత్సల్యగుణమును ప్రకాశించునది అని అర్థమిచ్చు **"శాలినీ"** అను నామమునుకల వృత్తవిశేషముతో కీర్తించుట విశేషము.

**31.** **నిహీనో జాత్యా వా భృశ మకుశలై ర్వా స్వచరితైః**
**పుమా న్వై యః కశ్చి ద్బహుతృణ మపి స్యా దగుణతః ।**
**భజంతం తం పశ్యే ద్భుజగపతినా తుల్య మపి యో**
**వనాద్రిప్రస్థ స్స మమ శరణం సుందరభుజః ॥**

జాత్యా = జన్మచే, నిహీనః వా = మిక్కిలి తక్కువవాడు కావచ్చును, అకుశలైః = మంచిని కల్గింపని, స్వచరితైః = తన నడవడికలచే, భృశం నిహీనో వా = మిక్కిలి హీనుడు కావచ్చును, యః కశ్చిత్ పుమాన్ = (అట్టి) పేరుపెట్టి పిలువతగని ఏ మానవుడు, అగుణతః అపి = (నిహీనః) గుణహీనతచే నిహీనుడు కావచ్చును, బహుతృణం వై = తృణమువలె అత్యల్పుడైనను, శ్రయంతం (భజంతం) = శరణుపొందుచున్న, తం = అతనిని, భుజగపతినా = నిత్యసూరులలో గొప్పవాడగు ఆదిశేషునితో, తుల్యం = సమానునిగా, యః = ఏ భగవానుడు, పశ్యేత్ = కటాక్షించునో, వనాద్రిప్రస్థః = వనాద్రిలోని సానువులో నివాసమును కల్గిన, సః = అట్టి సౌశీల్య (సామ్య) గుణమునుకల, సుందరభుజః = సుందరబాహుస్వామి, మమ = నాకు, శరణం = శరణము.

కూరేశులు ఈ శ్లోకములో సుందరబాహుస్వామికి గల సమత్వమను మహాగుణమును అనుభవించుచున్నారు. సమత్వమనగా – మందబుద్ధులతో, అన్ని విధముల తక్కువ వారితోకూడ మహాత్ములతోవలె సమానముగా కలసి ప్రవర్తించుట. ఈనాడు ఆశ్రయించిన నిత్యసంసారులలో కట్టకడపటివానినికూడ, గరుడ, శేష, శేషాశనాదులతో సమానముగా అనుగ్రహించుట అనెడి ఈ గుణమును ఇందు ప్రస్తుతించుచున్నారు – అని ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. **"సామ్య"** గుణమునుగూర్చి పూర్వము చూపిన వివరణ మిచట స్మరణీయము. **"మహతో మందై స్సహ నీరంధ్రేణ సంశ్లేషరూపం సౌశీల్య మపి సుందరభుజోఽత్యంతాసదృశ మితి, మందస్య మమ స ఏవ శరణ మితి"** అనుచు ఈ శ్లోక తాత్పర్యమునుగూర్చి శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో తెలుపబడుటచే ఇందు సౌశీల్యగుణము స్తుతింపబడినదనియు చెప్పవచ్చును. **(యః కశ్చిత్ పుమాన్) – ''కశ్చిత్**

**కాంతావిరహగురుణా"** అనునట్లు పేరుతో వ్యవహరింపతగని అవ్యపదేశ్యుడు. **"నామగ్రహణాయోగ్యోஉపి గుణతోஉపి నిహీనః". (జాత్యా వా......స్యా దగుణతః బహుతృణమ్)** జాతిచే కాని, చెడ్డ ప్రవర్తనచే గాని అధముడు. గుణరాహిత్యమువలన తృణప్రాయుడు. ఈవిధముగా సర్వాత్మనా అధముడు. అయినను–

**(భజంతం తం భుజగపతినా తుల్య మపి యః పశ్యేత్)** – భగవద్భజనము అను గుణమొక్కటి ఉన్నచో, అతనిని ఆదిశేషునితో సమానముగా ఎవరు కటాక్షింతురో, అనగా – ఆదిశేషుడు చేయునట్టి కైంకర్యములన్నిటిని అతనినుండి ఎవరు అనుగ్రహించునో, **(సః వనాద్రిప్రస్థస్థః సుందరభుజః మమ శరణమ్)** – అట్టి సుందరబాహుస్వామి నాకు శరణము.

ఇచట కూరేశులు **"ఏழை ఏదలన్ కీழ் మకన్ ఎన్నాదు ఇరజ్గి మற்றవర్క్కు ఇన్నరుళ్ శురన్దు. వాదమామకన్ మర్క్కడమ్ విలఙ్గు మற்றోర్శాది ఎన్దు ఒழிన్దిలై"** అనుచు తిరుమఙ్గై ఆழ்వార్లు సాయించిన సూక్తి భావమును దృష్టిలో నుంచుకొని ప్రస్తుతశ్లోకమును రచించిరి – అని భావించినచో **"మహతో మంద్తె స్సహ"** ఇత్యాది సౌశీల్య గుణమిందు ప్రస్తుతమని చెప్పనగును. అట్లుగాక **"సమోஉహం సర్వభూతేషు"** ఇత్యాదిగాగల సూక్తుల భావము అనుసంధింపబడినదనినచో సామ్యగుణము కీర్తిత మనదగును. ఈ సామ్యగుణమును దేశికులు **"జాతిగుణవృత్తాదినిమ్నోన్నతత్వానాదరేణ సర్వై రాశ్రయణీయత్వం సామ్యమ్"** అని నిర్వచించుటయే గాక, దీని లక్ష్య మనదగిన **"నిషాదానాం నేతా కపికులపతిః కాஉపి శబరీ కుచేలః కుబ్జా సా వ్రజయువతయో మాల్యకృదితి, అమీషాం నిమ్నత్వం వృషగిరిపతే రున్నతి మపి ప్రభూతైః స్రోతోభిః ప్రసభ మనుకంపే సమయసి"** అను శ్లోకరత్నమును దయాశతకమున అనుగ్రహించిరి. జన్మతః తక్కువవాడు గుహుడు. "ఇతడు నన్ను రక్షింపగలడా? రక్షింపలేడా?" అని శ్రీరాముని సందేహించి, "సాలవృక్షములను కూల్చునా? దుందుభి ఎముకల గుట్టను ఎగురగొట్టునా?" అనుచు పరీక్షించియు, భాతృపత్నీగమనము చేసియు, తాను మాట ఇచ్చిన సమయమున సీతాదేవి అన్వేషణము కొఱకు సేనను పంపుటను మఱచియు – ఇట్లు సదాచారరహితుడైనవాడు సుగ్రీవుడు. ఈ విధముగానే శ్లోకములోని మిగిలినవారి విషయముననను భావింపనగును. **"దురాచారోஉపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా, సమాశ్రయే చాదిదేవం శ్రద్ధయా శరణం యది, నిర్దోషం విద్ధి తం జంతుం ప్రభావా త్పరమాత్మనః"** అను సూక్తి భావము ఈ శ్లోకభావమునకు అనుగుణముగా అనుసంధేయము. **"బహుతృణమ్"** అనునపుడు అల్పమైన ఔపమ్యార్థమున **"బహుస్"** ప్రత్యయము వచ్చినది.



**"భజంతమ్"** అనుటకు బదులు **"శ్రయంతమ్"** అని పాఠాంతరము. **(భజంతమ్) – "మా మేకం శరణం వ్రజంతమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(భుజగపతినా తుల్యమ్) – "నివాసశయ్యాసనపాదుకాంశుకేత్యారభ్య, యథోచితం శేష ఇతీరితే జనై రితి శేషత్వసీమాభూమితయోక్తశేషేణాஉపి తుల్యం పశ్యేత్, త్వ మస్మాకం చతుర్ణాం వై భ్రాతా సుగ్రీవః పంచమః – ఇతి శేషావతారయాప్రతీతలక్ష్మణతుల్యయోగత్వేన, సుగ్రీవానుగ్రహోஉత్రాభిప్రేతః, సుగ్రీవే చ – వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః – ఇతి శంకనీయం శాఖామృగజాతీయత్వం, భ్రాతృభార్యాగమనవృత్తహానిః, తద్ధేతుభూతాజ్ఞానం చ ద్రష్టవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శిఖరిణి

**32. ఏకైకమంగళగుణానుభవాభినంద –**
**మీదృక్త్వియా నితి చ సుందరదోష్ణి కృష్ణే ।**
**తే యే శతంత్వితి నియంతుమనాః శ్రుతి ర్వై**
**నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥**

సుందరదోష్ణి = సుందరబాహుస్వామి అగు, కృష్ణే = శ్రీ కృష్ణభగవానునియందు, ఏక + ఏవ = ఒక్కటే అయిన, మంగళగుణ = కల్యాణగుణములోని, అనుభవ = అనుభవాతిశయముచే కల్గు, అభినందమ్ = ఆనందమును, ఈదృక్ = ఇట్టిది, ఇయాన్ ఇతి చ = ఇంతటిది అనియు, తే యే శతమ్ = అవి ఏవి నూఱు రెట్లుండునో, ఇతి చ = అనియును, నియంతుమనాః = పరిచ్ఛేదింపగోరిన, శ్రుతిః = ఆనందవల్లి, ఏషః = ఈ ఆనందగుణము, వాఙ్మనసః = మాటకు, మనస్సుకు, గోచరః న = గోచరింపదు, ఇతి = అని, ఉదాహ వై = ఉద్ఘోషించుట ప్రసిద్ధము కదా!

పూర్వము కూరేశులు ఒక్కొక్క శ్లోకమున ఒక్కొక్క కల్యాణగుణమును కీర్తించిరి, వేద పురుషుడును **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అనుచు ఆనందగుణమును పరిచ్ఛేదింపలేక, వెనుదిరిగిన విషయమును తెలుపుటద్వారా కూరేశులు ఆవిధముగానే తాము వెనుదిరుగవలసియున్న స్థితిని ఇందు ప్రకటించుచున్నారు. శ్రీవైకుంఠస్తవములోని **"త్వయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘైః"** ఇత్యాదిశ్లోకము, ఈ శ్లోకమును ఇంచుమించుగా అర్థమున సామ్యమును కల్గియున్నవి. రెండిటియందు – **"నైవైషవాఙ్మనసగోచర ఇత్యుదాహ"** అనునదియే నాల్గవపాదముగా నుండుటయును గమనింపతగినది.

**(సుందరదోష్ణి కృష్ణే)** – అసంఖ్యేయ కల్యాణగుణగణనిధియగు సుందరబాహుస్వామియందు,

**(ఏకైకమంగళగుణానుభవాభినందమ్)** – ఒక్కొక్క కల్యాణగుణమును అనుభవించుటవలన కల్గిన ఆనందమును –

**(ఈదృక్ ఇయా నితి నియంతుమనాః శ్రుతి స్తు)** – ఇట్టిది అని, ఇంతటిది అని పరిచ్ఛేదించి, పల్కుటకు ప్రయత్నించిన వేదము – **(ఏషః వాఙ్మనసగోచరః నైవ ఇతి ఉదాహ)** – ఇది మాటకు, మనస్సుకు అందనే అందదు అనుచు ఉద్ఘోషించినది. స్తోత్రరత్నములోని **"ఉపర్యుపర్యబ్జభవోఽపి"** అను శ్లోకమును, శ్రీరంగరాజస్తవములోని – **"మర్త్యోత్థాయం విరించావధికమ్"** అను శ్లోకమును ప్రకృతమునకు అనుగుణముగా అనుసంధేయములు. తైత్తిరీయ – ఆనందవల్లి – **"సైషాఽఽనందస్య మీమాగ్ంసా భవతి, యువా స్యాత్ సాధు యువాధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్, న ఏకో మానుష ఆనందః, శ్రోత్రియస్య చాఽకామహ తస్య, తే యే శతం మనుష్యగంధర్వాణా మానందాః"** అను క్రమమున, దేవ, గంధర్వ, పితృ, చిరలోకలోక, దేవ, ఆజానజదేవ, కర్మదేవ, ఇంద్ర, బృహస్పతులపర్యంతము గణించి, **"తే యే శతం ప్రజాపతే రానందాః స ఏకో బ్రహ్మణ ఆనందః"** అని బ్రహ్మానందమును నిర్ధారించినను, తిరిగి వెంటనే **"తే యే శతం బ్రహ్మణ ఆనందాః"** అని పల్కి **"యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్"** అనుచు పూర్తిగా లెక్కింపలేక వెనుకకు తిరిగినది. ఈ శ్రుతిలో ఏకశబ్దప్రయోగము చేయబడుటచే ఒక్కొక్క గుణానుభవమువలనకల్గు ఆనందము అపరిచ్ఛిన్నమనునది శ్రుతిహృదయమని భావము – **"స ఏకో బ్రహ్మణ ఆనందః – ఇతి ఏకశబ్దప్రయోగా దేకైకగుణానుభవజనితానంద ఏవాఽపరిచ్ఛిన్న ఇతి శ్రుతిహృదయ మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**33. అబ్జపాద మరవిందలోచనం పద్మపాణితల మంజనప్రభమ్ ।**
**సుందరోరుభుజ మిందిరాపతిం వందిషీయ వరదం వనాద్రిగమ్ ॥**

అబ్జపాదమ్ = తామరలనుపోలిన పాదములను కలవాడు, అరవిందలోచనమ్ = ఎఱ్ఱతామరలవంటి కన్నులను కలవాడు, పద్మపాణితలమ్ = తామరలవంటి హస్తములను కలవాడు, అంజనప్రభమ్ = కాటుకవర్ణమువంటి వర్ణమును కలవాడు, ఇందిరాపతిమ్ = లక్ష్మీవల్లభుడు, వనాద్రిగమ్ = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును చేరినవాడు, వరదమ్ = కోరిన వరములను ఇచ్చువాడు అగు, సుందరబాహుమ్ = సుందరబాహుస్వామిని, వందిషీయ = సేవింతుము.

ఇంతవరకు సుందరబాహుస్వామి కల్యాణగుణకీర్తనమును చేసిన కూరేశులు, ఇక దివ్యమంగళవిగ్రహసౌందర్యలావణ్యానుభవములో ప్రవేశింపగోరి, అందులకు ఉపోద్ఘాతముగా ఈ శ్లోకమును సాయించిరి. ఇందు అబ్జ, అరవింద, పద్మమనునవి (శబ్ద)



రూపతః భిన్నములే అయినను వాని అర్థమున భేదము లేదు. తిరునెడున్దాణ్డక ప్రబంధములో – **"కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్ పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిన్దమ్"** అనుచు తిరుమఙ్గైమన్నన్ పల్కిన క్రమములో కూరేశులు ఈ శ్లోకమును రచించిరి. **"శెన్దామరై త్తడఙ్గణ్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్ శెన్దామరైయడిక్కళ్"** అనుచు నమ్మాళ్వార్లు ఒకే పదముతో నిర్దేశించుటయు కలదు. అనుభవరసికుల క్రమము ఒకే విధమునుండుట సహజమే కదా! ఎట్లు పల్కినను – **"కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై యొవ్వా"** అనుచు శఠకోపులు నిశ్చయించినట్లు నిరుపమానముగా కదా స్వామిదివ్యాంగములుండును! ఈ స్తుతిలోనే పైన – **"అబ్జం తు కథం నిదర్శనమ్"** అని కూరేశులే పల్కిరి కదా! అట్లయిన, ఈ విధముగా ఉపమానప్రయోగముతో నిర్దేశించుట ఏమి? అనినచో, ఏదో ఒక విధముగా సామ్యమును పల్కి, వర్ణించుచు, కాలక్షేపమును చేయవలెను కదా! ఊరకనే మాటలాడకుండనుండుటకు సాధ్యము కాదు కదా! "దానివలెనుండును, దీనివలెనుండును" అనుచు భగవత్కీర్తనము చేయుటయు ఒక విధమైన అనుభవమే కదా! అని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య.

**"తతోఽపి తత్ప్రియతరమ్ రూపం యదత్యద్భుతమ్"** అను యామున సూక్తిచొప్పున భగవానుని రూపము. దివ్యాత్మస్వరూపముకంటె భగవానునకు మిక్కిలి, ప్రియము, ఆశ్చర్యకరమును.

**(అబ్జపాదమ్)** – తామరలవంటి అందమైన పాదములను కలవాడు.

**(అరవిందలోచనమ్)** – **"అరవిన్దమ్ పోన్ద నీణ్డ కణ్ణనై"** అనునట్లు అరవిందలోచనుడు.
**(పద్మపాణితలమ్)** – పద్మమనదగినట్లున్న శ్రీహస్తమును కలవాడు, లేక, పద్మమును చేతిలో ధరించిన వాడనియు చెప్పనగును. తిరుమఙ్గైమన్నన్ అష్టభుజస్వామిని స్తుతించు దశకములో – **"శెమ్బొనిలఙ్గు ఒణ్ మలర్ పఱ్ఱి"** 2-8-3 – అని పల్కుట ఇందులకు ఉదాహరణము.

**(అంజనప్రభమ్)** – **"మైప్పడిమేని"** అని కీర్తించిన రీతిలో స్వామి శరీరవర్ణము కాటుకరంగు. **"అఞ్జన వణ్ణనై"** అని, **"అఞ్జనమ్ పురైయు న్తిరువురువనై"** అనియు ఇట్లు పలువురు దివ్యసూరులు పలుమార్లు ఈ వర్ణము సొబగును పొగడిరి.

**(సుందరోరుభుజమ్)** – అందమైన, దీర్ఘములగు బాహువులను కలవాడు.

**(ఇందిరాపతిమ్)** – **"తిరుమకళార్ తనిక్కేళ్వన్"** అనునట్లు లక్ష్మీవల్లభుడు.

**(వనాద్రిగమ్ వరదమ్ వందిషీయ)** **"వనాద్రిగమ్, అత ఏవ వరదమ్"** అనుచు హేతుగర్భవిశేషణముగా అన్వయింపనగును. **"వనాద్రిగ అత ఏవ వరదతాయాం హేతు రితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య **"అత్యంతభోగ్యవిగ్రహో వనాద్రినాథ ఏవ వరప్రేప్సుభిః ఉపాస్య ఇతి భావః"** అనియు అచటి వివరణము. హస్తగిరిలోని వరదరాజస్వామి వనాద్రిలో

సుందరబాహువుగా సేవను అనుగ్రహించుచున్నాడు కాబోలు! దివ్యసూరులు **"నావాయుళానై నత్తైయూరిల్ కణ్డేనే"** అని, **"విరైయార్ పొల్ వేఙ్గడవన్ నీళ్‌మదిళ్ అరఙ్గత్తమాన్"** అనియు, **"తేన్ కొణ్డశారల్ తిరువేఙ్గడత్తానై నాన్ శెన్తు నాడి నత్తైయూరిల్ కణ్డేన్"** అనియు, **"నిన్తవూర్ నిత్తిలత్తై క్కణ్డదు నాన్ కడన్‌మల్లైత్తలైశయనత్తే"** అనియు ఒక దివ్యదేశములోని అర్చామూర్తిని వేఱొక దివ్యదేశములో దర్శించినట్లు పలుకుట కలదుకదా! ఆ విధముగానే ఇచటను కూరేశులు పల్కిరి. కావున, సర్వాంగసుందరుడగు వరదుని వనాద్రిలో సేవించగల్గితిమి – అని తాత్పర్యము.

తాము పుట్టిన ఊరగు కూరమునకు సమీపములోనున్నవాడు అగుటచే కంచిలోని వరదరాజస్వామి సమస్తదివ్యదేశములలో అర్చామూర్తిగా సేవను అనుగ్రహించెను. కావున ఆ వరదుడే ఇచట తిరుమాలిరుమ్‌శోలైలో వేంచేసియున్నాడు – అని కూరేశులు భావించుచున్నారు కాబోలు అని వ్యాఖ్యానాంతరము. ఈ విధముగానే, ఈ స్తోత్రములో ముందు **"హరితవారణభృత్యసమాహ్వాయం కరిగిరౌ వరద స్త్వ మపూర్వికామ్, దృశ మలంభయ ఏవ హి సుందర! స్ఫుట మదా శ్చ పరశ్శత మీదృశమ్"** అను శ్లోకములో తిరుక్కచ్చినమ్బి వంశస్థులగు హరితవారణభృత్యులకు నేత్రదానము చేసిన వరదుడే వనగిరిలో వేంచేసియున్నాడనిరి. ఈ రీతిలో పరాశరభట్టర్‌కూడ శ్రీరంగరాజస్తవములో వరదుడే శ్రీరంగమునందు శ్రీరంగనాథుని రూపమున శయనించియున్నాడనుచు – **"రంగగృహే శయితమ్ వరద ముదారదీర్ఘభుజలోచనసంహననమ్"** అని పల్కిరి. వృత్తము రథోద్ధత

**34. కనకమరకతాంజనద్రవాణాం మథనసముత్థితసారమేళనోత్థమ్ ।**
**జయతి కి మపి రూప మస్య తేజో వనగిరినందనసుందరోరుబాహోః ॥**

అస్య = ఈ, వనగిరినందన = తిరుమాలిరుమ్‌శోలైలో నున్నవారిని ఆనందింపజేయు, సుందర + ఉరుబాహోః = అందమైన, బలిష్ఠములైన బాహువులనుకల స్వామియొక్క, కనకమరకత + అంజనద్రవాణామ్ = బంగారము, పచ్చ, కాటుక – అను వీని ద్రవములయొక్క, మథన = మథించుటచేత, సముత్థిత = పుట్టిన, సార = సారములను, మేళన = కలుపుటచే, ఉత్థం = జనించినది, కి మపి రూపమ్ = అనిర్వచనీయమైనది అగు దివ్యరూపమునుకల, తేజః = కాంతి, జయతి = సర్వోత్కర్షతో వెలుగొందుచున్నది.

ఇందు కూరేశులు సుందరబాహుస్వామి దివ్యమంగళవిగ్రహలావణ్యశోభను స్తుతించుచున్నాడు.

**(వనగిరినందనసుందరోరుబాహోః)** వనగిరిలో ఆనందించుచున్న ఈ సుందరబాహుస్వామియొక్క – అనియు అర్థము. **(కి మపి రూపమ్)** – పరమవిలక్షణమైన



అనిర్వచనీయమైన తేజస్సు – అని అర్థము. **"కి మపి రూపమ్"** అను దానిని ఒకే పదముగా గ్రహింపనగును. **"అనవ్యయా మవ్యయేన ఇత్యనుశాసనాత్ కి మపి రూప మిత్యేకం పదమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. లేక, వ్యస్తపదముగా గ్రహించినచో, **"తేజః కిమ్ అపి రూపమ్ జయతి"** – తేజోమయమైన ఒక అద్వితీయరూపము ప్రకాశించుచున్నది – అని చెప్పనగును.

**(కనకమరకతాంజనద్రవాణాం.......మేళనోత్థమ్)** – బంగారము, మరకతము, అంజనము – అను వీనిని కఱగించి, ఆ ద్రవములను మూడింటిని ప్రత్యేకముగా మథించి, వడగట్టి, వానిని ఒకటిగా చేర్చినట్లున్నది సుందరబాహుస్వామి దివ్యరూపశోభ. మొదటి పాదము చివరలోని ద్రవశబ్దమును కనక, మరకత, అంజన శబ్దములు మూడింటిలో ప్రత్యేకముగా కలిపి, అనుసంధింపనగును. కనకద్రవము, మరకతద్రవము, అంజనద్రవము – ఈ మూడింటిని అని అర్థము. వీనిని మథించుట అనగా పుటమును పెట్టుట, పిమ్మట వడగట్టి అసారాంశమును తీసివేసి, సారమును ఘనీభవింపజేయుట. అట్లు ఘనీభవింపజేసి, మూడు సారములను ఒకటిగా చేయుటవలన భగవానుని దివ్యదేహలావణ్యము ఏర్పడినది – అని కూరేశులు చమత్కారసూక్తి. మూడు కుండలలో పెరుగును నింపి, వానిని ప్రత్యేకముగా మథించి, వాని సారముగా వెన్నను సమీకరించినట్లే, కనకద్రవ, మరకతద్రవ, అంజనద్రవములను మూడు పాత్రలలో నింపి, చిలికినచో, వానినుండి ఏర్పడు సారములను ఒకటిగా కలపగా సుందరబాహుస్వామి దివ్యమంగళవిగ్రహమయ్యెనని తాత్పర్యము. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో ఈ భావము **"కనకద్రవం, మరకతద్రవమ్, అంజనద్రవం చ ప్రత్యేకం చ స్థాలీషు నిధాయ మథనే కృతే సతి, దధిమథనే కృతే తత్సారభూతనవనీతవత్, సముత్థితతత్తత్సారాంశానాం త్రయాణాం మేళనే కృతే సతి, మిళితసారాంశత్రయస్య రూపం పీతహరితనీలవర్ణేషు ఇద మితి యథా పరిచ్ఛేద్య జ్ఞాతు మశక్యం భవతి, తథా సుందరబాహుదివ్యవిగ్రహసముదాయశోభాఽపి ఏవంరూపేతి పరిచ్ఛిద్య జ్ఞాతు మశక్యా సతీ, సర్వోత్కర్షా భవతీత్యర్థః"** అనుచు తెలుపబడినది.

భగవానుని దివ్యదేహములో బంగారమువలె ప్రకాశించు వర్ణము కలదు. పచ్చ వలె శోభిల్లు వర్ణమును కలదు. అట్లే, కాటుకవలె నల్లని వర్ణముకూడ కలదు. ఇవి మూడును ఒకదాని నుండి వేఱొక దానిని విడదీసి చూచుటకు వీలుకాని విధమున ఒకటిగా కలసియుండును. దీనిని **"మయూరకంఠద్యుతిహేమ"** అను సాముద్రిక శాస్త్ర ప్రమాణమును ఎత్తి చూపి, దేశికులు తెలిపిరి. నెమలికంఠమురంగులో ఈ మూడురంగులు కలిసి ఎట్లు ప్రకాశించునో, ఆ విధముగానే భగవానుని దేహములో ఈ మూడు రంగులు సమ్మిళితములై ప్రకాశించునని పై ప్రమాణభావము. భగవానుని వర్ణము అంజన వర్ణము. లక్ష్మీదేవి

వర్ణము **"హిరణ్మయీమ్"** అన్నట్లు స్వర్ణవర్ణము. భూదేవి వర్ణము మరకతవర్ణము. భూదేవి అవతారరూపమగు గోదాదేవివర్ణము అట్టిదే కదా! ఈ దేవేరులు ఇరువురును భగవానుని చెంతనే ఉందురు. కావున నెమలికంఠవర్ణమువంటి వర్ణమును భగవానుడు కల్గియుండునని ప్రమాణములు తెలుపుచున్నది. దేశికులు గోదాస్తుతిలో – **"దూర్వాదలప్రతిమయా తవ దేహకాంత్యా గోరోచనారుచిరయా చ రుచేందిరాయాః, అసీ దనుజ్ఝితశిఖావలకంఠశోభం మాంగల్యదం ప్రణమతాం మధువైరిగాత్రమ్"** అనుచు పల్కిన శ్లోకరత్న మిచట అనుసంధేయము. **"క్వచి న్న తద్ధేమసమానవర్ణమ్"** అను వాల్మీకివచనము, **"తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్"** అను పేయాళ్వార్ల సూక్తియు ఇచట గుర్తింపతగినవి. జాంబూనదమని స్వర్ణమునకు పేరు. నేరేడుపండురంగువంటి రంగును కల్గినదని దీని అర్థము. ఎనిమిది విధములైన అష్టాపదములలో (స్వర్ణములలో) ఇదియే గొప్పది అని రత్నశాస్త్రప్రమాణములు తెలుపుచున్నవి. అందుచే నిజమైన స్వర్ణమువలె, నిశితముగా గమనించినచో, ఈ మూడు రంగులును ప్రకాశించు స్థితిలో నుండునది స్వామి దేహము – అని తెలియనగును" అని వ్యాఖ్యానాంతరము. వృత్తము పుష్పితాగ్ర.

**35. కిం ను స్వయం స్వాత్మవిభూషణం భవన్ అసా వలంకార ఇతీరితో జనైః ।**

**వర్ధిష్ణుబాలద్రుమషండమండితం వనాచలం వా పరితః ప్రసాధయన్ ॥**

అసౌ = ఈ సుందరబాహుస్వామి, స్వయం = స్వయముగా, స్వాత్మవిభూషణం = తన దేహమునకుతానే అలంకారముగా, భవన్ = అగువాడై, (ఆ కారణము వలననే), జనైః = ఆ దివ్యదేహమును సేవించిన జనులచే, అలంకారః = అలంకారుడని, ఈరితః కిమ్ ను = చెప్పబడినాడా ఏమి? వర్ధిష్ణుబాల = పెరుగుచున్న, లేత, ద్రుమషండమండితమ్ = వృక్ష సమూహముచే అలంకరింపబడిన, వనాచలం = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు, పరితః = నాల్గువైపుల, ప్రసాధయన్ = అలంకరించుచు, ఈరితః వా = (ఇట్లు అలంకారశబ్దముతో) చెప్పబడినాడా ఏమి?

తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామికి అలంకారుడను ఒక నామము కలదు. భట్టనాథులు తమ ప్రబంధమున – **"పలపల నాழ்మ్ శొల్లి పழித్త శిశుపాలన్దన్నై అలైవలైమై త్తవిర్త్త అழகన్ అలఙ్గారన్ మలై తిరుమాలిరుమ్‌శోలైయదే"** అను పాశురములో ఈ నామముతో స్వామిని కీర్తించిరి. ఈ పేరు స్వామికి ఎట్లు కల్గినది! అను విచికిత్సతో రెండు విధములుగా కూరేశులు ఈ శ్లోకమున ఉత్ప్రేక్షించుచున్నారు.

స్వామి దివ్యదేహమునకు వేఱొక అలంకారము అలంకరింపవలసిన పనిలేదు.



స్వామిని ఆశ్రయించియే భూషణాయుధములు అలంకరింపబడుచున్నవి. **"ఆభరణస్యాభరణమ్"** అనునట్లు కదా స్వామి దివ్యాంగములుండును. **"భూషాయుధై రధిగతం నిజకాంతిహేతోః భుక్తం ప్రియాభి రనిమేషవిలోచనాభిః"** అనెడి దేశికుల దైవనాయకపంచాశత్‌సూక్తి ఇచట భావనీయము. ఈ విధముగా స్వామి రూపముండుటచే స్వామికి అలంకారనామము కల్గినదా? లేక, **"వళరిళమ్ పొழில்"** అనుచు శఠకోపులు పల్కిన రీతిలో నాల్గు వైపులనున్న వనగిరిలోని తోటలను అలంకరించుటచే ఇట్లు స్వామికి అలంకారనామము ఏర్పడినదా? – అనునవి ఆ రెండు ఉత్ప్రేక్షలు. లేక, ఇచట స్వామికి గల అలంకారనామము ప్రకారాంతరమున చమత్కారముగా నిర్వచింపబడుటచే నిరుక్తి అలంకారమనియు చెప్పవచ్చు.

**(కిం ను స్వయం స్వాత్మవిభూషణం భవన్)** – ఆభరణాదులచే అందమును పొందనక్కఱలేకుండ, తనకు తానే అలంకారమై యుండుటచే – ఈ అలంకారనామము స్వామికి కల్గినదా! అని భావము. ఆత్మశబ్ద మిచట దేహమును బోధించును. **"ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మచ"** అను అమరము. **(వర్ధిష్ణుబాలద్రుమషండమండితం వనాచలం పరితః ప్రసాధయన్ వా)** – **"వళరిళమ్ పొழில் శూழ்"** అని నమ్మాళ్వార్లు కీర్తించినట్లు నిత్యము వర్ధిల్లు స్వభావమునుకల తోటలను చుట్టును తన కాంతితో అలంకరించుటచేతనా? వరదరాజస్తవములోని **"కర్ణికా తవ కరీశ! కి మేషా"** అను శ్లోకములోని ఉల్లేఖము లిచట ఒక విధముగా అనుసంధేయములు. తనకు తాను అలంకారమగుచేతను, వనగిరికి అలంకారమైయుండుటచేతను అలంకారనామము స్వామికి కల్గెనని శ్లోకపరమతాత్పర్యము. **"స్వస్యైవ భూషణనిరపేక్షం స్వవిగ్రహాలంకారత్వేన వా వనాచలాలంకారత్వేన వేతి ద్వేధా ఉత్ప్రేక్ష్యతే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

వాస్తవమునకు తనను ఆశ్రయించినవారికి **"తన్నై త్తన్ద కఱ్పకమ్"** అనునట్లు, **"వేణ్డిత్తేల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్ వళ్ళల్ మణివణ్ణన్"** అని కీర్తించినట్లు వారు అడిగినవానిని అన్నిటిని సమృద్ధిగా, వారు ఆశించినదానికంటె ఎక్కువగా ఇచ్చువాడగుచు, వారిని **"ఆలమ్"** (చాలును) అనునట్లు చేయుచు, అనుగ్రహించును కావున భగవానునకు అలంకారనామము ఏర్పడినది. ఈ అంశము **"అలమ్పురిన్ద నెడున్దడక్కై అమరర్‌వేన్దన్"** అనెడి తిరునెడున్దాణ్డక సూక్తిద్వారా స్పష్టము. మిగిలిన దేవతలు కాని, ఇహలోకములో ధనికులుగాని భగవానుని అనుగ్రహమువలన ఇచ్చువారు కావున, చేతనులు ఆశించువాని నన్నిటిని వారు ఆశించినంతగా ఇవ్వగల్గిన యోగ్యతను కాని, సమృద్ధిని కాని స్వతః లేనివారు. జీవునకు సర్వాశాపూర్తిని కల్గించి, **"ఆలమ్"** అనునట్లు చేయువాడు భగవానుడొక్కడే.

లోకమున పశుగృహక్షేత్రారామాదులు ఎంతగా ఉన్నను, ఇంకను కావలయునను

భావమే కల్గును. **'అలమ్'** అను బుద్ధి ఏర్పడదు. అన్నమును భుజించినవానికిమాత్రమే ఇక చాలునను తృప్తి కల్గును. కావుననే అన్నమునకు అలంకారమని పేరు. భగవానుని ఒక పర్యాయము సేవించినచో, అన్యవిషయములలో ఆసక్తి నశించి, ఇక అవి చాలునను భావన భక్తునకు కల్గును. ఇట్లు అలంబుద్ధిని కల్గించువాడు కావునను భగవానుడు అలంకార పదవాచ్యుడు. ఇందులకు అనుగుణముగా **"అనుచితపదవీభిః చింతయిత్వా ప్రయాంతాన్యలమలమతిమాత్రత్రాసచింతావిషాదైః"** ఇత్యాది దేశికులసూక్తి భావనీయము. ఇట్లు పలురీతులలో అలంకారుడను సార్థకనామధేయుడు భగవానుడనుటను పూర్వాచార్యులు వివరించినట్లే, ఇచట కూరేశులు రెండు విధముల ఈ నామసార్థక్యమును సమర్థించిరి. వృత్తము – ఉపజాతి

**36.** **సుఖస్పర్శైః నిత్యైః కుసుమసుకుమారాంగసుఖదైః**
**సుసౌగంధ్యైః దివ్యాభరణగణదివ్యాయుధగణైః ।**
**అలంకార్యైః సర్వైః నిగదిత మలంకార ఇతి యః**
**సమాఖ్యానం ధత్తే స వనగిరినాథోఽస్తు శరణమ్ ॥**

సుఖస్పర్శైః = మెత్తని, సుఖమైన స్పర్శను కల్గినవి, కుసుమసుకుమార = పూవువలె సుకుమారమైన, అంగ = పాదాదిశిరఃపర్యంతముకల దేహమునకు, సుఖదైః = సుఖమును ఇచ్చునవి, సుసౌగంధ్యైః = సువాసనను కల్గినవి, అలంకార్యైః = దివ్యదేహమునకు అలంకారములై అమరియున్నవి, సర్వైః = అన్నివిధములైనవి అగు, దివ్యాభరణగణ = అప్రాకృతములగు కిరీట, హారాది ఆభరణగణములు, దివ్యాయుధగణైః = సుదర్శన, పాంచజన్యాది అప్రాకృత ఆయుధములు అను వీనిచే, నిగదితం = తెలుపబడిన, అలంకారః = **'అలఙ్కారః'**, ఇతి సమాఖ్యానం = అను పేరును, యః వనగిరినాథః = ఏ వనాద్రీశుడు, ధత్తే = ధరించుచున్నాడో, సః శరణమ్ అస్తు = అతడు (నాకు) శరణము అగుగాక!

సుందరబాహుస్వామికి అలంకారనామము ఎట్లు ఏర్పడెను? అను విషయమున వితర్కము గతశ్లోకమున చేయబడగా, ఇందు నిష్కర్ష చేయబడుచున్నది. కిరీటమకుట చూడావతంసాది దివ్యాభరణములచేత, సుదర్శనపాంచజన్యాది దివ్యాయుధములచేతను అలంకారమును పొందియుండుటచే స్వామి అలంకారమని పిలువబడుచున్నాడు. అతడే మనకు శరణము – అనుచున్నారు.

శ్రీవిష్ణుపురాణములో అస్త్రభూషణాధ్యాయమను ఒక అధ్యాయము కలదు. అందు భగవానుని దివ్యదేహములోని సర్వాయుధములును, సర్వాభరణములును ఒక్కొక్కటి ఒక్కొక్కతత్త్వమునకు అధిష్ఠానముగా అభిమానించియుండునని తెలుపబడినది. ఈ భూషణాస్త్రములు నిత్యములు. అనగా, భగవానుడు ఏ అవతారమెత్తినను అందులకు తగినట్లు అవియును అవతరించును అని, అన్నియు అలంకారములవంటివి అని, సౌకుమార్యము,



అత్యంతసౌగంధ్యము, ఆశ్చర్యకరమైన కాంతి, అంతులేని సుఖస్పర్శ – అను వీనిని కల్గినవి అని శ్రీపరాశరమహర్షి తెలిపిరి. దీనిని అనుసంధించియే భగవద్రామానుజులు శరణాగతిగద్యలో – **"స్వోచితవివిధవిచిత్రానంతాశ్చర్య – నిత్య – నిరవద్య – నిరతిశయసుగంధ – నిరతిశయసుఖస్పర్శ – నిరతిశయౌజ్జ్వల్య"** అనుచు కిరీటాదులనుగూర్చి పల్కిరి. ఇది అంతయు ప్రస్తుతశ్లోకమున ప్రస్తావింపబడినది. కావున ఇట్లు భూషణాస్త్రములకే అలంకారముగా భగవానుడు వేంచేసి యుండుటచే అతడు అలంకారశబ్దవాచ్యుడు – అని పల్కుట ఇందలి ప్రమేయము. లక్ష్మీదేవివలెనే దివ్యభూషణాస్త్రములును అవతారములన్నిటియందు భగవానుని వెన్నంటియుండుననుటను **"వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుదరాழியుమ్ పల్లాణ్డు, పడైపోర్ పుక్కు ముழఙ్గుమ్ అప్పాఞ్జశన్నియముమ్ పల్లాణ్డే"** అను పెరియాழ్వార్ల సూక్తి, **"శక్తి ర్యస్యైషు దంష్ట్రానఖపరశుముఖవ్యాపినీ యద్విభూత్యామ్"** అను సుదర్శనశతకసూక్తి ఇత్యాదులు తెలుపుచున్నవి. దివ్యాయుధముల స్వరూపస్వభావములను పరాశరభట్టర్ **"సర్వప్రహరణాయుధః"** అను నామమునకు భాష్యమును అనుగ్రహించుచు **"స్వనిష్ఠానాం సర్వానిష్టోన్మూలయితౄణి అసంఖ్యేయాని అమర్యాద సామర్థ్యాని ఆత్మోచితాని అనంతాని ఆభరణవికల్ప్యాని సదా సర్వత్ర సర్వథా సర్వప్రకారసమాశ్రిత సంరక్షదీర్ఘసత్రదీక్షితాని సర్వైశ్వర్యధురంధరాణి అన్యాన్యపి దివ్యాయుధాని"** (ఆశ్రయించిన వారి సర్వానిష్టములను సమూలముగా నశింపజేయునవి, అంతులేనివి, అంతులేని సామర్థ్యమును కల్గినవి, తనకు తగినవి, లెక్కలేనివి, ఆభరణములతో సాటి వచ్చునవి, ఎల్లప్పుడు అంతటా అన్ని విధములా పూర్తిగా ఆశ్రితుల సంరక్షణమను దీర్ఘసత్రమును నిర్వహించుటలో దీక్షబూనివవి, భగవానుని సమస్త ఐశ్వర్యమును భరించునవి అగు మిగిలిన దివ్యాయుధములు) అని వివరించిరి. **"శ్రీవిష్ణుపురాణే సకలతత్త్వానామ్ అస్త్రభూషణత్వ ముక్త మస్త్రభూషణాధ్యాయే......... సర్వజ్ఞా స్సముచితశక్తయ స్సదైవ త్వత్సేవానియమజుష స్త్వదేకభోగాః, హేతీనా మధిపతయ స్సదా కిమేతాన్ శోభార్థం వరద బిభర్షి హర్షతో వా – ఇతి వరదరాజస్తవోక్తరీత్యా సుదర్శనాదీనా మపి భూషణత్వం సర్వపూర్వాచార్యసమ్మతమ్. అత స్స్వవిగ్రహాలంకారతయా ప్రతీతానా మాభరణానా మాయుధానా మపి అతిశయాధాయకతయా వివిధశోభాసమగ్రస్వవిగ్రహతః ఏతేషా మలంకార్యత్వం, స్వస్య అలంకారత్వం చ సిద్ధ్యతీతి భావః"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్యలోని వివరణ మిచట స్మరణీయము. వృత్తము శిఖరిణి పూర్వవలె ఇచటను నిరుక్తి అలంకారము కలదు.

**37.** **మకుటమకుటమాలోత్తంసచూడాలలామ –**
**స్వలకతిలకమాలాకుండలైః సోర్ధ్వపుండ్రైః ।**
**మణివరవనమాలాహారకేయూరకంఠ్యైః**

**తులసికటకకాంచీనూపురాద్యై శ్చ భూషైః ॥**

**38. అసిజలజరథాంగై శార్ఙ్గ కౌమోదకీభ్యామ్**
**అగణితగుణజాలై రాయుధై రప్యథాన్యైః ।**
**సతతవితతశోభం పద్మనాభం వనాద్రేః**
**ఉపవనసుఖలీలం సుందరం వందిషీయ ॥**

మకుట = కిరీటము, మకుటమాలా = కిరీటమును చుట్టియున్న రత్నమాల, ఉత్తంస = కిరీటములోని శిరోరత్నము, చూడాలలామ = గొప్పదైన శిరస్సుయొక్క ఆభరణములు, స్వలక (సు + అలక) = అందమైన ముంగురులు, తిలకమాలా = (ముత్యాలు పొదిగిన, బంగారముతో చేయబడిన) లలాటాలంకారమాల, కుండలైః = కర్ణాభరణములు – అను వీనిచే, సోర్ధ్వపుండ్రైః = ఊర్ధ్వపుండ్రములతోకూడినవి అగు, మణివర = గొప్పరత్నమగు కౌస్తుభము, వనమాలా = వైజయంతీవనమాల, హార = ముత్యాల హారములు, కేయూరకంఠ్యైః = భుజకీర్తులు, కంఠసీమను అలంకరించు కంఠికలు – అను వీనిచే, తులసి = తులసి, కటక = హస్తాభరణములు (ముంజేతి కంకణములు), కాంచీ = మొలనూలు (ఒడ్డాణము) నూపుర + అద్యైః = నూపురములు (అందెలు) మొదలగు, భూషైః = అలంకారములచేతను, అసి = నందకమను ఖడ్గము, జలజ = పాంచజన్యమనెడి శంఖము, రథాంగైః = సుదర్శనమనెడి చక్రము – అను వీనిచే, శార్ఙ్గ = శార్ఙ్గమనెడి విల్లు, కౌమోదకీభ్యాం = కౌమోదకి అనెడి గద – అను వీనిచే, అథ = మరియు, అన్యైః = మిగిలిన ముసల, హలాదులగు, అగణితగుణజాలైః = లెక్కలేని సద్గుణముల సమూహమునుకల, ఆయుధైః = ఆయుధములచేతను, సతత = ఎల్లప్పుడు, వితతశోభం = అంతట వ్యాపించిన శోభనుకలవాడు, వనాద్రేః = తిరుమాలిరుమ్‌శోలైమలైయొక్క ఉపవన = ఉద్యానవనములో, సుఖలీలం = లోకములకును సుఖమును కల్గించు లీలలను చేయువాడు, పద్మనాభం = (లోకమును సృష్టించిన) తామరపూవును నాభియందు కలవాడును అగు, సుందరం = సుందరబాహుస్వామిని, వందిషీయ = సేవింతుము.

ఈ రెండు శ్లోకములకును క్రియాపదము ఒక్కటే కావున ఏకాన్వయమును కల్గియున్నవి. కావున యుగ్మకమనబడును. పూర్వశ్లోకములో **"దివ్యాభరణదివ్యాయుధగణైః"** అనుచు ప్రస్తావించిన ఆయుధాభరణములు రెండిటిలో ముఖ్యములగు కొన్నిటిని స్తుతింపగోరి, ఒక శ్లోకముతో దివ్యాభరణములను, వేఱొక శ్లోకముతో దివ్యాయుధములను పేర్కొని, ఇవి అన్నియును ఆభరణకోటిలోనికి చేరుటను కూరేశులు అనుగ్రహించుచున్నారు. **"దివ్యాభరణగణదివ్యాయుధగణై రిత్యుక్తవర్గద్వయస్యాప్యాభరణత్వం శ్లోకద్వయే నాహ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.



**(మకుటమాలా)** – కిరీటమును చుట్టియుండు రత్నమాల. లేక, పుష్పమాల అని అర్థము. **"కిరీటవేష్టరత్నమాలా, పుష్పమాలా వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(స్వలకతిలకమాలా)** – **"మాలా"** శబ్దమును రెండిటియందు అన్వయించిన **"స్వలకమాలా, తిలకమాలా"** అని అగును. అలకబంధమునకు అలంకరించుకొను ఆభరణము, లలాటమును అలంకరించు ఆభరణము – అని దీని అర్థము. – అని. శ్రీప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"తిలకానాం మాలా తిలకమాలా, మౌక్తికనద్ధాగ్రాణాం సౌవర్ణతిలకానాం లలాటాలంకారభూతానాం మాలా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(కుండలైః సోర్ధ్వపుండ్రైః)** – మకరకుండలములతో, ఊర్ధ్వపుండ్రాలంకారముతో.

**(మణివర)** – **"కురుమామణిప్పూణ్"** అని కీర్తింపబడిన కౌస్తుభము.

**(వనమాలా)** – **"ఆపాదచూడం యా మాలా వనమాలేతి కథ్యతే"** అని నిర్వచింపబడిన వనమాల.

**(కంఠ్యైః)** – కంఠిక – కంఠాభరణము. ద్రావిడమున **"కాఱై"** అని పేరు.

**(తులసి)** – **"మహీ, మహిః"** అను రెండు రూపములున్నట్లే, **"తులసీ, తులసి"** అనురెండు రూపములున్నవి. కావున, హ్రస్వాంత తులసిశబ్దమును సాధువే అగును – అని వ్యాఖ్యానాంతరము. ఇట్లు మొదటి శ్లోకములో ఆభరణములు ప్రస్తావింపబడినవి. ఇక అనంతరశ్లోకములో అయుధగణము ప్రస్తుతింపబడుచున్నది.

**(భూషైః)** – **"భూషా"** శబ్దము స్త్రీలింగము. కావున **"భూషాభిః"** అని ప్రయోగింపవలసియుండగా, **"భూషైః"** అని పుంలింగమున ప్రయోగించుట ఎట్లు? అని సందేహపడవచ్చును. దీనిని గూర్చి శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో – **"వ్యాకరణనిపుణై ర్విచారణీయమ్"** అని తెలుపబడినది. ఇచటి పుంలింగము ఘఞంతము కావున దుష్టము కాదని తెలియనగును – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"నేపథ్యం భూషణం భూషాఽలంకారో భూష ఇత్యపి"** అని రభసనిఘంటు ప్రమాణమును కలదు.

**(సతతవితతశోభం వందిషీయ)** – నిరంతరము వ్యాపించిన సౌందర్యమునుకల సుందరబాహుస్వామిని నమస్కరింతును. ఈ శ్లోకములో దివ్యాభరణములవలెనే దివ్యాయుధములును శోభావహమైయుండుటను కూరేశులు స్తుతించిరి.

అందమైన అలకమాలను. ఊర్ధ్వపుండ్రమును, తులసిని ఆభరణకోటిలోనికి చేర్చుట ఏమి? అనగా – శ్రీరామానుజులు శరణాగతి గద్యలో – **"పీతాంబరకాంచీగుణనూపురాది"** అనుచు పీతాంబరమును ఆభరణములలో చేర్చి పల్కుట వంటిదే ఇదియును. ఆభరణములవలెనే ఇవియును అత్యంతశోభాకరములు కావున అట్లు పఠించిరనదగును.

శరణాగతిగద్యభాష్యములో దేశికులు **'పీతాంబరస్య భూషణతయోక్తిః శోభాతిశయహేతుత్వమహార్హత్వాద్యభిప్రాయా'** అని వివరించుట ప్రకృతమునను అనుసంధేయము. **"నూపురాద్యైః"** అనునపుడు **"ఆద్య"** శబ్దముచే హస్తబంధ, అంగులీయకాదులను గ్రహింపనగును. మొట్టమొదట కిరీటమును ప్రస్తావించుట – భగవానుని సర్వలోకశరణ్యత్వమును కవి స్మరించుటకు సూచకము. ఇతరదేవతలకు ఉష్ణీషాదులు (తలపాగ) మాత్రమే కిరీటము లేదు – అనుట బహుప్రమాణసిద్ధము – అని వ్యాఖ్యానాంతరము. నవరత్నములున్నను, కౌస్తుభమణిని మాత్రము పేర్కొనుటకు కారణము – అది జీవాత్మాభిమాని అగుటచే.

ఈ ఆభరణములు, ఆయుధములును జ్ఞానస్వరూపములు, అనురూపములు, భగవానునకు ఆనందజనకములును, సాటిలేనివి, సంసారగంధము లేని, అభిమానిదేవతలుగా నున్నవి ఇవి. ఈ విషయమును – **"స్రగ్వస్త్రాభరణై ర్యుక్తం స్వానురూపై రనూపమైః, చిన్మయైః స్వప్రకాశై శ్చాన్యోన్యరుచిరంజకైః"** అను పౌష్కర సంహితావచనము తెలుపుచున్నది. కావుననే కూరేశులు ఇచట **"అగణితగుణజాలై రాయుధైః"** అని పల్కిరి. ఆయుధములలో మొదట జలజశబ్దముతో శంఖమును ప్రస్తావించుట ఎందులకనగా – శంఖము మోక్షమునకు నిదానమని ప్రమాణములు తెలుపుచుండుటచేత. దేశికులు గద్యభాష్యములో – **"సృష్టిబీజం తథా పద్మం చక్రం స్థితినిబంధనమ్, గదా సంహారబీజం తు శంఖం ముక్తినిబంధనమ్"** అను పరమసంహితావచనమును ఉదాహరించుట ప్రకృతమునను స్మరింపతగినది. కావుననే నిలుచున్న భంగిమలోనున్న సుందరబాహుస్వామిని **"పద్మనాభమ్"** అని స్తుతించుట, ఇతడే లోకములను సృష్టించి, కాచి, లయమును చేయువాడు అను విషయమును తెలుపుచున్నదనియు చెప్పనగును. వృత్తము మాలిని. మకుటమాల, తిలకమాల, వనమాల, కాంచీమాల, ఆయుధమాల, గుణముల మాలలను వర్ణించు ఈ సందర్భమునకు అనుగుణముగా మాలినీ వృత్తమును ప్రయోగించుటవలన కవి ఔచితీ చాతురి వ్యక్తమైనది.

**39.** **ఆజానజస్వగతబంధురగంధలుబ్ధ –**
**భ్రామ్యద్విదగ్ధమధుపాళిసదేశకేశమ్ ।**
**విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజం**
**హై ! సుందరస్య ! బత ! సుందర ముత్తమాంగమ్ ॥**

ఆజానజ = పుట్టుకతోనున్న (సహజమైన), స్వగత = తనకు చెందిన, బంధుర = దట్టమైన (సమృద్ధిగానున్న), గంధ = సువాసనయందు, లుబ్ధ = మిక్కిలి ఆశను కల్గిన, భ్రామ్యత్ =



(ఆ ఆశవలన) పరిభ్రమించుచున్న, విదగ్ధ = మిక్కిలి రసికులైన, మధుప + ఆళి = తుమ్మెదల సమూహమునకు, సదేశ =సాటియైన, కేశమ్ = ముంగురులను కల్గినది. విశ్వ + అధిరాజ్య = ప్రపంచముకంతటికిని ప్రభువైయుండుటకు, పరిబర్హ = చిహ్నమైయున్న, కిరీటరాజం = గొప్పకిరీటమును కల్గినది అగు, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క ఉత్తమాంగమ్ = శిరస్సు, సుందరం = మిక్కిలి అందమైనది, హై బత = ఎంత గొప్ప ఆశ్చర్యము!

కూరేశులు ఈ శ్లోకము నుండి వరుసగా 3 శ్లోకములలో సుందరబాహుస్వామి వివిధదివ్యాంగములను స్తుతించుచున్నారు. ఇందు ముంగురుల శోభను, కిరీటశోభను ప్రస్తుతించుచున్నారు. పూర్వాచార్య స్తోత్రములలో భగవానుని దివ్యాంగవర్ణనను విస్తృతముగా చేయు ప్రక్రియ కూరేశులు శ్రీకారమును చుట్టిరనుటకు ఈ వర్ణన ఒక సాక్షి. ఈ ప్రక్రియను పరాశరభట్టర్, వేదాంతదేశికాది పూర్వాచార్యులు పలువురు అనుసరించిరి.

**(హై ! బత!)** ఈ రెండు అవ్యయములు సుందరబాహుస్వామి ఉత్తమాంగ దివ్యసౌందర్యమును యథాతథముగా వర్ణింపలేక కవి తడబడుటను తెలుపుచున్నవి. ఆ ఉత్తమాంగము ఎట్టిది? అనుటను రెండు విశేషణములతో కూరేశులు వివరించుచున్నారు. గొప్ప అందమైన ముంగురులను, ఉన్నతమైన కిరీటమును ఆ ఉత్తమాంగము కల్గినది.

**(ఆజానజస్వగతబంధురలుబ్ధభ్రామ్యద్విదగ్ధమధుపాళిసదేశకేశమ్) – "స్వగత"** అనునపుడు స్వశబ్దముచే కేశమును చెప్పనగును**;** ఏల అన **"అజానజ"** అను పదమునుండి **"సదేశ"** అను పదమువరకు కేశమునకే విశేషణమగుటచే. "సహజమైన పరిమళమునందలి లోభముచే చుట్టును భ్రమించుచున్న తుమ్మెదల గుంపువలెనున్న ముంగురులను కల్గినది స్వామి శిరస్సు – అని భావము. **"ఆజానజ"** అనగా ఆరోపితముకాదు, జన్మసిద్ధమని అర్థము. లోకములో కేశములకు ఇతరద్రవ్యములద్వారా సువాసన కల్గింపబడుచున్నది. స్వామి విషయమున ఆ అవసరము లేదు. **"సర్వగంధః"** అని ఉపనిషత్ప్రసిద్ధుడైన భగవానుని కేశములగుటచే, అవి పరిమళమును సహజముగానే కల్గియుండునుకదా! **"బంధుర"** శబ్దమునకు సమృద్ధమని భావము. స్వాభావికమై, సమృద్ధమైన, తనయందు సమృద్ధిగానున్న సువాసనలో లోభమును కల్గినవై, పైన తిరుగుచున్న రసిక భ్రమరపంక్తులతో సాటి అయిన ముంగురులను కల్గినది స్వామి శిరస్సు అని తాత్పర్యము. **"సదేశ"** అనుటకు రెండు విధములైన అర్థములను చెప్పవచ్చును. తుమ్మెదలతో సమానమైయున్నవి, తుమ్మెదలతో సమానాధికరణములై యున్నవి అనునవి – ఆ రెండు అర్థములు. రెండవ అర్థమువలన తుమ్మెదలు ఉత్తమాంగములో నున్నవి – అని ఏర్పడును. మొదటి అర్థమున **"కళివణ్డెజ్గు జ్కులన్దాళ్పోల్ కమళ్పూజ్కుళల్ కళ్ తడన్దోళ్మేల్ మిళిర నిన్ఱు"** అను నాయ్చ్చియార్ తిరుమొళిసూక్తి చొప్పున నల్లని తుమ్మెదలు వాలియున్నవా! అని శంకించునట్లున్న ముంగురులను స్వామి శీర్షము

కల్గియున్నదని స్ఫురించును. సదేశ, సగంధాది శబ్దములు ఉపమావాచకములని దండి తనకావ్యాదర్శమున పేర్కొనెను కదా!

**(విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజమ్)** – సర్వేశ్వరత్వసూచకమైన కిరీటమును కలవాడు. **"పోఙ్గోదమ్ శూఴ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే అళ్కిన్ఱ"** అనునట్లు ఉభయవిభూతి నిర్వాహకుడు ఇతడే అనుటను ప్రస్ఫుటము కావించుచున్నది స్వామి కిరీటము. **"పరిబర్హ"** శబ్దమునకు సామగ్రి అని వాచ్యార్థము. సూచకమని తాత్పర్యము. **"ఉత్తమాంగ సౌందర్యవర్ణన మప్యశక్య మితి భావః"** అనుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో ఈ శ్లోకసారము తెలుపబడినది. దివ్యుల వర్ణనను పాదాదికేశాంతము ఆరోహణక్రమమున చేయవలెనను కవి సమయమున్నను, స్వామి పరత్వమును సూచించునది కిరీటము కావున, భగవానుని దర్శించునపుడు ఆ పర్వతము మనస్సులో స్ఫురించు అవకాశమున్నది కావునను, ముందుగా కిరీటముతో వర్ణను ఆరంభించుటయును ఒకవిధమైన క్రమమే. ఇట్టి క్రమమును శఠకోపసూరి తిరువాయ్‌మొఴి ప్రబంధములో **"ముడిచ్చోది"** అను దశకమున చూపిరి. కావున ఇది దివ్యసూరి సమ్మతము కూడ. ఈ క్రమమును పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవ – పూర్వశతకమున అనుసరించిరి. వృత్తము వసంతతిలక.

**40.** **అంధం తమ స్తిమిరనిర్మిత మేవ యత్ స్యాత్**
**తత్సారసాధితసుతంత్వతివృత్తవార్తమ్ ।**
**ఈశస్య కేశవగిరే రలకాళిజాలం**
**తత్తుల్యకుల్యమధుపాఢ్యమహావనస్య ॥**

తత్తుల్యకుల్య = (సుందరబాహుస్వామి) అలకలను పోలిన, మధుప = తుమ్మెదలచే, ఆఢ్య = దట్టమైన (నిండిన), మహావనస్య = గొప్పవనమునుకల, కేశవగిరేః = కేశవుడగు భగవానుడు నివసించు వనగిరియొక్క, ఈశస్య = ప్రభువగు సుందరబాహుస్వామియొక్క, అలకాళిజాలమ్ = తుమ్మెదలను పోలిన ముంగురుల సమూహము, తిమిరనిర్మితమ్ ఏవ = చీకటితోనే నిర్మించబడిన, యత్ = ఏ, అంధం తమః స్యాత్ = దట్టమైన చీకటి ఉన్నదో, తత్‌సార = దానియొక్క సారముతో, సాధిత = నిర్మింపబడిన, సుతంతు = చక్కని దారములను, అతివృత్తవార్తమ్ = మించిన వార్తను కల్గినది అగును.

ఈ శ్లోకమున కూరేశులు సుందరబాహుస్వామియొక్క ముంగురులను వర్ణించుచున్నారు. పూర్వశ్లోకములో పూర్వార్ధమున కేశపాశవర్ణనము చేయబడినను, అది శిరస్సునకు విశేషణముగా చేయబడుటచే, అప్రధానము అయినది. ఇచట దానినే ప్రధానము చేసి వర్ణించుట, ఆ వర్ణన కూడ ఆఴ్వార్ల శ్రీసూక్తి భావమును అనుసంధించుచు



చేయుటయును ఈ శ్లోకములోని విశేషము.

తిరువాయ్‌మొఴిలోని **"ఏఴైయరావి"** అను దశకములో నమ్మాఴ్వార్లు **"కొళ్ కిన్ఱ కోళిరుళై చ్చుకిర్న్దిట్ట కొఴుఙ్జురుళిన్ ఉట్కొణ్డ నీలనన్నూల్ తఴైకొల్? అన్ఱు మాయన్ కుఴల్"**. అను రెండు పాదములలోని భావ మీ శ్లోకములోని పూర్వార్ధరూపముగా కూరేశులు అనుగ్రహించిరి. నమ్మాఴ్వార్లు భగవానుని కేశపాశసౌందర్యము తమను మిక్కిలి బాధించుచున్నదని పల్కుచు ఈ పాశురమున కేశములను (ముంగురులను) మొదట అద్వితీయమైన రీతిలో ఉల్లేఖించి పిమ్మట, ఆ ఉల్లేఖము సైతము తగినది కాదని, త్రోసిరాజనిరి. ప్రళయకాలములో ప్రపంచమునంతటిని వ్యాపింపగల్గిన ఏ చీకటి కలదో, దానిని గ్రహించికొనివచ్చి, దానిలోని అసారభాగమును తొలగించి, సారాంశమును దూదిగా గొని, దానినుండి తీసిన నల్లని దారముల జాలమా ఈ కేశములు! అని భావింపవచ్చుననిరి. నిజమునకు ఈ అభూతోపమసైతము చాలదు అనునట్లుకదా! స్వామి కేశపాశములున్నవి. అందుచే వెంటనే **"అన్ఱు"** అనుచు దానిని తామే కాదనిరి. అయినచో ఏమని చెప్పవలెను అన్నచో, **"మాయన్‌కుఴల్...."** అని (ఉపమేయమును) మాత్రమే చెప్పుటకు సాధ్యము అనుచు ముగించిరి. దీనివలన అనన్వయాలంకారము ఇచట వ్యంగ్యము. ఇట్టి రీతిలోనే కూరేశుల ఈ శ్లోకమును అమరియుండుట సహృదయహృదయైకవేద్యము. **(తిమిరనిర్మిత మేవ అంధం తమః యత్ స్యాత్ తత్సారసాధితసుతంతు అతివృత్తవార్తమ్)** – చీకటినే ఉపాదానముగా గొని నిర్మించబడిన అద్వితీయగాఢాంధకార మనునది ఉన్నచో, దాని సారమును గైకొని, దానితో చేయబడిన చక్కని దారముల సమూహమే సుందరబాహుస్వామి కేశపాశము – అని వర్ణింపజూచినచో, **(అతివృత్తవార్తమ్)** – సుందరబాహుస్వామి కేశపాశసౌందర్యము ఈ ఉత్ప్రేక్షను కూడ అతిక్రమించియున్నది. అనగా, ఈ విధముగా కూడ చెప్పవీలుకాకున్నదని భావము. అది ఏది? అనగా – **(అలకాళిజాలమ్)** తుమ్మెదలతో పోలిన ముంగురులు. అవి ఎవరిది? అనగా –

**(తత్తుల్యకుల్యమధుపాఢ్యమహావనస్య కేశవగిరే రీశస్య)** – తచ్ఛబ్దము అలకాళి జలమును పరామర్శించును. ఆ ఆలకజాలముతో సమానకులమును కల్గిన, అనగా – సమానాకారములైన, తుమ్మెదలతో నిండిన తోటలను కల్గిన వనగిరికి ప్రభువగు సుందరబాహుస్వామి అలకజాలము అని భావము. **"కేశవగిరే రీశస్య అలకాళిజాలమ్ సుతంత్వతివృత్తవార్తమ్"** అని అన్వయము.

**(కేశవగిరేః)** – తిరుమఙ్గైయాఴ్వార్లు పెరియతిరుమొఴిప్రబంధములో **"దేశమెల్లామ్ వణఙ్గుమ్ తిరుమాలిరుమ్‌శోలైనిన్ఱ కేశవనమ్బీ"** అని స్తుతించుటచే, కేశవుడు వర్తించు ఈ తిరుమలను కేశవగిరి అని ప్రసిద్ధముగా వ్యవహరింతురు. **"కేసరిగిరేః"** అను పాఠమును గ్రహించినచో,

అది **“సింహగిరి”** అనుచు మాటిమాటికి చేయు ప్రయోగమునకు అనుగుణము. ఈ క్షేత్రములోని పంచబేరములలోని ఒక బేరమునకు కేశవనామము కలదు. **“అలక + అళి”** అను విభాగమును చేసి, భగవానుని ముఖపద్మమునందలి మధువును ఆస్వాదించుటకు తుమ్మెదలు వరుసగా వచ్చి చేరినవా? అనునట్లు ముంగురులు తోచుటచే, ఇట్లు కవి పల్కిరి అనవచ్చును. **“వదనారవిన్దమకరన్దరసాస్వాదత్తిఱ్కాక వణ్డొఱ్ఱుజ్గు పడిన్దాఱ్పోలే అశైకిఱ తిరుక్కుఱల్ కఱ్ఱైకళై”** అనుచు దేశికులు పరమపదసోపానములో పల్కిరి – అని వ్యాఖ్యానాంతరము. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో కూడ **“అలకాళిజాలమ్ అళిసదృశాలకనికరః ”** అని వివరింపబడినది. **“తమోనిర్మితగాఢాంధకార సారాంశసంతన్యమాన సుతంతువృత్తాంతాతిక్రాంతిమంత స్సుందరబాహుచూర్ణకుంతలా ఇత్యుక్తేః తదలకా అతీవ కాలా ఇతి భావః”** అని ఈ శ్లోకభావము ఆ వ్యాఖ్యలో తెలుపబడినది. **“అలకాళిజాలమ్”** అనునపుడు **“అలక + ఆళి”** అని, **“అలక + అళి”** అని రెండు రీతులలో విడదీయుటకు అవకాశమున్నను, రెండవ విభాగమే మిక్కిలి రస్యము. నాల్గవ పాదములో పునరుక్తి దోషమును సంభవింపదు. **“ఆళి”** – అనగా సమూహమని అర్థము. దానికి పిమ్మట సమూహమును అర్థమిచ్చు జాలశబ్దము కలదుకదా. ఈ రెండును కలసి మిక్కిలి సాంద్రతను తెలుపును – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**41.** **జుష్టాష్టమీకజ్వలదిందుసన్నిభం ధృతోర్ధ్వపుండ్రం విలసద్విశేషకమ్ ।**
**భూమ్నా లలాటం విమలం విరాజతే వనాద్రినాథస్య సముచ్ఛ్రితశ్రియః ॥**

సముచ్ఛ్రితశ్రియః = **“ఏఱు తిరువుడైయాన్”** అని కీర్తింపబడు, వనాద్రినాథస్య = తిరుమాలిరుమ్‌శోలై పర్వతముయొక్క నాథుని, లలాటం = లలాటము (నుదురు), జుష్టాష్టమీక = అష్టమి అను తిథిని పొందినవాడు, జ్వలత్ = ప్రకాశించువాడును అగు, ఇందు = చంద్రునితో, సన్నిభమ్ = సమానమైనదియై, ధృత + ఊర్ధ్వపుండ్రమ్ = ఊర్ధ్వపుండ్రమును దాల్చినదియై, విలసత్ = ప్రకాశించుచున్న, విశేషకమ్ = కస్తూరి బొట్టుతో కూడినదియై, విమలం = దోషరహితమైనదియై, భూమ్నా = మిక్కిలి అతిశయముతో, విరాజతే = ప్రకాశించుచున్నది.

ఇందు కూరేశులు సుందరబాహుస్వామి లలాటవర్ణనను చేయుచున్నారు. కృష్ణపక్షము, శుక్లపక్షము – అను రెండు పక్షములలో ఒకే స్థితిలో నుండునది అష్టమీ చంద్రుడు మాత్రమే. అది కృష్ణుడు అవతరించిన తిథి కావున, అందు కృష్ణుని సేవించి, మార్పులేని ఈ స్థితిని చంద్రుడు పొందినాడో! ఏమో! ఆ విధమైన అష్టమీ చంద్రునివలె శోభిల్లునది, ఊర్ధ్వపుండ్రము, శ్రీచూర్ణము (లేక, కస్తూరినామము)లను కల్గినది, విపులమైనది స్వామి లలాటము – అని భావము. ఒకవైపు నల్లనిదియై, వేఱొకవైపు ప్రకాశించునది అగుటచే లలాటమునకు కవులు అష్టమీ చంద్రుని ఉపమానముగా పల్కుదురు.



**(సముచ్ఛ్రితశ్రియః వనాద్రినాథస్య లలాటం భూమ్నా విరాజతే)** – **“ఏఱు తిరువుడైయాన్”** అని కీర్తింపబడిన సుందరబాహుస్వామి లలాటము అతిశయించి ప్రకాశించుచున్నది. ఆ లలాటము ఎట్టిది అనగా, **(జుష్టాష్టమీకజ్వలదిందుసన్నిభమ్)** – అష్టమీ చంద్రునివలె వెల్గునట్టిది. అర్ధచంద్రుని వంటిది – అని అర్థము. వరదరాజస్తవములోని **“ఉభయోరపి పక్షయో స్తతి ర్యా”** అను శ్లోకము ఇచట అనుసంధేయము. దేశికుల పరమపదసోపానములోని తొమ్మిదియవ ప్రాప్తిపర్వములో – **“తిరుక్కుఱల్ శేర్త్తియాలే ఒరుపాక మిరుళోడే శేర్న్ద అష్టమీచంద్రనై యనుసరిక్కిఱ తిరునెఱ్ఱియై యనుబవిత్తు”** అను సూక్తి ఇచట అనుసంధేయము. **(విలసద్విశేషకమ్)** – కస్తూరీతిలకముతో, లేక, శ్రీచూర్ణరేఖతో ప్రకాశించునది. **“శ్రీచూర్ణతిలకః, కస్తూరికా వా”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **“విమలమ్”** అనుటకు బదులు **“విపులమ్”** అని పాఠాంతరము. వృత్తము – ఉపజాతి.

**42.** **సుచారుచాపద్వయవిభ్రమం భ్రువోః యుగం సునేత్రాహ్వసహస్రపత్రయోః ।**
**ఉపాంతగం వా మధుపావళీయుగం విరాజతే సుందరబాహుసంశ్రయమ్ ॥**

సుందరబాహుసంశ్రయం = సుందరబాహుస్వామిని ఆశ్రయముగా కల్గిన, భ్రువోః యుగం = కనుబొమ్మల జంట, సుచారు = మిక్కిలి అందమైన, చాపద్వయ = రెండు ధనుస్సుల, విభ్రమం = అందమువంటి అందమును, సునేత్రాహ్వ = సుందరనేత్రములనెడి, సహస్రపత్రయోః = తామరపూవుల జంటయొక్క, ఉపాంతగమ్ = సమీపమును చేరిన, మధుప + ఆవళీయుగమ్ వా = తుమ్మెద వరుసల జంటవలె, విరాజతే = ప్రకాశించుచున్నది.

ఇందు కూరేశులు సుందరబాహుస్వామి కనుబొమ్మల అందమును వర్ణించుచున్నారు.

**(సుందరబాహుసంశ్రయమ్ భ్రువోః యుగం విరాజతే)** **“శున్దరత్తోళుడైయాన్”** అగు సుందరబాహుస్వామి కనుబొమ్మలు రెండు విరాజిల్లుచున్నవి. ఎట్లనగా – **(సుచారుచాపద్వయవిభ్రమమ్)** – **“తన్కై చ్చార్ఙ్గమదువే పోల్ పురువవట్ట మఴకియ పొరుత్తమిలి”** అనెడి గోదాదేవిసూక్తిచొప్పున మిక్కిలి అందమైన రెండు ధనుస్సుల విలాసమువంటి విలాసమును కల్గినది. **“ఇన్నుయిర్క్కు ఏఱైయర్మేల్ వళైయుమ్ ఇణైనీల విఱ్కొల్? మన్నిశీర్ మదనన్ కరుప్పుచ్చిలైకొల్?”** అను నమ్మాళ్వార్ల శ్రీసూక్తి భావముకూడ ఇచట అనుసంధేయము. ఆ కనుబొమల జంట ఎట్లు ఉల్లేఖింపదగినట్లున్నది? అనినచో, **(సునేత్రాహ్వసహస్రపత్రయోః ఉపాంతగం మధుపావళీయుగం వా)** – స్వామి తిరునేత్రములనెడి రెండు తామరపూవుల సమీపమున వచ్చి చేరిన రెండు తుమ్మెదల వరుసలా ఇవి! అనునట్లున్నవి. **“వా”** అను పదము ఉపమావాచకము. **“పద్మినీం వాఌ

**న్యరూపామ్"** అను మహాకవిప్రయోగము ఇందులకు ఉదాహరణము. **"ఇవార్థో వా శబ్దః , యద్వా యథా తథైవేవం సామ్యే ఇత్యమరః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"నేత్రయోః సహస్రపత్రభ్రాంత్యా ప్రాంతగతభృంగపంక్తిద్వంద్వ మివ సుందరబాహుభ్రూయుగం శోభతే ఇత్యర్థః''** అని అందలి వివరణము. వృత్తము – ఉపజాతి. నేత్రములందు సహస్రపత్రకమలత్వారోపణము, భ్రూద్వంద్వమున మధుకరపంక్తి ద్వితయత్వారోపమును చేయబడుటచే, ఈ రెండింటి మధ్య హేతుహేతుమద్భావముండుటచే పరంపరితరూపకము కలదు.

**43. అదీర్ఘ మప్రేమదుఘం క్షణోజ్జ్వలం న చోర మంతఃకరణస్య పశ్యతామ్ ।**
**అనుబ్జ మబ్జం ను కథం నిదర్శనం వనాద్రినాథస్య విశాలయోః దృశోః ॥**

అదీర్ఘం = దీర్ఘము కానిది, (విశాలముగా లేనివి), అప్రేమదుఘం = ప్రేమను వర్షింపనిది, క్షణ + ఉజ్జ్వలమ్ = క్షణకాలము మాత్రమే ప్రకాశించునది, పశ్యతాం = దర్శించువారియొక్క, అంతఃకరణస్య = మనస్సును, న చోరం = దొంగిలింప(లే)నిది, అనుబ్జం = వంకరటింకరగా (వక్రముగా) నున్నదియు అగు, అబ్జం = తామరపూవు, వనాద్రినాథస్య = సుందరబాహుస్వామియొక్క, విశాలయోః = దీర్ఘములైన, దృశోః = కన్నులకు, నిదర్శనం = ఉపమానము, కథం ను = ఎట్లు అగును? (– కానే కాదు)

ఈ శ్లోకముద్వారా కూరేశులు సుందరబాహుస్వామి నేత్రశోభను స్తుతించుచున్నారు. ఎఱ్ఱతామరవంటి నేత్రములు అని వర్ణించెదమా? అని తలచి, వెంటనే స్వామి నేత్రములకు, తామరపూవులకును ఏ మాత్రము సామ్యము లేకున్నపుడు అది ఎట్లు అగును? అని అనుచున్నారు.

**(అదీర్ఘమ్) – "నీణ్డ అప్పెరియవాయకణ్గళ్"** అని తిరుప్పాణ్ ఆళ్వార్లు, **"ఇళఙ్గొళిశేర్ అరవిన్దమ్ పోన్ఱ నీణ్డకణ్ణానై"** అని తిరుమఙ్గైయాళ్వార్లు పల్కినట్లు స్వామి నేత్రములు దీర్ఘములై యుండునంతగా పద్మములు దీర్ఘములు కావుకదా! దైర్ఘ్యమున తామరపూవు సాటిరాదే!

**(అప్రేమదుఘమ్) – "నీణ్డ అప్పెరియవాయ కణ్గళ్ ఎన్నై ప్పేదమై శెయ్‌దనవే"** అను రీతిలో వాత్సల్యముతో పిచ్చెక్కించు గుణము స్వామి నేత్రములకు తప్ప తామరకు లేదే! ప్రేమను వర్షించుటలో పద్మము స్వామి నేత్రములకు ఎట్లు సరిపోవును? ఇచట దేశికుల దేహళీశస్తుతిలోని – **"దుర్వారతీవ్రదురితప్రతివాదదూకైః ఔదార్యవద్భి రనఘస్మితదర్శనీయైః దేహళ్యధీశ్వర! దయాభరితై రపాంగైః వాచం వినాఽపి వదసీవ మయి ప్రసాదమ్"** అనుచు స్వామి నేత్రములనుగూర్చిన శ్లోకముయొక్క భావమును అనుసంధింపనగును.



**(క్షణోజ్జ్వలమ్) – "ఎప్పొழுదుమ్ నాళ్ తిఙ్గళ్ ఆణ్డూழி యూழிదొఱుమ్ అప్పొழுదైక్కప్పొழுదు ఎన్నారావముదమే"** అనునట్లు క్షణక్షణము నిత్యనూతనముగా భాసించు స్వామి నేత్రములతో, అట్టి స్వభావము ఇసుమంతయు లేని పద్మమెట్లు తులతూగును?

**(పశ్యతా మంతఃకరణం న చోరమ్) – "కణ్డవర్‌తమ్ మనమ్ వழுఙ్గుమ్"** అను రీతిలో ఒక్కసారి దర్శించువారి ఉల్లములను సైతము కొల్లగొట్టగల్గినవికదా స్వామి నేత్రములు! ఇందులకు ధనుర్దాసు చరిత్రయే సాక్షి. వీనితో, ఆవిధమైన శక్తిఏమాత్రము లేని పద్మము ఎట్లు సాటి? **"సందర్శనా దకస్మాచ్చ పుంసాం సమ్మూఢచేతసామ్, కువాసనా కుబుద్ధి శ్చ కుతర్క శ్చ కునిశ్చయః, కుహేతు శ్చ కుభావ శ్చ నాస్తికత్వం లయం వ్రజేత్"** అనుచు భగవత్కటాక్షమునకు పాత్రులై, ఆ భగవానుని సేవించువారికి కల్గు ఫలములు పౌష్కరసంహితలో తెలుపబడినవి. ఇవి ఏమియు తామరపూవుకు లేవు కదా!

**(అనుబ్జమ్) – "ఉబ్జ – ఆర్జవే"** అను ధాతుపాఠమునుబట్టి అనుబ్జమనగా ఋజువుకానిది–అని అర్థము. వక్రముగాకదా పద్మముండును. చంద్రోదయమును సహింపలేని అనార్జవము పద్మమునకున్నదికదా! ఆర్జవమే మూర్తీభవించినట్లున్న స్వామి నేత్రములకు అది ఎట్లు సమానము? **"ఆర్జవరహితమ్ చంద్రోదయాసహవికాసత్వా దితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **(వనాద్రినాథస్య విశాలయోః దృశోః కథం ను నిదర్శనమ్)** – తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామియొక్క విశాలమైన నేత్రములకు పద్మము ఎట్లు నిదర్శనమగును? ఏనాటికిని కానేకాదు.

ఈ విధముగా పల్కు కూరేశులే, **"అబ్జపాద మరవిందలోచనం పద్మపాణితలమ్"** ఇత్యాదిగా తామరపూవునే ఒక్కొక్క అవయమునకు ఉపమానముగా పల్కుట ఎట్లు తగును? అనినచో, ఏదయిన ఒక ఉపమానమును నిర్దేశించి పల్కి వర్ణింపవలెను. కావున, అట్లు పల్కిరి. అంతియే, తామరపూవువంటి ప్రాకృత వస్తువులు వస్తుతః స్వామి ఏ దివ్యాంగమునకు సాటిరావు. వాల్మీకి **"గుణై ర్దశరథోపమః"** అని పల్కుటయు ఇట్టిదే. నమ్మాళ్వార్లును **"ఒట్టురైత్తివ్వులకున్నై ప్పుకழ் వెల్లామ్ పెరుమ్బాలుమ్ పట్టురైయాయ్ పుఱ్కెన్ఱే కాట్టుమాల్ పరఞ్జోతీ"** అని తిరువాయ్‌మొழிలో పల్కిరి కదా! **"తస్య కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అని వేదము పల్కుటకూడ ఇట్టిదే. **"తత్తాదృగీదృగిదమిత్యుపవర్ణయంతో వాచో యదీయవిభవస్య తిరస్క్రియాయై"** అను వైకుంఠస్తవసూక్తి భావ మిచట అవధేయము. వేదార్థసంగ్రహవ్యాఖ్యానమగు తాత్పర్యదీపికలో శ్రీ సుదర్శనభట్టర్ ఈ శ్లోకమును ఉట్టంకించి, వ్యాఖ్యానించిరి. ఆ వ్యాఖ్యయు ఇచట స్మరణీయము. **"అదీర్ఘమిత్యాదివిశేషణవిశిష్ట మబ్జం కర్ణాంతవిశ్రాంతయోః, ఆశ్రితవిషయప్రణయక్షరణశీలయోః ఏకరూపవికాసయోః, పశ్యతా**

**మతిమనోహరయోః, అవ్యాజేన సర్వజనసంతోషప్రదయోః సుందరబాహుదృశోః న దృష్టాంతభూత మిత్యర్థః"** అని ఈ శ్లోకభావము శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో తెలుపబడినది. వృత్తము - ఉపజాతి. వర్ణ్యమునకు అవర్ణ్యముతో సాదృశ్యము నిష్పన్నము కాదనుట **''వర్ణ్యేనాన్యస్యోపమాయాః అనిష్పత్తివచ శ్చ తత్''** అని నిర్వచింపబడిన ప్రతీపాలంకారభేదమగును. పద్మము ఏ రీతిలోను స్వామి నేత్రములతో పోలదనుటచే ఇచట ఈ ప్రతీపాలంకార భేదము కలదు.

**44.** ప్రశ్చ్యోతత్ప్రేమసారామృతరసచుళుకప్రక్రమప్రక్రియాభ్యాం
విక్షిప్తాలోకితోర్మిప్రసరణముషితస్వాంతకాంతాజనాభ్యామ్ ।
విశ్వోత్పత్తిప్రవృత్తిస్థితిలయకరణైకాంతశాంతక్రియాభ్యాం
దేవోఽలంకారనామా వనగిరినిలయో వీక్షతా మీక్షణాభ్యాం ॥

ప్రశ్చ్యోతత్ = మిక్కిలి ప్రవహించుచున్న, ప్రేమసార = సారమైన ప్రేమ అనెడి, అమృతరస = అమృతరసముయొక్క, చుళుక = పుడిసిలియొక్క, ప్రక్రమప్రక్రియాభ్యాం = క్రమమువంటి క్రమమును కల్గివి, విక్షిప్త = బాగుగా నాల్గువైపుల ప్రసరింపజేయబడిన, అలోకిత + ఊర్మి = కటాక్షములనెడి కెఱటములు, ప్రసరణ = ప్రసరించుటచే, ముషితస్వాంత = దొంగిలింపబడిన మనస్సును కల్గిన, కాంతాజనాభ్యాం = (గోపికా) స్త్రీ జనమును కల్గినవి, విశ్వ = చేతనాచేతనాత్మకమైన సమస్తముయొక్క, ఉత్పత్తి = సృష్టి, ప్రవృత్తి = గతి, స్థితి = రక్షణ, లయ = నాశము - అను వీనిని, కరణ = చేయుటలో, ఏకాంతశాంత = ఏ మాత్రము అడ్డులేని, క్రియాభ్యాం = ప్రయత్నములను కల్గినవి అగు, ఈక్షణాభ్యాం = రెండు నేత్రములతో, వనగిరినిలయః = వనగిరిని నివాసముగా కల్గిన, దేవః = సుందరబాహుస్వామి, (మాం = నన్ను), వీక్షతామ్ = కటాక్షించుగాక.

పూర్వశ్లోకములో స్వామి నేత్రసౌందర్యము ప్రసక్తమైనది. **"త్వదీక్షణసుధాసింధు వీచివిక్షేపశీకరైః......శీతలై రభిషించ మామ్"** అని, **"అజ్గణ్ ఇరణ్డుజ్మోణ్డు.....ఎమ్మేల్ విళ్ళియావో''** అని, **''ఉన్ తామరైక్కణ్గళాల్ నోక్కాయ్''** అనియును భక్తులు ప్రార్థింపవలయును కదా! ఆ ప్రార్థనను కూరేశులు ప్రస్తుత శ్లోకము ద్వారా చేయుచున్నారు. **(వనగిరినిలయః అలంకారనామా దేవః ఈక్షణాభ్యాం వీక్షతామ్)** - తిరుమాలిరుమ్శోలై పర్వతవనసీమలో విహరించు సుందరబాహుస్వామి అలంకారనాముడు. తన దివ్యనేత్రములతో నన్ను అతడు చల్లగా చూడవలెను. ఆ స్వామి కన్నులు ఎట్టివి? అనగా, **(ప్రశ్చ్యోతత్ప్రేమసారామృతరసచళుకప్రక్రమప్రక్రియాభ్యామ్)** బాగుగా స్రవించు ప్రేమరసప్రవాహమనెడి అమృతరసప్రవాహముయొక్క పుడిసిళ్ళా ఇవి! అనునట్లున్నవి. చుళుకమనగా పుడిసిలి. కన్నుల వైశాల్యమును వర్ణించుటకు పుడిసిలిని ఉపమానముగా పల్కుట కవిసమయము. **"చళుకదృష్టాంతోక్తిః మందమంద మనుభవసౌకర్యాయ"** అని



శ్రీనివాసాచార్యవ్యాఖ్య. పుడిసిలి కొంచెము కొంచెముగా పానముచేయుటకు వీలగు సాధనము కదా! తిరువిరుత్తములోని **"ఓరో కుడజ్గై పెరియన కెణ్డైక్కులమ్"** అను ప్రయోగ మిందులకు తార్కాణము. సుందరబాహుస్వామి నేత్రములనెడి పుడిసిళ్లలో ప్రేమరసమనెడి అమృతప్రవాహము ప్రవహించుచున్నదనుటచే స్వామి ప్రేమతో కటాక్షించుచున్నాడని తాత్పర్యము. ప్రక్రమమనగా ప్రకారము. ప్రక్రియ అన్నను ప్రకారమే. చుళుకముయొక్క స్వభావమువంటి స్వభావమును నేత్రములు కల్గినవి - అని భావము. **(విక్షిప్తాలోకితోర్మిప్రసరణముషితస్వాంతకాంతాజనాభ్యామ్)** - కెఱటములు లేచు కటాక్షధారలచే గోపీజనహృదయములను కొల్లగొట్టునవి - అని అర్థము. కూరేశులు **"గోపీమనాంసి నవనీతమ్ ఉత! అభ్యమోషీః"** అని అతిమానుషస్తవమున పల్కిరి కదా! విక్షిప్తములగు అలోకితములనెడి కెఱటముల ప్రసరణముచే అపహరింపబడిన కాంతాజనస్వాంతములను కల్గినవి స్వామి నేత్రములు. విక్షిప్తములనగా విశేషించి ప్రేరితములు. అలోకితములనగా అలోకనములే. **"తూతుశెయ్ కణ్గళ్ కొణ్డొన్రు పేశి"** అనునట్లు కడగంటి చూపులతోనే ఉల్లమును కొల్లగొట్టువాడుకదా స్వామి. **"వృందాని స్వవశయన్ వ్రజసుందరీణాం వృందావనాంతరభువాం సులభో బభూవ"** అను సూక్తి స్మరణీయము. **(విశ్వోత్పత్తిప్రవృత్తి స్థితిలయకరణైకాంతశాంతక్రియాభ్యామ్)** సకలచరాచరముల ఉత్పత్తి, ప్రవృత్తి, రక్షణ, లయములను నిర్వహించుటలో మిక్కిలి ఆసక్తిని కల్గిన - అని భావము. **"నావేక్షసే యది తతో భువనాన్యమూని నాలం ప్రభో! భవితు మేవ కుతః! ప్రవృత్తిః"** అనుచు శ్రీ యామునులు స్తోత్రరత్నమున అనుగ్రహించినట్లు, అవేక్షణమాత్రముచేతనేకదా భగవానుడు విశ్వముయొక్క ఉత్పత్తి, ప్రవృత్తి, స్థితి, లయములను నడుపును. **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ", "స ఈక్షత లోకాన్ ను సృజా ఇతి", ''సేయం దేవతైక్షత''** ఇత్యాది శ్రుతులు ఇచట స్మరణీయములు. శ్లోకములోని మొదటిపాదముతో మోక్షప్రదత్వము, రెండవపాదముతో భోగమాత్రమున సామ్యమను స్థితి, మూడవపాదముతో జగత్కారణత్వమును తెలుపబడినది. కావున సుందరబాహుస్వామియే పరబ్రహ్మ అని సూచించినట్లయినది - అని వ్యాఖ్యానాంతరము. **"అనన్యలక్ష్యసమగ్రానుగ్రహకటాక్షలక్ష్యం కరో త్విత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని సూక్తి. వృత్తము స్రగ్ధర. ఏ తీరులో శ్లోకము ప్రారంభమైనదో, ఆ రీతిలోనే ముగించుట అని నిర్వచింపబడిన రీతి గుణ మిందు కలదు.

**45.** ప్రేమామృతౌఘపరివాహిమహాక్షిసింధుమధ్యే ప్రబద్ధసముదంచితసేతుకల్పా ।
ఋజ్వీ సుసుందరభుజస్య విభాతి నాసా కల్పద్రుమాంకురనిభా వనశైలభర్తుః ॥

వనశైలభర్తుః = వనశైలప్రభువు అగు, సుసుందరభుజస్య = సుందరబాహుస్వామి యొక్క

నాసా = నాసిక, ప్రేమ + అమృత + ఓఘ = ప్రేమ అనెడి అమృతప్రవాహము, పరివాహి = ప్రవహించు, మహాక్షిసింధుమధ్యే = విశాలనేత్రములనెడి సముద్రముమధ్యలో, ప్రబద్ధ = బాగుగా కట్టిన, సముదంచిత = మిక్కిలి ఉన్నతమైన, సేతుకల్పా = సేతువువంటిదిగా, ఋజ్వీ = ఋజువైన, కల్పద్రుమ + అంకురనిభా = కల్పవృక్షముయొక్క చిగురువంటిదిగా, విభాతి = ప్రకాశించుచున్నది.

ఈ శ్లోకమున కూరేశులు సుందరబాహుస్వామి నాసికాసౌందర్యమును శ్లాఘించుచున్నారు.

**(వనశైలభర్తుః సుందరభుజస్య)**–తిరుమాలిరుమ్‌శోలై ప్రభువగు సుందరబాహుస్వామి యొక్క –

**(ఋజ్వీ కలద్రుమాంకురనిభా నాసా)**–ఋజువైన కల్పలతయొక్క చిగురువంటి నాసిక –

**(ప్రేమామృతౌఘపరివాహిమహాక్షిసింధుమధ్యే ప్రబద్ధసముదంచిత సేతుకల్పా విభాతి)** –సుందరబాహుస్వామి నేత్రములు "ఆశ్రితవాత్సల్యాతిశయముచే ఎల్లప్పుడు కెఱటములను కల్గినవి అగుచు ప్రవహించు అమృతరసప్రవాహములా! ఇవి" అనునట్లుండును. ఆ నేత్రముల మధ్య అందమైన, దీర్ఘమైన నాసిక అమరియుండుట ఆ అమృతసముద్రము మధ్యలో చక్కగా కట్టిన సేతువా ఇది! అనునట్లుండును. అక్షిశబ్దముచే నేత్రములు రెండు ఉపలక్షితములు.

నేత్రములను సముద్రముగా రూపణము చేయుటకు అనుగుణముగా **"ప్రేమామృతౌఘపరివాహి"** అనెడి విశేషణము ప్రయోగింపబడినది. సముద్రము నీటి ప్రవాహమును ప్రవహించును. ఈ నేత్రములనెడి సముద్రము ప్రేమ (వాత్సల్యము) అనెడి అమృత ప్రవాహమును ప్రవహించుచున్నది. తిరువాయ్‌మొழி ప్రబంధములోని – **"ఈట్టియ వెణ్ణెయ్ ఉణ్డాన్ తిరుమూక్కు మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొழுన్దో అఱియేన్"** అని ఆழ்వార్లు పలికిన సూక్తిని అనుసరించుచు కూరేశులు **"కల్పద్రుమాంకురనిభా"** అని ఇచట ప్రయోగించిరి. దేవనాయకపంచాశత్‌లోని **"నిత్యోదితై ర్నిగమనిశ్శ్వసితై స్తవైషా నాసా నభశ్చరపతే! నయనాబ్ధిసేతుః"** అను శ్లోకమున ప్రకృత శ్లోకభావమును దేశికులు అనుసంధించిరి. శ్లోకమున **''ఋజ్వీ''** అనుటను **''నిరంతరానుభవేஉపి అభినవీభవదేకరూపశోభేత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య వివరించినది. అట్లే, **"అక్ష్ణః సింధుత్వరూపణా దేకవచనేనైవ అక్షిద్వయస్య క్రోడీకారః, ఇతరథా మధ్యశబ్దవిరోధశ్చ, సుందరబాహో రక్షిశోభానుభవాయ అవతీర్ణానాం తత్రత్యప్రేమరసమజ్జనేన అవయవాంతర శోభానుభవగమనాసక్తానామ్ అనుభవితృచక్షుషాం నాసా సేతు రివ పారగమనసాధన**



**మిత్యభిప్రాయః"** అని అందలి వివరణము. వృత్తము వసంతతిలక.

**46.** **వ్యాభాషితాభ్యధికనందనభందనర్ధిమందస్మితామృతపరిస్రవసంస్తవాఢ్యమ్ ।**
**ఆభాతి విద్రుమసమాధర మాస్య మస్య దేవస్య సుందరభుజస్య వనాద్రిభర్తుః ॥**

వనాద్రిభర్తుః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు ప్రభువు అగు, సుందరభుజస్య = సుందరబాహుస్వామి అను, అస్య దేవస్య = ఈ దేవునియొక్క, ఆస్యం = ముఖము, వ్యాభాషిత + అభ్యధిక = పలుకులకంటె అధికముగా, నందన = ఆనందమును కల్గించునది, భందన = మంగళమును కల్గించునది అగు, ఋద్ధి = సమృద్ధిని కల్గిన, మందస్మిత = చిఱునవ్వు అనెడి, అమృత = అమృతరసముయొక్క, పరిస్రవ = ప్రవాహముయొక్క, సంస్తవ + ఆఢ్యమ్ = పరిచయముచే సంపన్నమైనది, విద్రుమ + సమ + అధరమ్ = పగడముతో సమానమైన ఆధరమును కల్గినదిగా, ఆభాతి = ప్రకాశించుచున్నది.

సుందరబాహుస్వామి అధరశోభ ఇందు స్తుతింపబడుచున్నది.

**(వనాద్రిభర్తుః సుందరభుజస్య అస్య దేవస్య)** – **"పవళమ్‌పోల్ కనివాయ్ శివప్ప"** అని, **"శెమ్బవళత్తిరళ్"** అని, **"కోలమ్‌తిరళ్‌పవళ క్కొழுన్దుణ్డుమ్"** అనియు అనునట్లు ఎఱ్ఱగా, పండువలె అధరము ప్రకాశించుచున్నది. అది ఇంకను ఎట్టిది? అనగా –

**(వ్యాభాషితాభ్యధికనందన భందనర్ధిమందస్మితామృతపరిస్రవసంస్తవాఢ్యమ్)** – నోరు తెఱచి మాటలాడుట కంటె తీయనిది అగు మందస్మితము వికసింపబడినదని అర్థము. వ్యాభాషితమనగా వ్యాభాషణము – అనగా – నోరు తెఱచి మాటలాడుట. దానికంటె **"అభ్యధికనందన"** – మిక్కిలి ఆనందకరమైన, **భందన** – కల్యాణావహమైన, **ఋద్ధి** – సమృద్ధిని కల్గినదైయున్న, **మందస్మితమ్** – చిరునవ్వు – అనెడి, **అమృతపరిస్రవ** = అమృతప్రవాహముచే, **ఆఢ్యమ్** – నిండినది. **"వ్యాభాషితే వ్యాభాషణే అభ్యధికనందనా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **''స్మితపూర్వభాషిణమ్ – ఇత్యుక్తరీత్యా అభాషణకాలీనాత్యంతానంద కల్యాణస్వోన్మేష మందస్మితామృతనిష్యం దపరిచయోపచితశోభ మిత్యర్థః. ఆభాషణకాలీనాత్యంత భోగ్యమందస్మితసంపన్న మితి యావత్"** అని, **"ఆభాషణకాలీనాతిపాటలాధరాసంగిమందస్మిత మాస్యశోభాహేతు రితి భావః"** అనియు ఆ వ్యాఖ్యలోని వివరణము. వృత్తము వసంత తిలక.

**47.** **యశోదాంగుల్యగ్రోన్నమితచుబుకాఘ్రాణముదితౌ**
**కపోలా వద్యాపి హ్యనుపరతతద్ధర్షగమకౌ ।**
**విరాజేతే విష్వగ్వితతసహకారాసవరస –**
**ప్రమాద్యద్భృంగాఢ్యద్రుమవనగిరేః సుందరహరేః ॥**

విష్వక్ + వితత = నాల్గుప్రక్కల విస్తరించిన, సహకార = తీయమామిడిచెట్టుయొక్క, అసవరస = మధురసముచే, ప్రమాద్యత్ = మదమును పొందు, భృంగ = తుమ్మెదలచే, ఆఢ్య = నిండిన, ద్రుమవనగిరేః = వృక్షములతో నిండిన వనగిరిని నివాసముగాకల, సుందరహరేః = సుందరబాహుస్వామియొక్క, కపోలౌ = చెక్కిళ్ళు రెండును, యశోదా = యశోదాదేవియొక్క, అంగులీ + అగ్ర = చేతివేళ్ళ చివరి భాగములతో, ఉన్నమిత = పైకి ఎత్తబడిన, చిబుక = గెడ్డమును, అఘ్రాణ = సువాసను చూచుటచే, (ముద్దాడుటచే) ముదితౌ, = ఆనందమును పొందినవిగా, అద్య + అపి = సుందరబాహుస్వామిగా వెలసిన ఈనాటికిని, అనుపరత = అనువర్తించు, తత్ + హర్ష = అపుడు కల్గిన ఆనందముయొక్క, గమకౌ = సూచకములుగా, విరాజేతే హి = ప్రకాశించుచున్నవి కదా!

సుందరబాహుస్వామి దివ్యకపోలముల కాంతిని కూరేశులు ఇందు పొగడుచున్నారు. **(విష్వగ్వితతసహకారాసవరసప్రమాద్యద్ భృంగాఢ్యద్రుమవనగిరేః సుందరహరేః కపోలౌ విరాజేతే)** అంతట వ్యాపించిన తీయమామిడి చెట్ల మధువును ఆస్వాదించి, మదించుచున్న తుమ్మెదలతో నిండిన వనగిరిని నివాసముగా కల్గిన సుందరబాహుస్వామి మహనీయకపోలములు మిక్కిలి శోభిల్లుచున్నవి – **"వణ్డమర్శారల్ మాలిరుమ్ శోలై"** అను కలియన్ సూక్తి ఇచట స్మరణీయము.

**(యశోదాంగుళ్యగ్రోన్నమితచుబుకాఘ్రాణముదితౌ అద్యాపి.....గమకౌ)** పూర్వము కృష్ణావతారసమయమున యశోదాదేవి తనచేతివేళ్ళ చివరలతో స్వామి చిబుకమును ఎత్తి పట్టుకొని, ముద్దాడుటచే స్వామికి రోమాంచము కల్గినది. ఇప్పటికిని ఆ హర్షము కపోలములందు ప్రస్ఫుటమగుచు, అస్థితి మాఱకుండనున్న కదా! యశోద ముద్దాడునది కపోలములందు కాకున్నను, ఆనందము ప్రస్ఫుటమగునది చెక్కిళ్ళయందే అగుటచే ఇట్లు పల్కుటలో విప్రతిపత్తి లేదు. లేక, కపోలములందు ముద్దాడెనన్నను లోపము లేదు. సుందరబాహుస్వామియొక్క దివ్యమంగళ విగ్రహములో శ్రీకృష్ణతాదాత్మ్యభావన సంపూర్ణమై, కూరేశులిట్లు పల్కిరి అనదగును. **"కోవలనాయ్ వెణ్ణెయ్ ఉణ్డ వాయన్ అణ్డర్కోన్ అణియరఙ్గన్"** అనుచు తిరుప్పాణ్‌పెరుమాళ్‌కూడ ఇట్లే నుడివిరి కదా! ఈ దివ్యసూరిసూక్తిని భట్టరు వివరించునపుడు వారి శిష్యులు నఞ్జీయర్ ఇట్లు ప్రశ్నించిరట – "స్వామీ! శ్రీకృష్ణుడై అవతరించినపుడు కదా స్వామి వెన్నను దొంగిలించెను. శ్రీరంగములో అర్చారూపియై సేవను అనుగ్రహించు ఈ రూపమునుగూర్చి ఇట్లు పల్కుట ఎట్లు అర్థవంతము?" అని – అపుడు భట్టరు సమాధానముగా – "ఈ నాటికిని వెన్నవాసన శ్రీరంగనాథుని తిరుముఖమండలములో పరిమళించుటను మీరు గమనింపలేదా!" అని పల్కిరట. **"హి శబ్దప్రయోగాత్ అయం కపోలయో ర్వికాసః సుందరబాహుసేవాసమాగతసర్వజనానుభావ్య ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శిఖరిణి.



**48.** **వ్యాలంబికుండల ముదగ్రసువర్ణపుష్ప**
**నిష్పన్నకల్పలతికాయమలానుకారమ్ ।**
**యత్కర్ణపాశయుగళం నిగళం ధియాం న**
**స్సోఽయం సుసుందరభుజో వనశైలభూషా ॥**

వ్యాలంబి = భుజములవరకు వేలాడు, కుండలం = కర్ణాభరణములను కలిగినది, ఉదగ్ర = మిక్కిలి గొప్ప, సువర్ణపుష్పనిష్పన్న = బంగారు పూలచే ఏర్పడిన, కల్పలతికాయమల = రెండు కల్పలతలను, అనుకారం = పోలినది అగు, యత్ కర్ణపాళయుగళమ్ = ఏ సుందరబాహుస్వామియొక్క గొప్పకర్ణములు రెండును, నః ధియాం = మన మనస్సులకు, నిగళం = సంకెళ్ళుగా అగుచున్నవో, సః ఆయమ్ = అట్టి ఈ, సుందరభుజః = మిక్కిలి అందమైన బాహువులను కల్గిన స్వామి, వనశైలభూషా = వనగిరికి అందమైన అలంకారము.

కూరేశులిందు వనగిరిస్వామి దివ్యకర్ణయుగళవర్ణనను చేయుచున్నారు.

**(వ్యాలంబికుండలమ్) – "మకరమ్శేర్ కుழై యిరుపాడిలఙ్గి యాడ"** అనునట్లు తళతళమని మెఱయుచు, వేలాడు రెండు ఘనమకరకుండలములను కల్గినది.

**(ఉదగ్రసువర్ణపుష్ప నిష్పన్నకల్పలతికాయుగళానుకారమ్)** – మిక్కిలి గొప్ప స్వర్ణ పుష్పములతో వెలుగుచున్న రెండు కల్పలతలను పోలినది. కర్ణము స్థానమున కల్పలతలను, కుండలముల స్థానమున సువర్ణపుష్పములను గ్రహింపనగును. **(యత్ కర్ణపాశయుగళం నః ధియాం నిగళమ్)** – సుందరబాహుస్వామి ఇట్టి కర్ణపాశములు రెండును మన బుద్ధికి సంకెళ్ళుగానున్నవి. సంకెళ్ళతో బంధింపబడినవాడు తానున్న చోటినుండి వేఱొక చోటికి పోలేక, దిగ్భ్రమ చెందునట్లు, కూరేశుల చిత్తము సుందరబాహుస్వామి కర్ణపాశములునుండి విడివిడి వేరొక అవయవమునందు లగ్నము కాలేక, దిగ్భ్రమమును చెందుచున్నదని భావము. ఇచటి **"పాశ"** శబ్దమును శ్రేష్ఠవాచకముగానే కాక, బంధమను అర్థమున అన్వయించుటలోను స్వారస్యము కలదు. అపుడు కదా అవి నిగళమగును. లౌకికభోగములయందు ఆసక్తము కాకుండ మన మనస్సును బంధించుచున్నదని వ్యాఖ్యానాంతరము.

**(సోఽయం సుసుందరభుజః వనశైలభూషా)** – ఇట్టి కర్ణపాశసౌందర్యమునుకల స్వామి వనగిరికి దివ్యాలంకారమై వెల్గుచున్నాడు. **"కర్ణికా తవ కరీశ! కి మేషా కర్ణభూషణమ్? ఉతాంసవిభూషా"** అనుచు ఈ కవియే వరదరాజస్తవములో పల్కినట్లు సుందరబాహుస్వామి కర్ణాభరణము భుజములకును శోభను కల్గించుచున్నవి కాబోలు – అని వేఱొక వ్యాఖ్య. కావున **"సుసుందరభుజ"** అని అధికముగా వేరొక **"సువర్ణము ఘటితము"**. **"అతిసుందరత్వాత్ దివ్యావయవాంతరానుభవగమనప్రతిబంధకం విషయాంతరసంచారనిరోధకం వా భవతీత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంత తిలక.

**49. సదంససంసంజితకుంతలాంతికావతీర్ణకర్ణాభరణాఢ్యకంధరః ।**
**సుబంధురస్కంధనిబంధనో యువా సుసుందర స్సుందరదో ర్విజృంభతే ॥**

సదంస = చక్కని బాహువులలో, సంసంజిత = బాగుగా సక్తములైన, కుంతల = ముంగురుల, అంతిక = సమీపములో, అవతీర్ణ = క్రిందకు దిగిన, కర్ణ + ఆభరణ = కుండలములచే, ఆఢ్యకంధరః = అందము నిండిన కంఠమును కలవాడు, సుబంధుర = చక్కగా అమరియున్న, స్కంధనిబంధనః = బాహుస్కంధబంధములను కలవాడును, యువా = ఎల్లప్పుడు నిత్యయౌవనమును కలవాడును, సుందరదోః = అందమైన బాహువులను కలవాడును అగు, సుసుందరః = సుందరబాహుస్వామి, విజృంభతే = వర్ధిల్లుచున్నాడు.

**"కలివణ్డెఙ్గుమ్ కలన్దాల్పోల్ కమఴ్ పూఙ్కుఴల్కళ్ తదన్దోళ్కమేల్ మిళిరనిన్ఱు విళైయాడ"** అనియు, **"మైవణ్ణమ్నఱుఙ్కుఞ్జి కుఴల్ పిన్తాఴ మకరమ్‌శేర్ కుழை యిరుపాడిలఙ్గియాడ"** అనియు దివ్యసూరులు వేఱ్వేరుగా అనుభవించిన సౌందర్యములను కలిపి స్తుతించుట ఇందలి ప్రమేయము. **(సదంస.......కంధరః)** – అందమైన బాహువులపై వేలాడుచు, సక్తములై, కదలాడుచున్న కేశపాశమునకు సమీపమునగల గొప్ప మకరకుండలములచే ప్రకాశించు కంఠమును కలవాడై. **(సుబంధురస్కంధనిబంధనః)** స్కంధనిబంధనమనగా బాహుభుజస్కంధబంధము.

**(సుబంధురమ్)** – మిక్కిలి అందముగా నున్నది.

**(యువా సుసుందరః)** – వయస్సులోనున్న శరీరమును కలవాడైన – అని అర్థము. **"యువా కుమారః"** అని కదా వైదికసూక్తి. **"అరుమ్బినై అలరై"** అని దివ్యసూరిసూక్తి. **"కిళరొళి ఎన్‌కేశవనే"** అనునట్లు నిత్యయౌవనశాలియై, సుందరుడను పేరును కలవాడై.

**(సుసుందరః విజృంభతే )** – సుందరబాహుస్వామి వర్ధిల్లుచున్నాడు. దేశికులు అచ్యుత శతకములో – **"అకుమారయౌవనస్థితమ్ అహీంద్రపురనాథ అభిమత మనురూపమ్, నిత్యం స్వభావసిద్ధం శ్రూయతే సూరిమహితం సుఖం తవ రూపమ్"** అనుచు పలికిన సూక్తి ఇచట స్మరణీయము. వృత్తము – ఉపజాతి. అనుప్రాసరూపశబ్దాలంకారము స్పష్టము.

**50. వ్యూఢగూఢభుజజత్రు ముల్లసత్కంబుకంధరధరం ధరాధరమ్ ।**
**వృక్షషండమయభూభృత స్తటే సుందరాయతభుజం భజామహే ॥**

వ్యూఢ = దేనినైనను భరించు శక్తిని ( సామర్థ్యమును) కల్గినది, గూఢ = బలిసినది అగు, భుజజత్రు = భుజములకు – కంఠమునకు మధ్యనున్న భాగమును కల్గినవాడు, ఉల్లసత్ = మిక్కిలి ప్రకాశించు, కంబు = శంఖమువంటి, కంధరధరం = కంఠమును కలవాడు, ధరాధరమ్ = ఈలోకమును ధరించువాడు, సుందర + ఆయతభుజమ్ =



అందమైన, దీర్ఘములైన బాహువులను కలవాడగు స్వామిని, వృక్షషండమయ = వృక్షసమూహముతో నిండిన, భూభృతః = పర్వతముయొక్క, తటే = చఱియలో, భజామహే = సేవింతుము.

సుందరబాహుస్వామి భుజస్కంధబంధసౌందర్యమును కూరేశులు ఇందు స్తుతించుచున్నారు.

**(వ్యూఢగూఢభుజజత్రుమ్)** – స్కంధమునకు, కక్షమునకు మధ్యగల సంధికి జత్రువని పేరు. దానిపై భాగము భుజజత్రువనబడును. అది బలిష్ఠమై, అవ్యక్తమైయున్నదని భావము. మాంసలత్వాతిశయముచే ఆ సంధి అవ్యక్తమైయున్నది.

**(ఉల్లసత్కంబుకంధరధరమ్)** – శంఖమువంటి, అందమైన కంఠమును కల్గిన సుందరబాహుస్వామిని – అని అర్థము. రేఖాత్రయవిభక్తాంగమైన గ్రీవమునకు శంఖమును ఉపమానముగా పల్కుట కవిసమయము. శ్రీవరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములో **"కంబుప్రలంబమలిమ్లుచః"** అని ప్రయోగించుటను గమనింపనగును. కంఠమునకు వాచకమైన కంధరాశబ్దము స్త్రీ లింగము కావున, **"కంధరాధరమ్"** అనియే యుండనగును. కాని, ఇచట **"కంధరధరమ్"** అనియుండుటచే, బహువ్రీహిని చెప్పగోరి, విశేషణోభయపద కర్మధారయముగా చెప్పనగును. **"ఉల్లసంతీ కంబుకంధరా యస్య సః ఉల్లసత్కంబుకంధరః, ఉల్లసత్కంబుకంధర శ్చాసౌ ధర శ్చేతి"** అను విగ్రహమును చెప్పనగును – అని ఇచట శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"ఇతరథా కంధరశబ్దస్య స్త్రీలింగత్వవిరోధః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"కంధరా కంధరౌ సమౌ"** అని ద్విరూపకోశమున నుండుటచే కంధరశబ్దము పుంలింగమునకూడ నున్నట్లు తెలియుచున్నది. కావున **"కంధరధరమ్"** అనునది ఒకే అన్వయముగా గ్రహించుటలో దోషములేదు. **"నడైయాడుమ్ పతంజలి"** అని కీర్తింపబడిన కూరేశులు వచనమున లక్షణదోషము ఏ విధముగను ఉండదు. ఒకవేళ అట్టి నిఘంటువచనము లేకున్నను, సర్వజ్ఞులగు కూరేశుల ప్రయోగము మహాకవి ప్రయోగము కావున సాధువే అగును" అని వ్యాఖ్యానాంతరము. **"సర్వనిర్వాహకత్వేఽపి సౌలభ్యేనాఽస్మాదృశసంరక్షణాయ వనగిరినివాసినం సేవామహే ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత

**51. మందరభ్రమణవిభ్రమోద్భటా స్సుందరస్య విలసంతి బాహవః ।**
**ఇందిరాసమభినందభందనా శ్చందనాగరువిలేపభూషితాః ।**

మందర = మందరపర్వతమనెడి కవ్వమును, భ్రమణ = (పాలసముద్రమును మథించునపుడు) తిప్పుట అనెడి, విభ్రమ = లీలయందలి, ఉద్భటాః = మిక్కిలి ఆనందమును కల్గినవి, ఇందిరా = లక్ష్మిదేవిని, సమభినందన = బాగుగా ఆనందింపజేయుటలో, భందనాః

= మంగళకరమైన, చందన + అగరు = చందనము, అగరు – అను వీనియొక్క, విలేప = పూతలచే, భూషితాః = అలంకరింపబడినవి అగు, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క బాహవః = బాహువులు, విలసంతి = ప్రకాశించుచున్నవి.

వనగిరిలోని అర్చామూర్తికి **"సుందరబాహువు"** అని, **"శున్దరత్తోళుడైయాన్"** అనియు పేర్లు. ఆ స్వామి అందమైన బాహువులను ఈ శ్లోకమునుండి నాల్గు శ్లోకములలో కూరేశులు స్తుతించుచున్నారు. నాల్గు భుజములకు నాల్గు శ్లోకములను అనుగ్రహించిరి కాబోలు!

**(సుందరస్య బాహవః విలసంతి)** సుందరబాహుస్వామి చతుర్భుజుడు కావున **"బాహవః"** అను బహువచనము సార్థకము. ఆ బాహువులు అందముతో నిండినవై, వెల్గుచున్నవి. అవి ఎట్టివి? అనగా **(మందరభ్రమణవిభ్రమోద్భటాః)** – **"మన్దరమ్ నాట్టి యన్ఱు మదురక్కొழு ఞ్జాఱుకొణ్డ శున్దరత్తోళుడైయాన్"** అనుగోదాదేవి సూక్తినిబట్టి ఈ విశేషణ ప్రయోగము చేయబడినదని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య. సముద్రమును చిలికినపుడు మందరగిరిని కవ్వముగా నిలిపి, దానిని తిప్పుట – అనెడి విలాసమున ఉత్సాహమును పొందినవి ఈ బాహువులు. అనాయాసముగా మందరపర్వతమును తిప్పినవి – అని భావము. **"వాయు రస్మా ఉపామంథత్ పినష్టిస్మాకున్ననూ"** అని శ్రుతి ఈ సందర్భమును కీర్తించినది. **(ఇందిరాసమభినందభందనాః)** – మందర పర్వతమును తిప్పుటలోని చాతుర్యమును ప్రదర్శించుట ద్వారా శ్రీమహాలక్ష్మిని సంతోషింపజేసి, దానివలన ఆనందమును పొందినవి. **"విణ్ణవర్ అముదుణ అముదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ"** అను రీతిలో అమృతముకంటె మధురమగు లక్ష్మీదేవి అనెడి అమృతమును ఆస్వాదించిన స్వామి బాహువులు అగుటచే, **"శీదక్కడలుళ్ అముదు"** అనునట్లు అవతరించిన మహాలక్ష్మిని మనసార తడవి ఆమెను ఆనందింపజేసి, తద్వారా తామును ఆనందించినవి. **"యదర్థ మంబోధి రమంథి అబంధి చ"** అని యామునసూక్తి.

**(చందనాగరువిలేపభూషితాః)** – **"ఏవిఱ్ఱె చ్చెయ్‌వాన్ ఎన్ఱెదిర్‌న్దు వన్ద మల్లరై చ్చావ త్తకర్‌త్త శాన్దణితోళ్ శతురన్"** అనుచు భట్టనాథులు అనుగ్రహించుటను మనస్సున నుంచుకొని కూరేశులు ఇట్లు పల్కిరి. ఉత్తరమధురలో కుబ్జపూసిన చందనము గుర్తులు చెదఱిపోకుండ, మల్లులతో పోరాడి గెల్చిన బాహువులే ఇవి అను విషయమును చూపుచున్నవని భావము. **"పయోధిమథనకాల ఏవ లక్ష్మ్యాః ప్రాదుర్భావాత్ మందరభ్రమణవిభ్రమోద్భటత్వమ్ ఇందిరాసమభినందనభందనత్వే హేతు రితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము పూర్వము వలెనే రథోద్ధత.

**52. జ్యాకిణాంకపరికర్మధర్మిణో భాంతి సుందరభుజస్య బాహవః ।**



**పారిజాతవిటపాయితర్ధయః ప్రార్థితార్థపరిదానదీక్షితాః ॥**

జ్యాకిణాంక = (అవతారదశలో అసురులతో పోరాడినపుడు) వింటినారి (భుజములకు) తగులుటచే ఏర్పడిన కాయలు అనెడి, అంక = గుర్తులనే, పరికర్మధర్మిణః = అలంకారములుగా కల్గినవి, పారిజాత = పారిజాతవృక్షముయొక్క, విటపాయిత = కొమ్మలవలె, ఋద్ధయః = (దాన) సమృద్ధిని కల్గినవి, ప్రార్థిత = కోఱిన, అర్థ = ధర్మార్థ కామ మోక్షరూపపురుషార్థములను, పరిదాన = సమగ్రముగా ఇచ్చుటను, దీక్షితాః = వ్రతముగా కల్గినవి అగు, సుందరభుజస్య = సుందరబాహుస్వామియొక్క, బాహవః = బాహువులు, భాంతి = ప్రకాశించుచున్నవి.

ఈ శ్లోకమునకూడ బాహువర్ణనమే చేయబడుచున్నది, **"దానేన పాణి ర్న తు కంకణేన"** అని కదా కవివాక్కు. అట్లు ఉదారముగా అనుగ్రహించునవి, వీర్యచిహ్నములగు అల్లెతాడు దెబ్బల వలన ఏర్పడిన కాయలను గుర్తుగా కల్గినవి స్వామి బాహువులు.

**(జ్యాకిణాంకపరికర్మధర్మిణః)** – మహావీరుని బాహువులనుటను చూడగానే తెలుపుచున్నవి – జ్యాకిణాంకములు. **"తழும்பిరున్ద శార్‌ఙ్గనాణ్ తోయ్‌న్దవా మజ్గై"** అను పోయ్‌కై ఆళ్వార్ల పాశురమును మనస్సున నుంచుకొని ఈ విశేషణమును ప్రయోగించిరి – అని శ్రీప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. శ్రీయాములును **"చకాసతం జ్యాకిణకర్కశైః శుభైః చతుర్భి రాజానువిలంబిభిః భుజైః"** అని పరదశనుగూర్చి పలుకగా, ఇక అర్చామూర్తిపట్ల అనుసంధించుటలో ఏమి లోటు? శ్రీ శార్ఙ్గముయొక్క అల్లెతాడు కాయలతో అలంకరింపబడినవి. విభవతారములందు ఆశ్రితవిరోధులను సంహరించుటకు పలు యుద్ధములను చేసి, ఆ యుద్ధములలో అల్లెతాడు ఘాతములు తగులుట వలన కల్గిన కాయలు ఆ అవతారదశలో శ్రీరామకృష్ణాదిమూర్తుల బాహువులను అలంకరించియున్నవి. అవియే అర్చావతారములందును కూరేశుల ప్రత్యక్‌దృష్టికి గోచరములగుచున్నవి. పరవాసుదేవుని దేహమున, అర్చారూపమున వింటినారి గుర్తులు ఉండునా? అను సందేహమునుగూర్చి దేశికులు స్తోత్రభాష్యములో **''అవతారదశాయాం విరోధినిరాకరణార్థవ్యాపారత్వవ్యంజకైః జ్యాకిణై రంకితత్వం పరవిగ్రహభుజేష్వపి తదభేదానుసంధానేన నిర్దిశతి"** అని సమాధానమును పల్కిరి. కావున అవతారదశలోని రూపమును, అర్చామూర్తిని, కూరేశులు తమ భావనా ప్రకర్షవలన ఒకటిగా భావించి ఇట్లు పల్కిరి అనదగును. బాహువులన్నిటియందు కిణాంకములున్నట్లు చెప్పుటచే స్వామి సవ్యసాచి అని తెలుపబడినట్లయినది. **"సర్వేషా మపి భుజానాం మౌర్వ్యాఘాతోక్తేః సవ్యసాచిత్వ మపి సిద్ధమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇట్టి వివరణమే దేశికుల గద్య భాష్యమునను కలదు.

**(పారిజాతవిటపాయితర్ధయః)** – పారిజాతకల్పవృక్షముల శాఖలా ఇవి! అనునట్లున్న సమృద్ధిని కల్గినవి. **''కఱ్పకక్కావన నఱ్పలతోళర్‌క్కు"** అని కదా ఆళ్వార్లసూక్తి – కావుననే,

**(ప్రార్థితార్థపరిదానదీక్షితాః)** – అడిగినవారి కోరికలను అన్నిటిని అనుగ్రహించుట – అను దీక్షను కల్గినవి. **"అల్పమ్బురిన్ద నెదున్దడక్కై"** అని, **"కొళ్ళక్కుఱైయిల్లై వేణ్డిఱ్ఱెల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్‌వళ్ళల్ మణివణ్ణన్"** ఇత్యాదిగాకల పలు దివ్యసూరి సూక్తుల భావ మిచట స్మరణీయము. దీనివలన ప్రార్థించిననే భగవానుడు సకలవిధపురుషార్థములను అనుగ్రహించుననని సూచింపబడినది. **"సర్వజ్ఞోఽపి హి సర్వేశః సదా కారుణికోఽపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్షాపేక్షాం ప్రతీక్షతే", "కృతకప్రయత్నాపేక్ష స్తు సాపేక్షత్వాత్"** ఇత్యాది ప్రమాణములు అనుసంధేయములు. **"అర్థ్యతే పురుషైః ఇతి పురుషార్థః"** అనికదా పురుషార్థ శబ్దవ్యుత్పత్తి. కావున, పురుషుడు అర్థింపగా, భగవానుడు అనుగ్రహించునది పురుషార్థము. ఈ అంశము ప్రకృతమున **"ప్రార్థితార్థ"** శబ్దప్రయోగముద్వారా సూచితము. నాల్గవ, మూడవ పాదములమధ్య హేతుహేతుమద్భావము భావనీయము. **"విశేషణద్వయప్రతిపాదితశౌర్యానుగుణ వృత్తాయతపీనత్వౌదార్యరూపసంపత్"** అనుచు బుద్ధి శబ్దార్థము శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది. **"శౌర్యౌదార్యే ఏవ భుజశోభాహేతు రితి భావః"** అని ఆ వ్యాఖ్యలోని వివరణము. వృత్తము రథోద్ధత.

**53. సాగరాంబరతమాలకాననశ్యామలర్ధయ ఉదారపీవరాః ।**
**శేషభోగపరిభోగభాగిన స్తన్నిభా వనగిరీశితు ర్భుజాః ॥**

సాగర + అంబర = (నల్లని) ఆకాశమువలె, (సముద్రమువలె), తమాల = (కాటుకచెట్టు) తమాలవృక్షముల, కానన = అరణ్యమువలె, శ్యామల = నల్లనివై, ఋద్ధయః = సమృద్ధిని కల్గినవి, ఉదారపీవరాః = దానము ఇచ్చుటలో సాటిలేనివి, బలిష్ఠములైనవి, శేషభోగ = ఆదిశేషుని శరీరమునందు, పరిభోగ = శయనించుటలో, భాగినః = భాగమును కల్గినవి, తన్నిభాః = ఆ ఆదిశేషుని శరీరమువంటివి అగు, వనగిరీశితుః = వనగిరిప్రభువుయొక్క భుజాః = బాహువులు, భాంతి = వెలుగుచున్నవి.

ఈశ్లోకముకూడ సుందరబాహుస్వామి బాహుసౌందర్యమును కీర్తించుచున్నది. **(సాగరాంబరతమాలకాననశ్యామలర్ధయః)** – సముద్రము అని, ఆకాశము అని, పచ్చని వనము అని చెప్పదగినట్లు హరితవర్ణమును కల్గినవి. ఇవి కేవలము వర్ణమునకు మాత్రమే కాక, వైశాల్యమునకును ఉపమానములు.

**(ఉదారపీవరాః) "ఉదారో దాతృమహతోః"** అను నిఘంటువచనమునుబట్టి ఉదారపదముచే దాతృత్వము, మహత్వమును ఇచట వివక్షితములు. దీర్ఘములును, బలిష్ఠములును – అని తాత్పర్యము.

**(శేషభోగపరిభోగభాగినః)** – ఆదిశేషుని తిరుమేనిపైనుండి ఆనందానుభవమును పొందునవి. **"వెళ్ళై వెళ్ళత్తిన్ మేలొరు పామ్బై మెత్తైయాక విరిత్తు"** అనునట్లు క్షీరాబ్ధిపై తెల్లని దేహమునుకల



ఆదిశేషుని పడుకగా పఱచి, దానిపై దొంగనిద్రను పొందునపుడు **"తన్ తాళుమ్ తోళుమ్ ముడికళుమ్ శమనిలాద పల పరప్పి"** అను రీతిలో తన పలు పాదములను, బాహువులను శ్రమ లేకుండ విస్తరించి, నిద్రించు సన్నివేశమును తలచి ఇట్లు ప్రయోగింపబడినది. **"ఆయిరుమ్ తోళ్ పిరప్పి ముడియాయిరుమ్ మిన్నిలక ఆయిరమ్ పైన్దలైయ అనన్దశయన నానాళుమ్ మలై మాలిరుమ్‌శోలైయతే"** అను పెరియాళ్వార్ల పాశుర మిచట అనుసంధేయము.

**(తన్నిభాః)** – స్వామి **"భోగిభోగశయనీయశాయి"** అనుట పూర్వమే తెలుపబడినది. అంతమాత్రమే కాదు, ఆ ఆదిశేషుని తిరుమేనితో స్వామి బాహువులు సామ్యమును కల్గినవనుట దీనిచే చెప్పబడినది. ఇట్టి వర్ణనమును శ్రీరంగరాజస్తవములోకూడ చూడనగును. ఇట్టివి వనగిరీశుని బాహువులు.

"సముద్రము పలు వర్ణములను కల్గినదైనను, దానిని నీలవర్ణము కల్గినదిగా పల్కుట కవిసంప్రదాయము. **"విణ్ణీల"** ఇత్యాది ప్రయోగములలో ఆకాశము నీలవర్ణము కల్గినదిగా వర్ణింపబడినది. ఇవి రెండును నీలవర్ణమును కల్గియుండుటకు ఉపమానములు. మిగిలినది హరితవర్ణమునకు ఉపమానము. ఉపమేయమును మఱింత స్పష్టీకరించుటకు పలు ఉపమానములను కవులు పల్కుదురు. **"మైయార్ కడలుమ్ మణివరైయుమ్ మాముకిలుమ్ శెయ్యార్ కువళైయుమ్ కాయావుమ్ పోన్ఱిరుణ్డ మెయ్యానై"** అని తిరుమజ్గైయాళ్వార్ల పాశురము ఇందులకు ఒక ఉదాహరణము " అని వ్యాఖ్యానాంతరము. వృత్తము రథోద్ధత.

**54. అహమమికాభాజో గోవర్ధనోద్ధృతినర్మణి**
**ప్రమథనవిధా వబ్ధే ర్లబ్ధప్రబంధసమక్రియాః ।**
**అభిమతబహూభావాః కాంతాభిసరణసంభ్రమే**
**వనగిరిపతే ర్బాహాః శుంభంతి సుందరదో ర్వరేః ॥**

గోవర్ధన = గోవర్ధన మనెడి పర్వతమును, ఉద్ధృతినర్మణి = ఎత్తి పట్టుకొనుట అనెడి లీలయందు, అహమహమికాభాజః = నేను ముందు నేను ముందు అను స్థితిని పొందినవి, అబ్ధేః = పాలసముద్రముయొక్క, ప్రమథనవిధౌ = మథించుట అనెడి క్రియయందు, లబ్ధ = పొందబడిన, ప్రబంధ = ప్రయత్నములో, సమక్రియాః = ఒకే విధమైన వ్యాపారమును కల్గినవి, కాంతా = భార్యయగు లక్ష్మీదేవిని, అభిసరణ = కౌగలించుకొనుట అనెడి, సంభ్రమే = తొందరలో, అభిమతబహూభావాః = ఇంకను కొన్ని బాహువులున్నచో బాగుండును కదా! అనెడి భావమును కల్గినవి అగు, వనగిరిపతేః = తిరుమాలిరుమ్‌శోలైకు అధిపతియగు, సుందరదోర్వరేః = సుందరబాహుస్వామి అనెడి భగవానునియొక్క, బాహాః = బాహువులు, శుంభంతి = ప్రకాశించుచున్నవి.

ఈ శ్లోకముతో స్వామి బాహువర్ణము పూర్తి అగుచున్నది.

**(వనగిరిపతేః సుందరదో ర్వరేః బాహాః శుంభంతి)** – తిరుమాలిరుమ్‌శోలైకు నాథుడగు సుందరబాహుస్వామి బాహువులు మిక్కిలి ప్రకాశించుచున్నవి. అవి ఎట్టివి? అనగా – **(గోవర్ధనోద్ధృతినర్మణి అహమహమికాభాజః)** – గోవర్ధనమను పర్వతమును గొడుగుగా ఎత్తి పట్టుకొనిన దివ్యలీలావిశేషములో "నేను ముందు! నేను ముందు!" అను స్థితిని పొందినవి. గోవర్ధనపర్వతమును స్వామి శ్రీకృష్ణావతార సమయమున ఉద్ధరించెను. కంసవధవరకు దేవకిప్రార్థనను అనుసరించి, ద్విభుజుడుగానే రేపల్లెలో భగవానుడుండెనని పురాణేతిహాసాదులలో తెలియుచున్నది. ఇట్లుండగా, ఇచట కూరేశులు గోవర్ధనపర్వతమును స్వామి ఎత్తినపుడు స్వామి బాహువులను బహువచనముతో నిర్దేశించుట ఎట్లు అర్థవంతము? అను ప్రశ్నకు తావులేదు. ఇది **"నెయ్‌త్తలై నేమియుమ్ శఙ్గుమ్ నిలావియ కైత్తలఙ్గళ్ వన్దు కాణీరే"** అను భట్టనాథసూక్తి వంటిది. **"అయతా శ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః "** అనుచు ఋష్యమూక గిరిలో శ్రీరాముని, సేవించి ఆ స్వామిని చతుర్భుజునిగా హనుమానుడు పల్కుటవంటిది. **"కైయినార్ శురిశఙ్గనలాழియర్"** అనిరి తిరుప్పాణ్ పెరుమాళ్ కూడ. **"అహమహమికా"** శబ్దమునకు **"అహం పూర్వ మహం పూర్వ మితి యా ప్రవృత్తిః సా అహమహమికా"** అను విగ్రహము చెప్పనగును. దీనివలన ఉత్సాహాతిశయము వ్యక్తము. గొప్ప ఉత్సాహముతో గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తిపట్టుకొనెనని భావము.

**(అబ్ధేః ప్రమథనవిధౌ లబ్ధప్రబంధసమక్రియాః)** – సముద్రమును చిలుకు వ్యాపారము (ప్రయత్నము)ను చేయు దేవాసురులతో పాటు తామును ఆ వ్యాపారమును చేసినవి. ప్రబంధమనగా ప్రయత్నము, **"లబ్ధప్రబంధాః"** –అనగా ప్రయత్నించినవారు. వారు దేవతలు, రాక్షసులును. వారు అలసి సొలసినపుడు ఆ క్రియను స్వామిబాహువులే నిర్వహించినవి. **"అరఙ్గనే తరఙ్గనీల్ కులుఙ్గ వన్దు కున్దుశూழ் మరఙ్గళ్ తేయ మానిలమ్ కులుఙ్గ మాశుణమ్ శులాయ్, నెరుఙ్గ నీ కడైన్ద పోదు నిన్ఱశురర్ ఎన్ శెయ్‌దార్"** అను తిరుచ్ఛన్దవిరుత్త పాశురమును గమనింపనగును. **"వఙ్గక్కడల్ కడైన్ద"** అని గోదాసూక్తి. ప్రకృత ప్రయోగమును కూరేశులు శిలప్పదికారమను ద్రావిడ ప్రబంధములో ఇళఙ్కోవన్ అడికళ్ చేసిన వర్ణనను అనుసరించి చేసిరని వ్యాఖ్యానాంతరము.

**(కాంతిభిసరణసంభ్రమే అభిమతబహూభావాః)** – పాలసముద్రమును మథనమును చేసినపుడు ఆ సముద్రమునుండి లక్ష్మీదేవి ఆవిర్భవింపగా, ఆమెను కౌగిలించు సంభ్రమములో స్వామి బాహువులు విష్వగ్రూపమును ధరింపగోరినవి. రెండుగా, నాల్గుగా నుండి ఆలింగనము చేసికొనుటతో తృప్తిని పొందక పోవుటచే తాము ఇంకను అనేకములుగా కావలయునని సంకల్పించినవి అని భావము.



"భగవానుడు చతుర్భుజుడుగా ప్రసిద్ధుడు. వేదము **"ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణే న శతబాహునా"** అనుచు నూఱు బాహువులతో భూదేవిని ఆర్తితో స్వామి కౌగిలించుకొనెనని పల్కినది. **"అల్లిమాతర్ పుల్క నిన్ఱ అయిరమ్‌తోళన్"** అనుచు తిరుమఙ్గెయాழ్వార్ ఆహోబిలములోని స్వామిని కీర్తించిరి. **"అనేకబాహూదరవక్త్రనేత్రమ్"** అనుచు విశ్వరూపమును అర్జునుడు కీర్తించెను. వీనిని అన్నింటిని దృష్టిలో నుంచుకొని కూరేశులు భగవానుని చతుర్భుజములే కొన్ని సమయములలో పలు బాహువులుగా అగుచున్నవనిరి. ఒకానొక సమయమున శ్రీరంగనాథునకు "నాకు కేవలము నాల్గు చేతులు మాత్రమే ఉన్నవే! ఇంకను కొన్ని చేతులున్న ఎంత బాగుండును" అను తలపు కల్గినదట. అది ఎపుడు? ఎట్లు?, అనగా – **"కచకుచచిబుక్రాగే పాణిషు వ్యాపృతేషు ప్రథమజలధికన్యాసంగమే రంగభర్తుః, గ్రథితనిబిడనీవీగ్రంథవిస్రంభనేచ్ఛోః చతురధికభుజాశా శార్ఙ్గిణో వః పునాతు"** –లక్ష్మీదేవియొక్క కేశపాశము, వక్షఃస్థలము, చిబుకము – అను వీని యందు క్రమముగా భగవానుని మూడు చేతులను ఏకాంతకాలమున అభినివేశమును పొందినవి. మిగిలిన చేతితో నీవీబంధమును విప్పుటకు పలుసార్లు ప్రయత్నించినను వీలు కాలేదట. అపుడు స్వామి "అయ్యో! వేఱొక బాహువు ఉండియుండినచో ఎంత బాగుండెడిది! అట్లు లేకుండ పోయినదే! అని వాపోయెనట. నాల్గు బాహువులకు మించి వేఱొక బాహువు కావలయునను అట్టి ఆశ మిమ్ములను రక్షించుగాక!" అను భావమునిచ్చు ఈ శ్లోకము ప్రకృతప్రయోగమును వ్యాఖ్యానించుచున్నదనదగును. వృత్తము హరిణి. **"రసయుగహయైః న్సౌ మ్రౌ గౌ యదా హరిణీ తదా"** అని లక్షణము.

**55.** **శ్రీమద్వనాద్రిపతిపాణితలాబ్జయుగ్మమ్**
**అరూఢయో ర్విమలశార్ఙ్గరథాంగయో స్తు ।**
**ఏకోఽబ్జ మాశ్రిత ఇవోత్తమరాజహంసః**
**పద్మప్రియోఽర్క ఇవ తత్సమితో ద్వితీయః ॥**

శ్రీమద్వనాద్రిపతి = తిరుమాలిరుమ్‌శోలైకు ప్రభువు అగు సుందరబాహుస్వామి యొక్క, పాణితల = కరతలమనెడి, అబ్జయుగ్మం = రెండు తామరపూలను, ఆరూఢయోః = అధిరోహించిన, విమలశంఖ = తెల్లని శంఖము, రథాంగయోః తు = సుదర్శనము అను వీనిలో, ఏకః = ఒకటి అగు శంఖము, అబ్జమ్ ఆశ్రితః =తామరను పొందిన, ఉత్తమరాజహంసః ఇవ = గొప్ప రాజహంసవలె, ద్వితీయః తు = రెండవది అగు సుదర్శనము, పద్మప్రియః = తామరపూవుపట్ల గొప్ప ప్రేమను కల్గిన, అర్కః ఇవ = సూర్యునివలె (ప్రకాశించుచున్నవి).

సుందరబాహుస్వామి కరతలద్వయములో శోభిల్లు సుదర్శనపాంచజన్యములను

ఇందు కవి అనుభవించుచున్నారు.

**(శ్రీమద్వనాద్రిపతిపాణితలాబ్జయుగ్మమ్ అరూఢయోః)** – సుందరబాహుస్వామి రెండు కరతలములను అధిరోహించిన – అని అర్థము. **"ఊఴియాన్ కైత్తలత్తిదరిల్ కుడియేతి"** అని, **"వడమదురైయార్ మన్నన్ వాశుదేవన్ కైయిల్ కుడియేతి వీఱ్ఱిరున్దాయ్ కోలప్పెరుమ్ శఙ్గే"** అనియును గోదాదేవి అనుగ్రహించిన సూక్తిని అనుసరించి ఇచట **"ఆరూఢ"** శబ్ద ప్రయోగము చేయబడినది.

**(విమలశంఖరథాంగయోః)** – **"వెళ్ళై విళి శఙ్గమ్"**, **"వెళ్ళై చ్చురిశఙ్గు"** అనునట్లు స్వచ్ఛమైన శంఖము, సుదర్శనము – అను వీనియందు, **(ఏకః అబ్జ మాశ్రితః ఉత్తమరాజహంసః ఇవ)** – ఒకటి అగు శ్రీపాంచజన్యము తామరను ఆశ్రయించిన రాజహంసవలె నున్నది. నాచ్చియార్ తిరుమొఴిలోని **"శెఙ్గమల నాణ్మలర్మేల్ తేనుకరుమ్ అన్నమ్పోల్, శెఙ్గట్కరుమేని వాశుదేవనుడైయ అఙ్గైత్తల మేతి ఉన్నవశమ్ శెయ్యుమ్ శఙ్గరైయా! ఉన్‌శెల్వమ్ శాల వఴికియదే"** అను పాశురార్థమును స్పృశించుచు ఇట్లు పలుకబడినది. **"ఉరకమెల్లణైయాన్ కైయిల్ ఉఱై శఙ్గమ్ పోల్ మడవణ్ణమ్"** అను పెరియాళ్వార్ల (4-4-4) సూక్తియు స్మరణీయము. దేశికులు ఈ భావమును సుభాషిత నీవిలో **"హరికరపుష్కరహంసం.......పాంచజన్యమ్"** ఇత్యాదిగా అనువదించిరి

**(ద్వితీయ స్తు తత్సమితః పద్మప్రియః అర్క ఇవ)** – వేఱొకటి అగు సుదర్శనము తామరపూవులో వేంచేసియున్న సూర్యునివలె వెలుగుచున్నది. సూర్యుడు తామరలో నుండుటకు ప్రసక్తి ఏమి? అనుటకు – **"పద్మప్రియ"** అనునది సమాధానము. ఇది హేతుగర్భవిశేషణము. సూర్యుడు కమలబాంధవుడగుటచే కమలములో రెండు తామరపూవులు కావున, ఒక తామరలో హంస అమరియుండి శంఖముగా ప్రకాశించుచున్నది, వేఱొక తామరలో సూర్యుడు వచ్చి నిలచి, సుదర్శనముగా ప్రకాశించుచున్నాడు – అని తాత్పర్యము. **"సమితః"** అనగా **"సమ్యక్ ఇతః – ప్రాప్తః"**. **"ఇణ్ – గతౌ"** అను ధాతువునుండి పుట్టిన కర్తరి క్త ప్రత్యయాంత రూపము **'ఇతః'** అనునది.

శంఖమును మొదట ప్రస్తుతించుటకు కారణము ఏమనగా – అది భగవానుని మోక్షప్రదత్వమును తెలుపుటచే, గద్యభాష్యములో దేశికులు – **"సృష్టిబీజం తథా పద్మం చక్రం స్థితినిబంధనమ్, గదా సంహారబీజం తు శంఖం ముక్తినిబంధనమ్"** అను పరమసంహితా వచనమును ఉదాహరించుచు, ఈ అంశమును వివరించిరి. వృత్తము వసంత తిలక.

**56. లక్ష్మ్యాః పదం కౌస్తుభసంస్కృతం చ శ్రీవత్సభూమి ర్విమలం విశాలమ్ ।**



**విభాతి వక్షో వనమాలయాఽఽఢ్యం వనాద్రినాథస్య సుసుందరస్య ॥**

వనాద్రినాథస్య = వనాద్రికి నాథుడగు, సుసుందరస్య = గొప్ప అందమునుకల సుందరబాహుస్వామియొక్క, వక్షః = వక్షఃస్థలము, లక్ష్మ్యాః = లక్ష్మీదేవియొక్క, పదం = నిత్యవాసమును చేయు స్థలముగా, కౌస్తుభసంస్కృతమ్ = కౌస్తుభమణిచే అలంకరింపబడినదిగా, శ్రీవత్సభూమిః = శ్రీవత్సమను పుట్టుమచ్చకు స్థానముగా, విమలం = నిర్మలముగా, విశాలమ్ = విశాలమైనదిగా, వనమాలయా = వైజయంతి అనెడి, వాడని పూలచే నిర్మింపబడిన, కంఠమునుండి పాదములవరకుగల వనమాలచే, ఆఢ్యమ్ = మహనీయమైనదిగా, విభాతి = ప్రకాశించుచున్నది.

శ్రీసుందరబాహుస్వామి వక్షఃసౌందర్యమును కవి వర్ణించుట ఇందలి విషయము. స్వామి వక్షఃస్థలములో అమరియున్న వానిని అన్నిటిని ఒకేసారి అనుభవించిన వైలక్షణ్యము ఇందు కానవచ్చును.

**(లక్ష్మ్యాః పదం)** – **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గైయుఱైమార్బా"** అనియు, **"పూవార్ తిరుమామకళ్ పుల్కియ మార్బా"** అనియు పల్కురీతిలో లక్ష్మీదేవికి నిత్య నికేతనము స్వామి వక్షము. **"పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"** అనునట్లు లక్ష్మీదేవి స్వయముగా ఆశపడి చేరినచోటు కదా ఇది. పదమును పదము పాదమును కూడ తెలుపును., అందుచే **"పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షారసాంకమ్"** ఇత్యాదిగా అభిజ్ఞులగు ఆచార్యులు పల్కినరీతిలో ప్రణయకలహాదులచే లాక్షారసాంకితమైన పాదముల ముద్రలు ఏర్పడిన చోటు అనియు చెప్పనగును. బ్రహ్మచారి వేషమునుకల వామనావతారములోకూడ భగవానుని లక్ష్మీదేవి విశ్లేషింపలేదు అనుటను వ్యాసమహర్షి **"కృష్ణాజినేన సంవృణ్వన్"** అని తెలిపిరి. దేశికులు దేహళీశస్తుతిలో **"భిక్షోచితం ప్రకటయన్ ప్రథమాశ్రమం త్వం కృష్ణాజినం యవనికాం కృతవాన్ ప్రియాయాః"** అనుచు ఈ అర్థమును అనుసంధించిరి.

**(కౌస్తుభసంస్కృతం చ)** – **"కురుమామణి పూణ్ కులావి తికఴుమ్"** అనునట్లు కౌస్తుభమణిచే అలంకృతము స్వామి వక్షము. ఈ రత్నము క్షీరాబ్ధి మథనమున వెలువడినది. **"రత్నహారీ చ పార్థివః"** అనునట్లు లక్ష్మి అను వధూరత్నముతో పాటు ఈ రత్నముకూడ స్వామి సొంతమైనది. ఇది జీవరాశికి అభిమానదేవత అనుట విష్ణుపురాణములోని అస్త్రభూషణాధ్యాయమున వ్యక్తము. **"కాశియున్ వరై యనైత్తుమ్ కాయావణ్ణన్ కడైన్దెడుత్త కౌత్తువత్తిన్ శీర్మై క్కొవ్వా"** అనుచు దేశికులు భగవానుడు దీనిని అభిమానముతో దాల్చుననిరి.

**(శ్రీవత్సభూమిః)** – **"తిరుమఱుమార్బన్"** అనునట్లు శ్రీవత్సమనెడి శ్వేతరోమావర్త

విశేషమునకు స్థానము. దీనిని కవులు నల్లనిగా, తెల్లనిదిగా, పచ్చనిదిగా, ఎఱ్ఱనిదిగా – ఇట్లు పలు రీతులలో వర్ణించిరి. దీనిని కిణవిశేషము (కాయ) అను వారును కలరు. భృగుమహర్షి పాదముతో స్వామివక్షమున తాకినప్పటినుండి ఇది ఏర్పడినదని, దూర్వాసుడు పాదము మోపుటచే ఏర్పడినదనియు కొన్ని పురాణముల కథనము.

**(వనమాలయా ఆఢ్యమ్) – "ఆపాదచూడం యా మాలా వనమాలేతి కథ్యతే"** అను సూక్తి చొప్పున శిరస్సునుండి పాదములవరకు వెలుగునట్టి వనమాలచే శోభిల్లునది. పలు విధములైన పూలచే నిర్మింపబడినదిగా, తులసిచేతనే కట్టబడినదిగా, ఎనిమిది విధములైన పూలచే కూర్చబడినదిగా – ఇట్లు పలురీతులలో వనమాల వర్ణింపబడినది. **"లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్"** అను స్తోత్రరత్నసూక్తిని దేశికులు వ్యాఖ్యానించుచు పల్కిన సూక్తులిచ్చట స్మరణీయములు. ఇది ఉభయవిభూతులకు అభిమానదేవత అని అస్త్రభూషణాధ్యాయప్రోక్తము. **"ఇరుపూతమాలై వనమాలైయాక"** అనుచు దేశికుల అధికారసంగ్రహములోని సూక్తి ఇచట స్మరణీయము. ఇట్టి వైభవమును సంతరించుకొన్నది స్వామి దివ్యవక్షస్సు. వృత్తము – ఉపజాతి. ఉదాత్తాలంకారము.

**57. సౌందర్యామృతసారపూరపరివాహావర్తగర్తాయితం**
**యాతః కించ విరించిసంభవనభూమ్యంభోజసంభూతిభూః ।**
**నాభిః శుంభతి కుంభికుంభనిభనిర్భాతస్తనస్వర్వధూ –**
**సంభుక్తద్రుమషండశైలవసతే రారూఢలక్ష్మ్యా హరేః ॥**

కుంభికుంభ = గజములయొక్క కుంభస్థలముతో, నిభ = సమానమైన, నిర్భాతస్తన = వెలుగునట్టి స్తనములనుకల, స్వర్వధూ = దేవతాస్త్రీలగు రంభ, మేనక మొదలగువారిచే, సంభుక్త = మిక్కిలి అభినివేశముతో అనుభవింపబడిన, ద్రుమషండశైల = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును, వసతేః = నివాసముగా కల్గిన, ఆరూఢలక్ష్మ్యాః = **"ఏఱు తిరువుడైయాన్"** అని పొగడబడు, హరేః = స్వామియొక్క, నాభిః = నాభిః, సౌందర్య + అమృతసార = సౌందర్యము అనెడి అమృతసారముయొక్క, పూరపరివాహ = మహా ప్రవాహముయొక్క, ఆవర్తగర్తాయితమ్ = సుడులచే ఏర్పడిన గుంటవలెనున్న స్థితిని, యాతః = పొందినదిగను, కించ = మఱియు, విరించిసంభవనభూమి = బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన, అంభోజ = నాభీపద్మముయొక్క, సంభూతిభూః = జన్మస్థానముగను, శుంభతి = ప్రకాశించుచున్నది.

సుందరబాహుస్వామి నాభీశోభను ఇందు కూరేశులు వర్ణించుచున్నారు. **"కొప్పూழ் – లెழుకమలప్పూవழகర్"** అనుచు గోదాదేవి వర్ణించిన రీతిలో స్తుతించుచున్నారు.

**(కుంభికుంభనిభనిర్భాతస్తనస్వర్వధూసంభుక్తద్రుమషండశైలవసతేః)** – ఏనుగు కుంభస్థలమువలె వెలుగుచున్న స్తనములనుకల దేవతాస్త్రీలు (ఊర్వశి, మేనక, రంభ, తిలోత్తమాదులు) వచ్చి ప్రార్థించి, సేవించు స్థలమగు తిరుమాలిరుమ్‌శోలైను



నివాసస్థలముగాకల స్వామియొక్క నాభి ఎట్లున్నదనుట రెండు విశేషణములతో తెలుపబడుచున్నది.

**(సౌందర్యామృతసారభూతపరివాహావర్తగర్తాయితం యాతః)** – సౌందర్యమనెడి అమృతప్రవాహము ప్రవహింపగా, అందు పుట్టిన సుడియా ఇది! అనునట్లున్నది. మహాప్రవాహము ఉన్నచోట సుడులు ఏర్పడుట సహజముకదా! సుందరబాహుస్వామి తిరుమేని అంతయు గొప్పగా ప్రవహించుచున్న సౌందర్యప్రవాహముయొక్క వేగముచే ఏర్పడిన సుడియే నాభి అని వ్యవహరింపబడుచున్నది. **"భగవదనుభవివశరుడైయ అభినివేశపాశపరిభ్రామిత మతిమంథానమథ్యమాన సౌందర్యదుగ్ధసింధువానదు శుఱోరమ్ తిరన్దెழున్దు నడుక్కுழிన్దిట్ట శుழிపెఱ్ఱ శున్దరమామ్ ఉన్ది మలరుమ్"** అను భగవద్రామానుజ అభిషేకగద్యలోని సూక్తి ఇందులకు అనుగుణముగా అనుసంధేయము. అంతియేకాదు. స్వామినాభి –

**(విరించిసంభవనభూమి.............అంభోజసంభూతిభూః) – "ఉయ్య ఉలకు పడైక్క వేణ్డి ఉన్దిమేల్ తోఱ్ఱినాయ్ నాన్ ముకనై"** అనియు, **"తన్నాభివలయత్తు ప్పేరొళిశేర్ మన్నియ తామరై మామలర్పూత్తు, అమ్మలర్మేల్ తిశైముకనై త్తాన్ పడైక్క"** అనియును చెప్పబడునట్లు చతుర్భుజునకు జన్మస్థానము. **"హస్తిమస్తకతుల్యదీప్తస్తనసురసుందరీపరిభుక్తో వనాద్రి రిత్యనేన అద్రే రౌన్నత్యభోగ్యతే జ్ఞాపితే, సుందరబాహోః ప్రత్యేకం తత్తదవయవసౌందర్యస్య అమృతసారత్వమ్ అవయవసముదాయసౌందర్యస్య పూరత్వమ్, నాభే స్తదేకదేశావర్తత్వం చోత్ప్రేక్ష్యతే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**58. సుందరస్య కిల సుందరబాహోః శ్రీమహాతరువనాచలభర్తుః ।**
**హంత యత్ర నివసంతి జగంతి ప్రాపితక్రశిమతత్తనుమధ్యమ్ ॥**

శ్రీమహాతరు = పెద్దపెద్ద వృక్షములనుకల, వనాచల = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు, భర్తుః = ప్రభువు, సుందరబాహోః = సుందరబాహువులనుకల, సుందరస్య = **"అழகర్"** అను పేరునుకల స్వామియొక్క, యత్ర = ఏ దేహప్రదేశమునందు, జగంతి = ఈ లోకములన్నియు, నివసంతి = నివసించుచున్నవో, తత్ = అట్టి, తనుమధ్యమ్ = దేహములోని మధ్యభాగము, ప్రాపితక్రశిమ కిల = మిక్కిలి కృశించిన దశను పొందినది కదా! హంత = ఆశ్చర్యము.

సుందరబాహుస్వామి దివ్యదేహములోని మధ్యభాగము (నడుము) ఇందు వర్ణింపబడుచున్నది. హరివంశములోని ఆశ్చర్యోపాఖ్యానములో తెలుపబడినట్లు భగవానుడు వటపత్రమున బాలకుని రూపములో సప్తలోకములను గ్రసించి **"(అలమామరత్తి నిలైమేల్ ఒరుపాలకనాయ్ ఞాలమేழుమున్డాన్", "అణ్డరణ్డ బకిరణ్డత్తొరుమానిల మెழுమాల్ వరై**

**మఱ్ఱుముణ్డ", "మఞ్జాడు వరైయేఴుమ్ కడల్‌కళేఴుమ్ వానకముమ్ మణ్ణకమామ్ మఱ్ఱుమ్ ఎల్లామ్ ఎఞ్జామల్ వయిఱ్ఱిల్ అడక్కి"** అనునట్లు సప్తకులపర్వతములను, సప్తముద్రములను, దివిని, భువిని, మిగిలిన అన్నిటిని తన ఉదరమున నిడికొనిన స్థితిలో ఉదరమున్నపుడు అది మిక్కిలి పెద్దదిగాకదా ఉండవలెను. కాని, తిన్నది ఏమియు రూపమున కనబడకుండ ఎట్లు సన్నగా ఉన్నది? అని ఆశ్చర్యపడుట ఇందలి విషయము.

ఉత్తపురుషుని నడుము సన్నగా ఉండును అను క్రమమును అనుసరించి పల్కిన సూక్తి ఇది. **"నివసంతి"** అను వర్తమానకాలిక ప్రయోగము, **"రోమకూపేష్వనంతాని బ్రహ్మాండాని భ్రమంతి తే"** అనుచు అర్జునుడు విశ్వరూపమును దర్శించినపుడు ఆశ్చర్యముగా వర్తమానకాలికముగా పల్కినట్లు అనేకబ్రహ్మాండములు ఈ ప్రకృతిమండలములో నున్నవి కావున, ఒకమూల ప్రళయము, వేఱొకమూల జగత్సృష్ట్యాదులును జరుగుచుండును కావున, భగవానుని ఉదరముల ఇపుడును జగములుండుట తగును – అని వ్యాఖ్యానాంతరము.

**(తనుమధ్యమ్)** – దీనిని సమస్తపదముగా, వ్యస్తముగాకూడ గ్రహింపవచ్చును. సమస్తపదమైనచో తనుశబ్దము దేహవాచకము. దివ్యమంగళవిగ్రహములోని మధ్యప్రదేశమని దీని అర్థము. వ్యస్తమైనపుడు తనుశబ్దము సూక్ష్మమను అర్థమిచ్చును. **"సకలజగన్నివాసభూతస్యాపి భగవదుదరస్య కార్శ్య మాశ్చర్యకర మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత. సన్నని నడుములో పదునాల్గు లోకములున్న వనుటచే ఘటనాననురూపమగు అధికాలంకారము కలదు.

**59. పిష్టదుష్టమధుకైటభకీటౌ హస్తిహస్తయుగళాభసువృత్తౌ ।**
**రాజతః క్రమకృశౌ చ సదూరూ సుందరస్య వనభూధరభర్తుః ॥**

పిష్టదుష్ట = పిండిచేయబడిన దుష్టులగు, మధుకైటభకీటౌ = మధువు, కైటభుడు అను కీటములతో సమానమైన ఇద్దఱు దుష్టులను కల్గినది, హస్తిహస్తయుగళ + ఆభ = ఏనుగు తొండముల జంటను పోలినవి, సువృత్తౌ = చక్కగా వర్తులములైయున్నవి, క్రమకృశౌ = పైనుండి క్రిందకు క్రమముగా కృశించినట్లు కనపడునవి అగు, వనభూధరభర్తుః = వనగిరిప్రభువు అగు, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క, సదూరూ = చక్కని ఊరువులు రెండు, రాజతః = వెల్గుచున్నవి.

ఇందు సుందరబాహుస్వామి ఊరుయుగము స్తుతింపబడుచున్నది.

**(వనభూధరభర్తుః సుందరస్య సదూరూ రాజతః)** – తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు ప్రభువు అగు సుందరబాహుస్వామి చక్కని ఊరుయుగము ఎట్లున్నది? అనగా – **(పిష్టదుష్టమధుకైటభకీటౌ)** – సృష్టికాలమున సృష్టింపబడివారు, మహాబలశాలురగు మధుకైటభులను ఇద్దఱు అసురులు పూర్వము ఒకానొక సమయమున చతుర్ముఖ బ్రహ్మ



వద్దనుండి నాల్గు వేదములను అపహరించుకొనిపోయి, సముద్రములో దాగిరి. జ్ఞానప్రకాశమును ఇచ్చు గొప్ప దీపములగు వేదములను కోల్పోవుటచే లోకమంతయు గాఢాంధకారవ్యాప్తముగా బ్రహ్మ మొదలగువారికి తోచినది. **"వేదా మే పరమం చక్షుః"** అనునట్లు వేదములను కోల్పోయి, కన్నులను కోల్పోయివారివలె ఏమియు కానలేక, కింకర్తవ్యతావిమూఢులై, వారు బాధపడుటను చూచిన స్వామి మనస్సున కఱగి, సముద్రములోనికి పోయి, ఆ అసురులను వెదకి పట్టుకొనెను. ఆ అసురులు బలగర్వముతో భగవానునితో చిరకాలము గొప్పగా పోరాడిరి. స్వామి వారిని ఇద్దఱిని తన ఊరువులతో మర్దించి పొడిచేసెనని ఇతిహాసకథనము. **"ఊరుద్వయేన నిష్పిద్య జఘాన భగవాన్ – ఇతి పురాణప్రసిద్ధిః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

పూర్వము ఒకానొక సమయవిశేషమున ఈ అసురులు పొందిన వరము నిష్ఫలము కాకుండుట కొఱకే తన ఊరువులతో భగవానుడు వీరిని సంహరించెను. పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములో శ్రీరంగనాథుని ఊరువులు వర్ణించుచు, **"మద మివ మధుకైటభస్య"** అని పల్కిన సూక్తి ఇచట స్మరణీయము. ఇట్లు మధుకైటభులను మర్దించిన అతిశయమును కల్గినవి సుందరబాహుస్వామి ఊరువులు.

**(హస్తిహస్తయుగళాభసువృత్తౌ)** – ఏనుగు తొండమును ఊరువులకు ఉపమానముగా పలుకుట కవిసమయము. **"రంభాస్తంభా కరివరకరాః"** అను వరదరాజస్తవశ్లోకమునందును ఈ విధముగానే వర్ణింపబడినది. **"క్రమకృశౌ"** అనుటకు అనుగుణముగా రామానుజుల అభిషేకగద్యలోని **"అడిపరుత్తు నుని శిఱుత్తు"** ఇత్యాదిచూర్ణిక స్మరణీయము. ఈ విశేషణము కరికరమునకును అన్వయించుట గమనింపతగినది. **"సువృత్తతయా కరికరసదృశౌ ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఉరోః సంధిప్రదేశ మారభ్య, అధస్తాత్ క్రమేణ కార్శ్య మావశ్యకం శోభాయా ఇతి భావః"** అనియు అందలి వివరణము. వృత్తము రథోద్ధత.

**60. యౌవనవృషకకుదోద్భేదనిభం నితరాం**
**భాతి విభో రుభయం జాను శుభాకృతికమ్ ।**
**సుందరభుజనామ్నో మందరమథితాబ్ధేః**
**చందనవనవిలసత్‌కందరవృషభపతేః ॥**

మందర = మందరము అను పర్వతమును కవ్వముగా చేసికొని, మథిత + అబ్ధేః = సముద్రమును చిలికినవాడు, చందనవన = చందనవృక్షముల వనములచే, విలసత్ = ప్రకాశించుచున్న, కందర = కొండగుహలనుకల, వృషభపతేః = వృషభాద్రి అను పేరుగల తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు అధిపతి అగు, సుందరభుజనామ్నః = సుందరబాహుస్వామి అను పేరును కల, విభోః = స్వామియొక్క, శుభాకృతికమ్ = మంగళకరమైన ఆకారమును కల్గిన, ఉభయం జాను = రెండు మోకాళ్ళు, యౌవన = యౌవనము అనెడి, వృష = ఎద్దుయొక్క, కకుద + ఉద్భేదనిభ = మూపురముల ఉత్పత్తితో,

నిభం = సమానముగా, నితరాం = మిక్కిలి, భాతి = ప్రకాశించుచున్నది.

సుందరబాహుస్వామి మోకాళ్ళ శోభ ఇందు వర్ణితము. **"మన్దరమ్ నాట్టి యన్తు మదురక్కొ(ళు ఞ్జాఱుకొణ్డ శున్దరత్తోళుడైయాన్"** అనుటచు గోదాదేవి స్తుతించినట్లు మందరపర్వతమును కవ్వముగా చేసి, సముద్రమును చిలికినవాడు, **"శన్దనప్పొ(ళిలిన్ తా(ళ్ శినైనీ(ళల్.........మాలిరుమ్శోలై వణఙ్గుదుమ్ వా మడనెఞ్జే"** అనునట్లు చందన వృక్షసమూహములచే ప్రకాశించు తిరుమాలిరుమ్శోలై పర్వతమునకు అధిపతి, **"శున్దరత్తోళుడైయాన్"** అను పేరును కలవాడగు స్వామియొక్క మిక్కిలి అందమైన జానుయుగము ఎట్లు ఉత్ప్రేక్షింపదగియున్నది? – అనగా –

**(యౌవనవృషకకుదోద్భేదనిభమ్)** – యౌవనమను గొప్పవృషభముయొక్క మూపురములే స్వామి మోకాళ్ళుగా మెఱయుచున్నవి – అనునట్లున్నవి. వృషభమునకు మూపురము అసాధారణనిరూపకము అయినట్లే, ముంగాళ్ళు స్వామియొక్క నిత్యయౌవనముకు అసాధారణ నిరూపకములని భావము – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. **"స్యా దుష్టో ర్వా కకుదయుగళం యౌవనైశ్వర్యనామ్నః"** అను వరదరాజస్తవసూక్తి ఇచట అనుసంధేయము. ఋగ్వేదము **"యువా కుమారః"** అనుచు భగవానుని స్తుతించినది. అచట **"యువా – అకుమారః.** అని పాఠభేదము. **"అకుమారః"** అనునపుడు **"ఈషదర్థే నఞ్"**. కౌమారము చివరి దశ, యౌవన ప్రాదుర్భావదశయైయున్న స్థితియే భగవానుని పరువమని భావము. అదియే స్వామి యౌవనదశ. ఇట్టి భావము **"అరుమినై అలరై"** అను దివ్యసూరిసూక్తి ద్వారా వ్యక్తము. విషమవృత్త భేదమిది. కూరేశులు ప్రయోగించిన అపూర్వవృత్తములలో ఇది ఒకటి. ఇందు నాల్గు పాదములలో వరుసగా భనయసస – భభతజలగ, భసతనగగ, భనయననగ – అను గణములున్నవి.

**61. అధోముఖన్యస్తపదారవిందయోః ఉదంచితోదాత్తసునాళసన్నిభే ।**
**విలంఘ్య జంఘే క్వ ను రంహతో దృశౌ వనాద్రినాథస్య సుసుందరస్య మే ॥**

వనాద్రినాథస్య = తిరుమాలిరుమ్శోలై ప్రభువగు, సుసుందరస్య = సుందరబాహుస్వామి యొక్క, అధోముఖ = అధోముఖముగా (క్రింది వైపుగా), న్యస్త = ఉంచబడిన, పదారవిందయోః = పదములనెడి రెండు తామరపూవుల, ఉదంచిత = వృత్తాకారమైన, ఉదాత్త = విశాలమైన, సునాళసన్నిభే = చక్కని తామరతూడులతో సమానమైనవి, అగు, జంఘే = రెండు పిక్కలను, విలంఘ్య = అతిక్రమించి, మే దృశౌ = నా (దాసుని) కన్నులు, క్వ ను రంహతః = వేఱుచోటికి ఎచటికి పోగలవు?

ఇందు సుందరబాహుస్వామి జంఘాద్వయము వర్ణింపబడుచున్నది. స్వామి పాదములు అధోముఖముగా పెట్టబడిన తామరపూలవలె ఉన్నవి అని, పిక్కలు ఆ



తామరపూవుల నాళదండము లనదగినట్లున్నవని పల్కుచున్నారు.

**(వనాద్రినాథస్య సుసుందరస్య)** – వనాద్రిప్రభువగు సుందరబాహుస్వామి జంఘములు ఎట్లున్నవి? అనగా –

**(అధోముఖన్యస్త.......విలంఘ్య)** అధోముఖముగా ఉంచబడిన శ్రీపాదపద్మముల, వృత్తాకారములై, ఆయతములైయున్న, అందమైన నాళదండములను పోలిన స్వామి పిక్కలను వదలిపెట్టి, **(మే దృశౌ క్వ ను రంహతః)** – నా కన్నులు వేఱెచటికి పోవును? ఎచటికి పోవు. ఈ జంఘాద్వయమును సేవించుచు అట్లే నిలుచును. అంతియే – అని భావము. "దేశికులును స్వామి జంఘలను గూర్చి **"జంఘాం దృష్ట్వా జననపదవీజాంఘికత్వం జహాతి"** అనిరి. పూర్వార్థములో ప్రసక్తమైనది అభూతోపమ కాదు. **"ప్రేమ్ణాఽ ఉద్ధూతుం కరిగిరిశిరోఽధోముఖీభావభాజోః, అంఘ్రిద్వంద్వాహ్వయకమలయోః దండకాండాయమానే"** అనుచు కూరేశుల వరదరాజస్తవములో పల్కినదానినిబట్టి ఉత్ప్రేక్ష అని చెప్పనగును" అని వ్యాఖ్యానాంతరము. ప్రకృతశ్లోకమున పాదపద్మములు అధోముఖముగా నుండుటకు హేతువు చెప్పబడకున్నను, పూర్వోదాహృతవరదరాజస్తవశ్లోకమున అది ప్రసక్తమైనదని గమనింపనగును. తిరుమాలిరుమ్శోలై క్షేత్రమునందలి ప్రీత్యతిశయముచే దాని అగ్రభాగమును వానన చూచి, ఆనందింపవలెనను తలంపుతో శ్రీపాదములు అధోముఖములుగా నున్నవి అని భావము. **"సుందరబాహుజంఘయో రతిసుందరత్వాత్ తదనుభవప్రవృత్తే మమ దృశౌ అవయవాంతరశోభానపేక్షే భవత ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము – ఉపజాతి.

**62. సుసుందరస్యాస్య పదారవిందే పదారవిందాధికసౌకుమార్యే ।**
**అతోఽన్యథా తే బిభృయా త్కథం ను తదాసనం నామ సహస్రపత్రమ్ ॥**

అస్య = ఈ, సుసుందరస్య = సుందరబాహుస్వామియొక్క, పదారవిందే = పాదపద్మములు రెండు, పదారవింద = పద్మపీఠముకంటె, అధిక = ఎక్కువ, సౌకుమార్యే = మృదుత్వమును కల్గినవి, అతః అన్యథా = దీనికంటె వేరుగానున్నవి, అయినచో, తే = ఆ పాదపద్మములు రెండింటిని, ఆసనం నామ = ఆసనము అను పేరును కల, తత్ సహస్రపత్రం = ఆ పద్మము, కథం = ఎట్లు, బిభృయాత్ ను = భరించునోకదా!

ఈ శ్లోకముతో, తరువాతి శ్లోకములో సుందరబాహుస్వామి రెండు శ్రీపాదములు ఆసనపద్మము – అను రెండిటి కలయికను కూరేశులు ఒక విలక్షణమైన ఉత్ప్రేక్షతో వర్ణించుచున్నారు. నమ్మాళ్వార్లు తిరువాయ్మొ(ళిలోని **"తణ్డామరై శుమక్కుమ్ పాదప్పెరుమానై"** అని పల్కిరి. చల్లని ఆసనపద్మములచే దాల్చబడిన పాదములను కలవాడని దీని భావము. భగవానుని శ్రీపాదముల క్రింద పద్మాసనమనునది కలదుకదా! దానిపై కదా స్వామి శ్రీపాదములుండును. **"అడిచ్చేది నీ నిన్ఱ తామరైయా యలర్న్దదువో"** అను తిరువాయ్మొ(ళి పాశురముకూడ ఇచట అనుసంధేయము. "చల్లని పద్మముపై వెలుగుచున్న

పాదములను కలవాడు" అని అనవలసినచోట, **"తణ్డామరై శుమక్కుమ్ పాదన్"** అనుట ఉత్ప్రేక్షా దృష్టితోనేకదా! అనగా, చల్లదనములో, సుగంధములో, ఋజుత్వములో తామరపూవు స్వామి శ్రీపాదమునకు ఓడిపోయినది. ఓడిపోయినవారు గెలిచినవారిని మోయుట అనెడి వ్యవస్థ లోకములో కానవచ్చుచున్నది. కావున, పరాజయమును పొందిన తామరపూవు గెల్చిన స్వామి పాదములను మోయవలసివచ్చినది కాబోలు! అని భావము. ఈ విషయము పిమ్మట శ్లోకములోకూడ విశేషముగా వ్యక్తము చేయబడినది. ఇందు దానిని సామాన్యముగా కవి ప్రస్తుతించిరి. ఈ సందర్భమున **"అధునాఽపి న భంగలక్షణం సలిలోన్మజ్జన ముజ్ఝతి స్ఫుటమ్"** అను నైషధసూక్తి భావము స్మరణీయము.

**(పదారవిందాధికసౌకుమార్యే)** – ఆసనపద్మముకంటెను మించిన సౌకుమార్యమును కల్గినవి. ఇది ఎట్లు తెలియుచున్నదన్నచో –

**(అతోఽన్యథా ఆసనం నామ తత్ సహస్రపత్రం తే కథం ను బిభృయాత్)** ఆసనపద్మమను ప్రసిద్ధమైన ఆ తామరపూవు స్వామిపాదమును ఎట్లు మోయును? ఓడిపోయినది కావుననే ఇట్లు మోయుచున్నది – అని కవి హృదయము. **"అతః సౌకుమార్యాతిశయపరాజిత మాసనపద్మం పదారవిందే వహతీత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**63.** **సౌందర్యమార్దవసుగంధరసప్రవాహైః ఏతే హి సుందరభుజస్య పదారవిందే ।**
**అంభోజదంభపరిరంభణ మభ్యజైష్టాం తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి ॥**

ఏతే = ఈ, సుందరభుజస్య = సుందరబాహుస్వామియొక్క, పదారవిందే = పాదపద్మముల జంట, సౌందర్య = అందము, మార్దవ = మెత్తనిదనము, సుగంధ = పరిమళము, రస = మకరందరసముయొక్క, ప్రవాహైః = ప్రవాహము – అను వీనిచే, అంభోజ = నీటిలోనుండు తామరపూవుయొక్క, దంభ = నేనే గొప్ప – అను గర్వముయొక్క, పరిరంభణ = ప్రసంగమును, అభ్యజైష్టాం = జయించినదో, పరాజితం = ఓడిపోయిన, తత్ = ఆ తామరపూవు, ఇమే = ఈ సుందరబాహుస్వామి శ్రీపాదములను, శిరసా = శిరస్సుతో, బిభర్తి = భరించుచున్నది, వై = ఇది నిజము.

పూర్వశ్లోకములో ప్రసక్తమైన విషయమునే సోపపత్తికముగా కూరేశులు ఇందు నిరూపించుచున్నారు. అందము, సౌకుమార్యము, సువాసన, మకరందరసప్రవాహము – అను వీనిచే సుందరబాహుస్వామి శ్రీపాదములు తామరను జయించుటచే, పరాజయమును పొందిన ఆ తామరపూవు ఆ పాదములను మోయుచున్నది.

**(సౌందర్యమార్దవసుగంధరసప్రవాహైః)** – స్వామి సౌందర్య – సౌకుమార్య – సౌగంధ్య – మకరంద రసప్రవాహములతోపాటు – **"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః"**, **"ఉన్ తేనే మలరుమ్ తిరుప్పాదమ్"** ఇత్యాదిగా కీర్తింపబడు రీతిలో స్వామి పాదములు మకరందమును స్రవించును. **"పిడిక్కుమ్ మెల్లడి"**, **"సర్వగంధ స్సర్వరసః"** ఇత్యాది ప్రమాణములు ఇచట



అనుసంధేయములు.

**(అంభోజదంభపరిరంభణ మభ్యజైష్టామ్)** – స్వామి పాదములు తామరపూవుయొక్క గర్వనిర్వాపణమును చేసినవి. **(తత్ వై పరాజితమ్ ఇమే శిరసా బిభర్తి)** – అట్లు పరాజితమైన ఆ తామరపూవు శ్రీస్వామి పాదములను రెండిటిని మోయుచున్నది. **"సుందరబాహుపాదారవిందాభ్యాం నిత్యనిరవద్య నిరతిశయసౌందర్యసౌకుమార్య సౌగంధ్యమకరందప్రవాహాభ్యాం పరాజితం లౌకిక మబ్జం తదాసనత్వేనావతీర్య తే మూర్ధా బిభర్తీత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**64.** **ఏతే తే బత సుందరాహ్వయజుషః పాదారవిందే శుభే**
**యన్నిర్ణేజసముత్థితత్రిపథగా స్రోతస్సు కించి త్కిల ।**
**ధత్తేఽసౌ శిరసా ధ్రువ స్తదపరం స్రోతో భవానీపతిః**
**యస్యాఽలకనందికేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్ ॥**

యన్నిర్ణేజ = ఏ సుందరబాహుస్వామి పాదమును అభిషేకించుటవలన, సముత్థిత = పుట్టిన, త్రిపథగా = దేవలోక, భూలోక, పాతాళలోకములను మూడు దారులలో ప్రవహించిన గంగానదియొక్క, స్రోతస్సు = ప్రవాహములలో, కించిత్ = కొంచెము భాగము. అసౌ ధ్రువః = ఈ జ్యోతిశ్చక్రమును నడిపించు ధ్రువుడు, శిరసా = తలతో, ధత్తే = ధరించుచున్నాడో, తత్ పరం = దానికంటె వేఱయిన, స్రోతస్సు = ప్రవాహములలో, భవానీపతిః = పార్వతీపతి, శిరసా ధత్తే = తలతో ధరించుచున్నాడో, అస్య = అట్టి శివుడు తన తలతో దాల్చిన ఈ ప్రవాహము, అలకనందికా ఇతి = అలకనంద (ముంగురులలో ఆనందించునది) అను పేరుతో, అన్వర్థకమ్ = సార్థకమైన, ఏవం నామ = ఇట్టి పేరును, నిజగుః = మహర్షులు పల్కుదురో, ఏతే = అట్టి మహిమనుకల ఈ, సుందరాహ్వయజుషః = సుందరబాహువను పేరునుకల స్వామియొక్క, పాదారవిందే = శ్రీపాదపద్మములు, శుభే = మంగళకరములుగా అగుచున్నవి, బత = ఆశ్చర్యము.

సుందరబాహుస్వామి పాదపద్మములలో గంగ ప్రవహించు ఐతిహ్యము ఇందు ప్రస్తుతింపబడినది. పూర్వశ్లోకమున స్వామి పాదముల వర్ణన ప్రస్తుతము కాగానే, ఆ పాదములలో గంగ ప్రవహించు విషయము స్మరణకు వచ్చుటచే, ఆ గంగను శ్రీపాదతీర్థముగా దాల్చి, లోకులకు దానిమహిమను తెలిపిన శివుని వృత్తాంతమును ఆ శివుడు తన తలపై దాల్చుటచే ఆ నదికి అలకనంద అను పేరు కల్గిన వృత్తాంతమును చేర్చి వర్ణించుచు, ఇట్టి మహిమను కల్గినవి సుందరబాహుస్వామి శ్రీపాదములు – అని కూరేశులు పల్కుచున్నారు.

లోకములను కొలిచిన భగవానుని శ్రీపాదమునుగూర్చి తిరుమఙ్గైయాళ్వార్‌ **"కుఱైకొణ్డు నాన్ముకన్ కుణ్డికైనీర్ పెయ్‌దు మఱైకొణ్డ మన్దిరత్తాల్ వాழ்త్తి కழைకొణ్డ**

**కణ్ణత్తాన్ శెన్నిమేలేఱ క్కళువినాన్ అణ్ణత్తాన్ శేవడియై యాఙ్గు"** అని పల్కినట్లు బ్రహ్మ తనలోకమగు సత్యలోకము వరకు వ్యాపించిన భగవానుని శ్రీపాదమును తన కమండలుతీర్థముతో వైదికసూక్తులను అనుసంధించుచు తిరుమంజనమును చేసెను. అపుడు – "ఆహా! ఇది సరి అయిన అవకాశము", అని ఆనందించి, ఆ శ్రీపాదతీర్థమును పరమశివుడు తన తలపై దాల్చెను. అపుడతడు **"స శివ శ్శివో౽భూత్"** అనునట్లు పాతకములు తీరినవాడయ్యెను. గంగయొక్క ఏడుపాయలలో ఒక పాయమాత్రమే భగీరథుని వెంటవచ్చినది. అది కూడ, దారిలో నక్షత్రమండలమును చేరి, అచట నాకవీథిని పరిశుద్ధము చేసి, ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుని నివాసమును చేరి, అతడు జోతిశ్చక్రమును నిర్వహించునట్లు సహాయపడినది. వేఱొకటి చంద్రమండలములో అమృతధారగా ప్రవహించి, సూర్యమండలమున ప్రవేశించి, అచటి వేడిమిని కొంత ఉపశమింపజేసి, మేరుపర్వతముపై పలు కొండవాగులుగా ప్రవహించి, అచటి నుండి కొంచెము భాగము మాత్రమే శివుని తలపై పడినది. ఈ వృత్తాంతము అంతయు శ్రీవిష్ణుపురాణము, వామనపురాణము, భాగవతము, హరివంశము – మొదలగు వానిలో వివరింపబడినది. **"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః"** అనుచు ఋగ్వేదము కీర్తించిన రీతిలో భగవానుని ఉత్తమపదములోని మధుప్రవాహమే ఈ గంగానది అని పెద్దల వివరణము. దేవలోకమునకు చేరి, అచటనున్నవారిని తరింపజేసి, భూమిలో ప్రవహించి ఇచటనున్న మనవంటి వారిని దృష్టాదృష్టఫలములతో ఉజ్జీవింపజేసి, పాతాళలోకమును చేరి, పాతాళగంగ అను పేరును పొందినదగుటచే గంగానదికి త్రిపథగా అనుపేరు కల్గినది. ఇట్లు శివుడు తన శిరస్సుపై ధరించుటచేతనే ఈ నదికి అలకనంద అను పేరు కూడా ఏర్పడినది. ఏడు విధములైన ప్రవాహములలోని ఒక ప్రవాహముయొక్క చిన్న భాగమే పలుచోట్లకు పోయి, అడ్డగింపబడి, వచ్చి చివరకు శివుని తలపై పడినది. మొత్తము ఆ శివుని తలపై పడినచో అతనికి భరించుట సాధ్యము కాకుండెడిది – అను భావము **"స్రోతస్సు కించిత్ కిల"** అను ప్రయోగముద్వారా వ్యక్తము. ఈ శ్లోకములోని వృత్తాంతమే ఇంచుమించుగా దేశికుల దేహళీశస్తుతిలోని – **"విక్రాంతికే తు పటికా పదవాహినీ తే న్యంచంత్యుపైతి నతజీవిత శింశుమారమ్, ఔత్తానపాది మమృతాంశు మశీతభానుమ్ వ్యోమాచలం పశుపతిం హిమవంత ముర్వీమ్"** అను శ్లోకమున వర్ణింపబడుట గమనింపతగినది. **"శతుముకన్ కైయిల్ శతుప్పుయన్ తాళిల్ శఙ్కరన్ శడైయనిల్ క్కదిర్ ముకమణి కొణ్డిళి పునఙ్కఙ్గై"** అను పెరియాళ్వార్ల శ్రీసూక్తికూడ శంకరుని అలకసంబంధము కారణముగానే గంగానదికి అలకనంద అను పేరు కల్గినదని తెలుపుచున్నది.

**(తే ఏతే పాదారవిందే శుభే)** – సుందరబాహుస్వామి ఈ పాదారవిందములు



పరమభోగ్యములు, ధ్రువుడు, శివుడును తమ తలలపై ధరించునట్టి ప్రవాహములనుకల గంగకు ఉత్పత్తిస్థానమైన స్వామి పాదములు మంగళకరములు. పరమభోగ్యములును అగుట ఎంత ఆశ్చర్యకరము! లోకములో పావనత్వ, భోగ్యత్వములు ఏకత్ర ఉండుట దుర్లభము కదా! **"పావనయో రేవ అత్యంతభోగ్యతా చ ఆశ్చర్యకరీ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**65. అమ్నాయకల్పలతికోత్థసుగంధిపుష్పం యోగీంద్రహార్దసరసీరుహరాజహంసమ్ ।**
**ఉత్పక్వధర్మసహకారఫలప్రకాండం వందేయ సుందరభుజస్య పదారవిందమ్ ॥**

ఆమ్నాయ = వేదమనెడి, కల్పలతికా = కల్పలతనుండి, ఉత్థ = పుట్టిన, సుగంధి పరిమళమునుకల, పుష్పమ్ = పూవువంటిదియు, యోగీంద్ర = పరాంకుశ – పరకాలాది మునీంద్రుల, హార్దసరహీరుహ = హృదయకమలములందు నివసించు, రాజహంసమ్ = రాజహంసవంటిది, ఉత్పక్వ = బాగుగా పండిన, ధర్మ = (మనము చేసిన) ధర్మమనెడి, సహకార = తీయమామిడిచెట్టుయొక్క, ఫలప్రకాండమ్ = గొప్పఫలమును అగు, సుందరభుజస్య = సుందరబాహుస్వామియొక్క, పదారవిందమ్ = పాదపద్మమును, వందేయ = సేవింతును.

ఇందు కూరేశులు స్వామి పదములను అత్యాశ్చర్యకరమైన తీరులో ఉల్లేఖించుచున్నారు. పర్యాయోక్తప్రక్రియతో ఈ శ్లోకము వర్ణింపబడినదనువారును కలరు. **(అమ్మాయ........పుష్పమ్)** – వేదములనెడి కల్పలతయందు పూచిన సుగంధపుష్పములే స్వామి పాదారవిందములు. వేదములో పరిమళించు పుష్పములు, అనగా – వేదప్రతిపాద్యములని భావము.

**(యోగీంద్ర......రాజహంసమ్)** – సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత, పరాంకుశ, పరకాల, యతివరాదియోగుల హృదయకమలములలో నివసించు రాజహంసములు స్వామి పాదములు. పాదముల రాజహంససామ్యముచే యోగీంద్రుల హృదయసరోవరముల స్వచ్ఛత వ్యక్తము. హంస కలుషితమైన నీటినికల సరస్సులలో నివసింపలేనట్లే, భగవానుడు రాగాదికలుషిత చిత్తమున నిలువజాలడు. **"రాగాదిదూషితే చిత్తే నాస్పదీ మధుసూదనః, న బధ్నాతి రతిం హంసః కదాచిత్ కర్దమాంభసి"** అనికదా ప్రమాణము.

**(ఉత్పక్వ.....ప్రకాండమ్)** – పరిపక్వధర్మమను తీయమామిడిచెట్టు ఫలించిన ఫలములా ఇవి! అనునట్లున్నవి స్వామిపాదములు. ధ్యానఫలముకూడ ఇవియే అగుటయేగాక, పరమపురుషార్థములై యుండునవియును ఇవియే – అని భావము. **"శ్రుతిశిరఃప్రతిపాద్యం యోగిధ్యేయం ధ్యానఫలం చ సుందరబాహుపదారవింద మేవేతి కేవల మనుక్త్వా, పుష్పరాజహంససహకారఫలప్రకాండనిరూపణాత్ శ్రుతిశిరస్సౌలభ్యావహత్వం,**

**యోగిహృదయవాసరసికత్వం, పరమపురుషార్థత్వంచ అభిప్రేత మితి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ప్రకాండశబ్దము శ్రేష్ఠవాచకము. **"అమ్నాయకల్పలతికే"** త్యాది ప్రయోగములలో అభేదాధ్యవసాయము చేయబడుటచే రూపకము. నాల్గు పాదములోను వైషమ్యము లేకుండుట అనెడి సమతాగుణము ఇందు కలదు. వృత్తము వసంతతిలక.

**66. సుసుందరస్యాస్య తు వామనాకృతేః క్రమత్రయప్రార్థిని మానసే కిల ।**
**ఇమే పదే తావదిహాసహిష్ణునీ విచక్రమాతే త్రిజగత్ పదద్వయే ॥**

వామన + ఆకృతేః = వామనావతారమును ఎత్తిన, అస్య = ఈ, సుసుందరస్య = సుందరబాహుస్వామియొక్క, మానసే తు = మానసము, క్రమత్రయ = మూడు పాదములను, ప్రార్థిని = ప్రార్థించినది కాగా, ఇహ = నీచుడగు ఒక అసురుని వద్ద, అసహిష్ణునీ = ఇట్లు యాచించుటను సహింపనివి అయిన, ఇమే పాదే = ఈ రెండు పాదములు, ఇహ తావత్ = ఈ భూమిలో, పదద్వయే = రెండు పాదములలో, త్రిజగత్ = ముల్లోకములను, విచక్రమాతే కిల = విక్రమించినవి (వ్యాపించినవి) కదా!

పూర్వము ఒకానొక సమయమున తన పాదములతో ముల్లోకములను కొలిచిన స్వామి వామనమూర్తియై మహాబలి వద్దకుపోయి **"ఎన్నుదైయ పాదత్తాల్ యానళప్ప మూవడిమణ్ మన్నా తరుకెన్ఱు వాయ్ తిఱప్ప"** అనుచు పాదత్రయపరిమితభూమిని యాచించినను, స్వామి పాదములు రెండు న్యాసములలోనే ముల్లోకములను ఆక్రమించినవి అని – ఉత్ప్రేక్షించుచున్నారు. దీనివలన శ్రీపాదములకుకల ఆశ్రితసంరక్షణత్వరాతిశయము చెప్పబడినది.

**(క్రమత్రయప్రార్థిని సతి)** – మహాబలిపట్ల త్రివిక్రమణమునకు అనుగుణముగా మూడు అడుగుల నేల కోఱగా –

**(ఇమే పదే తావ దిహ అసహిష్ణునీ)** – స్వామి పాదములు, ఈనేలలో మూడడుగుల న్యాసమును – అనగా అంత ఆలస్యమును సహింపవు కావున, **(త్రిజగత్ పదద్వయే విచక్రమాతే)** ముల్లోకములను రెండే పాదన్యాసములతో ఆక్రమించినవి. భగవానుని మనస్సుకంటెను పాదములకుగల త్వరాతిశయము మిక్కిలి ఆశ్చర్యకరము – అని భావము.

భగవానుడు మహాబలివద్దకు పోయి మూడడుగుల నేలను దేవతలకొఱకు యాచించెను. తన సొత్తు అగు ఈ నేలను స్వామి ఒక నీచునివద్ద యాచించుటను స్వామి పాదములు లజ్జించి, రెండు అడుగులతోనే కేవలము దివిని, భువినే కాక, అన్ని లోకములను



కొలిచినవి. "మూడవ అడుగునకు మహాబలి ఏమి చేయునో చూచెదము!" అని స్వామి పాదముల భావము కాబోలు – అను హార్దభావమును కూరేశులు ఇందు వ్యక్తీకరించిరి – అని వ్యాఖ్యానాంతరము. **"పదయో రాశ్రితసంరక్షణత్వరాతిశయ స్తాదృశ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము ఉపజాతి.

**67. సౌందర్యసారామృతసింధువీచిశ్రేణీషు పాదాంగుళినామికాసు ।**
**న్యక్కృత్య చంద్రశ్రియ మాత్మకాంత్యా నఖావలీ శుంభతి సుందరస్య ॥**

సుందరస్య = తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామియొక్క, పాదాంగుళీ = పాదముల వ్రేళ్ళు అను, నామికాసు = పేరునుకల, సౌందర్యసార = అందముయొక్క సారమనెడి, అమృతసింధు = అమృతసముద్రముయొక్క, వీచిశ్రేణీషు = కెఱటముల వరుసలలో, నఖావలీ = నఖముల సమూహము, ఆత్మకాంత్యా = తమకాంతితో, చంద్రశ్రియమ్ = చంద్రుని కాంతిని, న్యక్కృత్య = అధఃకరించి (తక్కువ చేసి), శుంభతి = శోభిల్లుచున్నది.

ఇందు స్వామి శ్రీపాదనఖవర్ణనము ప్రస్తుతము. దీనివలన అంగుళీవర్ణనము కూడా అర్థాత్ సిద్ధము. సుందరబాహుస్వామి తిరుమేనిలోని సౌందర్యమను అమృతసముద్రము ఒకటి కలదు. సముద్రమున కెఱటములుండునట్లే, ఈ సౌందర్యసముద్రమునందు పాదాంగుళులు అనునవి కెఱటములుగా నున్నవి. ఆ వేళ్ళలోని నఖములు చంద్రుని మించి మిక్కిలి అందముగా వెల్గుచున్నవి – అని భావము. నఖములు గుండ్రనివిగా, తెల్లగా, అందముగా మెఱయుట మహాపురుషలక్షణము. వీనిని చంద్రునితో పోల్చుట కవి సమయము.

**(పాదాంగుళీనామికాసు............సౌందర్యసింధువీచిశ్రేణిషు)** – కాలివేళ్ళు అనెడి సౌందర్యామృతసాగరతరంగపరంపరలలో –

**(నఖావళీ ఆత్మకాంత్యా చంద్రశ్రియం న్యక్కృత్య శుంభతి)** – నఖముల శ్రేణి తన కాంతితో చంద్రుని కాంతినికూడ త్రోసిరాజని వెలుగుచున్నది. ఇచట ఉపమేయాధిక్యస్ఫురణచే వ్యతిరేకాలంకారము కలదు. చంద్రుడు ఒక్కడే అయినను, పలు కెఱటములలో ఈ చంద్రుడు ప్రతిబింబించుటవలన పలు చంద్రబింబములు కన్పించుట ప్రత్యక్షానుభవసిద్ధమే కదా. కావున చంద్రబహుత్వమున విరోధము లేదు. **"పాదాంగులీనాం వీచిశ్రేణిత్వేన నిరూపితత్వాత్**

**తత్ర ప్రతిఫలితచంద్రపంక్తిత్వే నఖావళ్యుత్ప్రేక్ష్యతే, లోకే ప్రతితరంగం చంద్రబింబప్రతిఫలనం ప్రసిద్ధం హి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. మాసములో ఒకనాడు మాత్రమే పూర్ణత్వమును కలవాడు, పాలకడలిలో పుట్టినను క్షయరోగమును కలవాడును అగు చంద్రుని కాంతి స్వామి నఖచంద్రకాంతిచే అధఃకరింపబడుటలో ఏమి ఎంత? దీనికి అనంతర శ్లోకములో చంద్రునికంటె స్వామి నఖచంద్రులకుకల వైలక్షణ్యము మరింత స్ఫుటము కాగలదు. **"సౌందర్యసారామృతసింధు"** ఇత్యాదులలో రూపకము కలదు. వృత్తము ఉపజాతి.

**68. యో జాతక్రశిమా మలీ చ శిరసా సంభావితః శంభునా**
**సోఽయం యచ్చరణత్రయీ శశధరో నూనం నఖవ్యాజతః ।**
**పూర్ణత్వం విమలత్వ ముజ్జ్వలతయా సార్ధం బహుత్వం తథాఽ**
**యాత స్తం తరుషండశైలనిలయం వందామహే సుందరమ్ ॥**

శంభునా = శివునిచే, శిరసా = తన తలతో, సంభావితః = గౌరవింపబడిన (ధరింపబడిన), యః శశధరః = ఏ చంద్రుడు, జాతక్రశిమా = కార్శ్యమును పొందినవాడుగా, మలీ చ = మలినమును కలవాడుగా, జాతః = అయ్యెనో, సః అయమ్ = ఆ ఈ చంద్రుడు, నఖవ్యాజతః = (భగవానుని పాదములలోగల) నఖములనెడి ఒక మిషతో, యచ్చరణత్రయీ = ఏ సుందరబాహుస్వామి శ్రీపాదములను ఆశ్రయించినవాడై, పూర్ణత్వం = పూర్ణముగానుండు స్థితిని, విమలత్వం = మలినము లేకుండు స్థితిని, తథా = అట్లే, ఉజ్జ్వలతయా సార్ధం = ప్రకాశముతో కూడియుండుటతో పాటు, బహుత్వం = బహుత్వమును, యాతః = పొందెనో, నూనః = ఇది నిశ్చయము, తరుషండశైలనిలయం = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును నివాసముగాకల, తం సుందరం = ఆ సుందరబాహుస్వామిని, వందామహే = నమస్కరింతుము.

పూర్వశ్లోకములో కూరేశులు స్వామి నఖములను చంద్రసదృశములుగా కీర్తించిరి. వాస్తవమునకు చంద్రుడు దేవాంతరస్పర్శచే తనకు కల్గిన కొఱతలను తీర్చుకొనగోరి, నఖముల రూపము పొంది, స్వామి పాదములను ఆశ్రయించి, ఆ కొఱతలను పోగొట్టుకొనెను, పూర్ణుడయ్యెను – అని శ్లోకసారము. తిరువాయ్‌మొழிలోని **"మలమఱు మదిశేర్ మాలిరుమ్‌శోలై"** అను సూక్తిభావమును ఈ శ్లోకము పుణికిపుచ్చుకొన్నది.

**(యః శశధరః శంభునా శిరసా సంభావితః సః జాతక్రశిమా మలీ చ)** – దక్షుని కుమార్తెలగు అశ్విన్యాదులను 27 మంది కన్యలను వివాహమాడిన చంద్రుడు వారిలో రోహిణిని మాత్రము ఆదరించి, మిగిలినవారిని నిరాదరించుటను చూచిన దక్షుడు కోపించి చంద్రుని



క్షయరోగగ్రస్తుడు కాగలడని శపించెను. అపుడు చంద్రుడు దక్షుని విరోధియగు శివుని చేరి, తనను రక్షింపవేడెను. శివుడును, చంద్రుడు **"చంద్రమా మనసో జాతః"** అనునట్లు భగవానుని మనస్సునుండి పుట్టినవాడని, స్వామికి నేత్రభూతుడని, పాలకడలినుండి పుట్టిన లక్ష్మీదేవికి సహోదరుడనియు – ఇట్లు గల అతని గొప్పతనములను గమనించి, అతనిని **"శిరసా శ్లాఘతే పూర్వమ్"** అను రీతిలో శిరసావహించెను. అయినను చంద్రుని క్షయరోగము తగ్గి, వృద్ధి కలుగలేదు. చంద్రకళాధరుడనికదా శివుని నామము. కళ అనగా 16వ భాగమే కదా! ఇట్లు చంద్రునకు ఏర్పడిన కళంకము (పావము) నశింపలేదు. గురుదారాగమనాదికళంకములును ఇచట చంద్రవిషయమున భావింపనగును. ఇట్లు శివుని శిరస్సులో ఉన్నను తీరని కళంకము, సుందరబాహుస్వామి పాదములను ఆశ్రయింపగానే నశించి, కళలను తిరిగి పొంది పూర్ణుడై వెలిగెను – అని భావము. శ్లోకములోని **"నూనమ్"** అను పదము **"మన్యే శంకే ధ్రువం ప్రాయో నూన మిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివ శబ్దోఽపి తాదృశః"** అను వచనమును బట్టి ఉత్ప్రేక్షావాచకము. "దేవతాంతరసంబంధముచే నశింపని పాపములుకూడ భగవానుని శ్రీపాదములను ఆశ్రయించినవారికి వెంటనే తీరును అను శాస్త్రార్థ మిచట **"నూన"** పదముచే వ్యక్తము" – అని వ్యాఖ్యానాంతరము. ఇట్లు సమయమును పురస్కరించుకొని మహనీయములగు శాస్త్రార్థములను వ్యక్తీకరించు ప్రతిభ కూరేశులకు మాత్రమే సొంతము. **"భూయసీ రపి కలాః కళంకితాః ప్రాప్య కించి దవసీయతే జనైః, ఏకయాఽపి కలయా విశుద్ధయా యోఽపి కోఽపి భజతే గిరీశతామ్"** అను దేశికుల సుభాషితనీవిలోని శ్లోకము ఇచట స్మరణీయము. చంద్రుని శిరస్సులో దాల్చుటచే శివునకు గౌరవము లభించినదే తప్ప. చంద్రుని కళంకము తీరలేదు – అనునది ఇచటి కవిహృదయము. **"బహుత్వమ్"** అనుటకు **"బహుమానం బహుసంఖ్యాయోగమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. దేవతాంతరశిరస్సంబధమువలన క్షయిష్ణుత్వమును, కళంకిత్వమును పొందిన చంద్రుడు సుందరబాహుస్వామి పాదములలోని నఖముల రూపమును పొంది, ఆ క్షయిష్ణుత్వము పోగొట్టుకొని, ఎల్లప్పుడు విమలుడైయుండు స్థితిని పొందెను. కొన్ని సమయములలో కాంతి తగ్గియుండు స్వభావముపోయి, ఎల్లప్పుడు ప్రకాశించువాడయ్యెను. ఏకత్వమును వీడి బహుత్వమును కూడపొందెను – అనుటనుబట్టి పది కాలివేళ్ళలోనున్న పదిగోళ్ళు పదిమంది చంద్రునివలె ప్రకాశించుటయును, అవి ఎల్లప్పుడు పుష్కలముగా, అకళంకముగా జాజ్జ్వల్యమానములై యుండుటయును తెలుపబడినవి. **"దేవాంతరశిరోధారణేఽపి కార్శ్యకలుషవిశిష్టస్య చంద్రస్య యత్పదాశ్రయే సతి, పూర్ణత్వవిమలత్వోజ్జ్వలత్వబహుత్వాని జాతాని, చ స ఏవ సుందరబాహుః శ్రేయస్కామానా మస్మాకం సమాశ్రయణీయ ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అపకృష్టపురుషైః శిరసా**

**బహుమానా దపి ఉత్కృష్టపురుషపాదసేవా గరీయసీతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**69. యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణా**
**మైశ్వర్యహేతు రితి సర్వజనీన మేతత్ ।**
**శ్రీ స్సేతి సుందరనిషేవణతో నిరాహుః**
**త్వాం హి శ్రియః శ్రియ ముదాహు రుదారవాచః ॥**

యస్యాః = ఏ లక్ష్మీదేవియొక్క, కటాక్షణమ్ = కడగంటి చూపులు, ఈశ్వరాణాం = బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకు, అనుక్షణమ్ = ప్రతిక్షణము, ఐశ్వర్యహేతుః = వారివారి సమస్తమగు ఐశ్వర్యమునకు కారణము, ఇతి ఏతత్ = అనెడి ఇది, సర్వజనీనం హి = అందరి జనులకు ప్రసిద్ధమేకదా! సా = అట్టి లక్ష్మీదేవి, సుందరనిషేవణతః = సుందరబాహుస్వామిని ఆశ్రయించుటవలన, శ్రీః ఇతి = ("భగవానుని ఎల్లప్పుడు ఆశ్రయించునది" అను అర్థమున) శ్రీః అని, నిరాహుః = (అభిజ్ఞులు) నిర్వచింతురో, తమ్ = ఆ భగవానుని, ఉదారవాచః = సకలశాస్త్రార్థములను ఉదారముగా అనుగ్రహించు పలుకులనుకల మహర్షులు, ఆళ్వార్లు, ఆచార్యులును, శ్రియః శ్రియమ్ = లక్ష్మీదేవికే సంపదగా, ఉదాహుః = చక్కగా వివరింతురు.

**"అజానత స్స్వగత"** అను 39వ శ్లోకమునుండి కూరేశులు 68వ శ్లోకము వరకు - అనగా ముప్పది శ్లోకములలో, సుందరబాహుస్వామియొక్క కేశాదిపాదాంతదివ్యావయవ వర్ణనమును చేసి ముగించిరి. ఇక పై, శ్రీ భూనీళాదేవులనెడి దివ్యదేవేరుల, పరిజనముల పరిచర్యావిశేషములను అనుభవింపగోరి, మొదటగా దీనిలో మహాలక్ష్మీదేవియొక్క నిత్యయోగమును కీర్తించుచున్నారు. ఏ లక్ష్మీదేవి కటాక్షము ఇంద్రాదిదేవతలకు మాటి మాటికి, క్షణక్షణము ఐశ్వర్యహేతువు అనునది సర్వజనసమ్మతమో, ఆ లక్ష్మీదేవికే లక్ష్మియై వెలుగుచున్నాడు - అని ఉదారవాక్కులను కల మహనీయులు పల్కుదురు - అని భావము. **(ఈశ్వరాణా మనుక్షణ మైశ్వర్యహేతు రితి ఏతత్ సర్వజనీనమ్)** ఈశ్వరుడను పేరును కలవారందఱికి మాటిమాటికి వారి ఐశ్వర్యహేతువు లక్ష్మీదేవి అగుచున్నది - అనుట నిర్వివాదము. **"శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరామ్"** అనికదా సూక్తి. విష్ణుపురాణములోని ఇంద్రకృతలక్ష్మీస్తుతి వచనములు ఇచట స్మరణీయములు. దేవతలు దుర్వాస మహర్షిశాపవశమున దేవత్వమును, సంపదను కోల్పోయి అసురులకు చిక్కి, తపించినపుడు వారిని కాపాడినది లక్ష్మీకటాక్షమే కదా! దీనిని దేశికులు - **"అలోకత్వా మమృతసహజే విష్ణువక్షఃస్థలస్థాం శాపాక్రాంతాః శరణ మగమన్ సావరోధాః సురేంద్రాః, లబ్ధ్వా భూయ**



**స్త్రిభువన మిదం లక్షితం త్వత్కటాక్షైః సర్వాకారస్థిరసముదయాం సంపదం నిర్విశంతి"** అను శ్రీస్తుతిశ్లోకమున నుడివిరి. **(సా సుందరనిషేవణతః శ్రీః ఇతి నిరాహుః)** - ఆ లక్ష్మీదేవికూడ సుందరబాహుస్వామిని ఆశ్రయించియే **"శ్రీః"** అను పేరును పొందుచున్నది - అని శ్రీశబ్దమును నిర్వచించువారు పల్కుదురు అని భావము. శ్రీశబ్దమునకు ఆఱు విధములగు వ్యుత్పత్తులున్నవి. వానిలో **"శ్రయతే ఇతి శ్రీః"** అనునది ఒకటి. భగవానుని ఆశ్రయించి స్వరూపలాభమును పొందుచున్నదని దీని అర్థము. **"మలర్మకళ్ విరుమ్బుమ్ నమరుమ్ పెఱులడికళ్"** ఇత్యాదిగా ఈ అర్థమును దివ్యసూరులును అనుసంధించిరి. లక్ష్మీదేవికి భగవానునివలన అతిశయము కల్గునట్లే, **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** అని, **"అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మజా"** అనియు శ్రుతీతిహాసములు పల్కునట్లు భగవానునకు లక్ష్మీదేవివలన అతిశయము కల్గుననియు కలదు కదా! ఆ అంశము నాల్గవపాదములో ప్రస్తుతము. ఆశ్రితుల ప్రార్థనలను స్వామికి వినిపించి, వారిని కాపాడుటకై నిత్యము స్వామిని లక్ష్మీదేవి ఆశ్రయించియుండుననియు పెద్దల సూక్తి. ఇట్లు లక్ష్మీనిత్యయోగము ఆమె స్వరూపసిద్ధి కొఱకు, జీవులందఱి స్వరూపసిద్ధికొఱకును.

**(ఉదారవాచః తం చ శ్రియః శ్రియ ముదాహుః) - "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా"** అని తిరుమఙ్గైమన్నన్, **"శ్రియః శ్రియమ్"** అని, **"కః శ్రీః శ్రియః"** అని ఆళవన్దార్, **"శ్రియః శ్రీ శ్చ భవే దగ్ర్యా"** అని వాల్మీకియు పల్కుటనుబట్టి వారిని ఇచట **"ఉదారవాచః"** అని కవి నిర్దేశించిరి. తిరుప్పావై - అఱాయిరప్పడి వ్యాఖ్యలోని - **"తిరువే తుయిల్ ఎழாయ్"** అను సూక్తివివరణమున **"ఉదారవాక్కుకళాకిఱార్ - తిరుమఙ్గైయాழ்వారుమ్, ఆళవన్దారుమ్, ఆழ்వానుమ్, భట్టరుమ్"** అనియుండుట ఇచట స్మరింపతగినది. నంజీయర్ శ్రీసూక్తభాష్యములో - లక్ష్మీదేవిని ఆరాధించి, దిక్పాలకులు తమ పదవిని పొందుట తెలుపబడినది. **"సర్వజనీనమ్, సార్వజనీనమ్"** అను పాఠములు రెండును సాధువులే - అని శ్రీఅణ్ణాస్వామివ్యాఖ్య.

ఈ శ్లోకము కొన్నిశబ్దముల మార్పుతో శ్రీవైకుంఠస్తవములో 29వ శ్లోకముగా కనుపించుచున్నది. ఈ రెండుశ్లోకములలో పూర్వార్ధమున మార్పులేదు. మూడవపాదము **"తాం శ్రీ రితి త్వదుపసంశ్రయణా న్నిరాహుః"** అని అచట కలదు. ఇచట సుందరబాహుస్వామి నామమును ప్రయోగింపవలెను. కావున **"శ్రీః ఇతి సుందరనిషేవణతో నిరాహుః"** అని కొంచెము మార్పుతో పల్కిరి. నాల్గవపాదములలోకూడ వ్యత్యాసము కలదు. అచటి మూడవపాదము **"త్వదుపసంశ్రయణాత్"** అని మధ్యమపురుషనిర్దేశముతో కూడుకొన్నది అగుటచే, దానికి తగినరీతిలో నాల్గవ పాదమున్నది. **"త్వామ్"** అని యుష్మచ్ఛబ్దనిర్దేశము చేయబడినది. ఇచట మూడవపాదములో మధ్యమపురుషనిర్దేశము

కాకుండ **"సుందరనిషేవణతః"** అని ప్రథమపురుషనిర్దేశమే కలదు. కావున, దానికి అనుగుణముగా నాల్గవపాదములో **"తమ్"** దివ్యమంగళవిగ్రహ గుణములచే, **(అద్భుతభావగర్భసతతాపూర్వైః ప్రియైః విభ్రమై శ్చ)** ఆశ్చర్యకరములగు అభిప్రాయవిశేషములను లోన గల్గినవియై, ఎప్పటికప్పుడు నూతనములై, ప్రియములై తోచునవి అగు విభ్రమములచే, **(రూపాకారవిభూతిభిః)** – స్వరూప – విగ్రహ – విభవములచే,

**(సదృశీమ్) – "తుల్యశీలవయోవృత్తామ్ తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీమ్ తం చేయ మసితేక్షణా"** అని, **"ఉనక్కేఱ్ఱుమ్ కోలమలర్ప్పావైక్కు అన్బా"** అనియు కీర్తింపబడినట్లు అనురూపమైనది,

**(నిత్యానపేతామ్ శ్రియమ్) – "రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"** అనునట్లు నిత్యానపాయిని అగు లక్ష్మిని,

**(ఈదృశీమ్ భూమిం నీళాం చ) – "ఏవంభూతభూమినీళానాయక"** అనునట్లు పూర్వోక్త విశేషణములతోకూడిన భూదేవీనీళాదేవులను,

**(వనాద్రీశ్వరః రమయితా)** – స్వామి ఆనందింపజేయును. దీనివలన సుందరబాహుస్వామిని ఆశ్రయించువారు కాలమును ఎదురుచూడవలసిన అవసరములేదని, పురుషకారసాన్నిధ్యము ఎల్లప్పుడు కలదని తెలుపబడినది. **"రమయితా"** అనునది తృన్ప్రత్యయాంతరూపము. **"సుందరబాహుచరణారవిందే శరవరణక్షమాణామ్ ఆపేక్షితం పురుషకారసాన్నిధ్యం సమృద్ధ మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా"** ఇత్యాది వైకుంఠస్తవశ్లోకభావ మిచట స్మరణీయము. వృత్తము శార్దూలము.

**71. అన్యోన్యచేష్టితనిరీక్షణహార్దభావప్రేమానుభావమధురప్రవణప్రభావః ।**
**ఆజస్రనవ్యతరదివ్యరసానుభూతిః స్వాం ప్రేయసీం రమయితా వనశైలనాథః ॥**

అన్యోన్య = పరస్పరము తగిన, చేష్టిత = మందహాస, భ్రూభంగాదులనెడి చేష్టితములు, నిరీక్షణ = కటాక్షములు, హార్దభావ = హృదయమునందలి అభిప్రాయములు, ప్రేమ + అనుభవ = ప్రేమాతిశయము, మధుర = (అను ఇట్టి) మధురమైన, ప్రణయప్రభావః = గొప్ప అభినివేశమును కలవాడు, ఆజస్ర = నిరంతరము, నవ్యతర = నిత్యనూతనముగా తోచు, దివ్య = అప్రాకృతమైన, రస + అనుభూతిః = ఆనందానుభవమును కలవాడు, వనశైలనాథః = తిరుమాలిరుమ్శోలై పర్వతమునకు ప్రభువు అగు సుందరబాహుస్వామి, స్వాం ప్రేయసీమ్ = తనకు ప్రియమైన భార్య అగు లక్ష్మీదేవిని, రమయితా = ఆనందింపజేయుచున్నాడు.

శ్రీరామాయణములోని **"రామ స్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్, మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృది సమర్పితః, ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా**



**ఇతి, గుణా ద్రూపగుణా చ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత. తస్యా శ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్ధతే, అంతర్గత మపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా"** అనెడి శ్రీరామాయణ శ్లోకములను ఇంచుమించుగా అనుసరించుచు ప్రస్తుతశ్లోకము రచింపబడినది. భగవానునకు, లక్ష్మీదేవికిని సర్వాత్మనా (అన్ని విధముల) గల సౌమనస్య మిచటి విషయము.

**(చేష్టిత)** – భ్రూభంగములు, మందస్మితము, మొదలగు విలాసవ్యాపారవిశేషములు,
**(నిరీక్షణ)** – కటాక్షములు, **(హార్దభావ)** – హృద్గతమైన భావము. అనగా – లావణతారుణ్యాదులనుగూర్చిన అనుధ్యానము. **(మధురప్రణయప్రభావః)** – పరమభోగ్యమైన అనురాగాతిశయము – అను వీనిని కలవాడు.

**(ఆజస్రనవ్యతరదివ్యరసానుభూతి స్సన్)** – నిత్యము కల్గునది అయినను **"అప్పోదైక్కప్పోదు"** అనునట్లు ఎప్పటికప్పుడు నిత్యనూతనముగా తోచు ఆనందానుభవమును కలవాడై,
**(స్వాం ప్రేయసీం రమయితా)** – తన ప్రేయసి అగు లక్ష్మీదేవిని ఆనందింపజేయును.

శ్లోకారంభములోని **"అన్యోన్య"** అనుటకు దివ్యదంపతులకు పరస్పరము అనుభావ్యమైన అని అర్థము. **"పరస్పరతపస్సంపత్ఫలాయితపరస్పరౌ"** ఇత్యాది ప్రయోగములలోవలె ఇచట కూడ **"అన్యోన్య"** శబ్దప్రయోగానుగుణముగా ద్వివచనాంతముగాకదా ఉండవలెను! అని ప్రశ్నించువారును కలరు. కాని, అట్టి నిర్బంధము లేదు" అని శ్రీ అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"అత్యంతాపరాధిష్వపి క్షమా కర్తవ్యేతి లక్ష్మ్యా ప్రోక్త మాదర్తవ్య మేవ భవతి భగవతః ఇత్యభిప్రాయ మాహ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ప్రేమానుభావశబ్దేన రత్యాదయః శృంగారాదిరసానాం పూర్వావస్థా స్థాయిభావాః వివక్షితాః, ప్రణయభావశబ్దేన రసాత్మనా పరిణతాః శృంగారాదిరసా వివక్షితాః, స్థాయిభావాత్ శృంగారాదిరసా చ్చ పూర్వకాలభావిభిః అనోన్యచేష్టితైః అనోన్యనిరీక్షణై సహకాలభావిభిః అన్యోన్యహార్దభావైః నిర్వేదగ్లానిభిః, సంధుక్షితప్రేమానుభావ ఇతి, మధ్యమపదలోపిసమాసః ........ప్రణయభావస్య మధురత్వం నామ స్వాదుతరత్వమ్. అజ్రస్రనవ్యతరదివ్యరసానుభూతి రితి స్వరూపానందానుభవో వివక్షితః.....అత్ర అన్యోన్యచేష్టితనిరీక్షణేత్యాదిపదం చ స్త్రీలింగత్వేన విపరిణమయ్య లక్ష్మీవిశేషణత్వేనాప్యనుసంధేయమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**72. సుందరస్య వనశైలవాసినో భోగ మేవ నిజభోగ మాభజన్ ।**
**శేష ఏష ఇతి శేషతాకృతేః ప్రీతిమా నహిపతిః స్వనామని ॥**

వనశైలవాసినః = తిరుమాలిరుమ్శోలై పర్వతనివాసి అగు, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క, భోగమ్ ఏవ = ఆనందానుభవముకొఱకే, నిజభోగమ్ = తన శరీరమును, ఆభజన్ = వినియోగించుట అనెడి గొప్పతనమును పొందుచు, అహిపతిః =

సర్పరాజు అగు ఆదిశేషుడు, శేషతా + ఆకృతేః = భగవానునకు పలు రీతులలో సేవచేయు ఆకారమువలన, ఏషః శేషః ఇతి = ఇతడు శేషభూతుడు – అని పలువురు పలుకునట్లు, స్వనామని = తనపేరులో, ప్రీతిమాన్ = మిక్కిలి ప్రీతిని కలవాడైయున్నాడు.

ఈ శ్లోకమునుండి వరుసగా మూడు శ్లోకములలో అనంత – గరుడ – విష్వక్సేనులను నిత్యసూరివర్గముయొక్క పరిచర్యావిశేషములను కీర్తింపనెంచిన కూరేశులు, ఈ శ్లోకమున తిరువనన్దాళ్వాన్ (ఆదిశేషుల) యొక్క పరిచర్యావిశేషమును పేర్కొనుచున్నారు. శేషాద్రి అను నామము వేంకటాచలమునకు ఉన్నట్లే, వనగిరికి కూడకలదు. ఆదిశేషుడే వనగిరిగా రూపొంది, భగవానునకు పరమానందసందోహసంధాయకస్థానవిశేషముగా వేంచేసియున్నాడు. ఇట్టి విలక్షణమైన శేషత్వము తనకు లభించుటచే అనంతుడు శేషుడనెడి తన నామమునందు మిక్కిలి ప్రీతిని కలిగియున్నాడు.

**"శేషః పరార్థత్వాత్"** అనెడి జైమిని పూర్వమీమాంసా సూత్రముయొక్క వాస్తవార్థమును పరిష్కరించి భగద్రామానుజులు – **"పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వ మేవ యస్య స్వరూపం స శేషః, పరః శేషీ"** అనుచు వేదార్థసంగ్రహములో శేషత్వ – శేషిత్వములను నిర్వచించిరి. శేషభూతుడు చేయు సేవలన్నియు శేషి సంతోషముకొఱకే అగును. ఇట్లు సేవచేయుటలో తనకును సంతోషమున్నను, **"భుంక్తే స్వభోగ మఖిలం పతిభోగశేషమ్"** అనునట్లు, **"తనక్కేయాక ఎనై క్కొళ్ళ మీదే"** అనునట్లును భగవదానందాధీనమైయుండును. అనంత, నాగరాజాది నామములు ఆదిశేషునకున్నను, వానిలో శేషుడను నామము తన శేషత్వమును నిరూపించునది అగుటచే దానియందు ఆ మహనీయునకు ప్రీతి మెండు. దానినే తనకు నిరూపకనామముగా తలచును. ఈ శ్లోకభావమును అనువదించుచు దేశికులు – **"శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్ – ఎన్నుమ్, నివాసశయ్యాసన – ఎన్నుమ్ శౌల్లుకిఅపడియే సర్వదేశ – సర్వకాల – సర్వావస్థోచిత – సర్వవిధకైంకర్యఙ్గళైయుమ్ సర్వవిధశరీరఙ్గళాలే అనుభవిత్తు, శేషత్వమే తనక్కు నిరూపకమాకైయాలే శేషన్ ఎన్గిఱ తిరునామమామ్బడియాన తిరువనన్దాళ్వానాకిఱ తిరుప్పళ్ళిమెత్తైయిలే"**.....అనుచు ఉపోద్ఘాతాధికారములో పల్కిన సూక్తి ఇచట అనుసంధేయము. **(వనశైలవాసినః సుందరస్య భోగ మేవ నిజభోగమ్ ఆభజన్)** – తిరుమలిరుమ్‌శోలై పర్వతములో నివసించు సుందరబాహుస్వామియొక్క స్వేశ్వరవిహారానుభవమునే తన శరీరమునకు సాఫల్యముగా తలచువాడై – అని అర్థము. భగవద్భోగమునే తన భోగముగా కల్గినవాడయ్యెనని చాటూక్తిస్వారస్య మిచట గమనింపనగును. ఇదియే కదా చేతనుని నిష్కృష్టస్వరూపము. **"ప్రహర్షయిష్యామి సనాథజీవితః"** అని కదా యామున సూక్తి. భోగశబ్దమునకు అనుభవమని, పాము శరీరమనియును అర్థము. **"భోగ స్సుఖే స్త్ర్యాది భృతావహే శ్చ ఫణకాయయోః"** అని అమరము. (**"భోగ మేవేత్యత్ర కార్యే కారణోపచారః, యద్వా, భోగశబ్దస్య"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.)



**(శేషతాకృతేః)** – **"పరాగతాతిశయాధానే"** ద్యాదిగా నిర్వచింపబడిన శేషత్వము సిద్ధింపబడుటచే – **(శేష ఏష ఇతి స్వనామని ప్రీతిమాన్)** – **"ఇతడు శేషుడు"** అని పలువురు చెప్పునట్లు తన కేర్పడిన శేషుడను నామములో గొప్ప ఆదరమును కల్గినవాడు.

**"భోగ మేవ"** అనుటవలన ఇచట రెండు విషయములు వ్యక్తములగుచున్నవి. **"భోగమాత్రసామ్యలింగా చ్చ"** అను బ్రహ్మసూత్రభాష్యములో తెలిపిన రీతిలో జీవునకు జగత్సృష్ట్యాదులలో సంబంధములేదు – అనునది ఒకటి. దీనివలన, **"ప్రకృష్టవిజ్ఞానబలైకధామని"** అని పొగడబడుటచే, జగద్వ్యాపారాదులలో నిత్యులకు, ముక్తులకును శక్తి కలదు. కాని ప్రాప్తి లేదు – అను పక్షము నిరస్తము. శ్రీభాష్యాదిగ్రంథవిరుద్ధమని సూచింపబడినది – అని వ్యాఖ్యానాంతరము. **"వనశైలవాసినో భోగ మేవ నిజభోగమ్"** అను అన్వయముతో ద్వయము ఉత్తరఖండములోని అర్థమును వ్యక్తముచేయుట ద్వారా తాము చేయు కైంకర్యములు అన్నియు భగవదానందము కొఱకే – అనుటను కవి తెలిపిరి. **"స్వశేషభూతేన మయా స్వీయైః సర్వపరిచ్ఛదైః, విధాతుం ప్రీత మాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్"** అనుచు భట్టర్ తమనిత్యగ్రంథప్రారంభములో అనుగ్రహించినట్లు ఫలత్యాగము, ఫలసమర్పణమును సూచింపబడినది. వృత్తము రథోద్ధత.

**73. వాహనాసనవితానచామరా ద్యాకృతిః ఖగపతి స్త్రయీమయః ।**
**నిత్యదాస్యరతి రేవ యస్య వై హ్యేష సుందరభుజో వనాద్రిగః ॥**

వాహన = పయనించుటకు సాధనమగు వాహనము, ఆసన = కూర్చుండుటకు సాధనమగు ఆసనము, వితాన = మేల్‌కట్టు, చామర = చామరము, ఆది + ఆకృతిః = మొదలగు రూపములను కలవాడై, త్రయీమయః = వేదస్వరూపుడగు, ఖగపతిః = పక్షిరాజు అగు గరుడుడు, యస్య ఏవ = ఏ భగవానునకు ఒక్కనికే, నిత్యదాస్యరతిః వై = ఎల్లప్పుడు అంతరంగకైంకర్యము చేయుటలో అభినివేశమును కలవాడో, ఏషః = (అట్టి), ఈ, సుందరభుజః = సుందరబాహుస్వామి, వనాద్రిగః = వనాద్రిని చేరినవాడైయున్నాడు, హి = ఇది ప్రసిద్ధము.

ఇందు గరుడుని పరిచర్యావిశేషములు ప్రస్తుతింపబడుచున్నవి. గరుడునివలె స్తుతికర్తయు పలువిధములైన దాస్యవృత్తులను చేయవలెనని కోరుచున్నారని వ్యాఖ్యానాంతరము. ఆదిశేషుడు ఒకే సమయమున చేతనసమాధితో అచేతనములగు పాదుకలు మొదలగు పలు రూపములను పొంది, శేషవృత్తిని చేయగా, గరుడుడును ఆ విధముగానే దాస్యవృత్తిని పలు విధములలో చేయును. ఈ రెండింటిలో ఏమి భేదము?

అనినచో గరుడుడు తన రూపమును మార్చుకొనకొండ, చేతనధర్మముతోనే కైంకర్యములను చేయును – అని ఇందలి వివరణము. శేషత్వము చేతనాచేతనసాధారణము. దాస్యము చేతనాసాధారణము.

**(త్రయీమయః ఖగపతిః)** – **"వేదాత్మా విహగేశ్వరః", "సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరః"** అనియును వేదస్వరూపిగా కీర్తింపబడు గరుడుడు –

**(వాహనాసనవితానచామరాద్యాకృతి స్సన్)** – **"దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః"** అనుచు యామునులు అనుగ్రహించినరీతిలో సమయానుగుణముగా వాహన – ఆసన – వితాన – చామరాదులుగా పలు రూపములను ఎత్తినవాడై – అని అర్థము. ఎట్లనగా –

**వాహనముగా** – **"అత్తియురాన్ పుళ్ళైయూర్వాన్"** ఇత్యాదిగా గరుడుడు వాహనమగుట ప్రసిద్ధము.

**ఆసనముగా** – భగవానునకు ప్రయాణసమయములో గరుడుని ఆసనముగా ధ్యానించుట ఆగమసిద్ధము.

**వితానముగా** – **"మేలాల్ పరన్ద వెయిల్ కాప్పాన్ వినతైచ్చిఱువన్ శిఱకెన్నుమ్ మేలాప్పిన్ కీழ் వరువానై"** అను నాయ్చ్చియార్ తిరుమొழி (14-3) సూక్తిని బట్టి గరుడుడు మేల్కట్టుగా రూపొంది, స్వామి కైంకర్యమును చేయునని తెలియుచున్నది.

**చామరముగా** – **"కానకమెల్లామ్ తిరియ కరియ తిరుమేని వాడ"** అనునట్లు శ్రీకృష్ణావతారమున అరణ్యములో తిరిగి, స్వామిశరీరము వాడిపోయినపుడు గరుడుడు తన రెక్కలను చామరములుగా చేసి, వీచెననుట పురాణప్రసిద్ధము. ఈ విధముగా గరుడుడు ఆయా సమయములకు తగినట్లు పలు సేవలను చేసి ఆనందించుననటను యామునులు **"దాసః సఖా"** ఇత్యాదిగా, దేశికులు గరుడపంచాశత్‌లో **"వేగోత్తానం వితానం వ్యజన మనుగుణం వైజయంతీ జయంతీ, మిత్రం నిత్యాభ్యమిత్ర్యం యుధి విజయరథో యుగ్యయోగానపేక్షః, దాసో నిష్పర్యదాసః"** ఇత్యాది శ్లోకమున తెలిపిరి.

గరుడుని కన్నులు – గాయత్రి, శిరస్సు –త్రివృత్ అను శ్రుతి, యజుస్సులు నామధేయములు – ఇత్యాదిగా తెలుపబడిన గరుడుని త్రయీమయత్వమును దేశికులు **"నేత్రం గాయత్ర మూచే త్రివృ దితి చ శిరో నామధేయం యజూంషి"** అను గరుడ పంచాశత్ శ్లోకమున వ్యక్తము చేసిరి. వేదప్రతిపాద్యుడు భగవానుడే అనుటను వేదపురుషుడు గరుడుని రూపమున వచ్చి, భగవానుని మోయుచు, వీథివీథి సంచరించి, తెలియనివారి కందఱకును తెలియురీతిలో చేయును. **"యజ్ఞో వై విష్ణుః"** అనునట్లు యజ్ఞమనగా భగవానుడే. **"వహేయం యజ్ఞాన్ ప్రవిశేయం వేదాన్"** అనుచు సౌపర్ణశ్రుతి పల్కినట్లు భగవానునకు గరుడుడు ఎల్లప్పుడు వాహనమై, వహించుననుటను తెలుపుటకై **"వాహన"**



పదమును ప్రయోగించిరి. చెప్పినదానిని చేయువాడు – అనుటను **"నిత్యదాస్యరతిః"** అను ప్రయోగము తెలుపును – అని వ్యాఖ్యానాంతరము. **"వేదాత్మకగరుత్మతా నిరంతరపరిచరితచరణద్వంద్వః సుందరబాహుః సౌలభ్యాతిశయేన వనశైలవాసీ భవతి ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత. స్వామి రథమైన గరుడుని రథోద్ధత అను వృత్తములో స్తుతించుట విశిష్టమైన వృత్తౌచిత్యము.

**74. వనాద్రినాథస్య సుసుందరస్య వై ప్రభుక్తశిష్టాశ్యథ సైన్యసత్పతిః ।**
**సమస్తలోకైకధురంధర స్సదా కటాక్షవీక్ష్యోఽస్య చ సర్వకర్మసు ॥**

వనాద్రినాథస్య = వనాద్రిప్రభువు అగు, సుసుందరస్య = సుందరబాహుస్వామియొక్క, ప్రభుక్తశిష్టాశీ = ప్రసాదశేషమును భుజించువాడు, సైన్యసత్పతిః = సేనాధిపతి, సమస్తలోక ఏకధురంధరః = అన్ని లోకముల భారమును తానే వహించువాడును అయి, సదా = ఎల్లప్పుడు, సర్వకర్మసు = అన్ని కార్యములయందు, అస్య = ఈ సుందరబాహుస్వామియొక్క, అథ = మంగళకరమైన, కటాక్షవీక్ష్యః = కడగంటి చూపులతో చూడబడతగినవాడు(గానున్నాడు)

ఇందు కూరేశులు విష్వక్సేనులనబడు సైన్యాధిపతి యొక్క పరిచర్యావిశేషములను స్తుతించుచున్నారు. అనంత, గరుడ, విష్వక్సేనులను నిత్యసూరులు ముగ్గురును ముఖ్యులని సంహితలు తెలుపుచున్నవి. దానిని అనుసరించియే పూర్వాచార్యులు ఇట్లు ఈ ముగ్గురను ప్రత్యేకముగా స్తుతించిరి.

**(ప్రభుక్తశిష్టాశీ)** – శ్రీవిష్వక్సేనమంత్రము ధ్యానప్రకరణములో **"శ్రీశభుక్తోజ్ఝితశేషజీవనః"** అని యున్నది. సుందరబాహుస్వామి భుజించి విడచిన **"పోనకమ్ శెయ్ద శేడమ్"** అని కీర్తింపతగిన ప్రసాదమును భుజించువాడితడు, కావుననే శేషాశనుడని పేరు. **"త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినా ప్రియేణ సేనాపతినా"** అని ఆళవందార్ స్తుతించిరికదా! దేశికులు ఈ విషయమును భగన్నివేదితాధికారములో పారమేశ్వరసంహితాదులలోని ప్రమాణములను చూపి వివరించిరి. **(సైన్యసత్పతిః)** – **"అన్యేషు సైన్యపతిషు సత్స్వయ మేవ సర్వోత్తర ఇత్యభిప్రేత్య సత్పదప్రయోగః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇతరసేనాధిపతులు అనేకులున్నను ఇతడే అందరికంటె గొప్పవాడను అర్థమును ఈ ప్రయోగము తెలుపుచున్నది.

**(సమస్తలోకైకధరంధరః)** – "ఇతడు సేనాధిపతియగుటచే ఆయా లోకనిర్వాహములను లోకములో ప్రభువువద్ద విన్నవించి, ఆ ప్రభువు అభిప్రాయమును గుర్తించి సేనాధిపతులు కార్యభారములను నిర్వహించునట్లే, విష్వక్సేనుడును చేయును. జగత్సృష్ట్యాదులలో మాత్రము ఇతనికి సంబంధము లేదు. అట్లయినచో ఇతని ధ్యానమంత్రములో **"విశ్వసృజే"** ఉన్నది కదా!" అని ప్రశ్నింపరాదు మఱి ఆ ప్రయోగమునకు అర్థమేమి? అనగా – **"స యది**

**పితృలోకకామో భవతి సంకల్పాదేవ వాస్య పితరః సముత్తిష్ఠంతే"** అను శ్రుతిలోవలె భగవత్సంకల్పాధీనముగ, స్వామి కైంకర్యానుగుణముగా **"ఏకధా భవతి ద్విధా భవతి"** అను రీతిలో అనేకవిధశరీరములను పరిగ్రహించునట్లే, స్వామి సేవకు ఆవశ్యకములగు ఉపకరణములను సృష్టించుకొనును – అని అర్థము –" అని వ్యాఖ్యానాంతరము. బ్రహ్మ, విశ్వామిత్రుడు మొదలగువారు కొన్ని లోకములను సృష్టింపగల సామర్థ్యమును కల్గియున్నట్లే, ఇది కూడ. శ్రీవైకుంఠగద్య లోని – **"సంకల్పమాత్రావక్లుప్తజగజ్జన్మస్థితిధ్వంసాదికే శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్తైశ్వర్యమ్"** అను సూక్తిని వ్యాఖ్యానించునపుడు దేశికులు ఈ విధముగానే వివరించిరి. కావున జగత్సృష్ట్యాదులను విష్వక్సేనుడు భగవానుని నియమానుసారము నిర్వహించునని కొందఱు పల్కుట **"జగద్వ్యాపారవర్జం, ప్రకరణా దసన్నిహితత్వా చ్చ"** అను సూత్రమునకు, దాని భాష్యమునకును, సంప్రదాయమునకును, వీనికి మూలమగు శ్రుతులకును విరుద్ధము. కూరేశుల అభిప్రాయమునకును విరుద్ధము – అని వ్యాఖ్యానాంతరము.

ఈ వివరణములోని సామంజస్యమును కొంచెము గమనించెదము. విష్వక్సేనుల మంత్రములో **'విశ్వసృజే'** అని యుండుటవలన, భగవద్రామానుజులు సాక్షాత్తుగా **"సంకల్పమాత్రావక్లుప్తజగజ్జన్మస్థితిధ్వంసాదికే"** ఇత్యాదిగా అనుగ్రహించుటచేతను, విష్వక్సేనులకు ఏ విధముగానైనను జగత్సృష్ట్యాదులతో సంబంధము ఎంతమాత్రము లేదని వ్యాఖ్యానించినచో పైన ఉదహరింపబడిన మంత్రసూక్తికి, పరమప్రమాణమగు భగవద్రామానుజసూక్తిని విరోధము కలుగను. కావున **"స్థితస్య గతిః చింతనీయా"** అను రీతిలో పైరెండు సూక్తులకును, **"జగద్వ్యాపారవర్జమ్"** ఇత్యాది బ్రహ్మసూత్ర. తద్భాష్య సూక్తులకును తగిన రీతిలో సమాధానము చెప్పుకొనవలెన్న – భగవత్సంకల్పాయత్తమైన జగత్సృష్ట్యాది నిర్వహణమును విష్వక్సేనుడు చేయునని అంగీకరింపవలెను. స్వతస్సిద్ధమైన, భగవత్సంకల్పముతో సంబంధములేని జగన్నిర్వాహమును విష్వక్సేనులు చేయుచున్నచో శ్రుతివిరోధము, బ్రహ్మసూత్రవిరోధము, సంప్రదాయవిరోధము, కూరేశసూక్తి విరోధము కలుగును కాని, తత్సంకల్పానుగుణ నిర్వహణము చేయుననుట విరుద్ధము కాదుకదా! ఇట్లు చెప్పకున్నచో శ్రీరామానుజుల శ్రీభాష్య – వైకుంఠగద్య సూక్తులమధ్యకూడ విరోధమును, అప్రామాణ్యమును ఒప్పుకోవలసియుండును. ఇది ఎవరికిని అభిమతము కాదు. కావున పై సమన్వయమే మేలనితోచును. దీనిని పరమకారుణికులగు పెరియవాచ్చాన్ పిళ్ళై **"నినైవుమాత్రత్తాలే నిర్వహిక్కప్పట్ట స్థావరజంగమాత్మకమాన సమస్తవస్తుక్కళినుడైయ ఉత్పత్తి స్థితివినాశఙ్గళెన్న, నియమనాదికళెన్న, ఇవరిరైయుడైయరాయ్"** అనుచు గంభీరముగా సూచించిరి. ఇట్టి సమన్వయము కూరేశులకు అభిమతమే అనుటను – **"ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా"** ఇత్యాది వైకుంఠస్తవములోని సూక్తినిబట్టి తెలియనగును. ప్రభువుచేయు



కార్యములను అతని సేనాధిపతి ఆరాజు నియమమునకు అనుగుణముగా నిర్వహించినంతమాత్రమున ఆ ప్రభువు అధికారమునకు లోటు ఏమియు రాదుకదా! కావున లోకవిరోధమును లేదు. భగవానుడే జగత్సృష్ట్యాదులను నిర్వహించునను వేదాంతశాస్త్ర విరోధముకూడ లేదు. భగవద్రామానుజుల మోక్షప్రదత్వమునుగూర్చికూడ అభిజ్ఞులగు పూర్వాచార్యులు అది భగవత్సంకల్పాధీనమేనని అంగీకరించిరి కదా! ఇట్టి సమన్వయమునే **"యస్మిన్ విన్యస్య భారం విజయిని జగతాం జంగమస్థావరాణామ్"** ఇత్యాది శ్రీసుదర్శనశతక సూక్తివిషయమున, **"శ్రీరంగచంద్రమస మిందిరయా విహర్తుం విన్యస్య విశ్వచిదచిన్నయనాధికారమ్"** అను శ్రీరంగరాజస్తవపూర్వశతకసూక్తివిషయమునను వ్యాఖ్యాతలు వివరించిరి. ఇచట వక్తవ్యాంశము లింకను కొన్ని ఉన్నను విస్తరభీతిచే ఇంతటితో ఈ విషయమును ముగించుచు, పరమప్రామాణికులగు దేశికులు సైతము తమ వైకుంఠగద్యభాష్యములోని **"యద్యపి జగద్వ్యాపారమోక్షప్రదత్వే బ్రహ్మలక్షణతయా ముక్తేష్వివ నిత్యసూరేష్వపి న సంభవతః, యద్యపి చ భగవాన్ సర్వజ్ఞః, తథాపి – ప్రియేణ సేనాపతినా నివేదితం తథాఽనుజానంత ముదారవీక్షణైః – ఇతి న్యాయేన భగవద్దత్తతాదృశాధికారతయా తత్తదవసరే జగత్సృష్ట్యాద్యర్థం భగవతే విజ్ఞాపనవాక్యం విష్వక్సేనో వ్యాహరతి, తదా స్వత స్సర్వజ్ఞో భగవాన్ తన్నివేదితకారీవ క్రీడతి, తావన్మాత్రేణ విష్వక్సేనస్య జగద్వ్యాపారవ్యపదేశ రూపస్తుతిః"** అను వివరణము ప్రకృతమున అవధేయమని విన్నవింపబడుచున్నది. **"యస్య సైన్యపతి రేవ సర్వనిర్వాహకః స ఏవ సులభో భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. తిరువాయ్‌మొழி ప్రబంధములోని **"అదు నమదు విదివకైయే"** (10–6–1) అను సూక్తిని వ్యాఖ్యానించుచు నమ్పిళ్ళై ఈడువ్యాఖ్యలో అనుగ్రహించిన రస్యమైన సూక్తుల భావ మిచట స్మరణీయము. **"కటాక్షవీక్ష్యః"** అనుటకు **"ఇంగితపాత్రం చ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము ఉపజాతి.

**75. ఛత్రచామరముఖాః పరిచ్ఛదా స్సూరయః పరిజనా శ్చ నైత్యగాః ।**
**సుందరోరుభుజ మింధతే సదా జ్ఞానశక్తిముఖనిత్యసద్గుణాః ॥**

నైత్యగాః = ఎల్లప్పుడు భగవత్కైంకర్యమును విడువకుండ చేయుటచే నిత్యులనబడు, సూరయః = దివ్యసూరులు, పరిజనాః చ = అనంత, గరుడ, విష్వక్సేనాది పరిజనులును, ఛత్రచామరముఖాః = ఛత్రము, చామరము మొదలగు, పరిచ్ఛదాః = భోగోపకరణములు, జ్ఞానశక్తిముఖ = జ్ఞానము, శక్తి మొదలగు, నిత్యకల్యాణగుణములును, సుందరోరుభుజం = సుందరబాహుస్వామిని, (ప్రాప్య = పొంది), సదా = ఎల్లప్పుడు, ఇంధతే = ప్రకాశించుచున్నవి.

సుందరబాహుస్వామియొక్క పరిజన, పరిచ్ఛద, కల్యాణగుణసమృద్ధిని ఇందు కూరేశులు పొగడుచున్నారు. **"సదా పశ్యంతి సూరయః"** అని కీర్తింపబడు నిత్యసూరుల

కైంకర్యములను, **"రాజా గచ్ఛతీత్యుక్తే సపరివారో గచ్ఛతీతి గమ్యతే"** అని భాష్యములో నుడివిన రీతిలో భగవానుని వెంటనంటియుండు పరిజనపరిచ్ఛదములను స్తుతించుచు, ఇవి అన్నియు వెల్గుచుండుటకు కారణము అవి సుందరబాహుస్వామిని ఆశ్రయించుటయే – అని పల్కుచున్నారు.

**(నైత్యగాః సూరయః)** నిత్యకైంకర్యమును చేయు దివ్యసూరులు. **"నిత్యం భవం నైత్యం, తత్కైంకర్యం గచ్ఛంతీతి నైత్యగాః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(సుందరోరుభుజమ్ ఇంధతే)** సుందరబాహుస్వామిని పొంది, ప్రకాశించుచున్నవి. ఈ శ్లోకములో మూడవపాదమున ఒక విరోధము కలదు. **"సుందరోరుభుజమ్ ఇంధతే"** అనుటకు సుందరబాహుస్వామిని ఎల్లప్పుడు ప్రకాశింపజేయుచున్నవి – అని కొందఱు అర్థమును చెప్పునట్లు, అది సరికాదనియు, **"ప్రాప్య"** (పొంది) అను ల్యబంతరూపమును (అసమాపక క్రియను) ఆధ్యాహారము చేసికొని **"సుందరోరుభుజం ప్రాప్య ఇంధతే"** అని యోజించుటయే తగినది అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఇంధతే ప్రకాశయతీత్యుక్తి రనుపపన్నా, ణిజంతత్వాభావ ద్ధేతోః, "గుణజం గుణినో హి మంగళత్వమ్" ఇత్యాద్యుక్తివిరోధా చ్చ, ప్రాప్యేత్యధ్యాహారః"** అని అచటి వివరణము. **"ఇంధతే"** అనుటకు **"ప్రకాశయతి"** అను అర్థమును చెప్పుట అనుపపన్నమని పల్కుట సమంజసమే. కాని, ముందు శ్లోకములో చివర **"శ్రితాః"** అనియున్నట్లు, అది **"సదా"** అని మాఱినదని కొందరు పెద్దలు ఊహించిరి. కాని, సాహసముతో కూరేశుల పాఠమునుమార్చు అధికారము మనకు లేదు. (లేఖక దోషమువలన) అపపాఠములు ఏర్పడుట సహజమే. **"సుందరోరుభుజే ఇంధతే"** – సుందరబాహుస్వామియందు ప్రకాశించుచున్నవి – అని వివరించువారును కలరు – అని మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**"ఇంధీ"** ధాతువును అకర్మకముగా భావించినకదా ఈ వివాదమంతయును. అది సకర్మకముగాకూడ కావచ్చును. యాదవాభ్యుదయమున, మాఘకావ్యమునను ఇట్టి ప్రయోగములను గమనింపవచ్చును. కావున కూరేశులు సకర్మముగా ఈ ధాతువును ప్రయోగించిరన్నచో ఏ విరోధమునులేదు. ఈ అంశములను అన్నిటిని **"ధాతో రర్థాంతరే వృత్తేః ధాత్వర్థేనోపసంగ్రహాత్, ప్రసిద్ధే రవివక్షాతః కర్మణోఽ కర్మికా క్రియా"** అను వాక్యపదీయవాక్యమును ఉట్టంకించి, సంస్కృతవ్యాఖ్యలో వివరించితిమి – అని వ్యాఖ్యానాంతరము. వృత్తము రథోద్ధత.

**76. ద్వారనాథగణనాథతల్లజాః పారిషద్యపదభాగిన స్తథా ।**



**మామకా శ్చ గురవః పురాతనా స్సుందరం వనమహీధ్రగం శ్రితాః ॥**

ద్వారనాథ = చండప్రచండాదులనెడి గొప్ప ద్వారపాలకులు, గణనాథతల్లజాః = కుముద, కుముదాక్షాదులగు గొప్ప గణనాయకులు, తథా = ఆ విధముగానే, పారిషద్యపదభాగినః = పారిషద్యపదవాచ్యులు, పురాతనాః = ప్రాచీనకాలమునుండి కైంకర్యమును చేయు, మామకాః గురవః చ = దాసుని ఆచార్యులు, దివ్యసూరులును, వనమహీధ్రగం = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును చేరియున్న, సుందరం = సుందరబాహుస్వామిని, శ్రితాః = ఆశ్రయించిరి.

చండప్రచండాది ద్వారపాలక శ్రేష్ఠులు, కుముదకుముదాక్షాది గణనాయక శ్రేష్ఠులు, **"పారిషద్యాః పరశ్శతమ్"** అని కీర్తింపబడు పారిషద్యపదవాచ్యులు, పరాంకుశపరకాల యతివరాదులు, మన పూర్వులును వనగిరినాథుని ఆశ్రయించి, ఉజ్జీవించిరి – అని భావము.

భగవానుని ధ్యానించునపుడు విష్ణుపరిషత్తులోనుండు మహనీయులనుకూడ ధ్యానింపవలెనని సంహితాదులలో చెప్పబడిన రీతిని కూరేశులు ఇందు అనుసరించిరి – అని వ్యాఖ్యానాంతరము. ఆదిశేషుడు, అతని పరివారమును నగరపాలకులు. గరుడుడు, అతని పరిజనులగు సత్య, సుపర్ణ, గరుడ, తార్క్ష్య, విహగేశ్వరాదులు గోపురపాలకులు, కుముద, కుముదాక్షాదులు ఆస్థాన నిర్వాహకులు – అని పాంచరాత్రశాస్త్రసిద్ధము. **"మామకా గురవః పురాతనాః"** అను ప్రయోగమునుబట్టి, కూరేశుల పూర్వులు ఈ ప్రాంతమున నుండియుండవచ్చును అని తెలియుచున్నదని – వ్యాఖ్యానాంతరము. వృత్తము రథోద్ధత.

**77. ఈదృశైః పరిజనైః పరిచ్ఛదైః నిత్యసిద్ధనిజభోగభూమిగః ।**
**సుందరో వనగిరేః తటీషు వై రజ్యతే సకలదృష్టిగోచరః ॥**

ఈదృశైః = పూర్వము తెలుపబడిన ఇట్టి, పరిజనైః = అనంత, గరుడ, విష్వక్సేనాది పరిజనులతో, పరిచ్ఛదైః = ఛత్ర, చామరాది చిహ్నములతో, నిత్యసిద్ధ = ఎల్లప్పుడు ఒకే స్థితిలో నున్న, నిజభోగభూమిగః = తన నిత్యవిభూతియగు శ్రీవైకుంఠములోనున్నవాడై, వనగిరేః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతముయొక్క తటీషు = చరియలలో, సకలదృష్టిగోచరః = అందఱు దర్శించునట్లు, గోచరీభూతుడై, సుందరః = **"అழகర్"** అను తిరునామముతో, రజ్యతే వై = ఆనందించుచున్నాడు, ఇది నిజము.

పూర్వము ప్రస్తావింపబడిన అనంత, గరుడ, విష్వక్సేనాది పరిజనములతో, ఛత్రచామరాది చిహ్నములతో సుందరబాహుస్వామి తిరుమాలిరుమ్‌శోలైపర్వతములో సేవను అనుగ్రహించిన రీతిని కూరేశులు ఇందు వర్ణించుచున్నారు. ఆళవన్దార్, శ్రీరామానుజులు మొదలగువారు అందఱు అనంతగరుడ విష్వక్సేనాదులను పరమపదములో

నిత్యకైంకర్యమును చేయువారుగానే తమస్తుతులలో తెలుపగా, మీరు ఇట్లు వారిని వనగిరిలోని స్వామిని సేవించుచున్నట్లు పల్కుట ఎట్లు తగును? అను ప్రశ్న కలుగునని తలచిన కూరేశులు, అందులకు సమాధానముగా ఈ శ్లోకమును సాయించిరని వ్యాఖ్యానాంతరము.

**(ఈదృశైః పరిజనైః పరిచ్ఛదై స్సహ)** – పూర్వోక్తప్రకారములగు పరిజనపరిచ్ఛదములతోకూడ – అని అర్థము. **"సుందరస్య వనశైలవాసినః"** అను శ్లోకమునుండి పూర్వశ్లోకమువరకు అయిదు శ్లోకములలో అనుగ్రహించిన వానిని అన్నిటిని **"ఈదృశైః"** అని నిర్దేశించిరి.

**(నిత్యసిద్ధనిజభోగభూమిగః)** – **"నిత్యసిద్ధ"** అనగా సదా ఏకరూపమైన అని అర్థము. **"నిజభోగభూమి"** అనునది తనకు అసాధారణమైన, **"నలమన్దమిల్లైదోర్ నాడు"** అనబడు అంతులేని ఆనందముగల దేశమగు నిత్యవిభూతిని తెలుపుచున్నది. **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, అస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతై స్సహ"** అనునట్లు శ్రీవైకుంఠములో వేంచేసియుండు భగవానుడు.

**(సకలదృష్టిగోచరః సుందర స్సన్)** – **"సకలమనుజనయనవిషయతాం గతః"** అనునట్లు అందఱికి గోచరుడైన సుందరబాహుస్వామియై –

**(వనగిరితటీషు రజ్యతే)** – తిరుమాలిరుమ్‌శోలై పర్వతచరియలలో హృదయపూర్వకముగా నివసించుచున్నాడు. పరమపదములో మనవంటివారి కన్నులకు లక్ష్యభూతుడు కాని కొఱత తీరునట్లు అచటి సన్నివేశముతోనే అజహత్ స్వభావుడై, **"ఆదియమ్ శోదియురువై అఙ్గు వైత్తిఙ్గు"** అనునట్లు ఇచటికి వేంచేసి, అందఱికి చక్షుర్విషయభూతుడై సేవను అనుగ్రహించుచున్నాడు. **"తదక్షరే పరమ్ వ్యోమన్", "యోఽ స్యాధ్యక్షః పరమే వ్యోమన్", "యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః", "ఏతే వై నిరయా స్తాత స్థానస్య పరమాత్మనః" – "న మాంసచక్షుభి రభివీక్షతే తమ్", "శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః – ఇత్యుపాసకానాం సాక్షాత్కారోఽపి స్వకీయకృపయా వనగిరిప్రాంతే సకలనేత్రపాత్రం భవతీతి సుందరబాహుసౌలభ్యాతిశయోఽభిధీయతే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా"** అనురీతిలో పరమపదనాథుడు వనగిరిలోని సుందరబాహుస్వామిగా వేంచేయగా, ఆస్వామిని సేవించుటకై అనంతగరుడవిష్వక్సేనాదులు అచటికి వచ్చుటలో ఏమి వింత? భగవానుడు మన బోటివారి మాంసచక్షువులకు గోచరుడు కాడు. **"స్వాధ్యాయ శ్చక్షు రుత ఏక మస్య యోగో ద్వితీయ మభివీక్షణాయ, అధ్యయన మనన నయనోఽస్య ద్రష్టా న మాంసచక్షుభి రభివీక్షతే తమ్"** అనెడి ఉపనిషద్వాక్యమును ప్రమాణీకరించి, విజ్ఞులీ అంశమును విపులీకరించిరి. **"స్వాధ్యాయోగనయనాః శుచయః కవీంద్రా"** అనుచు దేశికులును ఈ విషయమును తెలిపిరి. అట్టి దుర్లభుడగు స్వామి



అందఱి ప్రాకృతనేత్రములకును గోచరుడగు రీతిలో వనగిరిలో వేంచేసియుండుట ఆ స్వామి సౌలభ్యపరాకాష్ఠకు నిదర్శనము అని వ్యాఖ్యానాంతరము. **"వై"** అను అవ్యయము నిశ్చయార్థకము. వృత్తము రథోద్ధత.

**78. ఆక్రీడభూమిషు సుగంధిషు పౌష్పికీషు వైకుంఠధామని సమృద్ధసువాపికాసు ।**
**శ్రీమల్లతాగృహవతీషు యథా తథైవ లక్ష్మీధరః సజతి సింహగిరే స్తటీషు ॥**

వైకుంఠధామని = శ్రీ వైకుంఠమనెడి దివ్యదేశములో, సుగంధిషు = పరిమళమును కలిగిన, పౌష్పికీషు = పూలతో నిండిన, ఆక్రీడభూమిషు = క్రీడాప్రదేశములందు, సమృద్ధ = చక్కగా (జల) సంపద నిండిన, సువాపికాసు = బావులలో (జలక్రీడార్థము అమరియున్న బావులలో), శ్రీమల్లతాగృహవతీషు = అందమైన గొప్ప లతామండపములలో, యథా = (పరమపదములో) ఎట్లో, తథా ఏవ = ఆవిధముగానే, సింహగిరేః తటీషు = సింహగిరి అనబడు తిరుమాలిరుమ్‌శోలై పర్వతచరియలలో, లక్ష్మీధరః = లక్ష్మీపతి అగు భగవానుడు, సజతి = అభినివిష్టుడై వేంచేసియున్నాడు.

**"నల్లమన్దమిల్లదోర్ నాడు"** అని కీర్తింపబడు దివ్యలోకమగు శ్రీవైకుంఠములో మనస్సునకు మిక్కిలి ప్రియమగునట్లు నివసించు భగవానునకు ఈ వనగిరితటీవాసము రుచించునా? అను ప్రశ్నను కూరేశులు ఇందు సమాధానించుచున్నారు **"నిత్యసిద్ధభోగభూమినివాసరసికస్య వనాద్రివాసో వైరస్యావహః సా దిత్యాకాంక్షాయామ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. శ్రీవైకుంఠములోవలెనే ఈ దివ్యక్షేత్రములోకూడ భోగస్థాన – భోగోపకరణములకు కొదువలేదు, కావున భగవానుడు అచటవలె ఇచటను మనలను అనుగ్రహించుటకై క్రీడించుచున్నాడు – అని భావము. **"వైకుంఠభువనోద్యానభూమిసమాన – భోగ్యతావాసో వనాద్రితట ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఈ శ్లోకమున **"సభాప్రాసాదసంయుక్తం వనై శ్చోపవనైః శుభమ్, వాపీకూపతటాకై శ్చ వృక్షషండై శ్చ మండితమ్"** అను జితంతేస్తోత్రసూక్తియొక్క, భగవద్రామానుజుల వైకుంఠగద్యలోని – **"పరితః పతితైః పతమానైః పాదపస్థై శ్చ నానాగంధవర్ణైః దివ్యపుష్పైః శోభమానైః దివ్యపుష్పోపవనై రుపశోభితే దివ్యోద్యానశతసహస్రకోటిభి రావృతే"** ఇత్యాది సూక్తులయొక్క భావమును వనగిరివిషయమున కూరేశులు అనుసంధించిరి – అని చెప్పనగును. "దీనివలన వనగిరి భూలోకవైకుంఠమని తెలుపబడినది" – అని శ్రీ అణ్ణాస్వామివారివ్యాఖ్య.

పుష్పమండపమను నామముతో సంప్రదాయమున ప్రసిద్ధమైన తిరుమలలోని వృక్షములు, ఎల్లప్పుడు పూవులను రాల్చుచుండును. ఆ విధముగా రాలిన పూలు చెట్ల మీద ఉన్నప్పటి శోభకంటె కొండపై రాలినపుడు ఆపర్వతముయొక్క పవిత్రస్పర్శచే మరింత శోభను కల్గియుండును. **"శిన్దు పూ మకిழుమ్ తిరువేఙ్గడత్తు"** అను నమ్మాళ్వార్లసూక్తి

భావము ఇచట గమనింపదగినది. దీనిని ప్రకృతమున కూరేశులు **"సుగంధిషు పౌష్పికేషు"** అనుచు సూచించిరి. వేంకటాచలములోవలెనే ఇచటకూడ భగవానునకు అభినివేశము మెండు – అని భావము. **"సమృద్ధసువాపికాసు"** అను ప్రయోగము శ్రీరంగక్షేత్రమును సూచించుచున్నది. అచటి కావేరి, ఉయ్యక్కొణ్డార్ బావి, వడతిరుక్కావేరియు ఇచట స్మరణీయములు. అట్లే, **"ఆక్రీడభూమిషు శ్రీమల్లతాగృహవతీషు"** అనునది కాంచీపురమును పరామర్శించును. వరదరాజస్వామి పెరున్దేవితాయార్‌తో కలసి తోటలలో విహరించుటనుగూర్చి దేశికులు హంససందేశములో **"దేవః శ్రీమాన్ న యది విహరేత్ స్వైర మారామభూతా"** ఇత్యాది శ్లోకమున పలుకుటను గమనింపనగును. ఈ విధముగా ప్రకృతశ్లోకమున దివ్యదేశములలో అత్యంతము ప్రాముఖ్యమును కల్గిన **"తిరుమలై, కోయిల్, పెరుమాళ్‌కోయిల్"** అనబడు వేంకటాద్రి, శ్రీరంగము, కాంచీపురములలోని వైలక్షణ్యములను సూచింపజేయుచు, ఆ దివ్యదేశములలో భగవానుడు ఎట్లు అభినివిష్టచిత్తుడయ్యెనో, ఆ విధముగానే ఈ వనగిరిలోకూడ అత్యంతాభినివేశముతో వేంచేసియున్నాడు అని కూరేశులు తెలిపిరి – అని పెద్దలందురు – అని వ్యాఖ్యానాంతరము. కాని, ప్రకృతమున కవి తాత్పర్యము పరమపద – వనగిరుల సామ్యములోనే కావున, ఇట్టి సమన్వయములోని స్వారస్యమును విజ్ఞులూహింపగలరు. వృత్తము వసంతతిలక.

**79.** **ఆనందమందిరమహామణిమంటపాంతః**
**లక్ష్మ్యా భువాఽప్యహిపతౌ సహ నీళయా చ ।**
**నిస్సంఖ్యనిత్యనిజదివ్యజనైకసేవ్యో**
**నిత్యం వసన్ సజతి సుందరదోర్వనాద్రౌ ॥**

ఆనందమందిర = **"ఆనందనిలయము"** అను పేరునుకల, మహామణిమండప అంతః = తిరుమామణిమంటపములోపల, అహిపతౌ = ఆదిశేషునిపై, లక్ష్మ్యా = లక్ష్మీదేవితో, భువా అపి = భూదేవితోకూడ, నీళయా చ = నీళాదేవితోను, వసన్ = నివసించుచు, నిస్సంఖ్య = లెక్కలేని, నిత్యనిజదివ్యజన = నిత్యసూరులనెడి తన దాసులచే, ఏకసేవ్య = మాత్రమే సేవింపతగిన, సుందరదోః = సుందరబాహుస్వామి, వనాద్రౌ = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునందు, నిత్యం సజతి = ఎల్లప్పుడు ప్రీతిని కల్గియున్నాడు.

పూర్వశ్లోకమునకు శేషభూతమైయున్నది ఈ శ్లోకము. **"ఇతః పూర్వోక్తశ్లోకార్థ ఏవ ద్రఢీకృత్య సమర్థిత ఇతి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. పరమపదనాథుడే వనగిరిలో సుందరబాహుస్వామిగా సాక్షాత్కరించుచున్నాడు – అని వ్యాఖ్యానాంతరము. **(ఆనందమందిరమహామణిమండపాంతః)** – భగవానుని స్వరూపరూపగుణవిభూతులతో,



నిత్యముక్తులతో కూడియున్న స్థితిని సేవించుటవలన కల్గు మహానందమునకు ఆకరమగు, వేయున్తంభములనుకల తిరుమామణి మంటపములోపల – అని అర్థము. **"స్వరూపరూపగుణవిభూతినిత్యముక్తసంయుక్తభగవదనుభవజన్యమహానందోత్పత్తిగృహమ్..... సహస్రస్థూణాస్థానరత్నమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"జ్ఞానానందమయా లోకాః, తత్రానంద మయా లోకాః"** – అను సంహితావచనానుసారము, **"ఓమ్, ఆనందమయాయ దివ్యమండపరత్నాయ నమః"** అను ఆధారశక్తిమంత్రమునకు తగినట్లును ఈ ప్రయోగమును కవి చేసిరి. ఇచట పరాశరభట్టర్‌కృత శ్రీరంగరాజస్తవములోని – **"ఆస్థాన మానందమయం సహస్రస్థూణాదినామ్నా తమ్"** అను ప్రయోగము స్మరణీయము. ఇట్టి తిరుమామణి మంటపములో ఆదిశేషుడను పర్యంకముపై శ్రీభూనీళాసమేతుడై స్వామి సాక్షాత్కరించును. ఎవరికి? అనగా,

**(నిస్సంఖ్యనిత్యదివ్యజనైకసేవ్యః)** త్రిపాద్విభూతియగుటచే పరమపదమున లెక్కకు మించిన నిత్యులచే ముక్తులచే సేవింపబడుచుండును. వారికిమాత్రమే అతడు సేవ్యుడైయుండును. **"నిత్యాతీతో జగద్ధాతా నిత్యై ర్ముక్తై శ్చ సేవితః, బద్ధాంజలిపుటైః హృష్టైః నిర్మలైః నిరుపద్రవైః"** అని విష్వక్సేనసంహితలో తెలుపబడినట్లు నిత్యకైంకర్యరసికులైన నిత్యులకు సేవను అనుగ్రహించును. బలపౌష్కరసంహితలోని – **"దేవో వైకుంఠనాథ స్తు అనంతాసనసంస్థితః , సేవ్యః శ్రీభూమినీళాభిః ప్రాదుర్భావై స్తు చాఖిలైః"** అను సూక్తిని ప్రకృతశ్లోకమున పూర్వార్ధములో కూరేశులు పరిగ్రహించిరి. నిత్యగ్రంథమునందుకూడ శ్రీరామానుజులు పరమపదనాథుని ఈ విధముగానే ధ్యానించిరి – అని వ్యాఖ్యానాంతరము.

**(వనాద్రౌ నిత్యం వసన్ సజతి)** – వనాద్రిలో నిత్యవాసరసికుడై యున్నాడు. విరజానదిని మఱపించు నూపురగంగయు, తిరుమామణి మంటపమును మఱపించు దివ్యాలయమంటప సన్నివేశమును వనాద్రి కల్గియుండుటచే, పరమపదములోని వాసమును సైతము మఱచి, స్వామి ఇచటనే నివసించుచున్నాడు – అని అర్థము. **'సజతి'** అనగా ఆసక్తుడగుచున్నాడని భావము. **"పత్నీపరిజనాదిభి స్సహ నిత్యవాసయోగ్యో వనాద్రిః ఆనందమందిర మహామణిమంటపా దపి అత్యంతభోగ్య ఇతి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**80.** **ప్రత్యర్థిని త్రిగుణకప్రకృతే రసీమ్ని వైకుంఠధామని పరాంబరనామ్ని నిత్యే ।**
**నిత్యం వసన్ పరమసత్త్వమయేఽప్యతీత యోగీంద్రవాఙ్మనస ఏష హరి ర్వనాద్రౌ ॥**

పరమసత్త్వమయే =ఉన్నతమైన సత్త్వగుణముతో నిండినది, త్రిగుణక = సత్త్వరజస్తమస్సులు కలిసిన, ప్రకృతేః = మూలప్రకృతికి, ప్రత్యర్థిని = విరుద్ధమైనది, పర

+ అంబరనామ్ని = పరమాకాశమనబడు పేరును కల్గినది, నిత్యే = నిత్యమైనది అగు, వైకుంఠధామని = **"కలజ్గా ప్పెరునకర్"** అగు శ్రీ వైకుంఠనగరమునందు, నిత్యం వసన్ అపి = ఎల్లప్పుడు నివసించువాడు అయినను, ఏషః = ఈ, అతీతయోగీంద్రవాఙ్మనసః = యోగుల వాక్కుకు, మనస్సునకు సైతము అందనివాడగు, హరిః = శ్రీహరియగు సుందరబాహుస్వామి, వనాద్రౌ = వనగిరియందు (సజతి = అభినివేశమును పొందియున్నాడు).

**"సమర్థిత మర్థ మేవ ముఖాంతరేణాహ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక. అనగా పూర్వశ్లోకద్వయముద్వారా తెలుపబడిన అర్థవిశేషమే ఇచటను ప్రకారాంతరముగా తెలుపబడుచున్నది – అని అర్థము. వైకుంఠముయొక్క మహిమను శ్రుతిప్రతిపాదితరీతిలో కూర్చి, ఇందు తెలుపుచున్నారని వ్యాఖ్యానాంతరము. శ్రీవచనభూషణములో **"ఆవరణజలమ్ పోలే పర్వతమ్......పెరుక్కాఱుపోలే విభవజ్గళ్, అదిలే తేజ్గిన మడుక్కళ్‌పోలే అర్చావతారమ్"** అని పరమపదముకంటె అర్చావతారమునకుగల వైలక్షణ్యము దృష్టాంతపూర్వకముగా తెలుపబడినది. అట్టి ప్రాధాన్యమును దృష్టిలో నుంచుకొని ఈ శ్లోకమును కూరేశులు అనుగ్రహించిరి – అని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారి అవతారిక.

**(వైకుంఠధామని నిత్యం వసన్ అపి ఏష హరిః వనాద్రౌ)** – ఈ సుందరబాహుస్వామి వైకుంఠములో ఎల్లప్పుడు వేంచేసియున్నవాడు అయినను ఈ వనగిరిలో సన్నిహితుడైయున్నాడు. వైకుంఠమున తగిన పలు విశేషణముతో విశేషింపబడుచున్నది.

**(త్రిగుణకప్రకృతేః ప్రత్యర్థిని)** – ఈ ప్రకృతిమండలమునకు మిశ్రసత్త్వమని పేరు. సత్త్వరజస్తమస్సులను మూడు గుణముల కలయికయే ఇది. **"అచేతనా పరార్థా చ నిత్యా సతతవిక్రియా, త్రిగుణా కర్మిణాం క్షేత్రం ప్రకృతే రూప ముచ్యతే"** అను పరమసంహితా ప్రమాణమును ఉట్టంకించుచు భగవద్రామానుజులు శ్రీభాష్యములో దీనిని వివరించిరి. ఇందు సత్త్వగుణమున్నను, రజస్తమస్సుల కలయిక ఉన్నందున ఇది మిశ్రసత్త్వమగును. **"క్షయంత మస్య రజసః పరాకే"**, **"తమసః పరస్తాత్"** అనుచు శ్రుతులు రజోగుణమును, అవి కలిపిన ప్రకృతిని ప్రస్తావించి, వాని సంబంధములేనిది ఆ వైకుంఠము అని తెలుపుటచే ఇది శుద్ధసత్త్వ మనియు తెలియవచ్చును. **"త్రిగుణమయప్రకృతే ప్రత్యర్థిని ప్రతిభటే – హేయప్రతిభట ఇతి యావత్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"పరమసత్త్వమయే – రజస్తమోభ్యా మనవష్టబ్ధ శుద్ధసత్త్వమయే. కల్యాణైకతాన ఇతి యావత్"** అనియు ఆ వ్యాఖ్యలోని వివరణము. దీనివలన ఇచటి స్వామియొక్క ఉభయలింగములును సూచింపబడినవి.



**(అతీతయోగీంద్రవాఙ్మనస ఏషః)** – ఇచట **"అతీతయోగీంద్రవాఙ్మనసః"** అను సమస్త పదమును ప్రథమాంతముగా, లేక, సప్తమీవిభక్త్యంతముగా – రెండువిధములుగా గ్రహింపవచ్చును. ఈ రెండువిధములైన విభాగములకును సంధి ఒప్పును. **"స్థానేఽంతరతమః , ఉరణ్ రపరః"** అనునపుడు పతంజలి సంధిలో ప్రథమా, సప్తమీ విభక్తులను చెప్పి అన్వయించినట్లే, ఇచట కూడ. సప్తమీవిభక్త్యంతముగా అన్వయించినచో వైకుంఠమునకు విశేషణముగను, ప్రథమాంతముగా అన్వయించినచో భగవానునకు విశేషణముగను అగును. రెండు అన్వయములును అందమైనవే. శరణాగతిగద్యలోని భగవద్రామానుజుల – **"పరమయోగివాఙ్మనసాపరిచ్ఛేద్యస్వరూపస్వభావనిరతిశయ....వైకుంఠనాథ"** ఇత్యాది ప్రయోగమునకు సప్తమ్యంతమగు అన్వయము అనుకూలము. యోగశ్రేష్ఠుల వాక్కులకు సైతము అందనిది వైకుంఠముయొక్క మహిమ – అని దీని అర్థము. భగవద్వైభవముకూడ అట్టిదే కావున ప్రథమాంతాన్వయమును అర్థవంతమే. **"యోగీంద్రావాఙ్మనసాఽపరిచ్ఛేద్యస్వరూపరూప గుణవిభూత్యాదికోఽపి హరిః వనాద్రౌ ఏషః అయ మితి ప్రత్యక్షార్థో వర్తత ఇత్యర్థః. అతీతయోగీంద్రవాఙ్మనసే ఇతి సప్తమ్యాం వైకుంఠధామవిశేషణం వా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము పూర్వమువలెనే వసంతతిలక.

**81. లోకా శ్చతుర్దశ దధత్ కిల సుందరస్య పంక్తీగుణోత్తరితసప్తవృతీద మండమ్ ।
అన్యాని చాస్య సుసదృంశి పరశ్శతాని క్రీడావిధే రిహ పరిచ్ఛదతా మగచ్ఛన్ ॥**

చతుర్దశ = పదునాల్గు, లోకాన్ = లోకములను, దధత్ = దాల్చునది, పంక్తీగుణ = పదిరెట్లు, ఉత్తరిత = పెంచబడిన, సప్తవృతి = ఏడు ఆవరణములను కల్గినది, అగు, ఇదమ్ అండమ్ = ఈ బ్రహ్మాండమునకు, సుసదృంశి = చక్కగా పోలినవి అగు, పరశ్శతాని = నూఱు సంఖ్యలలోనున్న, అన్యాని చ = వేఱు బ్రహ్మాండములును, ఇహ = ఈ లీలావిభూతిలో, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క, క్రీడావిధేః = విలాసముకొఱకు, పరిచ్ఛదతామ్ = సాధనములగుటను, అగచ్ఛన్ కిల = పొందినవికదా!

పూర్వము నాల్గు శ్లోకములలో సుందరబాహుస్వామి నిత్యవిభూతియోగమును స్తుతించిన కూరేశులు ఈ శ్లోకమునుండి రెండు శ్లోకములలో లీలావిభూతియోగమును కీర్తించుచున్నారు. **"యదండమండాంతరగోచరం చ యత్ దశోత్తరాణ్యావరణాని యాని చ"** అను స్తోత్రరత్నసూక్తిని అనుసరించి ఈ శ్లోకములోని పూర్వార్ధము రచింపబడినది. ఈ సోత్రరత్నసూక్తికి దేశికుల భాష్య మిచట అనుసంధేయము. భగవానుడు లోకములను సృష్టించుట కేమి ఫలము? అను ప్రశ్నకు సూత్రకారుడు **"లోకవత్తు లీలాకైవల్యమ్"** అని సమాధానించెను – అనునదియు ఇచట వివక్షితము. ఈ సందర్భమున **"యత్సంవృతం**

**దశగుణోత్తరసప్తతత్త్వై రండం చతుర్దశ జగద్భవధాతృధామ, అండాని తత్సుసదృశాని పరశ్శతాని క్రీడావిధే స్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్"** అను వైకుంఠస్తవసూక్తియొక్క భావము స్మరణీయము.

**(చతుర్దశ లోకాన్ దధత్ పంక్తీగుణోత్తరితసప్తవృతీదమండమ్)** – పదునాల్గు లోకములను తనలో ఇముడ్చుకొన్నది, ఆపైన ఒకదానికి ఇంకొకటి పదిరెట్లు అధికమైన వైశాల్యమునుకల్గిన సప్తావరణములనుకల్గినది అగు ఈ అండము – అని భావము. **"దశగుణైః ఉత్తరితాః ఉత్తరత్వేన కృతా అధికతయా కృతాః"** అని, **"యద్వా, ఉత్తరితా సంజాతోత్తరాః సాతిశయా ఇతి యావత్"** అనియు రామానుజాచార్యవ్యాఖ్య. భూలోకభువర్లోక సువర్లోకాది 14 లోకములను కల్గినది బ్రహ్మచే సృష్టింపబడిన బ్రహ్మాండము. దీనికి ఆవల ఒకదానికి వేఱొకటి పదిరెట్లున్న జల, అగ్ని, వాయు, ఆకాశ, భూతాది, మహత్, ప్రకృతులనబడు ఏడు ఆవరణములతో ఆవరించబడియున్నది. **(అన్యాని సుసదృంశి పరశ్శతాని అండాని చ)** – ఇట్టి బ్రహ్మాండములు అనేకములున్నవి. ఈ విషయము **"అండానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ, ఈదృశానాం తథా తత్ర కోటికోట్యయుతాని చ"** అను పరాశరమహర్షివచనమువలన, **"రోమకూపేష్వనంతాని బ్రహ్మాండాని భ్రమంతి తే"** అనుచు భగవానుని విశ్వరూపమును చూచి, ఆశ్చర్యపడి పల్కిన అర్జునుని వచనమువలనను వ్యక్తము. ఇవి అన్నియు – **(ఇహ సుందరస్య క్రీడావిధేః పరిచ్ఛదతామ్ అగచ్ఛన్)** = ఇచట వేంచేసియున్న సుందరబాహుస్వామికి క్రీడాపరికరములు అగుచున్నవి. అండకులమునకు అధిపతియై, వానిని తన లీలోపకరణములుగా కల్గిన సుందరబాహుస్వామి ఈ తిరుమలలో సేవను అనుగ్రహించుచున్నాడు. **"పంక్తిర్వింశతిత్రింశత్"** అను సూత్రముద్వారా నిపాతితమైన పంక్తి శబ్దము పది అను అర్థమునిచ్చును. **"పంక్తిచ్ఛబ్దోఽపి దశమమ్"** అని అమరము. వృత్తము వసంతతిలక.

**82.** **సురనరతిర్యగాదిబహుభేదకభిన్న మిదం**
**జగదథ చాంఽడ మండవరణాని చ సప్త తథా ।**
**గుణపురుషౌ చ ముక్తపురుషా శ్చ వనాద్రిపతే**
**రుపకరణాని నర్మవిధయేఽపి భవంతి విభోః ॥**

సురనర = దేవతలు, మనుష్యులు, తిర్యక్ + ఆది = తిర్యక్కులు మొదలగు, బహుభేదక = పలు విశేషణములతో, భిన్నమ్ = వేఱ్వేరుగానున్న, ఇదమ్ జగత్ = ఈ లోకము, అథ చ = మఱియు, ఇదమ్ అణ్డమ్ = ఈ బ్రహ్మాండము, తథా = ఆ విధముగానే,



సప్త అండవరణాని చ = ఏడు ఆవరణములును, గుణపురుషౌ = గుణమయమైనది అగుటచే త్రిగుణములనబడు ప్రకృతి, బద్ధజీవులు, ముక్తపురుషాః చ = (ముక్తిని పొందిన జీవులు) – ఇవి అన్నియు, విభోః అపి = అందఱిని పాలించుస్వామి అగు, వనాద్రిపతేః = వనాద్రిప్రభువు యొక్క, నర్మవిధేః = లీలాప్రకారమునకు, ఉపకరణాని భవంతి = సాధనములగుచున్నవి.

**(సురనరతిర్యగాదిబహుభేదకభిన్న మిదమ్ జగత్)** – దేవ – మనుష్య – తిర్యక్ – స్థావరములనెడి బహువిధములైన విశేషణములతో వేఱు వేఱు అగు ఈ జగత్తు. **"భిద్యతే అనేనేతి భేదకః విశేషణమ్"** అను వ్యుత్పత్తినిబట్టి భేదకశబ్దము విశేషణవాచకము. ఆది శబ్దముచే స్థావరములు గ్రాహ్యములు.

**(అథ చ అణ్డమ్ సప్త అణ్డవరణాని చ)** ఇంతమాత్రమేకాక, అండము, ఏడు అండావరణములును.

**(గుణపురుషౌ చ)** ప్రకృతి, జీవాత్మవర్గములు – అని అర్థము. గుణమయమై, బంధకమై యుండుటచే గుణశబ్దవాచ్యమైనది ప్రకృతి. **"పురి శేతే ఇతి పురుషః"** అను వ్యుత్పత్తినిబట్టి దేహమునందుండుటచే పురుషశబ్దవాచ్యుడగు జీవుడు.

**(ముక్తపురుషా శ్చ)** – ప్రకృతి సంబంధమునుండి విడివడిన పురుషులు. గీతలో **"తేషాం సతతయుక్తానామ్"** అనుచోట గల **"సతతయోగం కాంక్షమాణానామ్"** అను శ్రీరామానుజుల భాష్యరీతిలో అర్థమును గ్రహించినట్లే ఇచట కూడ **"ముక్తపురుషాః"** అనుటకు ముక్తిని కోరు పురుషులు అను అర్థమును గ్రహించుట ఉచితము. తిరువిరుత్తప్రబంధములో **"పామ్బణైమేల్ పళ్ళికొణ్డరుళుమ్ శీదనైయే తొఴువార్ విణ్ణుళారిలుమ్ శీరియర్"** అని కీర్తింపబడినవారు ఈ ముక్తపురుష పదవాచ్యులు–అని శ్రీఅణ్ణాస్వామివారి వ్యాఖ్య. **"ముక్తపురుషాః ముచ్యమానాః పురుషా ఇత్యర్థః, లీలావిభూతియోగస్య ప్రకృతత్వాత్"** శ్రీనివాసాచార్యవ్యాఖ్య. మఱియు ఇచటి పురుషశబ్దములోని ఏకవచనమును జాత్యేకవచనముగా గ్రహింపనగును – అను వేఱొక వ్యాఖ్యనుబట్టి **"ముక్తపురుష శ్చ"** అను పాఠాంతరముకలదని తెలియును. జన్మాంతరసుకృతవిశేషవశముచే ఆచార్యకటాక్షపాత్రులై, **"మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే"** అనబడిన, ఎడారివంటి కైవల్యమును కోఱు వారు. కావుననే, భక్తులనుండి వీరిని వేఱుచేసి, **"అశంసాయాం భూతవ చ్చ"** అను సూత్రప్రకారము మోక్షమును కోరువారు కావున, ముక్తులని వేరుగా చూపబడిరి – అని వ్యాఖ్యానాంతరము. ఇవి అన్నియు సుందరబాహుస్వామికి లీలోపకరణములు. వృత్తము నర్కుటకము – **"యది భవతో నజౌ**

**భజజలా గురు నర్కుటకమ్"** అని లక్షణము.

**83. జ్ఞానినః సతతయోగినో హి యే సుందరరాంఘ్రిపరభక్తిభాగినః ।**
**ముక్తి మాప్య పరమాం పరే పదే నిత్యకింకరపదం భజంతి తే ॥**

సతతయోగినః = కర్మయోగమును అనుష్ఠించి, ఎల్లప్పుడు భగవానునితో యోగమును కోఱువారు, జ్ఞానినః = స్వస్వరూపజ్ఞానమును పొంది, తమలో అంతరాత్మగానుండు భగవానుని తెలియుట – అనెడి జ్ఞానయోగమును అనుష్ఠించు జ్ఞానులు, యే = ఎవరు, సుందర + అంఘ్రి = సుందరబాహుస్వామి శ్రీపాదములలో, పరభక్తిభాగినః = గొప్పభక్తిని పొందివారు కలరో, పరే పదే = పరమపదములో, తే = వారు, పరమాం ముక్తిమ్ = ఆపునరావృత్తిరూప గొప్పమోక్షమును, ఆప్య = పొంది, నిత్యకింకరపదం = (వీరు ప్రతిదినము కైంకర్యమును చేయుదురుగాక! అను మాటకు లక్ష్యభూతులగు) నిత్యకైంకర్యమును చేయు స్థితిని, భజంతి హి = పొందుచున్నారుకదా!

పూర్వశ్లోకమున **"ముక్తపురుషా శ్చ"** అనుచు ముముక్షుప్రస్తావము చేయబడుటచే వారిని ఇందు కూరేశులు విశేషించుచున్నారు. **"ముక్తపురుషా ఇతి ముముక్షుప్రస్తావనాత్ ముముక్షూన్ విశినష్టి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. భగవద్గీతలో **"తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిః విశిష్యతే"**, అనియు, **"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** అనియు పొగడబడిన జ్ఞానివర్గమునకు చెందినవారు తిరుమాలిరుమ్శోలై గిరిప్రభువు శ్రీపాదములలో భక్తిని కలవారైననే మోక్షమును పొందగలరు – అనునది ఈ శ్లోకమును బీజభూతమైన అర్థము. **"సతతయోగినః"** అను పదము **"తేషాం సతతయుక్తానామ్"** అనెడి గీతాశ్లోకములోనున్న **"సతతయుక్త"** పదస్థానములో ప్రయుక్తమగుటచే ఆ పదముయొక్క అర్థమే ఈ పదమునకును చెప్పనగును. **"సతతయోగం కాంక్షమాణాః"** – నిత్యయోగమును కోఱువారు – అని దీని అర్థము.

ద్వితీయపాదములో **"సుందరాంఘ్రిపద"** అని, **"సుందరాంఘ్రివర"** అనియును రెండు విధములైన పాఠభేదములు కలవు. **"వర"** అను పాఠమును అన్వయించుట సులభము. **"పద"** అను పాఠములో, **"అంఘ్రి"** అన్నను, **"పద"** అన్నను చరణమనియే అర్థము, కావున పునరుక్తిదోషము కలదు కదా! – అని శంకింపనక్కఱలేదు. పదమనుటకు ఆస్పదము అని అర్థము. సుందరబాహుస్వామి శ్రీపాదములను ఆస్పదముగా గొనిన భక్తిని కలవారు – అని ఇచటి అర్థము. ఇచట **"పరా భక్తిః"** అని పాఠముండవలెను. పుంభావము రాదు. అయినను, వాల్మీకి ప్రయోగించిన **"దృఢభక్తిః"** అను పదమును **"దృఢభక్తి రితి జ్యేష్ఠే"** అని రఘువంశములో కాళిదాసు ప్రయోగించగా, అచట వ్యాఖ్యాతలు తెలిపిన నిర్వాహములను ఇచటను గ్రహింపనగును". – అని వ్యాఖ్యానాంతరము.



మూడవపాదములో **''ముక్తి మాప్య''** అనునపుడు **''ఆప్య''** అను ల్యబంతరూపమును గూర్చిన ఒక విచారము కలదు. ఉపసర్గయోగములేనపుడు **"త్యక్త్వా, హిత్వా, ఉక్త్వా, బుద్ధ్వా గత్వా''** – అనునట్లు ఇచటను **''ఆప్త్వా''** అని క్త్వా ప్రత్యయాంతముగాకదా ఉండవలెను. ఉపసర్గయోగమున్న కదా **"ఆగత్య, పరిత్యజ్య, సమాప్య"** అనునట్లు ల్యబంతరూపము వచ్చును. **"ఆప్య"** అను ప్రకృతప్రయోగములో ఉపసర్గయోగము లేకుండగనే ల్యబంతము ఎట్లు వచ్చినది? అని అనునది ఆ సందేహము. కాని, ఇచట కూడ **"ఆఙ్"** అను ఉపసర్గము అంతర్హితమై యుండుటచే, పూర్వోక్తమగు అనుపపత్తికి అవకాశము లేదు – అని శ్రీ అణ్ణాస్వామివారి వ్యాఖ్యానసూక్తి. అతిమానుషస్తవములోకూడ మూడవశ్లోకమున **"రసమజ్జన మంజసాఽఽప్య"** అనుచోటకూడ ఇట్టి ప్రయోగమునే కూరేశులు చేసిరి.

**(తే పరమాం ముక్తి మాప్య పరే పదే నిత్యకింకరపదం భజంతి)** – పూర్వార్ధమున చెప్పబడిన జ్ఞానులై, సుందరబాహుస్వామి శ్రీపాదములందు భక్తిని కలవారు అపునరావృత్తి లక్షణమగు మోక్షమును పొంది, పరమపదములో నిత్యకైంకర్యము చేయువారగుదురు. **"కర్మజ్ఞానభక్తియోగా భగవన్నిత్యకింకరత్వసాధన మితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"జ్ఞానినః ప్రకృతివియుక్తప్రత్యగాత్మానుసంధానశీలాః"** అని, **"పరభక్తిభాగినః – కర్మయోగజ్ఞానయోగాంగకభక్తియోగనిష్ఠాః"**, అని, **"పరమాం ముక్తి మితి కైవల్యముక్తివ్యావృత్తిః"** అనియు రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**84. దేవస్య సుందరభుజస్య వనాద్రిభర్తుః హై శీలవత్త్వ మథవాఽఽశ్రితవత్సలత్వమ్ ।**
**ఐశస్వభావ మజహద్భి రిహావతారైః యోఽలంచకార జగదాశ్రితతుల్యధర్మా ॥**

యః = ఏ సుందరబాహుస్వామి, ఐశస్వభావమ్ = ఈశ్వరుడగు తనకే స్వంతమైన స్వభావమును, అజహద్భిః = వీడని, అవతారైః = పలు అవతారములతో, ఇహ = ఈ ప్రకృతిమండలములో, ఆశ్రితతుల్యధర్మా = తనను ఆశ్రయించినవారి ధర్మములతో పోలిన ధర్మములను కలవాడై, జగత్ = లోకమును, అలంచకార = అలంకరించెనో, దేవస్య = దేవతాసార్వభౌముడును, వనాద్రిభర్తుః = వనగిరికి ప్రభువు అగు, సుందరభుజస్య = సుందరబాహుస్వామియొక్క, శీలవత్త్వమ్ = సౌశీల్యమను గుణము నిండియుండుట, అథవా = లేక, ఆశ్రితవత్సలత్వమ్ = ఆశ్రయించినవారిపట్ల వాత్సల్యము, హై = మిక్కిలి ఆశ్చర్యకరము.

ఇది మొదలు ముప్పది ఎనిమిది శ్లోకములతో కూరేశులు భగవానుని

అవతారములను స్తుతింపగోరి, మొదటగా అయిదాఱు శ్లోకములను అవతారికారూపమున రచించిరి. వానిలో ఇది మొదటిది. **"అజోऽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోऽపి సన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా"** అను గీతాశ్లోకానుసారము అజహత్ స్వభావుడై, మనుష్యసజాతీయుడై విభవావతారములను ఎత్తుట సౌశీల్యప్రయుక్తమా? లేక, ఆశ్రితవాత్సల్యనిబంధనమా! – అని ఇందు కూరేశులు ఇందు తలపోయుచున్నారు.

**(యః ఐశస్వభావమ్ అజహద్భిః అవతారైః ఇహ అశ్రితతుల్యధర్మా సన్ జగత్ అలంచకార)** – ఏ సుందరబాహుస్వామి సర్వేశ్వరత్వమునకు తగిన స్వరూపరూపగుణ విభూతులను, లేక, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాదులను వీడకుండనుండు అవతారములతో ఈ లోకములో ఆశ్రితులగు మానవాదుల శీలముతో సమానమైన శీలమును కలవాడై, జగత్తును అలంకరించుచున్నాడో – అని అర్థము. **"ఐశస్వభావమ్ – సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదిస్వభావమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"స్వభావ మజహత్ శశ్వత్ ఆకారాంతర మాకృతేః"** అను పౌష్కరసంహితావచనమును అనుసరించి, **"ఐశస్వభావ మజహద్భిః"** అని పల్కిరి. ఏ రూపమున అవతారమును ఎత్తునో, ఆ జాతి ప్రాణి ఎట్లుండునో, ఆ విధముగానే భగవానుడు మాఱును – అను అర్థమును **"ఆశ్రితతుల్యధర్మా"** అనుటద్వారా తెలిపిరి. పరమతభంగములో దీనిని దేశికులు **"కన్నుమలర్ పశువుమలర్ ఆకినిన్టే కన్నాకి ప్పశువాకి నిన్టవణ్ణమ్"** అనుచు పల్కిరి.

**(తస్య వనాద్రిభర్తుః సుందరభుజస్య దేవస్య శీలవత్త్వమ్ అథవా ఆశ్రితవత్సలత్వమ్ హై)** – ఇది తిరుమాలిరుమ్శోలైగిరి ప్రభువగు సుందరబాహుస్వామి శీలగుణమా? లేక, ఆశ్రితవాత్సల్యమా? ఎంత ఆశ్చర్యకరమైనది! అని అచ్చెఱువును పొందుచున్నారు. **"ఆశ్రితవాత్సల్యమ్ ఆశ్రితపారతంత్ర్యమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**85.** **సింహాద్రినాథ తవ వాఙ్మనసాతివృత్తం**
**రూపం త్వతీంద్రియ ముదాహ రహస్యవాణీ ।**
**ఏవం చ న త్వ మిహ చేత్ సమవాతరిష్యః**
**త్వద్జ్ఞానభక్తి విధయోऽద్య ముధాऽభవిష్యన్ ॥**

సింహాద్రినాథ = వనగిరిప్రభూ! తవ = నీ యొక్క, రూపం = దివ్యరూపమును, వాఙ్మనస = వాక్కుకు, మనస్సుకు, అతివృత్తమ్ = అందనిదిగా, అతీంద్రియమ్ = చక్షురింద్రియమునకు అందనిదిగా, రహస్యవాణీ తు = ఉపనిషద్వాణి అన్నచో, ఉదాహ = గట్టిగా తెలిపినది, ఏవం చ = ఇట్లయినను, ఇహ = ఈ ప్రకృతిమండమములో, అద్య = ఈ సమయమున, త్వం = నీవు, న సమవాతరిష్యః చేత్ = అవతరించియుండకపోయినచో, త్వత్ జ్ఞానభక్తివిధయః = నీ దివ్యరూపమును ఆధారముగా చేసికొని ప్రవర్తించు జ్ఞానయోగ, భక్తియోగాది శాస్త్రములు, ముధా = వ్యర్థములుగా, అభవిష్యన్ = అయిఉండెడివి.



భగవానుడు అవతారములను ఎత్తకున్నచో, శ్రుతిస్మృత్యాదిసకలశాస్త్రములును నిర్విషయములు అగును అనుచు, భగవదవతారముల ఆవశ్యకతను కూరేశులు ఇందు స్థాపించుచున్నారు. **(రహస్యవాణీ వాఙ్మనసాతివృత్తమ్ తవ రూపం తు అతీంద్రియమ్ ఉదాహ)** – స్వామీ! ఉపనిషత్తులు అవాఙ్మనసగోచరమగు నీ దివ్యరూపమును అతీంద్రియమని తెలిపినవి. **"న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్"** అని, **"న మాంసచక్షుభి రభివీక్షతే తమ్"** అని కన్నులకు కానరానిది నీ రూపము అని అన్నది. ప్రకృతశ్లోకమున రూపశబ్దము దివ్యమంగళవిగ్రహపరము. **"రూపం తు శ్లోకశబ్దయోః పశావాకాశే సౌందర్యే.... స్వభావే చ"** అని హైమ నిఘంటువు. **"రోపయతి – విమోహయతి, రూపు – విమోహనే"** అని కదా రూప శబ్దవ్యుత్పత్తి. **"అత్ర రూపశబ్దో విగ్రహపరః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **(ఏవం చ త్వ మిహ న సమవాతరిష్యః చేత్)** – ఇట్లు ఉపనిషత్తులు తెలిపినదానికి అనుగుణముగా నీవు ఈ లోకమున అవతారములను ఎత్తి ఉండకపోయినచో, అనగా – ఎవరి కన్నులకు లక్ష్యభూతుడవు కాకున్నచో – అని అర్థము.

**(త్వత్ జ్ఞానభక్తివిధయః అద్య ముధా అభవిష్యన్)** – శాస్త్రములలో **"నిదిధ్యాసితవ్యః"** అనియు, **"తా మర్చయేత్, తాం ప్రణమేత్"** అనియు **"నిత్యం ప్రదక్షిణీకుర్యాత్"** అనియు మొదలుగా విధింపబడిన శాస్త్రవిధులకు విషయమే లేకుండపోయెడిది కదా! మానవులనుగూర్చి ప్రవర్తించిన శాస్త్రములలో విహితములైయున్న విధులకు లక్ష్యము లేకున్నచో, ఆ శాస్త్రములు నిర్విషయములు, నిరర్థకములు అగును కదా! **"శ్రుతిః స్మృతి ర్మమైవాజ్ఞా"** అను నీ సూక్తియు వ్యర్థమే కదా! అట్లు కాకుండుటకొఱకేకదా నీవు విభవావతారములను పరిగ్రహించితివి – అని భావము. **"శుభాశ్రయవిగ్రహాశ్రయకప్రవృత్తిమత్యః జ్ఞానభక్తివిధయః త్వదవతారాభావే న సంపద్యంతే ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అవతారగోచరజ్ఞానం సాక్షాత్కారరూపం, తద్గోచరా భక్తిః, తద్గోచరో విధిః పరిచారా శ్చ"** అని రామానుజాచార్యవ్యాఖ్య. భగవానుని అవతారములను నాల్గు విధములుగా పెద్దలు వర్గీకరించిరి. 1.భగవానుని సాక్షాద్ అవతారములు – ఇవి మత్స్యకూర్మాదులు – వ్యక్తములు. 2.కొన్ని కార్యములను చేయుటకు ఎవరినో ఒక ఋషి మొదలగువారిని ఆవేశించి ఎత్తిన పరశురామ, వేదవ్యాసాది అవతారములు. 3.నిర్దిష్టమైన ఒకానొక సమయమున మాత్రము కొందఱిని తన శక్తితో దాసులుగా చేసికొని తాను కోఱినపుడు ఉపసహరించుకొనిన పురంజయాద్యవతారములు.

4. శిలాకాష్ఠజతుచిత్రపటసుధాపంచలోహ రేఖాయంత్రపృథివీ జలవహ్నివాయువులు మొదలగువానిలో అర్చారూపమున అవతరించి అనుగ్రహించునవి – అని అట్లు భగవదవతారములు నాల్గు విధములు. వీనిని అన్నిటిని పౌష్కర సాత్త్వతాది సంహితలలో, శ్రీవిష్ణుధర్మము ఇత్యాదులలో తెలియనగును. వీనిలో మత్స్యకూర్మాది సాక్షాదవతారములకు, అర్చారూపమున సేవను అనుగ్రహించు విభవావతారములకును మాత్రము శుభాశ్రయత్వము – అనగా దివ్యమంగళవిగ్రహముండు స్థితి కలదు. అంశావతారములు, ఆవేశాతారములును అగు – పరశురామ, పురంజయ – వేదవ్యాసాదులకు లేదు. ఇతరదేవతలకుకూడ శుభాశ్రయత్వము లేదు. **“అశుద్ధా స్తే సమస్తా స్తు దేవాద్యాః కర్మయోనయః, యతోఽత స్తే సురాః సర్వే ధ్యానినాం నోపకారకాః”** అను సూక్తినిబట్టి వారిని ధ్యానింప వీలుకాదు. కావున శుభాశ్రయము, దివ్యమంగళవిగ్రహము, శుద్ధసత్త్వము అనుచు పిలువబడు దివ్యవిగ్రహము లేకుండ ధ్యానించుట అను భక్తియోగముకాని, అతనిని తెలిసికొనుట అనెడి జ్ఞానయోగము కాని, **“దైవ మేవాపరే యజ్ఞమ్”** (4–25) అని ప్రారంభించి గీతలో తెలుపబడిన దేవార్చన – తప – స్తీర్థ – దాన – యజ్ఞాదులగు కర్మయోగ ప్రకారములుకాని – ఇవి ఏవియును వీలుకావు. అందుచే నిన్ను పొందుటకు విధింపబడిన శాస్త్రములన్నియు వ్యర్థములే కావలసివచ్చును – అను గంభీరమైన శాస్త్రార్థమును కూరేశులు ఇందు పరమగంభీరమైన రీతిలో తెలిపిరి. ఈ సందర్భమున కూరేశకృతస్తోత్రమగు వరదరాజస్తవములోని – **“వరద! యది న భువ్యవావతరిష్యః శ్రుతివిహితాః త్వదుపాసనార్చనాద్యాః, కరణపథవిదూరగే సతి త్వయ్యవిషయతాని కృతాః కిలాభవిష్యన్”** అను శ్లోకార్థమును స్మరింపనగును. వీరికంటె ఇంకొక అడుగు ముందుకువేసిన వీరి కుమారులగు శ్రీపరాశరభట్టర్ ఈ శ్రీగుణరత్నకోశములో, శ్రీరంగరాజస్తవములో భగవానునితో లక్ష్మీదేవియు అవతరించియుండకపోయినచో **“ఆసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః”** ఇత్యాదిగా ఆ అవతారములు విరసములే అయియుండెడివి అనిరి. మన అదృష్టవశమున అట్లు కాకుండ పోయినది కదా! అను భావము **“లిఙ్ నిమిత్తే లుఙ్ క్రియాతిపత్తౌ”** అను లక్షణానుసారము లుఙ్‌లకారార్థప్రయోగముద్వారా వ్యక్తమగుచున్నది – అని వ్యాఖ్యానాంతరము. వృత్తము వసంతతిలక.

**86.** **యే భక్తా భవదేకభోగమనసోఽనన్యాత్మసంజీవనాః**
**తత్సంశ్లేషణతద్విరోధినిధనాద్యర్థం వనాద్రీశ్వర ।**
**మధ్యేఽణ్డం యదవాతరః సురనరాద్యాకారదివ్యాకృతిః**
**తేనైవ త్రిదశైః నరై శ్చ సుకరం స్వప్రార్థితప్రార్థనమ్ ॥**



వనాద్రీశ్వర = వనాద్రిప్రభూ ! అనన్యాత్మసంజీవనాః = తమ ఆత్మ ఉజ్జీవించుటకు భగవానుడు తప్ప వేఱు ఉపాయము లేదు అని తలచి, ఆ స్వామిచే తమ ఆత్మ చక్కగా ఉజ్జీవింపచేయబడినవారు (తమ ఆత్మల ఉజ్జీవనము భగవానునివలన మాత్రమే పొందువారును), భవదేకభోగమనసః = నిన్ను మాత్రమేసేవించుట అనెడి (ప్రాప్య) విషయమునందు అభినివేశమునుకల మనస్సును కలవారును అగు, యే భక్తాః = ఏ భక్తులు కలరో, తత్ సంశ్లేషణ = వారితోకలసి వర్తించుట (సాధుపరిత్రాణము), తద్విరోధినిధన = వారి విరోధులను వధించుట (దుష్కృద్వినాశము), ఆది + అర్థం= ధర్మసంస్థాపనము – అను వీనికొఱకు, సురనరాద్యాకార = దేవతలు, నరులు మొదలగురూపములలో, దివ్యాకృతిః = అప్రాకృతదేహమును కలవాడవై, మధ్యేఽణ్డమ్ = ఈ బ్రహ్మాండము మధ్యలో, యత్ = ఏకారణముచే, అవాతరః = అవతరించితివో, తేన ఏవ = ఆకారణముచేతనే, త్రిదశైః = దేవతలచే, నరైః చ = మఱియు నరులచేతను, స్వప్రార్థితప్రార్థనం = తాముకోరిన ఫలములను నీవద్ద ప్రార్థించి పొందుట, సుకరమ్ = సులభము (అయినది)

భగవానుడు విభవావతారములను ఎత్తిన కారణమును, ఆ అవతారములవలనకల్గిన సౌకర్యమును కూరేశులు ఇందు ప్రస్తావించుచున్నారు.

**(అనన్యాత్మసంజీవనాః భవదేకభోగమనసః యే భక్తాః)** – భగవానుడు తప్ప వేఱు ఉపాయమును, వేఱు ఫలమును దేనిని లేనివారగు భగవద్భక్తులెవ్వరు కలరో – అని అర్థము. **“కళైవాయ్ తున్బమ్ కళైయా దొழிవాయ్ కలైకణ్ మற்றிలేన్**...అని, **“ఉనక్కు ప్పణి శెయ్‌దిరుక్కు న్దవముడైయేన్”** అనియును అనుసంధించు భక్తులెవ్వరు కలరో, వారు – అనియు అర్థము. **‘సర్వేశ్వర మేవ ధారణపోషకభోగ్యత్వేన మన్యమానాః తదలాభే స్వాత్మధారణం కర్తు మశక్నువానా ఇతి యావత్”** అని రామానుజాచార్యవ్యాఖ్య. అందుచే **“ఉణ్ణుమ్ శోరు పరుకు నీర్ తిణ్ణుమ్ వెற்றிలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్”** ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు ఇచట అనుసంధేయములు. **(తత్సంశ్లేషణతద్విరోధినిధనాద్యర్థమ్)** – అట్టి పరమభక్తాగ్రేసురులతో కలసి వర్తించి, వారి విరోధులను నిరసించుటకు అని భావము. ఇచటి ఆదిశబ్దముచే ధర్మసంస్థాపనమను మూడవ ప్రయోజనము గ్రాహ్యము. గీతలోని **“పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్”** అనెడి శ్లోకములోని (సాధు) పరిత్రాణశబ్దమువలన వివక్షితమైన విలక్షణమైన అర్థమును కూరేశులు ఇచట సంశ్లేషణమను పదప్రయోగముద్వారా వ్యక్తీకరించిరి. సామాన్యమైన రక్షణము – (పరిత్రాణము) వివక్షితమైనచో, అది సంకల్పమాత్రసాధ్యము కావచ్చును. అందులకొఱకు భగవానుడు అవతరింపవలసిన అవసరమే లేదు. సృష్టిలయములను సంకల్పమాత్రముచేతనే నిర్వహించువాడు రక్షణను నిర్వహింపలేడా! కాని, సాధుసంశ్లేషణము సంకల్పమాత్రసాధ్యము

కాదుకదా! గీతాభాష్యమునందు, అంతరధికరణభాష్యమునందు భగవద్రామానుజులు అనుగ్రహించిన అర్థమదియే కదా! కావున అవతారములు సాధుపరిత్రాణ, దుష్కృద్వినాశాదులకొఱకు – అని భావము. **"సంశ్లేషణమ్ – యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ – ఇతి ప్రకారేణ స్వయ మేవ సంశ్లేషః''** అని రామానుజాచార్యవ్యాఖ్య. సుందరబాహుస్వామినిగూర్చి నమ్మాళ్వార్లు, **"పారిత్తు ఎన్నై ముఱ్ఱప్పరుకినాన్", "తిరుమాలిరుమ్శోలై వఞ్జక్కళ్వన్ మామాయన్ మాయ క్కవియాయ్ వన్దు ఎన్నన్ నెఞ్జమ్ ఉయిరుమ్ ఉళ్కలన్దు నిన్రాన్", "ఎన్నై ముఱ్ఱుమ్ ఉయిరుణ్డ ఎన్మాయవాక్కై యదనుళ్‌వుక్కు", "నన్గు ఎన్నుడలమ్ కైవిడాన్"** ఇత్యాదిగా అనుగ్రహించిన దానిని దృష్టిలో నుంచుకొని శ్లోకమున **"తత్సంశ్లేషణ"** అని ప్రయోగింపబడినది. ఆవిధముగానే **"ఎణ్ణాదనకళ్ ఎణ్ణుమ్ నన్ మునివర్ ఇన్బమ్ తలైచ్చిఱప్ప", "నల్ల అమరర్ పొలివెయ్‌ద"** అను సూక్తుల అర్థము ప్రథమపాదమున అనుసంధింపబడినది. **"నణ్ణా వశురర్ నలివెయ్‌ద"** అను సూక్త్యర్థము **"తద్విరోధినిధనాద్యర్థమ్"** అనుచు తెలుపబడినది. **"భవదేకోపాయోపేయా భక్తా స్సాధుశబ్దేనోచ్యంతే. పరిత్రాణాం తత్సంశ్లేషణ మేవ. దుష్కృచ్ఛబ్దేన భక్తివిరోధిన ఏవోచ్యంతే. నిధనాదీత్యత్ర ఆదిశబ్దేన ధర్మసంస్థాపన ముచ్యతే. అవతారాభావే భవత్సాక్షాత్కారస్యైవ దుష్కరత్వాత్ ప్రార్థితప్రార్థనం న సంభవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే – ఇత్యుక్త ప్రయోజన త్రయార్థం సంశ్లేషణమ్ – యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ – ఇతి ప్రకారేణ స్వయ మేవ సంశ్లేషః"** – అని రామానుజార్యవ్యాఖ్య. "భగవానుడు ఇట్లు ఈ ప్రకృతిమండలములో అవతరించుటచేతనే **"వరం వరయ తస్మా త్త్వం యథాభిమత మాత్మనః, సర్వం సంపత్స్యతే పుంసాం మయి దృష్టిపథం గతే"** అను రీతిలో ఆ స్వామి ఔదార్యము వ్యక్తమగుచున్నది. అట్లే చేయి చాచి జీవించు భిక్షుకులగు దేవతలు, ప్రార్థించినదంతయు వారికి లభించుటకు అవకాశమేర్పడినది. **''సురనరాద్యాకార శ్చాసౌ దివ్యాకృతి శ్చ** – అని సమానాధికరణసమాసమును చెప్పుకొనవలెను. లేనిచో **"సురనరాద్యాకారే దివ్యాకృతిః"** – అని వ్యధికరణసమాసమును చెప్పినచో పునరుక్తి వచ్చును" – అని వ్యాఖ్యానాంతరము. వృత్తము శార్దూలము.

**87.** **శ్రీమన్ ! మహావనగిరీశ! విధీశయో స్తే**
**మధ్యే తు విష్ణు రితి యః ప్రథమావతారః ।**
**తేనైవ చేత్ బత! మహిమ్ని జనాః కిలాంధాః**



**త్వన్మత్త్యభావ మవగమ్య కథం భవేయుః ॥**

మహావనగిరీశ = గొప్ప పర్వతమగు తిరుమాలిరుమ్శోలైకు ప్రభూ!, శ్రీమన్ = లక్ష్మీసహితుడా!, విధి + ఈశయోః = బ్రహ్మరుద్రులయొక్క, మధ్యే తు = నడుమలో, విష్ణుః ఇతి = విష్ణువు అను, తే = నీయొక్క, యః ప్రథమావతారః తు = ఏ మొదటి అవతారమున్నదో, తేన ఏవ = దానిచేతనే, తవ = నీ యొక్క, మహిమ్ని = మహిమయందు, జనాః = (తెలివి తక్కువ) జనులు, అంధాః చేత్ = (కన్నులున్న) గుడ్డివారైనచో, త్వత్ + మత్త్యభావం = నీ మత్త్యరూపమును, అవగమ్య = తెలిసికొని, కథం భవేయుః = ఏమి అగుదురో? (ఏమని ఎట్లు తలతురో), కిల = కదా!

విభవావతారప్రశంస ప్రస్తుతమగుటచే, ఇందు వివక్షితవిషయములను అన్నిటిని క్రమముగా కూరేశులు ప్రతిపాదించుచున్నారు. పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవోత్తర శతకములో **"మధ్యే విరించిగిరిశం ప్రథమావతారః"** అనుచు ప్రారంభించి, అనుగ్రహించిన శ్లోకము ఈ శ్లోకార్థమునకు వివరణరూపమే.

**(శ్రీమన్ మహావనగిరీశ)** – ఈ ప్రయోగమును ఒకే సంబోధనగా గాని, రెండు సంబోధనలుగాగాని అన్వయింపవచ్చును. **"శ్రీమన్"** అనునది ప్రత్యేకముగా విభజించినచో రెండు సంబోధనలు అగును. మహావనగిరియందుకాని, లేక మహావనగిరీశునియందుకాని శ్రీమత్త్వవత్త్వమును అన్వయించి, సమస్తపదముగా గ్రహింపవచ్చును. అపుడు అంతయు కలిపి ఒకే సంబోధన.

**(విధీశయో ర్మధ్యే విష్ణు రితి తే యః ప్రథమావతారః)** – **"నల్లరన్ నారణన్ నాన్ముకన్"** (2-9-1) అని తిరుమఴిసైమన్నన్ పల్కినట్లు జగత్సృష్ట్యాది వ్యాపారములను నడుపుటకు, లోకవ్యవస్థకొఱకు **"రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వ ముపజగ్మివాన్"** అనునట్లు ముమ్మూర్తులలో ఒకడుగా విష్ణువు అను పేరుతో సుందరబాహుస్వామి అవతరించెను.

**(తేనైవ తవ మహిమ్ని జనాః అంధా శ్చేత్)** ఈ రూపమునుకల నిన్ను చూచి, కన్నులున్న గుడ్డివారివంటి అజ్ఞులైన జనులు నీ మహిమను తెలియలేక, విపరీతముగా నిన్ను బ్రహ్మరుద్రాదిదేవతలలో ఒకనిగా భావించిరి అన్నచో,

**(త్వన్మత్త్యభావ మవగమ్య కథం భవేయుః)** – నీవు మత్త్యావతారమును ఎత్తుటను చూచి, ఏమని భావింతురోకదా! నీవు దేవజాతిలో అవతరించినపుడే నిన్ను చూచి నీ ప్రభావమున భ్రమించినవారైనచో, నీవు మత్త్యాదినీచజాతిలో జన్మించుటను చూచి, ఇంకను అధికముగా భ్రమింతురు కదా! – అని తాత్పర్యము. **"త్వన్మత్త్యభావమ్''** అనుటకు బదులు **"త్వన్మర్త్యభావమ్"** అను వేఱొక పాఠమును కలదు. ఈ పాఠమే తగినదని తలచువారును

కలరు. కాని, **"మాయావశేన మకరాదిశరీరిణం త్వాం తానేవ పశ్యతి కరీశ యదేవ లోకః "** అనుచు దేశికులు వరదరాజపంచాశత్ స్తోత్రములో ఈ శ్లోకార్థమును పల్కునపుడు మత్స్యశబ్దపర్యాయమగు మకరపదమును ప్రయోగించుటచే **"మత్స్యభావ"** మను పాఠమే ప్రాచీనమని తోచునని వ్యాఖ్యానాంతరము. **"కథం చ భవేయుః – "మోఘజ్ఞా మోఘకర్మాణ శ్చ భవేయు రిత్యర్థః. తదుక్తమ్ – అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్, పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్, మోఘజ్ఞా మోఘకర్మాణః మోఘజ్ఞానా విచేతస–ఇతి"** అని రామానుజాచార్యవ్యాఖ్య.

భగవానుడు వేత్వేరు అవతారములను పరిగ్రహించుటతోపాటు, త్రిమూర్తిసామ్యభ్రమజనకమగు, బ్రహ్మరుద్రులమధ్యలో విష్ణువుగా ఒక అవతారమును మొట్టమొదటగా ఎత్తెను. దీనిని తిరుమఙ్గైమన్నన్ పెరియతిరుమొழிలో **"నల్లరణ్ నారణన్ నాన్ముకనుక్కు''** అని అనుసంధింపగా, కూరేశులు అతిమానువస్తవములో **"బహ్మేశమధ్యగణనా"** అని కీర్తించిరి. **"ఏతం సేతుం తీర్త్వాఽ౦ధః సన్ అనంధో భవతి"** అని ఉపనిషత్తులు తెలిపిన రీతిలో భగవత్తత్త్వమును చక్కగా గ్రహించి, జ్ఞాననేత్రమును పొందవలసియుండగా, **"అంధేనైవ నీయమానా యథాంధాః"** అను స్థితిని లోకులు పొందుట ఏమి? – అని కూరేశులు వాపోవుచున్నారు – అని వ్యాఖ్యానాంతరము. భగవానుడు బ్రహ్మరుద్రుల మధ్యలో అవతారమును ఎత్తెను కావున, అతడు వారితో సమానుడని తలచుట అనుచితమని ఈ శ్లోకసారము. **"సముద్రసంచరన్మత్స్యేషు అయ మపి కశ్చి న్మత్స్య ఇత్యపి బుద్ధిం కుర్యు రితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. "సముద్రములో సంచరించు మత్స్యములలో ఇది కూడా ఒకటి అని భావింతురు" – అని దీని భావము. వృత్తము వసంతతిలక.

**88. హే దేవ! సుందరభుజ! త్వ మిహాండమధ్యే**
**సౌలభ్యతో విసదృశం చరితం మహిమ్నః ।**
**అంగీకరోషి యది తత్ర సురై రమీభిః**
**సామ్యా న్నికర్షపరిపాలన మేవ సాధు ॥**

హే దేవ = ఓ ప్రభూ! సుందరబాహుస్వామీ! త్వం = నీవు, సౌలభ్యతః = సౌలభ్యగుణమువలన, మహిమ్నః = (నీ) మహిమకు, విసదృశం = తగని, చరితం = ప్రవర్తనను, ఇహ + అండమధ్యే = ఈ బ్రహ్మాండమండలమునడుమ, యది అంగీకరోషి = అంగీకరించితివేని, తత్ర = ఆవిషయమున, అమీభిః సురైః = ఈ బ్రహ్మరుద్రాది దేవతలచే, సామ్యాత్ = సమానుడను స్థితికంటె, నికర్షపరిపాలన మేవ = మత్స్యకూర్మాది నీచజాతియందలి అభిమానమే, సాధు = మంచిది.

పూర్వశ్లోకములో బ్రహ్మరుద్రాదులమధ్య విష్ణువుగా అవతరించిన అవతారమొకటి



ప్రస్తావింపబడినది. ఆ అవతారములో దేవతలు విష్ణువును బ్రహ్మరుద్రాదులతో సమముగా భావించుటకంటె, నికర్షప్రతిపత్తిని కల్గియుండుటయే సాధువని ఇందు పల్కుచున్నారు. పురుషోత్తముడగు భగవానుని క్షుద్రులతో సమముగా తలచుట, తక్కువగా తలచుటయు రెండును తుల్యమేనని తాత్పర్యము. భగవానుని కర్మబద్ధులగు అన్యదేవతలతో సమానముగా కాని, తక్కువగా కాని తలచుట నరకబంధహేతువు – అని వేదములలోనే తెలుపబడినది. **"న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పర మంత మాప"** అని (ఋగ్వేదము), **"త్వ మేవ త్వాం వేత్థ", "యోఽ౦సి, సోఽ౦సి"** అని ఈ రీతిలో వేదములు భగవానుని మహిమను ఎవరికి అందనిదిగా కీర్తించినది. ఆ స్వామిని ఆవిధముగా తెలిసి, **"జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః శత స్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః"** అని ఉపనిషత్తులు తెలిపిన స్థితి. ఈ లోకులకు ఎంత కాలమునకు కల్గునో కదా! – అని కూరేశులు ఇందు వాపోవుచున్నారు అని వ్యాఖ్యానాంతరము. ఈ శ్లోకతాత్పర్యము శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో – **"సౌలభ్యాత్ స్వీయసర్వస్మాత్ పరత్వవిసదృశవ్యాపారాంగీకారే అభిమతే సతి. బ్రహ్మరుద్రేంద్రాదిసామ్యావహవిష్ణూపేంద్రాద్యవతారా దపి, మత్స్యకూర్మాదిసజాతీయాతార ఏవ అత్యంతసౌలభ్యావహా ఇతి భావః"** అని తెలుపబడినది. **"విసదృశమ్ అననురూపం చరితం – పితృవచనపరిపాలనాదౌత్యసారథ్యాదిప్రముఖమ్"** అని రామానుజాచార్యవ్యాఖ్య. **"దేవతాంతరసామ్యాచరణా దపి తన్నికర్షాచరణం భక్తచిత్తానురంజకం శ్రేయస్కరం చేతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వసంతతిలక వృత్తము.

**89. ఇహావతీర్ణస్య వనాద్రినాథ! తే నిగూహత స్స్వం మహిమాన మైశ్వరమ్ ।**
**ఉమాపతేః కిం విజయః ప్రియంకరః ప్రియంకరా వేంద్రజిదస్త్రబంధనా ॥**

వనాద్రినాథ = వనగిరినాథా! ఐశ్వరమ్ = అన్నిటిని ఏలునట్టి స్థితి అగు, స్వం = తన ఒక్కనికే సొంతమయిన, మహిమానం = గొప్పతనమును, నిగూహతః = మఱుగుపరచుకొనువాడవు, ఇహ = ఈ ప్రకృతిమండలములో, అవతీర్ణస్య = అవతరించినవాడవు అగు, తే = నీకు, ఉమాపతేః = శివునియొక్క, విజయః = విజయము (శివుని జయించుట), కిం ప్రియంకరః = ప్రియమును కల్గించునది అగునా!, వా = లేక, ఇంద్రజిత్ + అస్త్రబంధనా = ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగాస్త్రబంధనము, కిం ప్రియం (కరా) = ఇష్టమైనదా! (రెండిటిలో మొదట తెలుపబడినదియే మేలు కదా! – అని భావము)

అవతారములలో భగవానునకు అపకర్షను భావించు రీతిలో కొన్ని చరిత్రలు పురాణేతిహాసములలో కన్పించుచున్నవి. తన మహిమను తానే మఱుగుపరచుకొనగోరిన స్వామియొక్క ఒక విలక్షణమైన సంకల్పవిశేషముచే సంభవించిన ఆ చరిత్రలను చూచి, వానియందు అన్యథాప్రతిపత్తిని పొందుట తగదు – అను తాత్పర్యమును మనస్సులో

నుంచుకొని, కూరేశులు ఆ భగవానునే సాక్షాత్తు ప్రశ్నించు రీతిలో ఈ శ్లోకమును రచించిరి. **"ఆత్మానం మానుషం మన్యే"** అని, **"అహం వో బాంధవో జాతః"** అనియును అనుచు మానవులలో నీవును ఒకడవు అను తలపు వ్యక్తమగునట్లు నీవు ప్రవర్తింపగోరితివి. ఇట్లు తలచిన నీవు బాణాసురయుద్ధములో శంకరుని జయించుట నీ మనుష్యభావనకు విరుద్ధముకదా! ఇంద్రజిత్తు మాయాస్త్రబంధములో బంధింపగా, నీవు మోహమును పొంది, ఆ పిమ్మట తెలివిని పొంది, లక్ష్మణునిగూర్చి పరితపించుటకదా నీ భావనానుగుణము? అని ప్రశ్నించుచున్నారు – అని వ్యాఖ్యానాంతరము.

**(ఐశ్వరమ్ మహిమానమ్ నిగూహతః ఇహ అవతీర్ణస్య తే)** సర్వేశ్వరత్వప్రయుక్తము, స్వతస్సిద్ధము అగు మహిమను మఱుగుపరచుకొని, ఈ లీలావిభూతిలో అవతారములను ఎత్తిన నీకు –

**(ఉమాపతేః విజయః ప్రియంకరః కిమ్ – ఇంద్రజిదస్త్రబంధనా ప్రియంకరా వా)** – బాణాసుర యుద్ధములో శివుని భంగపఱచిన కృత్యము నీ మనస్సుకు ప్రియమా! లేక, ఇంద్రజిత్తు మాయాస్త్రబంధముచే నీవు బంధింపబడియుండుట ప్రియకరమా! – అని ప్రశ్నించుచున్నారని శ్రీనివాసాచార్యవ్యాఖ్యానములో కలదు. **"కిం బాణాసురసమకాలీనో రుద్రవిజయః ప్రీత్యావహో వా? స్వమహిమనిగూహనానుగుణతాదింద్రజిదస్త్రబంధనైవ ప్రియంకరేత్యర్థః"** అని అచటి వివరణము. **"ఉమాపతేః విజయః"** అనుటకు "ఉమాపతియగు శివుని జయించుట" అను అర్థమును చెప్పుటకంటె, "ఉమాపతి యగు శివుడు జయించునట్లు చేయుట" అను అర్థమును చెప్పుట మిక్కిలి సరసము. **"కర్తృకర్మణోః కృతి"** అను వ్యాకరణసూత్రానుసారము ఉమాపతిని విజయమునకు కర్తగా, కర్మగాకూడ చెప్పవచ్చును. కర్మగా గ్రహించి శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో వివరింపబడినది. అపుడు భగవానునకు ఉత్కర్షము వ్యక్తమగును. అది ప్రస్తుతమున సరసము కాదు. **"నిగూహతః స్వం మహిమాన మైశ్వరమ్"** అనునట్లు భగవానుడు తన పరత్వమును మఱుగుపరచుకొని, అవతారమెత్తుటకదా ఇచట ప్రస్తావింపబడుచున్నది. కావున ఇచట చెప్పబడు చరిత్ర తదనుగుణముగాకదా ఉండలెను! కావున ఉమాపతికర్తృకమైన విజయమే అచట స్తుతికర్తకు అభిమతమని తోచును. భగవానుడు శివునివద్ద పుత్రసంతానార్థము వరమును వేడుట మొదలగు వృత్తాంతములలో శివునకు విజయము, తనకు అపజయమును కనపడుచున్నది. తిరువాయ్మొழிలోని **"కళ్వా ఎమ్మైయుమ్ ఏழులకుమ్ నిన్నుళ్ళే తోற்றియ ఇఱైవ వెన్ఱు, వెళ్ళేఱన్ నాన్ముకన్ ఇన్దిరన్ వానవర్ పుళ్ళూర్ది కழల్ పణిన్దేత్తువరే"** (2–2–10) అను పాశురములోని అర్థస్వారస్యము ఇచట అనుసంధింపతగినది. అనగా, దేవతలు భగవానుని వద్దకు పోయి, వరమును గ్రహించునపుడు "నీవు మావద్దకు వచ్చి వరమును ప్రార్థించునట్లు ప్రవర్తించి, మాకు అతిశయమును కల్గింపవలెను" అను వరమును ప్రార్థింతురు. భగవానుడు దానికి సమ్మతించి తదనుగుణముగా "రుక్మిణీదేవికి ఒక కుమారుడు కలుగవలెను" అని శివునివద్ద ఒక వరమును ప్రార్థించెను. అపుడు – "అయ్యో! తాను



పరాత్పరుడను స్థితిని మఱచి, ఇట్లు వరమును అర్థించుచున్నాడే! ఇది ఏమి మాయయో?" అని ప్రీతిపడి **"మాయగాడా"** (కళ్వా) అని దేవతలు సంబోధించుదురట. దానిని కూరేశులు ఇచట ప్రస్తుతించుచున్నారు. ఇట్టి మాయావిలాసముతో స్వామి ఉమాపతికి ఔన్నత్యము, తనకు తక్కువదనమును చూపుట అనునది కలదుకదా! అదియే ఇచట వివక్షితము అనుట ఉచితము. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని వివరణము బొత్తిగా అసంగతమనరాదు. అదియును ఒకవిధముగా అన్వయించును – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్యానము. **"ఉభయ మపి తుల్య మితి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య.

ఇట్లుండగా వ్యాఖ్యానాంతరములో "ఈ శ్లోకమునకు ప్రాచీనసంస్కృతవ్యాఖ్యాకర్త చేసిన వివరణమే సరిఅయినది. – **"అర్చాహేతో రుపహరతి యా నూన మర్ధేందుమౌళేః "** – అని సువర్ణముఖీనదినిగూర్చి వర్ణించునపుడు దేశికులు పల్కిన రీతిలోనే, **"ఉమాపతేః విజయః"** అనుటకు ఉమాపతిని జయించుట, ఉమాపతి జయించుట – అని రెండు అర్థములను గ్రహింపవచ్చును. ఇందులకు వ్యాకరణమును సమ్మతించినను, ప్రకృతమున కూరేశులకు అభిమతమైనది కర్మణ్యర్థమే – అనగా ఉమాపతిని జయించుట అను అర్థమే – అగును". అని ఆగ్రహపూర్వకముగా వివరింపబడుటలోని స్వారస్యమెంతయో సహృదయులే నిర్ణయింపగలరు. వృత్తము ఇంద్రవజ్ర.

**90.** **పుచ్ఛోత్పుచ్ఛనమూర్ఛనోద్ధతిధుతవ్యావర్తితావర్తవత్**
**సంవర్తార్ణవనీరపూరవిలుఠత్పాఠీనదివ్యాకృతేః ।**
**సింహాద్రీశ! న వైభవం తవ కథం స్వాలక్ష్య మాలక్ష్యతే**
**పద్మాక్షస్య జుఘుక్షతోఽపి విభవం లక్ష్మీధరాధోక్షజ ॥**

సింహాద్రీశ = వనగిరిప్రభూ! అధోక్షజ = అతరింద్రియములద్వారా యోగులచే దర్శింపతగినవాడవైన స్వామీ, లక్ష్మీధర = శ్రీధరా! తవ వైభవమ్ = నీ గొప్పతనమును, జుఘుక్షతః + అపి = మఱుగుపఱచుగొనగోరినవాడవైనను, పుచ్ఛ + ఉత్పుచ్ఛన = తోకను పైకి ఆడించుటలోని, మూర్ఛన + ఉద్ధతి = అడ్డముగా ఆడించులోని వేగములచే, ధుత = కంపింపజేయబడిన, వ్యావర్తిత = పరిభ్రమింపజేయబడిన, ఆవర్తవత్ = నీటిసుడులను కల్గిన, సంవర్త + ఆర్ణవ = మహాప్రళకాలపు సముద్రములో, నీరపూర = నీటిప్రవాహమునందు, విలుఠత్ = మిక్కిలి సంభ్రమమముతో సంచరించు, పాఠీన = గొప్ప మత్స్యమను, దివ్య + ఆకృతేః = అప్రాకృతమైన రూపమునుకల, పద్మాక్షస్య = ఎఱ్ఱతామరలవంటి కన్నులను కల్గిన, తవ = నీయొక్క, స్వాలక్ష్యం = (మహాత్ములచే) సులభముగా, చక్కగా సాక్షాత్కరించుకొనతగిన, విభవం = గొప్పతనము, కథం న ఆలక్ష్యతే = ఏ విధముగా సాక్షాత్కరింపకుండపోవును? (స్పష్టముగా కన్పించునుకదా! అని భావము)

పూర్వశ్లోకములో కూరేశులచే భగవానుడు విభవావతారములలో తన మహత్త్వమును మఱుగుపఱచుకొనుట అను విషయము ప్రస్తుతమైనది. అతడు మఱుగుపరచుకొనవలెనని ప్రయత్నించినను అది మఱుగుపడదని ఇందు తెలుపుచున్నారు. ఈ శ్లోకమునుండి మత్స్యకూర్మాద్యవతారములను క్రమముగా స్తుతింపగోరి, మొదటగా మూడు శ్లోకములలో మత్స్యావతార వైభవమును స్తుతికర్త ప్రస్తుతించుచున్నారు. శ్లోకములోని పూర్వార్ధమంతయు ఒకే సమస్తపదము. ఇది మత్స్యాకృతిని అత్యద్భుతముగా, సహజముగా వర్ణించుచున్నది. మత్స్యావతారము పురాణములలో పలు రీతులలో కన్పించుచున్నది. బ్రహ్మదేవుడు కోల్పోయిన వేదములను తిరిగి సంపాదించి ఇచ్చుటకై భగవానుడీ అవతారమును ఎత్తెనని, ప్రళయకాలములో మనువును పురస్కరించుకొని, జగత్సృష్టికి ఆవశ్యకమగు వస్తువులతో మనువును ఒక ఓడలో నుంచి, ఆ ఓడ నీటిలో మునుగకుండుటకై, మత్స్యమూర్తియగు తన నాసికాగ్రమునగల శృంగమునకు కట్టివేసినట్లును – ఈ విధముగా పలురీతులలో మత్స్యావతార వృత్తాంతము కన్పించుచున్నది.

**(పుచ్ఛోత్పుచ్ఛనమూర్ఛనోద్ధతిధుత......పాఠీనదివ్యాకృతేః తవ)** – మీనరూపములో అవతరించినపుడు తోకను పైకిలేపుట, అటు ఇటు అడ్డముగా ఆడించుట మొదలగు సహజములైన కదలికల వేగముతో కంపింపజేయబడినది, నీటిసుడులను కల్గినదిగా చేయబడినదగు ప్రళయమహార్ణవమందలి ప్రవాహములో సంచరించు శ్రీదివ్యమత్స్యాకృతినికల నీయొక్క – అని అర్థము. ఈ విశేషణము నీటిలో సంచరించు మత్స్యముయొక్క స్వభావమును మనోహరముగా వర్ణించుటచే, **"స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తువర్ణనమ్"** అని నిర్వచింపబడిన స్వభావోక్తి అను అలంకారము కలదు. భగవానుడు ధరించిన మీనాకృతి సామాన్యమైనది కాదు. తోకను పైకెత్తునపుడు, అటు ఇటు అడ్డముగా ఆడించునపుడును పూర్తిగా ప్రళయసముద్రములోని నీరు కదలినది. ఇట్టి అప్రాకృతమైన, అతివిలక్షణమైన మత్స్యరూపమునుకల నీయొక్క – అను భావము. **"పాఠీనదివ్యాకృతేః"** అనుటద్వారా వ్యక్తము.

**(పద్మాక్షస్య)** – మీనాకృతిలోనున్నను భగవానుని అసాధారణలక్షణమగు పుండరీకాక్షత్వము వ్యక్తమని తెలుపు ఈ విశేషణము సాభిప్రాయకము **"మత్స్యవిగ్రహపరిగ్రహేఽపి పుండరీక ప్రకాండసదృశేక్షణస్య"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"మత్స్యః కమలలోచన"** అనికదా ప్రమాణము.

విదురుని ఇంటిలో భుజించిన కృష్ణుని అధిక్షేపించు దుర్యోధనుడు సైతము **"కి మర్థం పుండరీకాక్ష భుక్తం వృషలభోజనమ్"** అని కీర్తించునట్లు చేసినది స్వామి పుండరీకాక్షత్వమే కదా! భట్టరును శ్రీగుణరత్నకోశములో – **"నిత్యం......పతిం దృగ్భ్యా మేవ హి పుండరీకనయనం వేదో విదామాస తే"** అని నుడివిరి కదా! **(అధోక్షజస్య)** – అంతర్ముఖులై, అంతర్యామిని దర్శింపవలెనని ప్రయత్నించువారికి భగవానుడు సులభుడనుటను ఈ నామము తెలుపుచున్నది. **"అధో న క్షీయతే జాతు యస్మాత్ తస్మా దధోక్షజః"** అనునది పరాశరభట్టర్ చూపిన ఈ నామవ్యుత్పత్తి. ఉపాసకుల హృదయ కమలములో నివసించుటను ఈ నామము తెలుపును. **"ఉపాసకహృదయకమలవాసీతి యావత్"** అని శ్రీనివాసాచార్య వ్యాఖ్యానసూక్తి. **"అధోక్షజేతి – అమృతోదధివత్ సర్వైః భుజ్యమానోఽపి సర్వదా, అధో న క్షీయతే జాతు యస్మా త్తస్మా దధోక్షజః" – ఇతి నిర్వచనాత్ సర్వదా భోగ్య ఇత్యర్థః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. కావున ఈ నామము ప్రకృతమున సదాభోగ్యత్వమును తెలుపుచున్నదనియు చెప్పవచ్చును.



**(విభవం జుఘుక్షతోఽపి)** – ఈ పదములకు ముందుపదములతో అన్వయము. ఎంతగా నీవు నీ పరత్వమును కప్పిపుచ్చుకొన ప్రయత్నించినను – అని భావము. **"మాయాబలేన భవతాఽపి నిగూహ్యమానం పశ్యంతి కేచి దనిశం త్వదనన్యభావాః"** అనుచు శ్రీయామునులు పల్కినట్లు నీ పరత్వమును మహనీయులు సులభముగా దర్శింపగల్గుచున్నారు. సౌశీల్యముతో స్వామి ఏ వేషము దాల్చి, ఏ విధముగా అవతరించి, తనను కప్పిపుచ్చుకొన ప్రయత్నించినను, ఆ స్వామిని దరిచేరియున్న మహాత్ములు స్వామిపరత్వమును చక్కగా దర్శింతురు. ఈ భావమునే దేశికులు వరదరాజపంచాశత్‌లోని **"సౌశీల్యభావితధియా భవతా కథంచిత్ సంఛాదితా నపి గుణాన్ వరద! త్వదీయాన్, ప్రత్యక్షయంత్యవికలం తవ సన్నికృష్టాః పత్యు స్త్విషా మివ పయోదవృతాన్ మయూఖాన్"** అను శ్లోకములో అనుసంధించిరి. **"సంవర్తార్ణవవ్యావర్తనసమర్థ స్వపుచ్ఛోత్పుచ్ఛన మూర్ఛనోద్ధతియుతవిలక్షణలక్ష్మీకమత్స్యవిగ్రహపరిగ్రహః పద్మాక్షత్వం చ నిగూహిత మపి మహిమానం ప్రాదుర్భావయతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని వివరణము. **"గూహనేఽపి వైభవం క్వచిత్ ప్రకటిత మితి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**91. సాచలావటతటాకదీర్ఘికాజాహ్నవీజలధివర్ధితః క్షయే ।**
**శృంగసంగమితనౌ ర్మనో రభు రగ్రతోఽండజవపు ర్హి సుందర ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, క్షయే = ఒక అవాంతరప్రళయకాలములో, అండజవపుః = అండమునుండి పుట్టిన మత్స్యమై, సాచల + అవట = భూమితో కూడిన పల్లపు ప్రదేశము, తటాక = చెఱువు, దీర్ఘికా = దిగుడుబావి, జాహ్నవీ = గంగవంటి వేగానది, జలధి = సముద్రము – అను వీనిలో, వర్ధితః = క్రమముగా పెరిగినవాడవై, శృంగ = కొమ్ములో, సంగమితనౌః = ధరింపబడిన నౌకను కలవాడవై, మనోః = సత్యవ్రతమనువుయొక్క, అగ్రతః = ముందు, అభూః హి = వెల్గినవాడనైతి కదా!

మత్స్యపురాణప్రోక్తమైన మత్స్యావతారవృత్తాంత మిందు సంగ్రహముగా ప్రస్తావింపబడినది. కృతమాల అను నదీతీరములో భగవానుని ఉద్దేశించి తపస్సు చేయుచున్న సత్యవ్రతుడను ఒక రాజర్షి జలపానమును చేయుచు జీవించుచుండెను. అతడు ఒకనాడు

జలతర్పణము చేయునపుడు, అతని దోసిలిలోని నీటిలో ఒక చిన్నచేప పట్టుబడినది. దానిని అతడు భూమిలోని ఒక చిన్న పల్లపు ప్రదేశములో విడచెను. ఆ చేప కొద్ది సేపటిలోనే ఆ చోట ఇముడనంతటి ఆకారమును పొందుటను చూచిన అతడు దానిని ఒక చెఱువులో విడచెను. కొంచెముసేపటిలోనే దానిలోకూడ ఆ మత్స్యము పట్టకపోవుటచే, దానిని మరల సత్యవ్రతుడు ఒక పెద్ద దిగుడు బావిలోనికి వదలిపెట్టెను. దానియందుకూడ ఇముడక పోవుటచే ఆ చేపను అతడు గంగలో వదలెను. అందును ఇముడని ఆ మత్స్యమును చివరకు సముద్రములో విడచెను. అపుడు సత్యవ్రతుడు ఆ చేపను చూచి ఆశ్చర్యపడి, "ఓ మత్స్యరాజమా! నీ చరిత్రను తెలిసికొనవలెనని కుతూహలముగానున్నది. నూఱు యోజనముల పొడుగును, దానికి తగిన లావునుకల నీవెవరు? నీ తత్త్వమును స్పష్టము చేయుము" అనుచు చేతులను జోడించి ప్రార్థింపగా, ఆ మత్స్యరాజము "ఓ మహాత్మా! ఈనాటినుండి ఏడు దినములో ఈ ముల్లోకములు మునిగిపోగలవు. అపుడు ఆ ప్రళయజలములో ఒక పెద్ద ఓడ రాగలదు. ఆ నౌకలో సప్తర్షులు, నీవు. అన్ని ఓషధులతో, సమస్తప్రాణులతో పాటు ఎక్కి, మనస్సున ఎట్టి భయాందోళనలు లేకుండ ప్రయాణము చేయుము. అట్లు సంచరించుచుండునపుడు ఒక గొప్ప సుడిగాలి వీచగలదు. ఆ గాలిలో ఓడ నీటిలో ఊగిసలాడగలదు. అపుడు నా తలపై మొలిచియున్న పెద్ద కొమ్ముకు పెద్దసర్పముతో ఆ ఓడను కట్టివేయుము. పిమ్మట నేను ఆ ఓడతో పాటు నిన్ను, ప్రాణులందఱిని, ఋషులను మోయుచు ఆ ప్రళయతమస్సు వీడిపోవువరకు సముద్రమున సంచరింపగలను. అపుడు నా ప్రభావమును నీవు చూడగలవు'' అని పల్కి అంతర్ధానమయ్యెను. అది విని ఆశ్చర్యపడిన సత్యవ్రతుడు భగవానునిచే సూచింపబడిన ఆ కాలముకొఱకు ఎదురుచూడసాగెను. ఆ కాలము రాగానే సప్తమేఘముల విజృంభణతో సముద్రము ఉప్పొంగినది. భగవానుడు నిర్దేంచిన దినమున ఒక పెద్ద ఓడ సముద్రమున వచ్చుటను గమనించిన సత్యవ్రతుడు సంతోషముతో సమస్త ప్రాణులను ఆ ఓడలోనికి చేర్చి, తానును దానిలోనికి ఎక్కెను. పిమ్మట, సప్తర్షులు, తానుకలసి భగవానుని ధ్యానించుచుండగా, పెద్ద కొమ్మునుకల మత్స్యరూపముతో భగవానుడు దర్శన మిచ్చెను. లక్ష యోజనముల పొడుగు, పదివేల యోజనముల వెడల్పును కల్గి, ఒకే ఒక కొమ్ముతో, స్వర్ణవర్ణముతో, సకలలోకమనోహరరూపమును కల్గినవాడై అతడు గోచరించెను. వెంటనే, సత్యవ్రతుడు ఒక పెద్ద సర్పమును గొని, ఆ మత్స్యమూర్తి కొమ్ముకు ఆ నావను కట్టి వేసెను. భగవానుడు ఆ ఓడను లాగికొనుచు, అండకటాహమువరకు చేరి త్రుళ్ళుచు విలాసముగా క్రీడించి, పూర్వము అసురులు కొనిపోయిన వేదములను తిరిగి తీసికొనివచ్చెను. ఇట్లు ప్రళయమున ఏర్పడిన ఆపదనుండి జీవులను రక్షించుట, వేదములను ఉద్ధరించుటయే మత్స్యావతారచరిత్ర. ఈ వృత్తాంతమును కూరేశులు ఈ శ్లోకమున, తరువాతి శ్లోకమున ప్రస్తావించిరి. **"సమీరణః"** అను నామమునకు భాష్యమును ప్రసాదించుచు భట్టరు – ఈ



వృత్తాంతమునకు చెందిన ఈ క్రింది పురాణవచనములను ఉట్టంకించిరి. **"కల్పావసానసమయే వహంతం చైవ చింతయేత్, నౌరూపాం వితతాం క్షోణీం ప్రజాపతిగుణాన్వితామ్, కృత్వా మీనమయీం సద్యః ప్రవివేశ రసాతలమ్, వేదమూర్తి స్తతో వేదాన్ ఆనిన్యే బ్రహ్మణోఽంతికే, జ్ఞానాదిగుణబృందేన పక్షభూతేన భూషితమ్, స్వోత్థబ్రహ్మపదం శృంగనిస్సృతేన విరాజితమ్"**.

**(సాచలావటతటాకదీర్ఘికాజాహ్నవీజలవివర్ధితః) – "భూ ర్భూమి రచలాఽనంతా"** అనెడి అమరకోశవచనానుసారము **'అచలా'** అనునది భూవాచకము. అవట అనగా పల్లము. తటకమనగా చెఱువు. దీర్ఘికా – దిగుడుబావి. జాహ్నవీ – గంగ. వీనిజలముచే వృద్ధి పొందింపబడినవాడై – అని అర్థము. ఈ విశేషణముద్వారా పైన ప్రస్తావింపబడిన వృత్తాంతము సూచితము. చివరగా సముద్రములో మత్స్యము విడువబడుటచే **"జాహ్నవీజలధివర్ధితః"** అను పాఠము మొదట ఉండియుండవచ్చునని, క్రమముగా అది ప్రస్తుతపాఠముగా పరిణమించి యుండవచ్చునని తోచుచున్నది. దీనిని నిష్కర్షించుటలో పెద్దలు ప్రమాణము – అని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"సాచలావట"** ఇత్యాది ప్రయోగమున **"అచలాయాః అవటః అచలావటః, తేన సహితాః తటాకాదయః"** అనియు చెప్పవచ్చును. ఈ వివరణము శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో కలదు.

**(మనోః అగ్రతః శృంగసంగమితనౌః అభూః)** – పూర్వము వివరించిన వృత్తాంతములోని సత్యవ్రతుడే ఇచట **"మను"** శబ్దముచే నిర్దేశింపబడినాడు. శ్రీరంగరాజస్తవోత్తర శతకములోని – **"మీనతను స్త్వాం నావి నిధాయ స్థిరచరపరికరం అనుమను భగవాన్"** ఇత్యాది మత్స్యావతారశ్లోకార్థ మిచట అనుసంధేయము. వృత్తము రథోద్ధత.

**92.** **ప్రళయజనీరపూరపరిపూరితస్వనిలయావసన్నవదన –**
**భ్రమదశరణ్యభూతశరణార్థినాకిశరణం భవన్ స్వకృపయా ।**
**చలదుదధీరితాంబుకలుషీక్రియాధ్యగమనః స్వపృష్ఠవిధృతా –**
**చలకుల ఏష మీనతను రత్ర సుందరభుజో వనాద్రినిలయః ॥**

స్వకృపయా = తన దయతో, ప్రళయజ = ప్రళయకాలములో పుట్టిన, నీరపూర = జలప్రవాహముచే, పరిపూరిత = పూర్తిగా నిండింపబడిన, స్వనిలయ = తమ నివాసములను కలవారు, అవసన్నవదన = దుఃఖమును పొందిన ముఖములను కలవారు, భ్రమత్ = ఇచట, అచట తిరుగువారు, అశరణ్యభూత = భగవానునితప్ప వేఱు శరణము లేనివారును, శరణార్థి = భగవానుని శరణువేడినవారును అగు, నాకి = దేవతలకు, శరణం = శరణముగా, భవన్ = అగుచున్నవాడై, చలత్ = తన కదలికలచే కదలునట్టి, ఉదధి = సముద్రముచే, ఈరిత = ఇచటకు అచటకు తోయబడిన, అంబు = నీటిని,

కలుషక్రియా = కలుగునట్లు చేయుటలో, ఆధ్యగమన = అడ్డులేని గమనములను కలవాడు, స్వపృష్ఠ = తన వీపులో, విధృత = చక్కగా ధరింపబడిన, అచలకులః = పర్వతసమూహములను కలవాడును, మీనతనుః = మత్స్యరూపమును పొందిన, ఏషః = ఈ, సుందరభుజః = సుందరబాహుస్వామి, అత్ర = ఈ భూమండలములో, వనాద్రినిలయః = తిరుమాలిరుమ్‌శోలై పర్వతమును నివాసముగా కల్గినవాడైయున్నాడు.

పూర్వశ్లోకమువలెనే ఈ శ్లోకముకూడ మత్స్యావతారపరమే. ముందు శ్లోకమునకు ఇది శేషభూతమైనది. పెరియతిరుమొழி ప్రబంధములోని 11వ శతకములోగల – **"నిలయిడమెఝ్గు మిన్ఙి"** అను దశకములోని మొదటిపాశురము మత్స్యావతారపరము. ఆ పాశురమును, ఈ శ్లోకమును అర్థసామ్యమును కల్గియుండటయేకాక, ఛందఃసామ్యమును కూడ కల్గియున్నవి. ఈ శ్లోకమున ప్రతిపాదము 23 అక్షరములను కల్గియున్నట్లే, పెరియ తిరుమొழி పాశురములోకూడ 23 అక్షరములు కలవు. ఈ శ్లోకవృత్తము వికృతి ఛందస్సులోని అశ్వలలితమను అపూర్వవృత్తము. **"యదిహ నజౌ భజౌ భజభలగా తదాశ్వలలితం హరార్కయతిమత్"** అని లక్షణము. ఆ పాశురముయొక్క పూర్తిపాఠము ఇట్లున్నది.

**నిలైయిడ మెఝ్గుమిన్ఙి నెడు వెళ్ళ ముమ్బర్ వళనాడు మూడ విమైయోర్**
**తలైయిడ మఱ్ఱెమక్కుమోర్ శరణిల్లై యెన్న అరణావ వెన్ను మరుళాల్**
**అలైకడల్‌నీర్ కుழம్బ వకడాడ వోడి అకల్ వానురిఞ్జ ముదుకిల్**
**మలైకళై మీదుకొణ్డు వరు మీనైమాలై మఱవాదిఱైఞ్జెన్ మననే.**

ఈ పాశురమున భగవానుడు మత్స్యరూపమును దాల్చి, దేవతలను రక్షించిన వృత్తాంతము ప్రస్తుతమైనట్లే ప్రకృతశ్లోకమున ఆ వృత్తాంతమే ప్రస్తుతమగుట విశేషము.

**(ప్రళయజ.....శరణం భవన్)** – ప్రళయకాలములో సంభవించిన గొప్ప నీటిప్రవాహముచే మునిగిన తమ తమ నివాసములను కలవారై, అందుచే మిక్కిలి పరితపించిన వారై, అనాథులై, శరణార్థులైన దేవతలకు గొప్ప శరణమై – అని భావము. **"పరిపూరిత స్వనిలయ, అవసన్నవదన, భ్రమత్, అశరణ్యభూత, శరణార్థి"** అను పదములైదును **"నాకి"** అను పదమునకు విశేషణములు అగుటచే బహుపదకర్మధారయము.

**(చలదుదధీరితాంబు.......విధృతాచలకులః)** – ఇంతవరకు ఒక సమస్తపదముగా గ్రహింపవచ్చును. లేక, నడుమలో **"కలుషీక్రియాధ్యగమనః"** అని విసర్గాంతముగా చేసి అంతవరకు ఒక పదముగాను, మిగిలినదానిని ఒక సమస్తపదముగాను గ్రహింపవచ్చును. ఎట్లయినను అర్థభేదము మాత్రము లేదు. పూర్వోదాహృతమగు పెరియతిరుమొழி పాశురములోని **"అలైకడల్‌నీర్ కుழம்బ వకదాడవోడి అకల్‌వానురిఞ్జ"** అను సూక్తియొక్క భావమును **"చలదుధధీరితాంబు – కలుషీక్రియాధ్యగమనః"** అనుట ద్వారా, **"ముదుకిల్ మలైకళై మీదు కొణ్డువరు మీనైమాలై"** అను సూక్తియొక్క అర్థము **"స్వపృష్ఠవిధృతాచలకుల**



**ఏష మీనతనుః"** అనుట ద్వారా కూరేశులు అనుసంధించిరి. ఉప్పొంగివచ్చు సముద్రపునీటి ప్రవాహమునంతటిని కలగునట్లు చేసి, దానిలో సంచరించువాడు, తన వీపుపై పర్వతముల సమూహమును దాల్చియుండువాడు మత్స్యావతారమూర్తి – **(అత్ర సుందరభుజో వనాద్రినిలయః)** – ఆస్వామియే ఇచట వనగిరిలో సుందరబాహుస్వామిగా సాక్షాత్కరించుచున్నాడు – అనుట ధర్మ్యైక్యము. "**ప్రళయార్ణవనీరపూరాంతరిత మందిరాతివిషణ్ణామర్త్యరక్షణార్థం తదవస్థానయోగ్యాన్ కులాచలాన్ మీనతనుః య స్సముద్దధార స ఏవ సంసారార్ణవమగ్నాస్మాదృశరక్షణాయ వనాద్రిభవనో భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. దీర్ఘసమాసములను శ్రుతిమధురముగ ప్రయోగించుట అనెడి ఓజోగుణ మిందు కలదు.

**93.** **స్వపృష్ఠే ప్రష్ఠాద్రిభ్రమణకరణైః కిం చ ఫణినో**
**వికృష్టివ్యాకృష్టివ్యతివిధుతదుగ్ధాబ్ధిచలితైః ।**
**అవిస్పందో నంద న్వికసదరవిందేక్షణరుచిః**
**పురాఽభూ స్సింహాద్రేః ప్రియతమ హరే కచ్ఛపవపుః ॥**

సింహాద్రేః = సింహాచలమును పేరునుకల తిరుమాలిరుమ్‌శోలైపర్వతమునకు, ప్రియతమ = మిక్కిలి ప్రియమైనవాడా! హరే = శబ్దవాచ్యుడవగు సుందరబాహుస్వామీ! స్వపృష్ఠే = తన (నీ) వీపులో, ప్రష్ఠ + అద్రి = గొప్పమందరపర్వతముయొక్క, భ్రమణకరణైః = తిప్పుటచేతను, కించ = మఱియు, ఫణినః = (దారముగా చేయబడిన వాసుకి అను) సర్పముయొక్క, వికృష్టి = ఆకర్షించుట, వ్యాకృష్టి = వదలిపెట్టుటద్వారా (కుడి ఎడమలకు తిప్పుటద్వారా), వ్యతివిధుత = మిక్కిలి కలత పొందింపబడిన, దుగ్ధ + అబ్ధి = పాలసముద్రముయొక్క, చలితైః = కదలికలచేత, అవిస్పందః = ఏ కొంచెము చలింపని వాడవు, నందన్ = (శరణాగతరక్షణమువలన) ఆనందించువాడవుగా, వికసత్ = చక్కగా వికసించిన, అరవింద = ఎఱ్ఱతామరలను పోలిన, ఈక్షణరుచిః = నేత్రశోభను కలవాడవుగా, పురా = పూర్వము ఒకానొక సమయమునందలి, కచ్ఛపవపుః = కూర్మరూపుడవు, అభూః = అయితివి.

కూర్మావతార వైభవ మిందు ప్రస్తుతింపబడుచున్నది.

**(పురా)** – పూర్వము దేవతలకు వారు ప్రార్థించిన అమృతమును ప్రదానము చేయుటకై పాలకడలిని చిలికినపుడు – అని భావము. ఇచట కూరేశులు **"పురా"** అని ప్రయోగించుట తైత్తిరీయమున కూర్మావతార ప్రస్తావము చేయబడిన సందర్భములోనున్న **"పూర్వ మేవాహ మిహాస మితి. తత్పురుషస్య పురుషత్వమ్"** అను వాక్యమును స్మరింపజేయుచున్నది – అని వ్యాఖ్యానాంతరము. బ్రహ్మనుకూడ సృష్టించిన శ్రీకూర్మమూర్తికి సంబంధించినది ఈ శ్రుతి అనుటను దేశికులు స్తోత్రరత్నములోని 12వ శ్లోకమును వ్యాఖ్యానించుచు **"అధీయతే**

**చ తైత్తిరీయాః ప్రజాపతివిషయకూర్మవిషయే"** అను అవతారికతో పాటు వివరించిరి. కావున కూర్మావతారము. వేదఘోషితమనుటను తెలుపుటకై కూరేశులు **"పూరాఽభూః"** అని ప్రయోగించిరి – అనియు వ్యాఖ్యానాంతరము. **(స్వపృష్ఠే ప్రష్ఠాద్రిభ్రమణకరణైః)** – తన వీపుపై పర్వతమగు మందరమును తిప్పుటచేతను – అని భావము. **"ప్రష్ఠోఽగ్రగామిని"** అను వ్యాకరణసూత్రమును బట్టి ప్రష్ఠశబ్దము శ్రేష్ఠవాచకము. కావున ప్రష్ఠాద్రి అనగా గొప్ప పర్వతమని అర్థము. దేవతలకు అమృతమును ప్రసాదించుటకొఱకు స్వామి అనుజ్ఞతో **"మంథానం మందరం కృత్వా యోక్త్రం కృత్వా తు వాసుకిమ్"** అని పల్కినరీతిలో మందరమును కవ్వముగా, వాసుకిని దారముగా చేసికొని దేవాసురులు పాలకడలిని చిలికిరి. అపుడు మందరపర్వతము సముద్రములో మునిగిపోగా, స్వామి కూర్మరూపియై, తనవీపుపై ఆ పర్వతమును మోసెను. ఈ కూర్మమూర్తిని ఎవరు మోసిరి? అను ప్రశ్నకు సమాధానముగా **"స భగవః కుత్ర ప్రతిష్ఠితః ఇతి, స్వే మహిమ్ని"** అనుచు ఛాందోగ్యము పల్కిన సూక్తిని పరాశరభట్టరు సహస్రనామ భాష్యములో కూర్మావతారపరమైన ప్రతిష్ఠితః అను నామమును వ్యాఖ్యానించుచు ఉట్టంకించుటను స్మరింపనగును. విష్ణుపురాణములో కూడ **"స్వే మహిమ్ని స్థితం దేవమ్"** అని కలదు. **"అనంతబలశక్తయే"** అనునది కూర్మమూర్తి ధ్యానశ్లోకములోని ప్రయోగము. **(కించ ఫణినః వికృష్టివ్యాకృష్టివ్యతివిధుతదుగ్ధాబ్ధిచలితైః అవిస్పందః)** – ఇట్లు వీపుపై పర్వతము భ్రమించునపుడును, దారముగా చుట్టబడిన పామును అటు ఇటు లాగునపుడును మిక్కిలి చలించిన పాలకడలియొక్క వేగముచేతనుకూడ ఏమాత్రము కదలలేదు. **"స్వపృష్ఠనిష్ఠస్య మంథాచలస్య భ్రమణైః స్వస్యాపి భ్రమణం సంభావితమ్, మంథానాచలచలన నిబంధనరజ్జుభూత సర్పాకర్షణాతిమాత్రకంపితజలధిజలచలనేనాఽపి స్వస్య చలనం సంభావితమ్, తథాఽపి అవిస్పందః ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **(వికసదరవిందేక్షణరుచిః)** అపుడే పూచిన ఎఱ్ఱతామరలవంటి నేత్రముల సౌందర్యమును కలవాడు. ఆశ్రితులను రక్షించుటకు అవకాశము లభించినదికదా! అను సంతోషముచేతను, ఆవిర్భవింపబోవు లక్ష్మీదేవిని దర్శింపగలను అను పరమానందముచేతను స్వామి కన్నులు ఎఱ్ఱతామరలైనవి. అట్లు –

**(కచ్ఛపవపుః అభూః)** నీవు కూర్మరూపివైతివి. తన దేహరక్షణను గణింపక, ప్రణతజనమనోరథ పరిపూరణమునే వ్రతముగా గొనినవాడను స్వామి గుణాతిశయము ఇచ్చట తెలుపబడినది. **"స్వక్లేశేనాపి ప్రణతజనత్రాణలాభానందీ భవా నితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శిఖరిణి.

**94.** **జగత్ప్రలీనం పునరుద్ధిధీర్షతః సింహక్షితిక్షిన్నిలయస్థ! సుందర ।**
**పురా వరాహస్య తవేయ ముర్వరా దంష్ట్రాహ్వయేందోః కిల లక్ష్మలక్షితా ॥**

సింహక్షితిక్షిత్ = తిరుమాలిరుమ్‌శోలై పర్వతము అను, నిలయస్థ = వాసస్థానమున



వేంచేసియున్నవాడా! సుందర = సుందరబాహుస్వామీ! పురా = పూర్వము, ప్రలీనమ్ = నీటిలో మునిగిన, జగత్ = లోకమును, పునః = తిరిగి, ఉద్దిధీర్షతః = ఉద్ధరింపగోరిన, వరాహస్య = వరాహరూపమును కల, తవ = నీ యొక్క, దంష్ట్రా + ఆహ్వయ = కొమ్ము అను పేరును కల, ఇందోః = చంద్రునకు, ఇయం = ఈ, ఉర్వరా = (సర్వసస్యాఢ్యమైన) భూమి, లక్ష్మలక్షితా కిల = కళంకమువలె భాసించినది కదా!

దివ్యవరాహమూర్తిని ఇందు కూరేశులు స్తుతించుచున్నారు. అందమైన వరాహమూర్తిని కీర్తించువారు అందఱు చమత్కారముగా పలుకు రీతి ఒకటి కలదు. తిరుమళిశైయాళ్వార్లు **''ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే''** అను పౌరాణికప్రమాణమును అనుసరించి **"లమ్బునిదై చ్చిఱుపరల్ పోల్ పెరియమేరు తిరుక్కుళమ్బిల్ కణకణప్ప త్తిరువాకారమ్ కులుజ్గ నిలమడన్దైతనై యిడన్దు పుల్‌కి క్కోట్టిడై వైత్తరుళియ వెజ్గోమాన్"** అని పల్కిరి. అంతియేకాక, **"తీతఱు తిజ్గళ్ పొఙ్గు శుడరుమ్ పరుమ్బరుల మేఴ్‌కడలుమ్ పాదమర్ శూழ்కుళమ్బిన్ అకమణ్డలత్తినొరు పాలొడుఙ్గ వళర్‌శేల్ ఆదిమునేనమాకి యరణాయ మూర్‌త్తియదు"** అనియు అనుగ్రహించిరి. **"వరద హంత కథం! ప్రభూతం వారాహ మాస్థితవతో వపు రద్భుతం తే?"** అనుచు దేశికులు వరదపంచాశత్‌లో సాశ్చర్యముగా ప్రశ్నించిరి. ఇచట కూరేశుల అనుభవము అత్యంతవిలక్షణము.

**(పురా ప్రలీనం జగత్ పున రుద్దిధీర్షితః వరాహస్య తవ)** – పూర్వము ప్రళయ సమయమున అర్ణవమగ్నమైన జగత్తును ఉద్ధరింపగోరిన వరాహమూర్తియగు నీయొక్క – అని భావము. ఈ వరాహమూర్తికి ఒకే దంష్ట్ర. **"ఏకశృంగో వరాహ స్త్వమ్"** అని శ్రీరామాయణము ఈ అంశమును పల్కినది కదా! **"మత్కృతే సర్వభూతానాం లఘూపాయం వద ప్రభో!"** అని భూదేవి ప్రార్థింపగా, **"స్థితే మనసి సుస్వస్థే"** అను వరాహచరమమును స్వామి కృపతో ప్రసాదించుటను ప్రకృతమున స్మరింపనగును. కావున **"జగదుద్ధిదీర్షతః"** అను ప్రయోగము ఈ విధముగాకూడ అర్థవంతము. **"ఏతాదృశాభినివేశేన ప్రళయాబ్ధిమధ్య ప్రలీనజగదుద్ధారక స్త్వం సంసారసాగరమగ్నా నస్మా నపి ఉత్తారయేతి పర్యవసిత మితి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(ఇయ ముర్వరా)** – **"ఉర్వరా సర్వసస్యాఢ్యా"** అని అమరము. అన్ని పంటలు సమృద్ధిగా పండు సారవంతమైన నేల ఉర్వర అనబడును. విశ్వక్షేత్రకృషీవలుడు శరణాగతి అను ఉపాయమును వ్యక్తీకరించి, సాగుచేసిన పైరుకదా ఈ జగత్తు. కావున ఉర్వరాశబ్ద ప్రయోగము ఇచట అర్థవంతము. **"పత్తి యుழவన్"** అని ఆళ్వార్లు భగవానుని నిర్దేశించిరి. **"విశ్వక్షేత్రకృషీవలః"** అనుచు దేశికులు షోడశాయుధస్తోత్రమున భగవానుని కీర్తించిరి.

ఈ కృషీవలత్వచిహ్నముగానే బలరామావతారమున స్వామి హలాయుధుడైనాడు. **(వరాహస్య దంష్ట్రాహ్వాయేందోః లక్ష్మలక్షితా)** – ఇచట కూరేశులు వరాహస్వామి దంష్ట్రను చంద్రునిగా రూపించుట తిరువాయ్‌మొழிలోని **"నీలవరై యిరణ్డు పిఱైకవ్వి నిమిర్‌న్దదు ఒప్ప కోలవరాకమొన్ఱాయ్ నిలమ్ కోట్టిడైకొణ్డ వెన్దాయ్"** అను ప్రయోగమును స్మరింపజేయును. **"ఉద్ధృతాఽసి వరాహేణ"** ఇత్యాది శ్రుతివాక్యార్థముకూడ ఇచట స్మరింపనగును. **"లక్షితా ఉత్ప్రేక్షితా"** అని రామానుజాచార్యవ్యాఖ్య, **"లక్షితా అవలోకితా"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఉపజాతి వృత్తము.

**95.** **న వాయుః పస్పందే యయతు రథ వాఽస్తం శశిరవీ**
**దిశోఽనశ్య న్విశ్వాఽప్యచల దచలా సాచలకులా ।**
**నభ శ్చ ప్రశ్చ్యోతి క్వథిత మపి పాథో నరహరౌ**
**త్వయి స్తంభే శుంభద్వపుషి సతి హే సుందరభుజ ॥**

హే సుందరభుజ = ఓ సుందరబాహుస్వామీ!, త్వయి = నీవు, నరహరౌ = నృసింహుడవై, స్తంభే = (హిరణ్యకశిపుని ఇంటిలోని) స్తంభమునందు, శుంభద్వపుషి సతి = ప్రకాశించిన రూపమును కలవాడవు అయినపుడు, వాయుః = వాయువు, న పస్పందే = కొంచెముకూడ వీచలేదు, అథవా = మఱియు, శశిరవీ = చంద్రసూర్యులు, అస్తం = అస్తమయమును, యయతుః = పొందిరి, దిశః = దిక్కులు, అనశ్యన్ = నశించినవి (తెలియకున్నవి), సాచలకులా = కులపర్వతములతో పాటు, విశ్వా = సమస్తమైన, అచలా అపి = ఈ భూమియు, అచలత్ = చలించెను (కంపించెను), నభః చ = ఆకాశముకూడ, ప్రశ్చ్యోతి = కఱిగి ప్రవహించినది, పాథః అపి = సముద్రములోని (చల్లనితనముకల) నీరును, క్వథితమ్ = సలసల కాగినది.

ఈ శ్లోకమునుండి వరుసగా మూడుశ్లోకములలో నృసింహావతారవైభవము అభివర్ణింపబడుచున్నది. **"అఙ్గణ్ఞాల మఞ్జ అఙ్గోరాళరియాయ్"** అనురీతిలో స్వామి నృసింహరూపమును పొంది ఆవిర్భవించినపుడు లోకములన్నియు భయభ్రాంతములగుటను బట్టి, అపుడు వాయువు వీచలేదు, చంద్రసూర్యు లస్తమించిరి. దిక్కులు కనబడలేదు. పర్వతసమూహములతో కూడిన సమస్తభూమండలమును గడగడలాడినది. ఆకాశము సైతము వికృతిని పొందినది. చల్లని సముద్రజలము సలసల కాగినది. అప్పటి స్థితిని ఏమని చెప్పుదును? స్వామీ! – అని కూరేశులు అనుచున్నారు.

**(వాయుః న పస్పందే)** – **"భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః"** అనునట్లు నీ దివ్యాజ్ఞకు లోబడి, సదాగతియైయుండు వాయువు సైతము వీచలేదు.
**(అథవా శశిరవీ అస్తం యయతుః)** – చంద్రసూర్యు లస్తమించిరనునపుడు –



**"యదీక్షణజ్యోతిషి రశ్మిమండలం ప్రలీన మీష న్న రరాజ భాస్వతః, కుతః శశాంకస్య స దివ్యరూపధృత్"** అను మాంగల్యస్తవస్తోత్రములోని శ్లోకము స్మరణీయము.

**(దిశః అనశ్యన్)** – చంద్రసూర్యోదయమైనకదా దిక్కులు తెలియుట. అది లేనపుడు భ్రాంతియే కల్గును. దిక్కులు ఆకాశాదులలో అంతర్భవించునని, ప్రత్యేకపదార్థము కాదనెడి మన సిద్ధాంతము ఇచట చమత్కారముగా ప్రతిపాదితము.

**(సాచలకులా అచలా విశ్వాఽపి అచలత్)** – చలింపనిది అను పేరును కల (అచలా) కులపర్వతములతో కూడిన భూమి సైతము కంపించినది.
**(నభ శ్చ ప్రశ్చ్యోతి)** – ఆకాశముకూడ కఱిగి నీరై, సముద్రమున కలిసినది – ఏతావతా, నృసింహావతారసమయమున పంచభూతములకు చాంచల్యము కల్గెనని తెలుపబడినది. **"ప్రహ్లాదప్రతిపక్షశిక్షణాయ ప్రాదుర్భవన్నరసింహసంహననసాక్షాత్కారాక్షమాణాం క్షమాదిపంచభూతానాం చాంచల్య మభూ దితి భావః. స్వాశ్రితాహితానుగ్రహనిగ్రహౌ సుగ్రహౌ వభిహితౌ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శిఖరిణి. పర్వత శిఖరములను అధివసించు నృసింహమూర్తిని శిఖరిణీ వృత్తమున వర్ణించుటలోని వృత్తౌచిత్యము గమనింపతగినది.

**96.** **అరాళం పాతాళం త్రిదశనిలయః ప్రాపితలయో**
**ధరిత్రీ నిర్ధూతా యయు రపి దిశః కా మపి దశామ్ ।**
**అజృంభిష్టాంభోధిః ఘుమఘుమ మితి ఘూర్ణన్ సురరిపోః**
**విభింధానే వక్ష స్త్వయి నరహరౌ సుందరభుజ ॥**

సుందరభుజ = సుందరబాహుస్వామీ!, త్వయి = నీవు, నరహరౌ = నృసింహుడవై, సురరిపోః = దేవతలకు శత్రువగు హిరణ్యకశిపుని, వక్షః =వక్షస్థలమును, విభింధానే = బ్రద్దలుచేయునపుడు, పాతాళమ్ = పాతాళము, అరాళమ్ = తలక్రిందులైనది (వక్రమైనది), త్రిదశనిలయః = దేవలోకము, ప్రాపితలయః = లయమును పొందింపబడినది, ధరిత్రీ = భూమి, నిర్ధూతా = మిక్కిలి కంపించినది, దిశః అపి = దిక్కులుకూడ, కామ్ అపి దశామ్ = ఇట్టిదని చెప్పుటకు వీలులేని దశను, యయుః = పొందినవి, అంభోధిః = సముద్రము, ఘుమఘుమ మితి = ఘుమ ఘుమమను శబ్దముతో, ఘూర్ణన్ = తిరుగుచు, అజృంభిష్ట = ఉప్పొంగినది.

పూర్వశ్లోకమున భగవానుడు నృసింహరూపమున స్తంభమునుండి అవతరించినప్పటి స్థితి వర్ణింపబడగా, ఇందు స్వామి హిరణ్యకశిపుని వక్షమును చీల్చునప్పటి స్థితి వర్ణింపబడుచున్నది. భగవానుని కోపమును చూచి తాళలేని సర్వలోకములు పొందిన అవస్థను ఏమని చెప్పుదుము! అని కవి హృదయము.

**(హే సుందరభుజ! త్వయి నరహరౌ సురరిపోః వక్షః విభింధానే సతి)** –

సుందరబాహుస్వామీ! నీవు నృసింహమూర్తివై హిరణ్యకశిపుని వక్షస్సును నీ నఖములతో బ్రద్దలు చేయునపుడు – ఏమయ్యెనో తెలియునా? –

**(పాతాళం అరాళమ్)** – పాతాళమే తలక్రిందులైనది.

**(త్రిదశనిలయః ప్రాపితలయః)** – దేవతల నివాసమగు స్వర్గము లయమును పొందినది. స్వర్గమున్న చోటే తెలియరాలేదు.
**(ధరిత్రీ నిర్ధూతా)** – భూమి అత్యంతము కంపించినది.
**(దిశః అపి కా మపి దశామ్ యుయుః)** – దిక్కులు కనుపడనేలేదు.
**(అంభోధిః ఘుమ ఘుమ మితి ఘూర్ణన్ అజ్రుంభిష్ట)** – సముద్రజలముసైతము ఘుమఘుమ అను శబ్దముతో భ్రమించుచు, కాగినది. ఇట్టి భయంకరస్థితిని పొందినవి. ముదల్ తిరువన్దాదిలోని – **"పూజ్మోదైయాళ్ వెరువ పొన్‌పెయరోన్ మార్‌పిళన్ద"** అను సూక్తినిబట్టి లక్ష్మీదేవియే భీతిల్లగా, ఇక మిగలిన వానినిగూర్చి చెప్పవలసినదేమి? వృత్తము శిఖరిణి. ఇందు చీరరస, భయానకరసములు హృద్యముగా పోషింపబడినది. శైలియు తదనుగుణము.

**97. నఖక్రకచకప్రధిక్రథితదైత్యవక్షఃస్థలీ –**
**సముత్థరుధిరచ్ఛటాచ్ఛురితబింబితం స్వం వపుః ।**
**విలోక్య రుషితః పునః ప్రతిమృగేంద్రశంకావశాత్**
**య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సుందరః ॥**

యః నరకేసరీ = ఏ నృసింహస్వామి, నఖ = నఖములనెడి, క్రకచ = ఱంపముయొక్క, ప్రధి = అంచులచే, క్రథిత = నఱుకబడిన, దైత్యవక్షఃస్థలీ = దైత్యుడగు హిరణ్యకశిపుని వక్షః స్థలమునుండి, సముత్థ = పుట్టిన, రుధిరచ్ఛటా = రక్తప్రవాహమునందు, చ్ఛురితబింబితం = లగ్నమై, ప్రతిబింబించిన, స్వం వపుః = తనరూపమును, విలోక్య = చూచి, ప్రతిమృగేంద్ర = తనకు శత్రువగు వేఱొక సింహమనెడి, శంకావశాత్ = భయముతో, పునః = తిరిగి, రుషితః = కోపమును పొందినాడో, సః ఏష = అట్టి, ఈ, సుందరః = సుందరబాహుస్వామి, దృశ్యతే =అందఱు సేవించునట్లు తిరుమాలిరుమ్‌శోలైలో సాక్షాత్కరించుచున్నాడు.

నృసింహావతారకాలములో హిరణ్యకశిపుడు పరమభక్తశిఖామణి యగు ప్రహ్లాదునకు పలు రీతులలో ద్రోహములను చేసెనని స్వామికి కల్గిన కోపము లోకములకు కల్గించిన అవస్థ ముందు రెండు శ్లోకములలో తెలుపబడినది. వేఱొక రీతిలోకూడా నృసింహమూర్తికి కోపము కల్గినదని కూరేశులిందు స్వభావోక్త్యలంకార పురస్సరముగా చమత్కరించుచున్నారు. పేయాళ్వార్లు **"పార్‌త్త కడువన్ శునైనీర్ నిழల్ కణ్డు పేర్‌త్తోర్ కడువనెన ప్పేర్‌న్దు"** అనుచు సాయించినరీతిలో ఈ శ్లోకము రచింపబడినది., మృగములు



నీటిలో తమ ప్రతిబింబమును చూచి కోపించు స్వభావమును కల్గినవనుట పంచతంత్రాది కథలలో ప్రసిద్ధము.

**(నఖక్రకచకప్రధి.....బింబితం స్వం వపుః విలోక్య)** – **"దైత్యేంద్రవక్షఃస్థలదారదారుణైః కరోరుహై ర్యైః క్రకచానుకారిభిః"** అని శౌనక భగవానుడు పల్కినట్లే నృసింహమూర్తి నఖములు ఱంపములవంటివి–అని కూరేశులు అనుచున్నారు. ఆ నఖముల అగ్రములతో హిరణ్యకశిపుని వక్షఃస్థలమును ఖండించినపుడు, దానినుండి స్రవించిన రక్తప్రవాహములో నృసింహుని రూపము ప్రతిబింబించినది. **(ప్రతిమృగేంద్రశంకావశాత్ పునః రుషితః)** దానిని చూచిన స్వామి – నన్ను ఎదిరించుటకు వేఱొక సింహము వచ్చినదా! ఏమి! అను కోపమును పొంది, దానిని సంహరించవలెనని స్వామి సమాయత్తమైనాడు... అనుటచే తన ప్రతిరూపమును చూచి కోపించు సింహస్వభావము వర్ణింపబడినది. కావున స్వభావోక్తి.

**(స ఏష ఇహ సుందరః దృశ్యతే)** – ఆ నరసింహస్వామియే ఈ తిరుమలలో సుందరబాహువుగా సేవను అనుగ్రహించుచున్నాడనుటచే పూర్వమువలెనే ధర్మైక్యము అనుసంధింపబడినది. **"అద్యాపి సమాశ్రితద్వేషినిరసనోద్యుక్తో వర్తతే ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇట్టి ధర్మైక్యములనుబట్టి ఈ నాటికిని స్వామి నృసింహమూర్తివలె ఆశ్రితుల విరోధులను నిరసించుటకై ఉద్యుక్తుడై ఉన్నాడని స్ఫురించుచున్నది. ఇందు గాఢబంధత్వప్రయుక్తమైన ఊర్జితమను కవితాగుణము కలదు. వృత్తము పృథ్వి.

**98. క్షితి రియం జనిసంహృతిపాలనైః నిగరణోద్గిరణోద్ధరణై రపి ।**
**వనగిరీశ తవైవ సతీ కథం వరద వామన భిక్షణ మర్హతి ॥**

వరద = కోఱిన వరములను ఇచ్చువాడా! వామన = వామనమూర్తీ!, వనగిరీశ = వనగిరిప్రభూ!, జని = పుట్టుక (సృష్టి), సంహృతి = లయము, పాలనైః = రక్షణము – అను వీనిచే, నిగరణ = ఒక కాలమున గ్రసించుట, ఉద్గిరణ = వేఱొక కాలమున వెడలగ్రక్కుట, సూక్ష్మరూపమున దాల్చుట, (వ్యక్తము చేయుట) ఉద్ధరణైః+అపి = కూర్మ వరాహాదిరూపములలో ఉద్ధరించుట, ధరించుట మొదలగువానిచేతనుకూడ, ఇయమ్ క్షితిః = ఈ భూమి, తవ ఏవ సతీ = నీకు ఒక్కనికే చెందినదియై (శేషమై) ఉండగా, భిక్షణమ్ = (ఒక సామాన్యుని వద్ద) యాచించుటను, కథం అర్హతి = ఎట్లు తగును?

వామనావతారమునందలి తమ అభినివేశమును కూరేశులు ఇందు వ్యక్తము చేయుచున్నారు. నమ్మాళ్వార్లు పెరియతిరువన్దాది ప్రబంధములో భగవానుని ఉద్దేశించి ప్రశ్నించుచు **"శీరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు పేర్ వామనాకాక్కాల్ పేరాళా! మార్‌ప్పార ప్పుల్‌కి నీ యుణ్డుమిழ்న్ద పూమి నీరేఱ్పురిదే, శొల్లు నీ యామఱియ చ్చ్వాழ்న్దు"** అని పల్కిన సూక్తిని అనుసరించుచు కూరేశులీ శ్లోకమును రచించిరని

శ్రీ. ప్ర. భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య. **(వనగిరీశ! వరద! వామన! ఇయం క్షితిః జనిసంహృతిపాలనైః నిగరణోద్గిరణై రపి తవైవ సతీ కథం భిక్షణ మర్హతి)** – వనగిరీశా! **"వేణ్డిరేల్లాతరుమ్ కోదిల్ ఎన్ వళ్ళల్ మణివణ్ణన్"** అని, **"అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కై"** అనియు కీర్తింపబడు వరదా! వామనమూర్తీ! ఈ భూమిని అంతటిని సృష్టించుట, రక్షించుట, లయమొనర్చుట, గ్రసించుట, ఉమియుట, కొలిచి, ఉద్ధరించుట మొదలగు కృత్యములచే ఇది సర్వాత్మనా నీకే సొంతము అనుట స్పష్టము కదా! దీనిని ఒక క్షుద్రునివద్దకు భిక్షకుడవై పోయి, యాచించుట ఏమి స్వామీ?'' అని కవి హార్దముగా ప్రశ్నించుచున్నారు. చతుర్ముఖునిద్వారా సృష్టించి, స్వేన రూపేణ రక్షించి, ఇట్టి పలు ప్రకారములచే నీకే వశమైన ఈ త్రైలోక్యమును ఒక క్షుద్రుడు తనది అని భావించినచో, అతనివద్దకు నీవు నేరుగా పోయి, అతనిని దండించి, గ్రహింపవలసియుండగా, అట్లు చేయకుండ, అతని వద్దకే యాచకుడవై వెడలి, నీ పన్నెండు పళ్ళను చూపించి, ప్రార్థించి పొందవలెనా ఏమి? భూమిని పొందుటకు వేఱు ఉపాయమే లేదా స్వామీ! అనుచు శ్లోకములోని ప్రశ్నకు వివరణమును గ్రహింపనగును. **'వరద'** అను సంబోధన సాభిప్రాయకము. కోఱిన వరముల నిచ్చు వరదుడవుగా ప్రసిద్ధిచెందిన నీవే భిక్షకుడవు కాదగునా? అను భావము దీనిచే వ్యక్తము. కావున పరికరాలంకారము వ్యంగ్యము. నీ భక్తుడగు మహాబలి ఔదార్యమనెడి ఒక ధర్మాభాసమును పాలించువాడగుటచే, దానికి తగినట్లు యాచకవేషమును దాల్చి వెడలి, కార్యమును సఫలమొనర్చుట నీ సదుపాయజ్ఞతకు గీటురాయి–అనెడి సమాధాన మిచట గ్రహింపనగునని శ్రీ అణ్ణాస్వామివారి వివరణము. ఈ విషయము శ్రీపరాశరభట్టరు అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవ–ఉత్తరశతకములోని **"దైత్యౌదార్యేంద్రయాచ్ఞావిహతి మపనయన్"** అను సూక్తిలో తెలుపబడినది. **"సమాశ్రితపరిపంథినా మపి ధర్మసంబంధే సతి. తదనుసారేణావతీర్య, నిరాకరణం భక్తాభిమత మితి సిద్ధమ్''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"మణ్ణై యుణ్డుమిழ్న్దు పిన్ ఇరన్దు కొణ్డళన్దు"** అను తిరుమழிశై ఆழ்వార్ల సూక్తినిబట్టి **"నిగరణోద్గిరణోద్ధరణైః"** అని ప్రయోగింపబడినది **"తజ్జలాత్ ఇతి"** అను శ్రుత్యనుసారము **"జనిసంహృతిపాలనైః"** అనిరి. **"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః", "హరిం హరంత మనుయంతి దేవాః"** ఇత్యాది శ్రుతులనుబట్టి **"నిగరణ"** అనిరి. **"ఎమ్బెరుమాన్ ఉణ్డుమిழ్న్ద ఎచ్చిల్"** అను సూక్తినిబట్టి, **"ఉద్గిరణ"** అనిరి. అదికూర్మ, ఆదివరాహావతారములలో, అట్లే ఆదిశేషుని రూపమున భూమిని ధరించి, ఉద్ధరించుటచే **"ఉద్ధరణైః"** అనిరి. **"విష్ణునా విధృతే భూమీ ఇతి వత్సస్య వేదనా"** అను శ్రుతి ఇచట స్మరణీయము. **"తవైవ"** అనునది **"త్వన్నిర్మితా జఠరగా చ తవ త్రిలోకీ కిం భిక్షణా దియ మృతే భవతే దురాపా"** అనుచు తామే అతిమానుషస్తవములో పల్కిన రీతిలో భగవానుడు ఆశ్రితరక్షణార్థము తాను యాచకుడుగా సైతము అగుటకు సిద్ధపడునట్టి సౌలభ్యమును



తెలుపును. **"సమూఢ మస్య అపాంసురే"** (స్వామి పాదరేణువులలో ఈ లోకము అణగియున్నది) అను శ్రుతిని ఇచట స్మరింపనగును" – అనియు వ్యాఖ్యానాంతరము. ద్రుతవిలంబిత వృత్తము.

**99. భార్గవః కిల భవన్ భవాన్ పురా కుందసుందర వనాచలేశ్వర ।**
**అర్జునస్య బలదర్పితస్య తు చ్ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్ ॥**

కుందసుందర = కుందవృక్షములచే అందమైన, వనాచల + ఈశ్వర = వనగిరికి ప్రభూ, పురా = పూర్వము, భవాన్ = నీవు, భార్గవః భవన్ = భృగువంశములో జన్మించిన పరశురాముడవై, బలదర్పితస్య = (భుజ) బలముచే గర్వించిన, అర్జునస్య = కార్తవీర్యార్జునునియొక్క, బాహుకాననమ్ = అరణ్యమువంటి బాహుసమూహమును, ఛేత్స్యతి స్మరతి కిల = ఛేదించితివి కదా! (నీకు గుర్తున్నదా!)

ఈ శ్లోకముద్వారా కూరేశులు పరశురామావతారప్రస్తావ మొనర్చుచున్నారు. శ్రీమహావిష్ణువు పరశురాముడై అవతరించి, లోకములో దుష్టక్షత్రియనిబర్హణమును చేసిన విషయము సుప్రసిద్ధము. జమదగ్నిముని భృగువంశమున జన్మించినవాడు. అతనికి రేణుకకు కల్గిన నాల్గవ పుత్రసంతానమే పరశురాముడు. ఆయుధముగా కలిగియుండుటచే పరశురాముడనుపేర ప్రసిద్ధుడయ్యెను. అతనియందు భగవానుడు ఆవేశావతారముగా అనుప్రవేశించి, క్షత్రియసంహారము చేసెను. జమదగ్నిమునివద్దగల హోమధేనువును కార్తవీర్యార్జునుడు తనకు ఇవ్వవలసినదిగా ఆ మునిని కోరెను. కార్త్యవీర్యుడు కృతవీర్యుడను రాజు కుమారుడు. బాణాసురునకువలెనే ఇతనికిని వేయి బాహువులు కలవు. భగవానుడు దత్తాత్రేయుడుగా అవతరించినపుడు అతడు – " నా రాజ్యములో ఎవరికిని తప్పు చేయవలెనను ఆలోచన రాకూడదు" అను వరమును వేడెను. దత్తాత్రేయుడు "అట్లు కాదు, తప్పుచేయవలెనను తలచువానిముందు నీవు ప్రత్యక్షమై, వానిని నీవు బెదిరింపగలవు. అందువలన అతనికి తప్పుచేయవలెనను భావము పోవును. నీవును ముల్లోకములలో నా పాలనను అవిచ్ఛిన్నముగా సాగింపగలవు" అని వరమిచ్చెను. ఈ విషయము **"దేవేంద్ర స్త్రిభువన మర్ధ మేకపింగః సంసిద్ధిం త్రిభువనగాం చ కార్తవీర్యః, వైదేహః పరమపదం ప్రసాద్య విష్ణుం సంప్రాప్తః సకలఫలప్రదో హి విష్ణుః"** అనుచు విష్ణుధర్మములో శౌనకుడు దాల్భ్యునకు చెప్పిన వచనముద్వారా తెలియుచున్నది. ఇట్టి ధార్మికుడైన కార్తవీర్యార్జునుడు పుత్రులతోపాటు వేటకై బయలుదేరి ప్రాక్తనపాప కర్మవశమున జమదగ్ని ఆశ్రమములోని హోమధేనువు కోఱిన వస్తువులన్నింటిని ఇచ్చుటను చూచి దానిని తనకు ఇమ్మనెను. కాని ఆ ముని అంగీకరింపకపోవుటచే, అతనిని వధించి హోమధేనువును బలవంతముగా తీసికొనిపోయెను. అపుడు పరశురాముడు ఆశ్రమములో లేడు. ఆశ్రమమునకు తిరిగివచ్చిన

పరశురాముడు విషయమును గ్రహించి, ఆగ్రహోదగ్రుడై కార్తవీర్యార్జునుని, అతని పుత్రులను సంహరించి, ఆ కోపము కారణముగానే భూమండలమున ఇరువది ఒక్క పర్యాయములు తిరిగి, దుష్టక్షత్రియనిర్మూలనము చేసెనని ఇతిహాసకథనము. **"తెఱ్ఱిత్తిట్టెఘున్దే యెదిర్ నిన్ద మన్నన్ శినత్తోళవై యాయిరముమ్ మఘువాల్ అఱ్ఱిత్తిట్టవన్"** అనియు, **"అడర్పురై ఎఱిల్ తికఱ్ తిరడోళ్ అయిరన్దుణియ అడల్ మఱుప్పఱ్ఱి మఱ్ఱవనకల్ విశుమ్బణైయ"** అని తిరుమజ్గై ఆళ్వార్లు అనుగ్రహించిన పాశురమును అనుసరించి కూరేశులు ప్రకృతశ్లోకమును అనుగ్రహించిరి. ముముక్షువులకు ఆవేశావతారమైన పరశురామావతారము ఉపాసనకు తగినది కాకున్నను, విరోధినిరసనమును చేసిన ఉపకారశీలత్వమునకు వివశులై కూరేశులు స్తుతించుట తగినదియే. ఇరామానుశనూఱ్ఱన్దాదిలో **"కోక్కులమన్నరై మూవెఘుకాల్ ఒరు కూర్ మఘువాల్ పోక్కియ తేవనై పోఱ్ఱుమ్ పునిదన్...... ఇరామానుశన్"** అని స్తుతింపబడుట గమనార్హము. శ్రీరంగరాజస్తవములో **"భవాన్ రామో భూత్వా పరశుపరికర్మా భృగుకులా దలావీత్ భూపాలాన్"** అనుచు భట్టరు అనుగ్రహించిరి.

**(కుందసుందర వనాచలేశ్వర) – "కుంద, సుందర, వనాచలేశ్వర"** అను మూడిటిని వ్యస్త సంబోధనలుగాకూడ చెప్పుటకు వీలున్నను ఆ అన్వయమంత సరసము కాదు. మొత్తము సమస్తముగా గ్రహించుటలోనే స్వారస్యమున్నది.

**(బాహుకాననం ఛేత్స్యతి స్మరతి)** – కార్తవీర్యార్జునుని భుజవనమును ఖండించితివి. **"అభిజ్ఞావచనే లృట్"** అను సూత్రముప్రకారము **"స్మరతి"** పదసమభివ్యాహారమువలన భూతకాలార్థములో భవిష్యత్కాలికలకారప్రయోగము చేయబడినది. ఇట్టిలకార ప్రయోగములు సంస్కృతభాషకు సోదరిభాషవంటిది అగు **(Sister language)** ఆంగ్లమునను కలవు. **'స్మరతి'** అను పదమునకు ప్రత్యేకముగా అర్థము లేదు. అది దానికి ముందున్న భవిష్యదర్థక్రియారూపమునకు భూతకాలికమైన అర్థమును నిర్వహించునంతియే – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోకూడ **"స్మరతిపదసమభివ్యాహారానుగుణో భూతార్థే లృట్ప్రయోగః"** అని కలదు. ఇట్లుండగా, **"ఛేత్స్యతి స్మరతి ఇత్యత్ర అభిజ్ఞావచనే లృట్, ధాతుసంబంధే ప్రత్యయాః, –ఇతి ధాతుసంబంధః. శేషే ప్రథమః – ఇత్యనుశాసనాత్ ప్రథమపురుషః సాధుః. భూతే లృట్"** – అనుచు **"ఛేత్స్యతి"** అను భవిష్యత్కాలరూపమునకు భూతార్థమును తెలిపి, **"స్మరతి"** అను క్రియను వేరుగా **'కిల'** అను అవ్యయములోకలిపి అన్వయించి, "నీకు గుర్తున్నది కదా!" అను అర్థము వ్యాఖ్యానాంతరములో తెలుపబడినది. విజ్ఞులీవిషయమున ప్రమాణము. **"అనేక క్షత్రియయూథనిధనవిధానా దపి కార్తవీర్యార్జునబాహుసహస్రచ్ఛేదో ౽ తిదుష్కర ఇతి భావః**



" అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**100. ఆజ్ఞా తవా౽త్రభవతీ విదితా త్రయీ సా**
**ధర్మం తదుక్త మఖిలేన వనాద్రినాథ ।**
**అన్యూన మాచరితు మాస్తికశిక్షణార్థ**
**మత్రావతీర్య కిల సుందర! రాఘవో౽భూః ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, అత్ర భవతీ = మిక్కిలి గౌరవింపతగిన, సా త్రయీ = ఆ ప్రసిద్ధములైన వేదములు మూడును, త్వ = నీయొక్క, ఆజ్ఞా = శాసనము అని, విదితా = పెద్దలచే తెలియబడినది (ప్రసిద్ధము), తదుక్తం = ఆ వేదములలో చెప్పబడిన, ధర్మం = ధర్మము, అఖిలేన = సమస్తము, అన్యూనం = ఏ లోటు లేకుండ, అచరితుం = ఆచరించుటకు, ఆస్తిక = భగవానుడున్నాడను భావించువారిని, శిక్షణార్థం = తీర్చిదిద్దుటకు, అత్ర = ఈ భూమండలములో, రాఘవః = శ్రీరాముడవై, అభూః కిల = అయితివి (అవతరించితివి) కదా!

ఈ శ్లోకమునుండి వరుసగా ఏడుశ్లోకములలో – అనగా, **"రఘుకులతిలక స్త్వమ్"** అను శ్లోకము పర్యంతము శ్రీరామావతారమును కూరేశులు కీర్తించుచున్నారు. దశావతారములలో **"సప్తమభూమికాయై"** అని ఏడవది అగు రామావతారమును ఏడు శ్లోకములతో కీర్తించుట విశేషము. పూర్వము రామునిగా అవతరించినది, ఇపుడు వనగిరిలో సుందరబాహుస్వామిగా సాక్షాత్కరించునదియు ఒక్కరే అనుటను సమర్థించునట్లు **"వనాద్రినాథ హే సుందర త్వం రాఘవః అభూః"** అని పల్కిరి. వేదోక్తధర్మములన్నింటిని సంపూర్ణముగా ఏలోటులేకుండ అనుష్ఠించుటకొఱకే నీవు శ్రీరామునిగా అవతరించితివి – అనుట ఇచటి ప్రధానాంశము.

**(అత్ర భవతీ సా త్రయీ ఆజ్ఞా విదితా)** – పరమపూజ్యమైన వేదము తన ఆజ్ఞారూపమే అనుటను సాక్షాత్తు భగవానుడే భారతములోని ఆశ్వమేధిక పర్వములో **"శ్రుతిః స్మృతి ర్మమైవాజ్ఞా య స్తా ముల్లంఘ్య వర్తతే, ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ మద్భక్తో౽పి వైష్ణవః"** అనుచు తెలిపెను. **"అత్రభవత్తత్రభవచ్ఛబ్దౌ పూజ్యార్థౌ"** అను అనుశాసనమునుబట్టి **"అత్రభవతీ"** అనుటకు పరమపూజ్యమైన – అని అర్థము.

**(తదుక్తం ధర్మమ్ ఆస్తికశిక్షణార్థమ్ అఖిలేన అన్యూనమ్ అచరితుమ్) – "వేదో౽ఖిలో ధర్మమూలమ్"** అనునట్లు ఆ వేదము సకలవిధధర్మములకును మూలమైయుండుటచే, అందు చెప్పబడిన సకలధర్మములను ఆస్తికుల శిక్షణార్థము తాను ఏ లోటు లేకుండ ఆచరించుటకొఱకు – అని అర్థము. **"స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః"** అను గీతా సూక్తిచొప్పున వేదధర్మములు అనుష్ఠేయములు కదా! ఆచార్యుడైనవాడు తాను

అధర్మములను ఆచరించి **"ఆచారే స్థాపయత్యపి స్వయ మాచరతే"** అనునట్లు ఇతరులచే ఆచరింపజేయవలెనుకదా! ఆ క్రమమును అనుసరించుచు **"లక్ష్మీనాథసమారంభామ్"** అని పొగడబడు ప్రథమాచార్యుడైన భగవానుడు శ్రీరామునిగా అవతరించి, వైదికధర్మము లన్నిటిని తాను సంపూర్ణముగా ఆచరించెను.

**(అత్ర అవతీర్య రాఘవోఽ భూః)** – ఈ భూమిలో రఘుకులతిలకుడవుగా నీవు అవతరించితివి. భగవద్గీతలో భగవదవతారములకు ప్రయోజనము – సాధుపరిత్రాణము, దుష్కృద్వినాశము, ధర్మసంస్థాపము – అని మూడు విధములుగా తెలుపబడినది. వీనిలో ధర్మసంస్థాపనమును ఇచట ప్రధానముగా గ్రహింపనగును. **"రామో విగ్రహవాన్ ధర్మః"** అనికదా సూక్తి. పితృవాక్యపరిపాలన, శరణాగతరక్షణము మొదలగు సామాన్య – విశేషధర్మములను నీవు అనుష్ఠించి చూపి, ఆస్తికులచే అనుష్ఠింపజేయుటకై రాముడవైతివి. **"ఆస్తికశిక్షణార్థమ్"** అనునపుడు ముముక్షుప్పడిలోని – **"శిష్యనాయ్ నిన్ఱదు శిష్యనిరుక్కు మిరుప్పు నాట్టా రతియామైయాలే, అత్తై యతివిక్కైక్కాక"** అను సూక్తిని స్మరింపనగును – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య.

**"అస్తి బ్రహ్మేతి చేద్వేద"** – అని చెప్పబడు ఆస్తికులను – "ఇట్లు ఆచరింపలెను, ఇట్లు ఆచరింపరాదు" అనుటను తన అనుష్ఠానమూలమున శిక్షించుటకై భగవానుడు రాముడై అవతరించెను. **"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అనునట్లు అవతార ప్రయోజనములలో ధర్మానుష్ఠానమనునది ఒకటి కలదుకదా! "రాముడు కేవలము ఒక మానవప్రభువు. అతనిని దైవముగా భావించి పల్కుట అజ్ఞతయే. అతడును **"విలలాపాకులేంద్రియః"** అనునట్లు రోదించెను కదా! సుఖదుఃఖములకు అతీతుడు కాడతడు. ఏదో కొన్ని సద్గుణములు మాత్రము అతనియందు కన్పించినవి. అంతమాత్రమున అతనిని దైవమని ఉన్నతముగా తలచుట తగదు" అని వాదించు నాలూరాన్‌వంటి పాపులను విడచుట వలన **"ఆస్తికశిక్షణార్థమ్"** అనిరి. **"మజ్జంతి పితర స్తస్య నరకే శాశ్వతీః సమాః, ద్విష్యద్యో విబుధశ్రేష్ఠం దేవం నారాయణం హరిమ్"** అనిచు తాత్పర్యచంద్రికలో దేశికులు దాహరించిన సూక్తి ఇచట స్మరణీయము – అని వ్యాఖ్యానాంతరము. **"రామో విగ్రహవాన్ ధర్మ ఇత్యుక్త ప్రకారేణ పితృవచనపరిపాలనశరణాగతసంరక్షణాదిసమస్తధర్మవ్యవస్థాపకో దాశరథి రభూః. తదుక్తం భగవద్గీతాయామ్ – యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే – ఇత్యాది"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"ఆస్తికశిక్షణార్థం స్వయం ధర్మాచరణేన ఆస్తికానాం ధర్మానుచరణశిక్షణార్థమ్. తదుక్తం భగవతా – యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ఇతి, తథా "ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం చేదహమ్ – ఇతి"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము



వసంతతిలక.

**101. వనగిరిపతి రీశితేతి దేవైః త్రిపురహరత్రిపురఘ్నచాపభంగాత్ ।**
**వ్యగణి పరశురామదర్శితస్య స్వకధనుషః పరిమర్శదర్శనాచ్చ ॥**

త్రిపురహర = త్రిపురములను దహించిన శివునియొక్క, త్రిపురఘ్న = ఆ త్రిపురములను భగ్నమొనర్చిన, చాపభంగాత్ = ధనస్సును భగ్నము చేయటవలన, పరశురామదర్శితస్య = పరశురామునిచే చూపబడిన, స్వకధనుషః = తన (విష్ణువుయొక్క) ధనస్సుయొక్క, పరిమర్శదర్శనాత్ + చ = ఎక్కుపెట్టుటను చూచుటచేతను, దైవాః = దేవతలచే, వనగిరిపతిః = తిరుమాలిరుమ్‌శోలై ప్రభువే, ఈశితా = అందఱిని పాలించువాడు, ఇతి = అని, వ్యగణి = లెక్కింపబడెను.

శ్రీరామావతారములో **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** అనుచు తన పరత్వమును మఱచి, మనుష్యభావనను తనలో ఆరోపించుకొన్నను, రెండు పనులద్వారా స్వామి పరత్వమును దేవతలు గ్రహించినట్లయినది – అనుచు ఇందు కూరేశులు పల్కుచున్నారు. శివధనుర్భంగము, పరశురామగర్వభంగము – అను రెండిటిని చూచి ఈ సుందరబాహుస్వామియే పరమాత్మ అనుటను దేవతలు రామావతారమున నిశ్చయించుకొనిరి – అని భావము. **"జృంభితం తద్ధను ర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః, అధికం మేనిరే విష్ణుం దేవాః సర్షిపురోగమాః"** అను వాల్మీకివచన మిచట స్మరణీయము.

**(త్రిపురహరత్రిపురఘ్నచాపభంగాత్)** – విశ్వకర్మ అను దేవశిల్పిద్వారా దేవతలు రెండు ధనుస్సులను నిర్మింపజేసి, వానిలో ఒక ధనుస్సును విష్ణువుకు, వేరొక ధనుస్సును శివునకు ఇచ్చి, ఇరువురకుమధ్య బలపరీక్షను ఏర్పాటుచేసిరి. ఆ పరీక్షలో శివుడు పరాజితుడగుటను చూచి దేవతలు, మునులును భగవానుని సర్వోత్కృష్టతను గ్రహించిరి –అను ఈ వృత్తాంతము బాలకాండమున కలదు. బంగారు, వెండి, ఇనుము –అను మూడులోహములతో నిర్మింపబడిన నగరములతో ముగ్గురు అసురులు యథేచ్ఛగా భూమిపై దిగుచు, సంచరించి లోకమును పీడించుటను చూచి, దేవతలు ఆ అసురులను వధింపవలసినదిగా శివుని ప్రార్థించిరి. 'మీకు ఈ సహాయమును చేసినచో నేను పొందు ఫలమేమి? నాకేమయిన ప్రతి ఫలము కల్గినచో మీకు సహాయము చేయుదును. నేను ఆశించు ఫల మేమి? అనగా – నేను పశువులకు అధిపతి కావలయును" అని శివుడు అనెను. అందులకు దేవతలు అంగీకరింపగా, శివుడు – "మీరు ప్రతిఒక్కరు నాకు సహాయము చేయవలెను" అని వేడెను. అపుడు బ్రహ్మ రథసారథిగా, భూమి రథముగా, మేరుపర్వతము ధనుస్సుగా, అగ్ని బాణముగా, విష్ణువు **"విష్ణుం తేజనమ్"** అనునట్లు ఆ బాణాగ్రముగా అయ్యిరి. ఇట్టి సాధనసంపత్తితో శివుడు త్రిపురాసురులను వధించెనను కథ వేదములోనే కలదు.

**"ఉపసంవాదాశంకయో శ్చ"** అను పాణినిసూత్రభాష్యమునందుకూడ కలదు. త్రిపురములను సంహరించిన శివుడు ఆ త్రిపురసంహారమును చేసినపుడు ఉపయోగించిన విల్లు కొంచెము విఱిగినది. దానిని శివుడు జనకకులమునకు చెందిన దేవరాతుడను ప్రభువునకు ఇవ్వగా, అది వంశపారంపర్యముగా జనకచక్రవర్తివరకు వచ్చినది. దానిని జనకుడు సీతాస్వయంవరశుల్కముగా చేసెను. శ్రీరాముడు **"హరధను రసౌ వల్లీభంజం బభంజ"** అనునట్లు అవలీలగా ఆ వింటిని విఱిచి, **"భవాన్ దృష్టవీర్యో౽సౌ"** అనునట్లు తన వీర్యమును ప్రస్ఫుటము కావించెను. దీనిని చూచి దేవతలు స్వామి పరత్వమును గ్రహించిరి – అని తాత్పర్యము. ఈ వృత్తాంతము అతిమానుషస్తవములోని **"యస్యాత్మతాం త్రిపురభంగవిధౌ"** ఇత్యాది శ్లోకమునను అనుసంధింపబడినది.

**(పరశురామదర్శితస్య స్వకధనుషః పరిమర్శదర్శనాచ్చ)** – శివధనుస్సునుగూర్చి పూర్వము వివరింపబడినది. విష్ణుధనుస్సును విష్ణువు ఋచీకుడను మునికి ఇవ్వగా, దానిని అతడు తన కుమారుడగు జమదగ్నికిని, అతడు తిరిగి తన పుత్రుడగు పరశురామునకు ఇచ్చిరి. శ్రీరాముడు సీతాదేవిని వివాహమాడి అయోధ్యానగరమునకు తిరిగి వచ్చునపుడు, దారిలో "నా వింటి బలిమిని చూచి పొమ్ము" అనుచు ఎదిర్చిన పరశురాముని చేతినుండి విష్ణుధనుస్సును గ్రహించి, సులభముగా వంచి, నారిని కూర్చి, బాణమును సంధించి, "ఈ బాణమునకు లక్ష్యమేమి? తెలుపుము" అని ప్రశ్నింపగా, పరశురాముడు అపుడు తన తపఃఫలము అంతటిని దానికి లక్ష్యము గావించెను. పరశురాముడు క్షత్రియకులమును నిర్మూలము చేసినను అతడు వేదవేత్త, తపోనిష్ఠుడును అగుటచే అతనిని వధింపకుండ, అతని తపస్సును హరించుటమాత్రముతో శ్రీరాముడు విడచిపెట్టెను అనునది ఇతిహాసకథనము. పరశురాముడు చూపినది వైష్ణవధనుస్సు అగుటచే **"స్వకధనుషః"** అని ప్రయోగింపబడినది. ఇట్లు ఈ రెండు సందర్భములవలన, దేవతలకు సువ్యక్తమైన పరమేశ్వరత్వమునుకల శ్రీరాముడే వనగిరిలో సుందరబాహువుగా వెలిసియున్నాడని శ్లోకభావము. పుష్పితాగ్రావృత్తము.

**102. అనవాప్త మత్ర కిల లిప్స్యతే జనైః న చ లబ్ధ మేత దిహ భోక్తు మిష్యతే ।**
**అనవాప్త మత్ర కిల నాస్తి రామ తద్ జగతీ త్వయా తృణ మవైక్షి సుందర ॥**

సుందర = సుందరబాహుస్వామీ! జనైః = జనులచే, అత్ర = ఈ భూమండలమున, అనవాప్తమ్ కిల = ఇంతవరకు పొందనిదానిని కదా, లిప్స్యతే = అభిలషింపబడుచున్నది, ఇహ = ఇచట, లబ్ధం ఏతత్ చ = లభించిన ఈ ఫలము, భోక్తుం = అనుభవించుటకు, న ఇష్యతే = అభిలషింపబడుటలేదు, రామ = శ్రీరాముడై, అవతరించిన స్వామీ!, అత్ర = ఈ ఫలములలో, అనవాప్తం = నీచే ఇంతవరకు పొందబడనిది, న అస్తి కిల = లేదుకదా!, తత్ = అందుచే, త్వయా = నీచే, జగతీ = ఈ కోసలసామ్రాజ్యము, తృణం = తృణముగా,



అవైక్షి = చూడబడినది.

మంథరమాటను విని వరములను అడిగిన కైకేయి వచనమును శ్రీరాముడు అనుసరించి, **"కళిఱొక్షిన్దు తేఱొక్షిన్దు మాఱొక్షిన్దు వనమే మేవి"** అనునట్లు సకలభోగములను విడచి, **"కువలయత్తుళ్ళక్కరియుమ్ పరియు మిరచ్చియము మెల్లా స్తుఅన్దు"** అని, **"కానకమే మిక విరుమ్బి"** అనునట్లు సామ్రాజ్యమును తృణప్రాయముగా పరిగణించి, వనవాసమునే **''వనవాసో మహోదయః''** అనునట్లు గొప్పగా తలచి పోవుటకు కారణము అవాప్తసమస్తకాముడవు అగుటచేతనే – అని తాత్పర్యము. లోకములో "ఈ ఫలమును నేను ఇంతవరకు అనుభవింపలేదు, ఇది నాకు కావలెను" అని తలచి అందఱు తాము అంతవరకు పొందిన దానిని పొందుటకు ప్రయత్నించెదరు. కాని భగవానుడు **"ఆప్తకామః , ఆత్తకామః, సత్యకామః, నానవాప్త మవాప్తవ్యమ్"** ఇత్యాదిగా వేదములలో, శ్రీగీతలో అవాప్తసమస్తకాముడుగా కీర్తింపబడినాడు. ఉభయవిభూతులకు స్వామి అగు అతడు ఇక పొందవలసినది ఏమున్నది? **"సర్వ మిద మభ్యాత్తః"** అనుచు శాండిల్యవిద్య భగవానుని కీర్తించినది. అందుచే అతడు "ఈ కోసల సామ్రాజ్యము నాకేపాటి? అని తలచి, దానిని తృణీకరించినాడు కాబోలు!

**(రామ! సుందర!)** పూర్వము శ్రీరామునిగా అవతరించిన సుందరబాహుస్వామీ!

**(జగతః అత్ర అనవాప్తమ్ కిల లప్స్యతే)** – ఈ లోకములోని మానవులందరు తమకు లభింపని ఫలమునేకదా పొందగోరుదురు.

**(న చ లబ్ధం ఏతత్ ఇహ భోక్తుమ్ ఇష్యతే)** – అనుభవించుటకు వీలుగా లభించిన వస్తువును ఎవరును పొందవలెనని కోరరు. సిద్ధమైన వస్తువు విషయమున పొందవలెనను ఆశకల్గు ప్రసక్తి లేదుకదా! కావున లభ్యముకాని వస్తువులోనే ఆశ ఉండుట, లభించిన వస్తువులో ఆశలేకుండుటయును – అనునది లోకస్వభావము. ఇక భగవానుని స్వభావమెట్లున్నది – అనగా –

**(అనవాప్తమ్ అత్ర కిల నాస్తి)** – అవాప్తసమస్తకాముడవని స్తుతింపబడు నీకు అనవాప్త మనునది ఏదియు లేదుకదా! అందుచే –

**(త్వయా జగతీ తృణమ్ అవైక్షి)** – **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్ కిన్ఱ వెమ్బెరుమాన్"** అనునట్లు ఉభయవిభూతులకును నాథుడవగు నీవు ఇక్ష్వాకు రాజ్యమును అత్యల్పముగా తలచితివి. కావుననే రాజ్యమును వీడి, వనమును కోఱితివి. భగవద్గీతలోని **"ఇద మద్య మయా లబ్ధమ్ ఇమం ప్రాప్స్యే మనోరథమ్, ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్"** (16–13) అను సూక్తిని అనుసరించి శ్లోకములోని పూర్వార్ధము కూర్చబడినది. ఇది అసురగుణము. కావున దీనిని విడువవలెనను సూక్ష్మాంశమును శ్రీరాముడు స్వయముగా ఆచరించి చూపెను" అనునది వ్యాఖ్యానాంతరము. **"ఉభయవిభూతినాయకస్య ఇక్ష్వాకురాజ్య మత్యల్పం ప్రత్యభాత్. ఇతరధా త్యాగాసంభవా**

**దితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఉభయవిభూతులతో పోల్చినపుడు ఇక్ష్వాకురాజ్యము తృణప్రాయముగా తోచుటచే భగవానుడు దానిని విడచి వనములకు వెడలెనని భావము. వృత్తము మంజుభాషిణి. **"మధురాభాషీ పూర్వభాషీ ప్రియంవదః"** ప్రశంసింపబడు శ్రీరాముని మంజుభాషిణీ వృత్తమున స్తుతించుట అత్యంతము ఉచితము.

**103. శిఖరిషు విపినేష్వప్యాపగాస్వచ్ఛతోయాసు**
**అనుభవసి రసజ్ఞో దండకారణ్యవాసాన్ ।**
**తదిహ తదనుభూతౌ సాభిలాషోఽద్య రామ**
**శ్రయసి వనగిరీంద్రం సుందరీభూయ భూయః ॥**

రామ = శ్రీరామచంద్రా!, రసజ్ఞః = పరమరసికుడవగు నీవు, శిఖరిషు = చిత్రకూటాది పర్వతములలో, విపినేషు + అపి = దట్టమైన అరణ్యములలో, అచ్ఛతోయాసు = స్వచ్ఛజలములను కల, ఆపగాసు = నదులలో, దండకారణ్యవాసాన్ = దండకారణ్యములో నివసించుటవలనకల్గిన అనుభవములను, అనుభవసి = అనుభవించితివి, తత్ = కావున, తత్ అనుభూతౌ = అట్టి పర్వత, కానన, నదీప్రాంతములలో తిరిగి ఆనందించుటయందు, సాభిలాషః = కోఱికను కలవాడవై, ఇహ = ఈ భూలోకములో, అద్య = ఈనాడు, భూయః = తిరిగి, సుందరీభూయ = సుందరబాహుస్వామివై, వనగిరీంద్రం = గొప్ప వనగిరిని, శ్రయసి = ఆశ్రయించుచున్నావు.

శ్రీరామావతారములో వనవాసమును చేసినపుడు కల్గిన ఆనందానుభూతిని మఱల పొందుటకై ఇట్లు ఇపుడు సుందరబాహుస్వామిగా వనగిరిని భగవానుడు ఆశ్రయించియున్నాడు కాబోలు! అనుచున్నారు కూరేశులు. స్వామీ! పదునాల్గు వర్షముల కాలము సీతాదేవితో, లక్ష్మణస్వామితో కలసి నీవు నివసించినపుడు చిత్రకూటము, ప్రస్రవణము, ఋష్యమూకము మొదలగు పర్వతములలో, తాటకావనము, దండకావనము, మధువనము మొదలగు వనములలో, మందాకిని, గోదావరి, పంపా మొదలగు నదులలో క్రీడించి ఆనందించితివి. అట్లే, తిరిగి క్రీడింపగోరి ఈ వనగిరిని ఆశ్రయించితివా! ఏమి!" అను గమ్యోత్ప్రేక్ష స్ఫురించునట్లు కూరేశులు పల్కిరి. చిత్రకూటాదిపర్వతముల స్థానమున ఈ వనగిరిని, దండకాదివనముల స్థానమున ఇచటనున్న వనసమూహమును, గంగానదుల స్థానమున నూపురగంగను గ్రహింపనగును.

**(శిఖరిషు)** – చిత్రకూటాదిపర్వతములందు –

**(విపినేషు)** – **"తే వనేన వనం గత్వా"** అనునట్లు వనములలో –

**(దండకారణ్యవాసాన్ అనుభవసి)** – **"చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్, రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః, దేవగంధర్వసంకాశా స్తత్ర తే న్యవసన్ సుఖమ్"** ఇత్యాదిగా అరణ్యవాసనసుఖమును అనుభవించితివి. ఇచట భూతకాల ప్రయోగమును చేయవలసిన సందర్భమున **"అనుభవసి"** అని వర్తమానకాల ప్రయోగమును చేయుట **"చిరనిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్"** అను సమాధివలన – అని చెప్పవచ్చును. శ్రీవత్సచిహ్నులగు కూరేశులు **"శ్రీవత్సచిహ్నో దృషేః"** అనునట్లు మహర్షికదా! దేశికులును గోపాలవింశతిలో **"నికటేషు నిశామయామి నిత్యం నిగమాంతై రధునాఽపి మృగ్యమాణమ్"** అనుచు యమళార్జునభంగసన్నివేశములోని శ్రీకృష్ణుని తాము నేరుగా దర్శించినట్లు పల్కిరి కదా!" – అని అణ్ణాస్వామి వ్యాఖ్య.



**(ఇహ భూయః తదనుభూతౌ సాభిలాష స్సన్)** – తిరిగి ఆ అనుభవములను పొందుటకై మనస్సును కలవాడవై – అని భావము. **"అలఙ్కారన్ మలై కులమలై కోలమలై కుళిర్ మామలై కొఱ్ఱమలై నిలమలై నీణ్డమలై తిరుమాలిరుమ్శోలైయదే"** (4-3-5) అను పెరియాళ్వార్ల సూక్తినిబట్టి ఇచటను వివిధపర్వతశిఖరములకు కొఱత లేదుకదా! **"వణ్శునైశూழ் మాలిరుమ్శోలై"** అని, **"శన్దొడు మణియుమ్ అణిమయిల్ తழైయుమ్ తழువి వన్దరువికళ్ నిరన్దు వన్దిழி శారల్ మాలిరుమ్శోలై"** అని, **"అయిరమాఱుకళుమ్ శునైకళ్ పలవాయిరముమ్ అయిరమ్ పూమ్ పొழిలుముడై మాలిరుమ్శోలైయదే"** అనియుగల సూక్తులనుబట్టి వనములకు లోపము లేదు. **"శిలమ్బాఱు పాయుమ్ తెన్ తిరుమాలిరుమ్శోలై"** ఇత్యాది సూక్తులనుబట్టి నదీప్రాంతములకు కొఱతలేదు – అని వ్యాఖ్యానాంతరము. **"సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమోగిరిః, యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే – ఇత్యుక్తచిత్రకూటసదృశో వనశైల ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము మాలిని.

**104. ఉపవనతరుషండైః మండితే గండశైల –**
**ప్రణయభవదుదంతోద్గాయిగంధర్వసిద్ధే ।**
**వనగిరితటభూమిప్రస్తరే సుందర త్వం**
**భజసి ను మృగయానానుద్రువశ్రాంతిశాంతిమ్ ॥**

సుందర = సుందరబాహుస్వామీ! ఉపవన = ఉద్యానవనములోని, తరుషండైః = వృక్షసమూహములతో, మండితే = అలంకరింపబడిన, గండశైలప్రణయి = పర్వతపాదభాగములోని శిలలపై (వేంచేసియుండుటలో) ఆసక్తినికలవాడవగు, భవదుదంతోద్గాయి = నీ చరిత్రలను గానముచేయుటనే భోగ్యముగా తలచువారగు, గంధర్వసిద్ధే = గంధర్వులతో, సిద్ధులతో నిండినదగు, వనగిరి = తిరుమాలిరుమ్శోలైగిరిలోని,

తటభూమి = చరియలలోగల, ప్రస్తరే = పెద్దరాళ్ళయందు, మృగయాన = మారీచునివంటి మృగముల గమనమును, అనుద్రవ = అనుసరించుటలో కల్గిన, శ్రాంతి = అలసటయొక్క, శాంతిం = శాంతిని, త్వం = నీవు, భజసి ను = పొందుచున్నావా ఏమి?

పూర్వశ్లోకములో అనుగ్రహించిన అర్థమునే కూరేశులు ఇందు మఱల కొంచెము వ్యత్యాసముతో పరిష్కరించి, అనుగ్రహించుచున్నారు. దండకారణ్యవాసములో నీకు శ్రమ కలిగినది. ఆ శ్రమ తీరుటకు ఈ క్షేత్రములోని కొండలో వాసమును కోఱుచుంటివి కాబోలు స్వామీ! అనునది ఈ శ్లోకభావము.

**(మృగయానానుద్రవశ్రాంతిశాంతిం వనగిరితటభూమిప్రస్తరే భజసి ను)** – పూర్వము పంచవటిలో మారీచమాయామృగమును వెంబడించినందువలన కల్గిన శ్రమ తీర్చుకొనుటకై తిరుమాలిరుమ్‌శోలై పర్వతము చఱియలలోని పెద్దశిలను ఇట్లు ఆశ్రయించితివి కాబోలు – అని భావము. ఈ కొండచఱియ రెండు విశేషణములతో వర్ణింపబడుచున్నది. **"దశగ్రీవస్తంబేరమదలనదుర్దాంతహృదయే విహారస్వాచ్ఛంద్యాత్ విశతి రఘుసింహే వనభువమ్"** అనుచు పాదుకాసహస్రములో అనుగ్రహించినట్లు రావణుడుకూడ ఒక మృగమే. **"యాతుధానచ్ఛలమృగః"** అని 106వ శ్లోకములో కూరేశులు పల్కిరికదా! వేటాడుటవంటిదే అతనిని సంహరించుట అను భావము. స్ఫురించునట్లు **"మృగయానుద్రవ"** అని పల్కిరి" – అని వ్యాఖ్యానాంతరము. కాని ఈ అర్థమిచట పొసగదు అనుటను 106వ శ్లోకవ్యాఖ్యను బట్టి గమనింపనగును.

**(ఉపవనతరుషండై ర్మండితే)** – **"అయిరమాఱుకళుమ్ శునైకళ్ పలవాయిరముమ్ అయిరమ్ పూమ్పొఴిలుముడై మాలిరుమ్‌శోలైయదే"** అనునట్లు ఉపవనములచే భూషితమైనది ఈ పర్వతము.

**(గండశైలప్రణయిభవదుదంతోద్గాయిగంధర్వసిద్ధే)** – గంధర్వులు, సిద్ధులను గండశిలలపై ఆసీనులై, భగవానుని దివ్యచరిత్రలను ఉచ్చైఃస్వరములతో గానముచేయుదురు. **"సిద్ధగంధర్వయక్షా శ్చ తత స్త్వాం శరణం గతాః"** అని శ్రీరామాయణములో తెలుపబడినట్లు – నీవు రాముడవై అవతరించి, రావణసంహారమును చేయవలెనని శరణాగతిని చేసినవారిలో ప్రథములు సిద్ధులు, గంధర్వులును, వారు నీ అపదానములను గానముచేయుదురు. దానిని నీవు విని ఆనందింతువు. కుంభకోణక్షేత్రములోనిస్వామి శయనించియుండుటకు తిరుమఴిశైప్పిరాన్ పలుకీతులలో – **"నడన్ద కాల్‌కళ్ నొన్దవో నడుఙ్గు ఞాల మేనమాయ్ ఇడన్ద మెయ్ కులుఙ్గవో"** అనుచు హేతువులను రమ్యముగ ఉత్ప్రేక్షించిరి. అట్లే, తిరువళ్ళూరులో పరుండియుండుట ఎందులకు? అను ప్రశ్నకు తిరుమఙ్గైమన్నన్ దుర్యోధనునివద్దకు దూతగా పోయినందులకేననుచు – **"పిన్నోర్ తూతన్ అది మన్నర్‌క్కాకి పెరునిలత్తార్ ఇన్నార్‌తూతనెన నిన్ఱాన్ ఎవ్వుళ్ కిడన్దానే"** అని పల్కిరి. ఆ రీతిలో కూరేశులు



ఇచట రామావతారవృత్తాంతమును ఆధారముగా గొని వనాద్రిలో స్వామి నిత్యవాసమును చేయుటకొక హేతువును ఉత్ప్రేక్షించిరి – అని వ్యాఖ్యానాంతరము. శ్లోకములోని **"ను"** అను శబ్దము ఇట్టి ఉత్ప్రేక్షను సూచించుచున్నది. **"దండకారణ్యవాసేఽపి క్వచిత్ క్లేశవిశేషస్య సత్త్వాత్ తాదృశశ్రమహరో వనగిరి రేవ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఇంచుమించుగా ఈ శ్లోకభావము **"రఘుకులతిలక"** అను (106) శ్లోకమునందును అనుసంధింపబడినది. వృత్తము మాలిని. పూర్వము దండకారణ్యము బాధింపగా, ఈ గిరివనము శ్రమను కలుగజేయకుండ, హాయిని గొల్పుచున్నదనుటచే, దానికంటె ఇది మేలు అను వ్యతిరేకాలంకారము కలదు.

**105. కూలేఽబ్ధేః కిల దక్షిణస్య నివసన్ దూరోత్తరాంభోధిగాన్**
**దైత్యా నేకపతత్త్రిణాఽచ్ఛిన ఇతీయం కింవదంతీ శ్రుతా ।**
**తత్రైవేశ్వర మంభసాం వ్యజయథా స్తస్మా ద్వనాద్రీశ్వర**
**శ్రీమన్! సుందర! సేతుబంధనాముఖాః క్రీడా స్తవాఽడంబరమ్ ॥**

వనాద్రీశ్వర = తిరుమాలిరుమ్‌శోలై ప్రభూ! శ్రీమన్ సుందర = లక్ష్మిని కలవాడా! (**"ఏఴుతిరువుడైయాన్"** అని కీర్తింపబడువాడా), సుందరబాహుస్వామీ! దక్షిణస్య అబ్ధేః = దక్షిణసముద్రముయొక్క, కూలే = ఉత్తరతీరములో, నివసన్ = నివసించువాడవై, దూరోత్తర +అంభోధిగాన్ = చాలా దూరములోనున్న ఉత్తర సముద్రములోనుండు, దైత్యాన్ = అసురులను, ఏకపతత్రిణా = ఒకే బాణముతో, అచ్ఛినః = ఖండించితివి, ఇతి ఇయమ్ = అని ప్రసిద్ధమైన ఈ, కింవదంతీ = జనశ్రుతి, శ్రుతా = వినబడినది, తత్ర ఏవ = ఆ దక్షిణసముద్రములోనే, అంభసామ్ ఈశ్వరమ్ = జలాధిపతియగు వరుణుని, వ్యజయథాః = జయించితివి, తస్మాత్ = ఆకారణమువలన, తవ = నీయొక్క, సేతుబంధనముఖాః = ఆనకట్ట కట్టుట మొదలగు, క్రీడాః = క్రీడలు, ఆడంబరమ్ = కీర్తిని కోఱి చేయునవియే, కిల = కదా!

శ్రీరాముడు **"సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి"** అను విభీషణ వచనమునందలి నమ్మకముతో సముద్రుని ఉద్దేశించి శరణాగతిచేసెను. కాని, సముద్రుడు అనుకూలుడు కాలేదు. అందులకై కోపించిన స్వామి లక్ష్మణుని చూచి – **"చాప మానయ సౌమిత్రే! శరాం శ్చాశీవిషోపమాన్, సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః"** అనుచు శరసంధానము చేసెను. అంత సముద్రుడు భీతిల్లి, గడగడవణకుచు పరుగెత్తివచ్చి స్వామిని శరణువేడెను. శ్రీరాముడు అతనిని చూచి, "నేను సంధించిన బాణము నిష్ఫలము కారాదు. దానికి ఏదైనను లక్ష్యమును చూపుము'' అనగానే వరుణుడు ఉత్తర సముద్రదీరములోని ద్రుమకుల్యమను దీవిలో తనకు అసురవిరోధులున్నట్లు తెలిపి, వారిపై బాణమును ప్రయోగింపుమని స్వామిని వేడెను. శ్రీరాముడును అట్లే చేసెను. ఆ అసురులు

అఖక్షణములో నశించిరి – అను ఈ వృత్తాంతము శ్రీరామాయణము యుద్ధకాండములోని 22వ సర్గలో కలదు. ఈ వధ సముద్రము ఉత్తరతీరము జరిగినది. దక్షిణతీరమున స్వామి తానున్నచోటనే సముద్రుని జయించినట్లున్నది. వీనివలన భగవానుని సత్యకామత్వ – సత్యసంకల్పత్వములు వ్యక్తములగుచున్నవి. ఇట్టి గొప్పమహిమ ఉన్నపుడు ఉన్నచోటునుండియే రావణుని శిరస్సులను ఖండించి, లంకను భస్మముచేయలేని అశక్తి స్వామికిలేదుకదా! ఇందులకై అంతప్రయాస పడవలసిన అవసరమును లేదు. అట్లయినను, సముద్రముపై వారధిని కట్టి, లంకను చేరి, అచట పలు శ్రమలను పొంది, అగస్త్యమహర్షిచే ఆదిత్యహృదయమును ఉపదేశముగా పొంది, చివరకు రావణుని వధించుట – మొదలగు ఈ ప్రయాసలు అన్నియు ఎందులకు? అను ప్రశ్న ఇచట కలుగును. అతిమానుషస్తవములో కూరేశులు ఈ ప్రశ్నను – **"త్వం దక్షిణస్య నివసన్"** ఇత్యాది శ్లోకములో లేవనెత్తిరి. దానికి ఒక విధమైన సమాధానమును ఇందు అనుగ్రహించిరి – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. ఆ సమాధానమేమి? అనగా – **"సేతుబంధనముఖాః క్రీడా స్తవాడంబరమ్"** అనునదియే.

**(తస్మాత్)** – అనగా – మనుష్యత్వమునందును పరత్వము స్ఫుటమగు మహిమను సంపూర్ణముగా కల్గియుండుటవలన – అని అర్థము. అచ్చటనే సముద్రతీరముననే ఉండి, ఒకేఒక్క బాణమును ప్రయోగించి రావణుని తలను ఖండించ శక్తుడవైయుండగా, అట్లు చేయకుండ – **(సేతుబంధనముఖాః తవ క్రీడాః) "కురక్కినత్తాలే కుఱై కడల్తన్నై నెరుక్కి యణైకట్టి"** అనునట్లు సేతువును నిర్మించుట మున్నగు నీ క్రీడలన్నియు – ఎందులకు! అన్నచో –

**(ఆడంబరమ్)** – రావణుని ఎట్లయినను వధించియే తీరవలెను అను తలపు నీకున్నచో, అట్లు చేసియుండవచ్చును. **"యది వా రావణ స్స్వయమ్"** అని పల్కిన నీకు అట్టి భావన ఉండుటకు అవకాశము లేదుకదా! ఎట్లయినను వానిని అభిముఖుని కావించుకొనవలెను అనియే నీ ఆలోచన. కావున అందులకు అతనికి అవకాశమును ఇచ్చు తీరులో వీనినన్నటిని ఆడంబరముగా చేసితివి, అంతియే సుమా! – అని తాత్పర్యము. ఆడంబరశబ్దము పుంలింగములోనే కలదు. కావున **"క్రీడాస్తవాడంబరాః"** అనియే ఉండవలెను. కాని **"ఆడంబరమ్"** అను నపుంసకలింగపాఠమే కానవచ్చుచున్నది. – అని శ్రీ అణ్ణాస్వామివారి వివరణము. **"ఆడంబరో డంబరోఽస్త్రీ"** అను నిఘంటువచనమునుబట్టి నపుంసకలింగ రూపమును యుక్తమే – అని వ్యాఖ్యానాంతరము. **"బహుదేశవ్యవహితోదీచ్యసముద్రద్వీపస్థ దైత్యస్తోమ మేకసాయకేన జితవత స్తవ తత్ర స్థిత్యైవ లంకాద్వీపస్థరక్షస్సంశిక్షణే సుశకే, సాగరపరాజయపూర్వకసేతునిర్మాణప్రభృతినర్మవిచేష్టితాని ఖ్యాత్యర్థకానీతి నిష్కృష్టార్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.



**106. రఘుకులతిలక స్త్వం జాతుచి ద్యాతుధాన –**
**చ్ఛలమృగమృగయాయాం సంప్రసక్తః పురాఽభూః ।**
**తదుపజనితఖేదచ్ఛేదనాయాఽద్య గాయ**
**న్మధుకరతరుషండం రజ్యసే కిం వనాద్రిమ్ ॥**

రఘుకులతిలక = రఘువంశమునకు తిలకమువంటి రామచంద్రా! పురా త్వమ్ = పూర్వము నీవు, జాతుచిత్ = ఒకానొక సమయమున, యాతుధాన = రావణాదిరాక్షసులనెడి, ఛ్ఛలమృగ = మాయామృగములయొక్క మృగయాయామ్ = వేటలో, సంప్రసక్తః = మిక్కిలి ఆసక్తిని కలవాడవు, అభూః = అయితివి, తదుపజనిత = దానివలనకల్గిన, ( ఆ వేటవలన) కల్గిన) ఖేదచ్ఛేదనాయ = శ్రమను తీర్చుకొనుకై, అద్య = ఇపుడు, గాయన్మధుకర = గానముచేయు తుమ్మెదలనుకల, తరుషండం = వృక్షసమూహమునుకల, వనాద్రిం = తిరుమాలిరుమ్‌శోలైపరత్వమనందు, కిం రజ్యసే = అభినివేశమును కలవాడవైతివా! ఏమి!

ఈ శ్లోకముతో శ్రీరామావతార వృత్తాంతానుసంధానము ముగియుచున్నది. ఇంతకు ముందు **"ఉపవనతరుషండైః"** అను (104) శ్లోకములో మారీచమాయామృగమును వెంబడించిన శ్రమ తీరుటకా నీవు వనాద్రిలో విశ్రమించితివి! అనిరి. ఆ ఒక్క శ్రమమాత్రమేనా నీకు! రాక్షసులను అందఱిని వేటాడినందువలన కల్గిన శ్రమ బహుగుణీకృతముగానుండునే! అది తీరుటకొఱకుగానా ఈ క్షేత్రములో నీవు వేంచేసియుండుట! – అనెడి ఉత్ప్రేక్ష ఇందలి విషయము. **(పురా జాతుచిత్ త్వం యాతుధానచ్ఛలమృగమృగయాయాం సంప్రసక్తః అభూః)** – పూర్వమొకానొక సమయమున నీవు రావణాదిరాక్షసులనెడి మృగములను వేటాడుటలో ఆసక్తుడవైతివి కదా! ఆ శ్రమము తీరుటకై – **(గాయన్మధుకరతరుషండం వనాద్రిమ్ అద్య రజ్యసే కిమ్)** – **"పాణ్డకు వణ్డినఙ్గళ్ పణ్గళ్ పాడి మదుప్పరుక"** అని పెరియాళ్వార్లు పల్కినట్లు, **"వణ్డినమురలుమ్ శోలై"** అని భక్తాంఘ్రిరేణుసూరి నుడివినట్లును తుమ్మెదలు ఝుంకారములను చేయు తోటలతోకూడిన వనాద్రిలో ఇపుడు అభినివిష్టుడవైతివా ఏమి! స్వామీ! – అని భావము

**"యాతుధానచ్ఛలమృగ"** – అనుటకు – మారీచమాయామృగమును అని కొందఱు చెప్పు అర్థము కవి వివక్షితము కాదు. ఆ అర్థము పూర్వోక్తమే కదా! శ్రీరామాయణకథను అనుగతముగా అనుసంధించుచు వచ్చు ఈ సందర్భమున పూర్వశ్లోకమున వారిధినిర్మాణము ప్రస్తుతమగుటచే, దానికి అనంతరము లంకలో ప్రవృత్తమైన రాక్షసుల వేటయే ఇచట ప్రస్తుత మనదగును. ప్రభువులు దుష్టమృగమును వేటాడునట్లు, భగవానుడును దుష్టరాక్షసులనెడి మృగములను వధించెనని భావము. ఇందుచే **"పొల్లావరక్కనై క్కిళ్ళి క్కళైన్దానై"** అను రీతిలో అనాయాసముగా రాక్షససంహారము చేసెనని తెలుపబడినది – అని శ్రీ

అణ్ణాస్వామివారి వ్యాఖ్యానము. **"తాదృశో వనశైలభోగ్యతాతిశయ ఇత్యాశయః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. ఈ అర్థము పూర్వమే ప్రస్తుతమైనను, తిరిగి దానిని ప్రస్తావించుట ఈ క్షేత్రముయొక్క భోగ్యతాతిశయమును సూచించును. ఇట్టి అర్థసాదృశ్యమును **"సంవాదో హ్యన్యసాదృశ్య"** మనుచు అలంకారికులును సమ్మతించిరి. కావున ఇచట పునరుక్తి దోషప్రసక్తి లేదు. వృత్తము మాలిని.

**107. హే సుందరైకతరజన్మని కృష్ణభావే ద్వే మాతరౌ చ పితరౌ చ కులే అపి ద్వే।**
**ఏకక్షణా దనుగృహీతవతః ఫలం తే నీళా కులేన సదృశీ తవ రుక్మిణీ చ ॥**

హే సుందర = ఓ సుందరబాహుస్వామీ! కృష్ణభావే = కృష్ణునిగా (నీవు నిన్ను) భావించిన, ఏకతరజన్మని = ఒక అవతారమునందు, తే = నీకు, ద్వే మాతరౌ = దేవకీదేవి, యశోదాదేవి అను ఇద్దఱు తల్లులు, పితరౌ చ = తండ్రులు కూడ (వసుదేవుడు, నందగోపాలుడు – అని ఇద్దఱు), కులే అపి = కులములును, ద్వే = (యాదవ, గోపాలరూపమున) రెండు, ఏకక్షణాత్ = ఒకే క్షణమున, అనుగృహీతవతః = అంగీకరించిన, తే = నీకు, ఫలం = ఫలము, కులేన సదృశీ = (గోపాల, యాదవ) కులమునకు తగిన, నీళా = నీళాదేవి, రుక్మిణీ చ = రుక్మిణియును కదా!

పూర్వము ఏడు శ్లోకములో రామావతారమును స్తుతించిన కూరేశులు ఈ శ్లోకమునుండి వరుసగా పదిశ్లోకములలో శ్రీకృష్ణావతారవైభవమును కీర్తించుచు సుందరబాహుస్వామికి, శ్రీకృష్ణునకు మధ్య అభేదమును స్థిరీకరించుచున్నారు. శ్రీకృష్ణావతారమున ఒకే క్షణములో తల్లులు ఇద్దఱు, తండ్రులు ఇద్దఱు, కులములును రెండు అనునది ఎందులకు? అనినచో, రెండు కులములకు తగినట్లు పత్నులను ఇద్దఱిని పరిగ్రహించుటకొఱకే కాబోలు! అని చమత్కారముగా పల్కుట ఇందలి విశేషము.

**(ఏకతరజన్మని కృష్ణభావే)** కృష్ణుడై అవతరించిన ఒక అవతారములో –

**(ద్వౌ మాతరౌ పితరౌ చ కులే ద్వౌ అపి చ)** – తల్లులు ఇద్దఱు, తండ్రులు ఇద్దఱు, కులములు రెండును – అనగా – దేవకీ యశోదలని తల్లులు ఇద్దఱు. వసుదేవ, నందగోపులని తండ్రులు ఇద్దఱు, యదుకుల, గోపాలకులములని రెండు కులములు. కావున అన్నియును రెండే.

**(ఏకక్షణా దనుగృహీతవతః ద్వౌ ఫలమ్)** – **"ఒరుత్తిమకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్ ఒరుత్తి మకనాయ్"** అనునట్లు స్వల్పకాలములోనే పరిగ్రహించుటలో నీకు ఉద్దేశ్యమేమి? అంటివా? ఆ రహస్యము బట్టబయలు అయినదిలే! చెప్పెదను వినుము.

**(కులేన సదృశీ నీళా చ రుక్మిణీ చ కిల)** – గోపాలకులమునకు తగినట్లు నీళాదేవిని, క్షత్రియకులమునకు తగినట్లు రుక్మిణీదేవిని పత్నులుగా గ్రహించుటకొఱకుకదా! – అని తాత్పర్యము.



తిరుమళిశైప్పిరాన్ తిరుచ్చన్దవిరుత్త ప్రబంధములో **"ఆయనాకి ఆయర్ మజ్గై వేయతోళ్ విరుమ్బినాయ్"** అని అనుగ్రహించిన పాశురమును బీజముగాగొని కూరేశులు శ్లోకమును కూర్చిరి. శ్రీకృష్ణుడు నందగోపాలునకు పుత్రునిగా పెరుగదలచినపుడే, శ్రీదేవి భూదేవులతో సమానమైన నీళాదేవి తానుకూడ గోకులములో యశోదాదేవికి సహోదరుడగు కుంభుని కుమార్తెగా జన్మించినది. నీళా అను పేరుతో ఆమె వ్యవహరింపబడెడిది. ఆమె తండ్రి ఎవరికిని లొంగని, అసురావేశమును కల్గియున్న ఏడు వృషభములను కన్యాశుల్కముగా నిర్ణయించి, వాని పొగరు అణచినవానికే నాకుమార్తె నిచ్చి వివాహము చేసెదనని నిశ్చయించి, తన నిర్ణయము ప్రకటించెను. అపుడు శ్రీకృష్ణుడు ఆ ఏడు ఎద్దుల పొగరును అణచి, వానిని వశీకరించుకొని, నీళాదేవిని వివాహము చేసికొనెను. ఈ వృత్తాంతము శ్రీవిష్ణుపురాణ, శ్రీభాగవతాదులలో కన్పింపదు. "యాదవాభ్యుదయములోని నాల్గవసర్గలో **"దిశా గజానా మివ శాక్వరాణామ్"** అను శ్లోకమున ఈ కథాప్రస్తావము కలదు. ఆ సందర్భమున వ్యాఖ్యానించుచు అప్పయ్య దీక్షితులు పై వృత్తాంతము హరివంశములో నున్నదని ప్రమాణపూర్వకముగా ఉదాహరించిరి." అని వ్యాఖ్యానాతరము ఆళ్వార్ల ప్రబంధములో రుక్మిణీ ప్రస్తావము చాల కొద్ది సందర్భములోనే కలదు. నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళిలో ఒక చోట, పెరియాళ్వార్ తిరుమొళిలో రెండుచోట్ల మాత్రమే కలదు. కాని నప్పినైప్పిరాట్టి ప్రస్తావమున్న సందర్భములు అనేకములు. **"కులవాయర్ కొళున్దు"** అనుచు నమ్మాళ్వార్లు విశేషించి పల్కినది గోపాలకులములో ఆవిర్భవించిన ఈ దివ్యమహిషిని గూర్చియే. "పరిపాడల్" అను ప్రాచీన ద్రావిడ గ్రంథము నుండి కనిపించు ఈ దేవేరిని గూర్చిన సాహిత్యవిమర్శకుల అద్భుతములైన పలు అభిప్రాయములు ఇచట ప్రస్తుతించిన విస్తృతి అగునను భీతిలో ప్రస్తుతించుట లేదు.

పాలసముద్రమును చిలికినపుడు అందుండి ముందుగా ఆవిర్భవించిన జ్యేష్ఠాదేవి **"మున్నై"** అని, చివరగా ఆవిర్భవించిన లక్ష్మీదేవి **"పిన్నై"** అనియు సంఘవాఙ్మయమున నిర్దేశింపబడిరి. నప్పిన్నై నీళాదేవి అవతారమైనను **"తిరువుమ్ నిఱల్‌పోల్‌వనర్"** అనునట్లు లక్ష్మీ సమానురాలు కావున. **"నల్ పిన్నై"** అర్థమున **"నప్పిన్నై"** అను పేరు ఏర్పడినది – అని వ్యాఖ్యానాంతరము. **"క్షత్రియకులసదృశీ రుక్మిణీ, గోపాలకులసదృశీ నీళా మాతృపితృ కులద్వయపరిగ్రహః భిన్నాన్వయజపత్నీద్వయపరిగ్రహార్థ మిత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**108. త్వం హి సుందర యదా స్తనంధయః పూతనాస్తన మధా స్తదా ను కిమ్।**
**జీర్ణ మేవ జఠరే పయోవిషం దుర్జరం వద తదాత్మనా సహ ॥**

సుందర = సుందరబాహుస్వామీ! త్వం = నీవు, యదా = ఎపుడు, స్తనంధయః

= తల్లిపాలను తాగువయస్సులో నున్నవాడవై, పూతనాస్తనమ్ = పూతన అను రాక్షసిస్తనమును, అధాః హి = తాగితివి కదా, తదా = అపుడు, దుర్జరం = ఎవరివలనను జీర్ణము చేసికొనుటకు సాధ్యము కాని, పయోవిషమ్ = చనుబాలు రూపముననున్న విషము, తదాత్మనా సహ = ఆ పూతన ప్రాణముతోపాటు, జఠరే = నీ ఉదరమున, జీర్ణమ్ ఏవ ను కిమ్ = జీర్ణమై పోయెనా ఏమి? వద = పల్కుము.

శ్రీకృష్ణుడు యశోదాదేవి స్తన్యమును తాగువాడగుటమాత్రమే కాక, పూతనాస్తనంధయుడయిన అద్భుతసన్నివేశమును స్మరించుచు కూరేశులు ఇచట దానిని ప్రస్తుతించుచున్నారు. ఉత్తరమధురలోగల వసుదేవగృహములో అవతరించిన కృష్ణుడు రేపల్లెలో **"ఒళిత్తు వళర"** అనునట్లు రహస్యముగా పెరుగుచుండగా, భగవానుని అస్తిత్వమును సహింపలేని పరమనీచుడగు కంసుడు ఏ విధముగానైనను కృష్ణుని చంపినగాని తనకు జీవితాశ లేదని తలచి, అందులకై అసురులను గోకులమునకు పంపుటయే తప్ప వేరు పనిని లేనివాడయ్యెను. అతని అజ్ఞపై పూతన అను రక్కసి యశోదాదేవి రూపమున **"వఞ్జనైచ్చెయ్య త్తాయురువాకి వన్ద పేయ్"** అనునట్లు అర్ధరాత్రివేళ రేపల్లెకు వచ్చి, అచట నిద్రించు కృష్ణుని ఎత్తుకొని, విషము పూసిన తన స్తన్యమును ఇచ్చి, చంపవలెనని ప్రయత్నింపగా, కృష్ణుడును ఆమె స్తన్యమును తాగునట్టి భావనతో ఆమె ప్రాణములనుకూడ హరించెను. **"స్తన్యం తద్విషసమ్మిశ్రం రస్య మాసీ జ్జగద్గురోః"** అను రీతిలో ఆమె స్తనములో పూసిన విషమును సైతము అమృతముగా భుజించి ఆమెను చంపెనని పూతనావధకథ. ఈ వృత్తాంతమును పేర్కొనుచు కూరేశులు ఒక రస్యమైన ప్రశ్నను స్వామిని ఉద్దేశించి సంధించుట ఇందలి విషయము.

**(హే సుందర! త్వం యదా స్తనంధయ స్సన్ పూతనాస్తనమ్ ఆధాః)** వనగిరిప్రభూ! సుందరబాహుస్వామీ! పూర్వము శ్రీకృష్ణునిగా అవతరించిన నీవు ఎపుడు స్తనంధయశిశువువై పూతనాస్తన్యమును త్రాగదలచితివో –

**(తదా దుర్జరం పయోవిషం తదాత్మనా సహ జఠరే జీర్ణమేవ కిమ్ వద)** – అపుడు ఇతరులచే జీర్ణము చేసికొనుటకు సాధ్యముకాని స్తన్యవిషము ఆమె ప్రాణములతో పాటు నీ ఉదరములో జీర్ణమైనదా ఏమి! దీనిని నీవే వివరింపవలెను.

పూతన ఇచ్చిన విషమే ఇతరుల నోటిలోనికి పోయినచో, వారు మరణించుట తథ్యము. ఇంకెవరిచేతను జీర్ణము చేసికొనుటకు సాధ్యముకాదు కదా! అది నీకు జీర్ణము అగుటయే కాక, ఆమె ప్రాణములుకూడ జీర్ణమైనవే? ఇది ఏమి ఆశ్చర్యము! అను ఈ ప్రశ్నద్వారా శైశవమందుకూడ స్వామి తన పరత్వమును ఏ కొఅత లేకుండ ప్రదర్శించిన మహిమ వ్యక్తమగుచున్నదని తెలుపబడినది. ఈ వృత్తాంతమునుగూర్చి ఒక కవి **"విష మప్యమృతం క్వచి ద్భవేత్ అమృతం వా విష మీశ్వరేచ్ఛయా"** అనుచు భగవదిచ్ఛవలన



విషమే అమృతమగునెను. విషము తాగినవాడు ఆ విషమును జీర్ణము చేసికొనెను. విషమును ఇచ్చినవారు మాత్రము మరణించిరి – అని అనుటవలన ఇచట విషమాలంకారము ధ్వనించున్నదని – వ్యాఖ్యానాంతరము. ఈ పూతనాస్తన్యవిషపానవృత్తాంతమును స్మరించినవారికి తిరిగి తల్లిపాలు తాగు అవకాశమే ఉండదనుచు పరమరహస్యముగా దేశికులు సాయించిన ఈ శ్లోకము పరమాద్భుతము – **"స్తన్యేన కృష్ణః సహ పూతనాయాః ప్రాణాన్ పపౌ లుప్తపునర్భవాయాః, యదద్భుతం భావయతాం జనానాం స్తనంధయత్వం న పున ర్బభూవ"**. వృత్తము రథోద్ధత.

**109. ఆశ్రితేషు సులభో భవన్ భవాన్ మర్త్యతాం యది జగామ సుందర ।**
**అస్తు నామ తదులూఖలే కియ ద్దామబద్ధ ఇతి కిం తదాఽరుదః ॥**

సుందర = సుందరబాహుస్వామీ! ఆశ్రితేషు = నిన్ను ఆశ్రయించినవారియందు, సులభః = సులభుడవుగా, భవన్ = ఉన్నవాడవై, భవాన్ = నీవు, మర్త్యతాం = మానవుడవైయుండు స్థితిని, యది జగామ = పొందినవాడవైనచో, తత్ అస్తు నామ = అది ఉండనిమ్ము, తదా = నీవు, ఆ మానవుడవైయున్నపుడు వెన్నను దొంగిలించిన సమయమున, ఉలూఖలే = రోటికి, కియత్ = ఎంతగా, దామ = దారములతో, బద్ధః = బంధింపబడితివి, ఇతి = అని, అరుదః = ఏడ్చితివి, కిమ్ = ఇది ఏమి?

శ్రీకృష్ణుని సౌలభ్యపరాకాష్ఠలో అభినివిష్టచిత్తులైన కూరేశులు తమ అనుభవమునకు ద్రవించుచు పల్కుచున్నారు. "ఓ సుందరబాహుస్వామీ! నీవు ఆశ్రితసౌలభ్యముతో అంతర్యామిరూపమును చక్షుర్విషయముగా చేసి, **"తుయరిల్ మలియుమ్ మనిశర్ పిఱవియల్ తోన్రి క్కణ్ కాణవన్దు"** అనునట్లు మనుష్యసజాతీయుడవై అవతరించుటలో ఆశ్చర్యములేదు. **"ఒళియా వెణ్ణె యుణ్డా నెన్రు ఉరలోడాయ్చ్చి యొణ్కయిఱ్ఱాల్ విళియావాక్క ఆప్పుణ్డు విమ్మి యழுదాన్"** అనియు, **"ఎழில் కొళ్ తామ్బుకొణ్డడిప్పదఱ్కు ఎళ్కునిలైయుమ్ వెణ్తయిర్ తోయ్న్ద శెవ్వాయుమ్, అழுకైయుమ్ అఞ్జినోక్కు మన్నోక్కుమ్ అణికళ్ శెఞ్జిఱువాయ్ తుడిప్పదువుమ్"** అనియును పల్కురీతిలో **"కణ్ణినుణ్శిఱుత్తామ్బు"** అనునట్లు ముదులతోకూడిన సన్నని దారముతో రోటికి కట్టబడి, వెక్కివెక్కి ఏడ్చుట ఎందులకొఅకు? ఈ గుణము ఏ ప్రకారమునకు చెందినది స్వామీ!" – అని ఇందు భగవానుని కూరేశులు హార్దముగా ప్రశ్నించుచున్నారు – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్యానావతారిక. **"మత్తుఱు కడైవెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుణ్డు ఎత్తిఱమ్ ఉరలినోడు ఇణైన్దిరున్దేఙ్గియ వెళివే"** అనుచు ఆళ్వార్లు పల్కినట్లు **"దామోదరం బంధగతమ్ః"** అనునట్లు సంసారబద్ధులు దామబద్ధుడగు స్వామిని స్మరించినచో వారు తమబంధములనుండి విముక్తులగుదురు అని శౌనకమహర్షి పల్కినట్లు కూరేశులు ఇందు పల్కుచున్నారు. – అని వ్యాఖ్యానాంతరములోని అవతారిక.

**(హే సుందర! భవాన్ ఆశ్రితేషు సులభో భవన్ యది జగామ తత్ అస్తు నామ)**

– సుందరబాహుస్వామీ! నీవు ఆశ్రితులపట్ల సులభుడవై, మనుష్యసజాతీయుడవై అవతరించినచో అవతరింపుము. ఆ విషయమున నాకెట్టి విచికిత్సయులేదు. అయినచో, ఏ విషయమునుగూర్చి నీకు విచికిత్స అందువా, చెప్పెదను వినుము. **(తదా ఉలూఖలే కియద్దామబంధ ఇతి కిమ్ అరుదః)** – అట్లు మనుష్యజాతిలో అవతరించినపుడు వెన్నను దొంగిలించి, అందువలన రోటికి చిన్నదారముతో కట్టుబడియుండి, ఏడ్చితివి కదా! అది ఎందులకు? అను ఈ విషయములోసుమా నావంటివారికి విచికిత్స కలుగుచున్నది – అని తాత్పర్యము. ఇట్లు కూరేశులు ప్రశ్నించుటలోని అంతర్యమేమి? అనగా, **"మత్తుఱు కడైవెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుణ్డు ఎత్తిఱ మురలినోడు ఇణైన్దిరున్దేఙ్గియ వెళివే"** అని పల్కి ఆళ్వార్లు ఆఱునెలల కాలము మోహించిపడియుండుటకొఱకే కదా! నీవు అట్లు రోటికి బంధింపబడి ఏడ్చుట – అని వ్యక్తము చేయుటయే. ఈ సందర్భమున – **"ఒళియా వెణ్ణెయుణ్డాన్ ఎన్ఱు ఉరలోడు అయ్చ్చి ఒణ్కయిఱ్ఱాల్ విళియా వాక్క ఆప్పుణ్డు విమ్మి యళుదాన్"** అను కలియన్ సూక్తినిబట్టి బిగ్గరగా ఏడ్చుట, వెక్కి వెక్కి ఏడ్చుటయును ఇచట **"కియత్ అరుదః"** అను అన్వయముద్వారా తెలుపబడినది – అని వ్యాఖ్యానాంతరము.

**(కియద్దామబద్ధ ఇతి అరుదః)** – అనగా **"స్వల్పదామబద్ధః"** అనియు అర్థము. **"దామబద్ధస్సన్ అరుదః"** అని అనకుండ **"దామబద్ధ ఇతి అరుదః"** అనుట – గోపికలు నిన్ను కట్టలేదు. **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్"** అనురీతిలో నిన్ను నీవే కట్టబడినవానినిగా చేసికొంటివి, ఆదియును నీ సౌలభ్యగుణాతిశయమును ప్రకటించుటకొఱకే – అను అర్థవిశేషమును స్ఫురింపచేయుట కొఱకు. **"సమాశ్రితసౌలభ్యలాభాయ మనుష్యభావనాజుషః తవోలూఖలబంధన మపి అత్యంతానుకూలమేవేతి ప్రీతిసమయోదితం రుదితం శంకావహ మితి భావః. పూర్వస్మిన్ శ్లోకే జీర్ణ మేవ కిమ్? ఇతి ప్రశ్నః పరత్వసూచకః, అత్ర శ్లోకే కిమ్ అరుదః? ఇతి ప్రశ్నః సౌలభ్యాతిశయసూచక ఇతి వివేకః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**110.** **సుందరోరుభుజ నందనంద స్త్వం భవన్ భ్రమరవిభ్రమాలకః ।**
**మందిరేషు నవనీతతల్లజం వల్లవీధియ ముత వ్యచూచురః ॥**

సుందరోరుభుజ = అందమైన, బలిష్ఠములైన బాహువులను కలవాడా! త్వం = నీవు, భ్రమరవిభ్రమ = తుమ్మెదలను పోలిన (అందమైన), అలకః = ముంగురులను కలవాడవై, నందనందనః భవన్ = నందుని కుమారుడవై, మందిరేషు = గోపికుల గృహములో, నవనీతతల్లజమ్ = చక్కని వెన్నను, వ్యచూచురః = దొంగిలించితివా? ఉత = లేక, వల్లవీధియమ్ = చిఱుగోపికల మనస్సును, వ్యచూచరః = దొంగిలించితివా? (చెప్పుము)



పూర్వశ్లోకమున దామబంధనము ప్రస్తుతమగుటచే, అందులకు మూలమైన నవనీతచౌర్యవృత్తాంతము స్మరణముకు రాగా, దానిని ప్రస్తుతించుచు కూరేశులు ఇందు స్వామిని ఉద్దేశించి "నీవట్లు దొంగిలించినది వెన్ననా? లేక గోపికల ఉల్లములనా?" అనుచు విద్ధహృదయులై ప్రశ్నించుచున్నారు. ఇంచుమించు ఇదే భావము అతిమానుషస్తవములోని **"కాంతాలకాంతమ్......గోపీమనాంసి నవనీత ముతాభ్యమోషీః"** అను శ్లోకమున అనుసంధింపబడుట గమనార్హము.

**(త్వమ్ భ్రమరవిభ్రమాలకః నందనందనః భవన్)** – **"కలివణ్డెఙ్గుమ్ కలన్దాఱ్పోల్ కమళ్ పూఙ్కుళల్కళ్ తడన్దోళ్మేల్ మిళిర నిన్ఱు"** అనియు, **"అణ్డత్తమరర్ పెరుమానళకర్ వణ్డొత్తిరుణ్డ కుళల్"** అనియు, **"వణ్డినమ్ పోలే శురుణ్డిరుణ్డ కుళల్ తాళ్న్ద ముకత్తాన్"** అనియును కీర్తించిన రీతిలో నీవు తుమ్మెదలను పోలిన ఆలకలను (ముంగురులను) కలవాడవై, నందుని కుమారుడవైయుండి –

**(మందిరేషు నవనీతతల్లజమ్ వ్యచూచురః? ఉత వల్లవీధియమ్?)** – గోపికల ఇండ్లలో ప్రవేశించి, వెన్నను మాత్రమే దొంగిలించితివా? లేక, గోపికల ఉల్లములనుకూడ అపహరించితివా స్వామీ! అను ప్రశ్నకు రెండిటిని అపహరించితినిలే – అనునది స్వామి సమాధానము. నవనీతచోరుడైయున్న సన్నివేశముతో స్వామి గోపికాహృదయచోరుడైయుండుట దీనిచే తెలుపబడినది. **"నవనీతతల్లజమ్"** అనగా గొప్ప వెన్న. తల్లజ శబ్దము శ్రేష్ఠవాచకము. వెన్నకు గొప్పతనము ఏమి? అనగా కవి దృష్టిలో స్వామి చేతులతో స్పృశింపబడి, గ్రహింపబడుటయే – అని శ్రీ అణ్ణాస్వామివారి వివరణము. ఇది స్వామి దృష్టినిబట్టి చెప్పిన అర్థము. తనకు పరమభక్తురాండ్రగు గోపికల హస్తస్పర్శను కల్గినదగుటచే కదా ఆ గోపికల ఇండ్లలోని వెన్నను పరమాత్మ పరమభోగ్యముగా ఆరగించెను. ఈ రీతిలో కూడ తల్లజశబ్దస్వారస్యము భావనీయము. ఇక, స్వాపదేశమున నవనీత చౌర్యము భక్తుల మనస్సును హరించుటకు పర్యాయమని పూర్వాచార్యుల అభిప్రాయము. కావున నవనీతచౌర్యము చేసెననగా భక్తుల మనస్సును దోచెననుటయే. తిరువిరుత్త ప్రబంధములోని **"ఈట్టియవెణ్ణెయ్ ఉణ్డాన్"** (12) అను సూక్తిని వ్యాఖ్యానించుచు **"ఇన్ద విభూతియిల్ సంబంధజ్ఞానముడైయార్ మతిమంథానత్తాలే నాడోఱుమ్ మననమథనమ్ పణ్ణి యాట్టుకైయాలే పాలానవవస్థైయై క్కళిత్తు, నెయ్యాన అవస్థైయిఱ్పుకాతే "అంతరే నవనీతమ్" – ఎన్గిఱపడియే నడువే నిత్తిఱ వెణ్ణెయైప్పోలే "అచ్యుతో వా ఏషోస్మాన్ లోకాత్" ఎన్ఱు సంసార్యవస్థైయై క్కళిత్తు "ఆగతో దేవలోకమ్" – ఎన్ఱు ప్రాప్యమాన పరమపదత్తిల్ పుకప్పెఱాతే నడువే నిత్తిఱ ముముక్షుచేతనరాకిఱ ఆన్తరాళికరై అచింతితమాక అనుభవిక్కైయిలుణ్డాన..... పారతంత్రైకనిరూపణీయమాకైయాలే అనన్యరక్ష్యమాయ్ అనన్యభోగ్యముమాయిరుక్కుమ్ ఆత్మవస్తువై భుజిక్క క్కుతైయుణ్డో?"** – అను వివరణమును అళకియ మణవాళచ్చీయర్

అనుగ్రహించుటచే నవనీతము ముముక్షువులను స్వాపదేశార్థమున నిర్దేశించునని, నవనీతమును స్వామి భుజించుట అనగా ముముక్షువులను ఆదరించుటయే అని తెలియుచున్నది. శ్రీకృష్ణుని దృష్టిలో భక్తురాండ్రైన గోపికలు "ఈ వెన్న కృష్ణుని కొఱకు" అనుచు ఆదరముతో, తమ చేతులతో తీసిరి. కావున అది నవనీత తల్లజమైనది. **"అత్యంతకాంతదివ్యమంగళవిగ్రహస్య నందనందనస్య భవతో నవనీతాపహారో గోపీజనమనోహారోఽ భవ దితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత. **"భ్రమరవిభ్రమాలకః"** అనునపుడు భ్రమరవిభ్రమమువంటి విభ్రమమునుకల ముంగురులు అని చెప్పవలెను కావున పదార్థవృత్తినిదర్శనాలంకారము కలదు. అలకలలో భ్రమరభ్రాంతి చెప్పబడుటచే భ్రాంతిమదలంకారము, కొల్లగొట్టబడినది గొల్లవనితల ఉల్లమూలా? లేక వెన్ననా? అను సందేహాలంకారమును కలవు.

**111. కాళియస్య ఫణతాం శిర స్తు మే సత్కదంబశిఖరత్వ మేవ వా ।**
**వష్టిజుష్టవనశైల! సుందర! త్వత్పదాబ్జయుగ మర్పితం యయోః ॥**

సుందర = సుందరబాహుస్వామీ! జుష్టవనశైల = సేవింపబడిన వనగిరినికలవాడా (వనగిరిలో నివసించువాడా), మమ = నాయొక్క, శిరః తు = శిరస్సుఅన్ననో, యయోః = ఏ రెండిటియందు, త్వత్పదాబ్జమ్ = నీ పాదాంబుజము, అర్పితమ్ = ఉంచబడినదో, (అట్టి), కాళియస్య = కాళియుని, ఫణతామ్ = పడగ అను స్థితిని కాని, వా = లేక, సత్కంబ = సత్తనుపొందిన (గొప్ప) కడిమిచెట్టు యొక్క, శిఖరత్వమ్ ఏవ = అగ్రభాగము అగుటను కాని మాత్రమే, వష్టి = కోఱుచున్నది.

నిత్యము రేపల్లెనుండి బృందావనమునకు వేంచేయు శ్రీకృష్ణుడు బలరామునితో కలసి పోవుట అలవాటు. **"ఏకదా తు వినా రామం కృష్ణో బృందావనం యయౌ"** అనునట్లు ఒకనాడు బలరాముడు వెంటలేకుండగానే, శ్రీకృష్ణుడు బృందావనమునకు బయలుదేరి, గోవులను తోలుకొని ఎవరును సంచరింపని దారిలో పోవుచుండగా, మిగిలిన గోపాలురు – కృష్ణా! ఆ దారిలో పోవలదు. ఆ దారిలో పోవుట ప్రమాదము, యమునానదియొక్క ఒక మడుగులో కాళియుడను క్రూరసర్పము తన కుటుంబముతో పాటు వాసము చేయుచు, విషాగ్నిని వెడల గ్రక్కుచు అందఱిని చంపుచున్నాడు. కావున మేము ఈ దారిలో వచ్చుటకు భయపడుచున్నాము – అని పల్కిరి. ఆ కాళియసర్పమును దండింపవలెనని తలచిన శ్రీకృష్ణుడు గోపాలురను భయపడవలదని పల్కి, వారిని తనవెంట తీసికొని వెడలి, కాళియుడున్న మడుగును, చేరి, అచటికి దగ్గరలో నున్న ఒక కడిమి చెట్టుపైకి ఎక్కి, ఆ మడుగులోనికి దుమికెను. ఆ కాళియుని పడగలపైకెక్కి నిలచి నాట్యమాడి, దాని పొగరును అణచెనని పురాణకథనము. దీనిని ఇచట అనుసంధించు కూరేశులు, తమ



హృదయములోనున్న ఒక వాంఛను ప్రకటించుచు కాళియుని పడగలుగానో, లేక, కదంబవృక్షాగ్రముగానో కావలయునని తమ శిరస్సు అభిలషించుచున్నదని నుడువుచున్నారు. అతిమానుషస్తవములోని **"అచిన్వతః కుసుమ మంఘ్రిసరోరుహం తే"** ఇత్యాది శ్లోకములో తెల్పిన భావమునే కూరేశులు ఇందు వ్యక్తీకరించుచున్నారు. కాళియుని పడగగానో, లేక కదంబవృక్షాగ్రమునో కావలయునని కోరుట ఎందులకనగా, ఆ రెండును అభిలషింపకనే, నీవు నీ శ్రీపాదములను వానిపై పెట్టి, వానిని ఉజ్జీవింపజేసితివి కదా! అందులకు! – అని వ్యాఖ్యానాంతరము. **"పత్యుః ప్రజానా మైశ్వర్యం పశూనాం వా న కామయే, అహం కదంబో భూయాసం కుందో వా యమునాతటే"** అను పురాణశ్లోకము ప్రకృత శ్లోకమునకు మూలమనదగును. **"ఊనేఱు శెల్వత్తు"** అను 4వ దశకములో కులశేఖరులు భగవదధిష్ఠితములైన క్షేత్ర–వాస్తు – వస్తువులుగా తాము జన్మింపవలెనని కోఱుటవంటిదే ఇదియును.

**(కాళియస్య ఫణతామ్ సత్కదంబశిఖరత్వమ్ ఏవ వా వష్టి)** – స్వామీ నా శిరస్సు కాళియుని పడగలుగానో, కదంబవృక్షముయొక్క అగ్రభాగముగానో కావలయునని కోఱుచున్నది. వానిలో ఏమి వైలక్షణ్యమున్నది? అందువా – చెప్పెదను వినుము.

**(యయోః త్వత్పదాంబుజయుగమ్ అర్పితమ్)** – నీ పాదపద్మయుగమును నీవు వానియందు అర్పించితివికదా! **"అడిచ్చియోమ్ తలైమిశై నీ యణియాయ్, ఆழియమ్ కణ్ణా ఉన్ కోలప్పాదమ్"** అనియు, **"కోలమా మెన్ శెన్నిక్కు ఉన్కమలమన్న కురైకழలే"** అనియు, **"కదా పునః శంఖరథాంగకల్పక....త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి"** అనియును ప్రార్థించి, పొందదగిన ఫలము వానికి అనాయాసముగా లభించినది. ఆహా! అని ఆశ్చర్యపడి, ఇట్లు పలుకబడినదని తాత్పర్యము. **"వష్టి"** అనగా కోఱుచున్నదని అర్థము. **"వశ – కాంతౌ"** అను ధాతువునుండి పుట్టినరూప మిది. కాంతి అనగా ఇచ్ఛ – అనగా కోఱుట. **"దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః" ఇతి, అరణ్యే సంతి పత్రాణి నద్యాం స్వాదూదకాని చ, సంతి హస్తౌ చ పాదౌ చ కథం నాఽ రాధ్యతే హరిః" – ఇతి చ భగవదాశ్రయణోపయోగికరచరణాదివిశిష్టేఽ పి మనుష్యత్వే ఏవ మమ నాఽ దరః భగవచ్చరణార్పణోపయుక్తే చేత్ తిర్యక్స్థావరత్వే ఏవ మమ అత్యంతావశ్యకే ఇతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**112. గూహితస్వమహిమాఽ పి సుందర త్వం వ్రజే కి మితి శక్ర మాక్రమీః ।**
**సప్తరాత్ర మదధా శ్చ కిం గిరిం పృచ్ఛత శ్చ సుహృదః కి మక్రుధః ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, వ్రజే = (పూర్వము) రేపల్లెలో, గూహితస్వమహిమా అపి = మఱుగుపరచుకొనిన నీ మహిమను కలవాడవైనను, కిమ్ ఇతి = ఎందులకని, శక్రమ్ = ఇంద్రుని, ఆక్రమీః = ఆక్రమించితివి? గిరిం = గోవర్ధనపర్వతమును, సప్తరాత్రం

= ఏడు రాత్రులపాటు, కిమ్ అదధాః చ = ఎందులకని దాల్చితివి? పృచ్ఛతః చ = నీ వెవరు? దైవమా? అని ప్రశ్నించిన, సుహృదః చ = స్నేహితులను సైతము, కిమ్ అక్రుధః = ఎందులకు కోపించితివి?

సౌలభ్య, సౌశీల్యములను ప్రదర్శించి, పర్వతమును దాచుకొని మనుష్యత్వమును మిక్కిలిగా ఆదరించిన సమయములోనే, పరత్వమే సువ్యక్తమగు అతిమానుషలీలను చేయుట ఎందులకు స్వామీ! అనుచు కూరేశులు చోద్యముగా మూడు విషయములను గూర్చి ప్రశ్నించుచున్నారు. **(సుందర త్వం గూహితస్వమహిమా అపి వ్రజే కి మితి శక్రమ్ అక్రమీః )** – స్వామీ! నీవు **"ఒరుత్తి మకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్ ఒరుత్తిమకనాయ్ ఒళిత్తు వళర"** అనునట్లు రహస్యముగా రేపల్లెలో పెరుగుట సహజములైన నీ శక్తి విశేషములను అన్నిటిని మఱుగుపఱచియేకదా! అట్లయినను, **"కేట్టఱియాదన కేట్కిన్ఱేన్ కేశవా కోవలరిన్దిరఱ్కు క్కాట్టియ శోఱుమ్ కఱియుమ్ తయిరుమ్ కలన్దుదనుణ్డాయ్ పోలుమ్"** అనియు, **"ఆయిరమ్ కణ్ణుడై యిన్దిరనుక్కెన్ఱు ఆయర్ విழవెడుప్ప పాశననల్లన పణ్డికళాల్ పుకప్పెయ్దవదనై యెల్లామ్ పోయిరున్దజ్గొరు పూదవడివుకొణ్డు ఉన్ మకనిన్ఱు నజ్గాయ్ మాయనతనైయెల్లామ్ ముఱ్ఱుమ్ వారి వళైత్తుణ్డిరున్దాన్ పోలుమ్"** అనియును పల్కినట్లు ఇంద్రపూజకు ఆటంకమును కల్గించి, ఆ ఇంద్రుని యుద్ధము చేయుటకు పురికొల్పితివి కదా! ఇది ఏమి ఆశ్చర్యము!

**(సప్తరాత్రమ్ అదధా శ్చ కిమ్ గిరిమ్)** – **"వழవొన్ఱు మిల్లాచ్చెయ్కై వానవర్కోన్ వలిప్పట్టు మునిన్దు విడుక్కప్పట్ట మழై వన్దెழనాళ్ పెయ్దు మాత్తడైప్ప మదుసూదనెడుత్తు మఱిత్త మలై"** అనియు, **"శెప్పాడుడైయ తిరుమాలవన్ తన్ శెన్దామరైక్కై విరలైన్దినైయుమ్ అకప్పాక మదుత్తు మణినెడున్తోళ్ కామ్బాక కొన్దుదుత్తు క్కవిత్తమలై"** అనియును పల్కురీతిలో **"కొడియేఱు శెన్దామరైక్కై విరల్కళ్ కోలము మழిన్దిల వాడిఱ్ఱీల వడివేరు తిరువుకిర్ నొన్దుమిల"** అను రీతిలో ఏడుదినములు ఎడతెగకుండ, చెదరకుండ అలసట పొందకుండ గోవర్ధనమును ఎత్తిపట్టుకొనుట ఏమి ఆశ్చర్యకరము! స్వామీ!

**(పృచ్ఛత శ్చ సుహృదః కిమ్ అక్రుధః)** – గోవర్ధనపర్వతమును ధరించి, నిలచిన అతిమానుషలీలను దర్శించి, ఆశ్చర్యపడిన గోపాలురు **"బాలత్వం చాతివీర్యం చ జన్మ చాస్మాస్వశోభనమ్, చింత్యమాన మమేయాత్మన్ శంకాం కృష్ణ ప్రయచ్ఛతి, దేవో వా దానవో వా త్వం యక్షో గంధర్వ ఏవ వా"** అని "నీవు దానవుడవా? దైవమా? యక్షుడవా? గంధర్వుడవా" అని ప్రశ్నింపగా, **"క్షణం భూత్వా త్వసౌ తూష్ణీమ్ కించిత్ప్రణయరోషవాన్"** అని అందులకు స్వామి కోపించినట్లున్నది. కోపింపవలసినంతగా వారేమియు తప్పుగా మాటలాడలేదే! కాని, అట్లు కోపించుట కేమి కారణము స్వామీ! అనుచు ప్రశ్నించుచున్నారు.

ఈ విధముగా ఈ శ్లోకములో మూడు ప్రశ్నలు కలవు. చిరకాలముగా రేపల్లెలో జరుగుచుండిన దేవేంద్రసమారాధనను ఎందులకు అడ్డగించుట? అనునది మొదటి ప్రశ్న.



పరాత్పరుడగు తానుపెరుగు ఊరిలో దేవాంతరమునకు ఆరాధన జరుగుట ఏమి? అని తలచుటచేనని దానికి సమాధానము. ఇంద్రుడు ఏడురోజులు రాళ్ళవర్షమును కురిపించి, గోగోపగోపీజనములకు భరింపలేని బాధను కల్గించినపుడు, అతని శిరస్సును ఖండింపవలసియుండగా, అట్ల చేయకుండ **"కున్ఱు కుడైయాక"** అనునట్లు గిరిని గొడుగా ఎత్తితివి ఎందులకు? అనునది రెండవ ప్రశ్న. ఇంద్రుని అన్నమును తీసివేసిన నేను అతని ప్రాణములనుకూడ తీసివేయవలెనా? ఈ పర్వతము మనకు రక్షకమని నేను మొదట చెప్పిన మాటను నిజము చేసినచో, అతని (ఇంద్రుని) చేయి నొప్పి పుట్టగానే అతడు తనకు తానే వర్షించుటను మానునులే" అను ఆనృశంస్యము (కరుణ)తో ఊరకుండి, గోవర్ధనమును గొడుగుగా ఎత్తెనని – ఇందులకు సమాధానము. నీవు దేవుడవా? దానవుడవా? యక్షుడవా? గంధర్వుడవా? – అని ప్రశ్నించినవారిపై కోపించుట ఎందులకు? అనునది మూడవప్రశ్న. పరత్వమునందు విసుగుచెంది, మనుష్యసజాతీయుడవై, అందులోకూడ గోపాలురలో చివరివాడవై, మనఃపూర్వకముగానే నీవు అవతరింపగా, నిన్ను రేపల్లెలోని జనులు ఆవిధముగానే గ్రహింపకుండ, అన్యథా భావించి ప్రశ్నంచుట నీకు అప్రియమై, **"దేవత్వముమ్ నిన్దైయానవనుక్కు"** అను ఆచార్యహృదయశ్రీసూక్తిప్రకారము నిందారూపమై తోచుటవలన కోపము కల్గినదని సమాధానము. ఈ విధముగా మూడుప్రశ్నలకును తెలియబడు సమాధానములద్వారా ఒక విలక్షణమైన గుణానుభమును కూరేశులు ఇందు వ్యక్తీకరించిరి – అని అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"స్వమహిమనిగూహనోద్యుక్తస్య శక్రక్రమణం నిరంతరం సప్తరాత్రం గోవర్ధనోద్ధరణం చ పునః పరత్వశంకాకృతం సుహృదం ప్రతి క్రోధ శ్చ పరస్పరవ్యాహతే ఇతి భావః".** నీ మహిమను దాచుకొనగోరి వచ్చిన నీ పరత్వమును నిరూపించు ఇంద్రుని జయించుట, ఎడతెగక ఏడు దినములపాటు గోవర్ధనోద్ధరణమును చేయుటకు, మఱియు, ఆ సందర్భములను చూచి నీవు పరమాత్మవా? అని శంకించిన స్నేహితులపై కోపించుటయు పరస్పర వ్యాహతములు కదా! అని దీని భావము. అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**113. హే నందనందన సుసుందర సుందరాహ్వా బృందావనే విహరత స్తవ వల్లవీభిః ।**
**వేణుధ్వనిశ్రవణత స్తరుభి స్తదా వై సగ్రావభి ర్జతువిలాయ మహో విలిల్యే ॥**

నందనందన = నందకుమారా! సుసుందర = గొప్ప అందమును కలవాడా! సుందరాహ్వా = సుందరుడను ("అழకర్ అను) నామమును కలవాడా! తదా = (నీవు రేపల్లెలోనున్న) ఆ సమయమున, బృందావనే = బృందావనమునందు, వల్లవీభిః = గోపికలతో, విహరతః తవ = క్రీడించు నీ, వేణుధ్వని = వేణువుయొక్క ధ్వనిని, శ్రవణతః = వినుటవలన, సగ్రావభిః = రాళ్ళతోకూడిన, తరుభిః = వృక్షములచే, జతువిలాయం = లక్క కఱగినట్లు,

విలిల్యే = ద్రవీకరింపబడినది, అహో = ఆశ్చర్యము!

శ్రీకృష్ణుని వేణుగానవైభవమును ప్రస్తుతించుచు కూరేశులు ఆ వేణుగానమహిమకు వృక్షములు, రాళ్ళతోపాటు అన్నియు కఱగినవి. అహో! అనుచున్నారు.

**(హే నందనందన! సుసుందర! సుందరాహ్వ)** – నందగోపకుమారునిగా అవతరించిన సుందరబాహుస్వామీ! **"అ౺కర్"** (సుందరుడు) అను నామమును కలవాడా!

**(తదా బృందావనే వల్లవీభిః సహ విహరతః తవ)** – పూర్వము బృందావనములో గోపికలతో లీలారసమును అనుభవించు నీయొక్క –

**(వేణుధ్వనిశ్రవణతః)** – వేణుధ్వనిని వినుటవలన –

**(సగ్రావభిః తరుభిః జతువిలాయం విలిల్యే అహో!)** – శిలలు, వృక్షములును **"తీయోడుడన్‌శేర్ మెழుకాయ్"** అనునట్లు అగ్నిలోపడిన లక్కవలె కఱగిపోయినవి. ఏమి ఆశ్చర్యము స్వామీ!

పెరియాழ్వార్ తిరుమొழిలోని **"నావలమ్ పెరియతీవు"** అను దశకములో **"మరుణ్డు మాన్‌కణఙ్గళ్ మేయ్‌కై మఱన్దు మేయ్‌న్ద పుల్లుమ్ కడైవాయ్ వழిశోర, ఇరుణ్డు పాడుమ్ తులుఙ్గ పుడైపెయరా ఎழుదు శిత్తిరఙ్గళ్‌పోల నిన్‌ఱనవే"** అనియు, **"మరఙ్గళ్‌నిన్ఱు మదుదారైకళ్ పాయుమ్ మలర్‌కళ్ వీழుమ్ వళర్‌కొమ్బుకళ్ తాழుమిరఙ్గుమ్ కూమ్బుమ్ తిరుమాల్‌నిన్ఱనిన్ఱ పక్కమ్ నోక్కి అవైశెయ్యు ఙ్కుణమే"** అనుచు అనుగ్రహింపబడిన సూక్తుల అర్థ మిచట అనుసంధేయము. భట్టర్ శ్రీరంగరాజస్తవములో **"శైలో௨గ్ని శ్చ జలాంబభూవ"** ఇత్యాదిశ్లోకములో అనుగ్రహించిన అర్థముకూడ స్మరణీయమ్. **"విలిల్యే"** అనునది భావప్రయోగము. భవభూతి ఉత్తరరామచరితములో **"అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్"** అనుచు సీతను అరణ్యమును పంపు సందర్భమున పల్కెను. వృక్షములకును సుఖదుఃఖానుభూతులుండునని విజ్ఞానశాస్త్రముకూడ అంగీకరించుచున్నది. కావున అవి ద్రవీకరించుచున్నవనుటలో విప్రతిపత్తిలేదు. స్వామి వేణుగానమాధుర్యమును ఆస్వాదింపగోరిన నిత్యులును, ముక్తులును భూమికి వచ్చి బృందావనములో శిలలుగానో, ఇసుకరేణువులుగానో పరిణమించిరట. కావున అవి కఱగుటలో ఆశ్చర్యములేదు. ఈ సందర్భమున అతిమానుషస్తవములోని **"ధన్యైః శ్రుతం తదిహ తావకరాసకాలే గీతేన యేన హి శిలా స్సలిలాంబభూవుః"** ఇత్యాదిగా కూరేశులు పల్కుటయు స్మరణీయము – అని వ్యాఖ్యానాంతరము. **"నందనందనత్వేనావతీర్ణస్య సుసుందరస్య వేణుక్వణనాకర్ణనమ్ అత్యంతకఠినానామపి నిష్యందహేతు ర్భవతీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వసంతతిలక వృత్తము.

**114. గాయంగాయం వనగిరిపతే త్వం హి బృందావనాంతః**
**గోపీసంఘై ర్విహరసి యదా సుందర వ్యూఢబాహో ।**
**రాసారంభోత్సవబహువిధప్రేమసీమంతినీనామ్**



**చేతశ్చేత స్తవ చ తు తదా కాం దశా మన్వభూతామ్ ॥**

వనగిరిపతే = సుందరబాహుస్వామీ! సుందరవ్యూఢబాహో = అందమైన, దృఢమైన బాహువులను కలవాడా! బృందావనాంతః = బృందావనము లోపల, గాయంగాయం = మరల మరల గానమును చేసి చేసి, త్వం = నీవు, గోపీసంఘైః = గోపికాసమూహములచే, యదా విహరసి హి = ఎపుడు క్రీడించుచున్నావో, తదా = అపుడు, రాసారంభోత్సవ = రాసక్రీడ అను ఉత్సవప్రారంభములో, బహువిధప్రేమ = అనేకవిధములైన శృంగారాది రసములలో ప్రేమనుకల, సీమంతినీనామ్ = గోపికలయొక్క, చేతః = మనస్సు(లు)ను, తవ చేతః చ = నీ మనస్సును, కాం దశామ్ = ఎట్టి దశను, అన్వభూతామ్ = అనుభవించినవి? (తెలుపుము).

పూర్వశ్లోకములో వేణుగానమహిమ ప్రస్తుతమగుటచే, ఆకాలములో వృక్షములు శిలలు మొదలగు అచేతనములు పడిన పాట్లు అట్లుండనిమ్ము. స్వామి హృదయము, గోపికల చిత్తములును పడినపాట్లు ఏవిధముగానుండెను? అని విచారించినచో, అది ఆ స్వామి చిత్తమునకే తెలియును. అంతియే – అని భావించి, ఆ స్వామినే నేరుగా కూరేశులు ప్రశ్నించుచున్నారు.

**(వనగిరిపతే సుందరవ్యూఢబాహో!)** – తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు ప్రభూ! సుందరములైన, బలిష్ఠములైన బాహువులను కలవాడా! **"సుందర"**, **"వ్యూఢబాహో"** అని వ్యస్త సంబోధనలుగా కూడ అన్వయింపవచ్చును.

**(త్వం బృందావనాంతః గాయంగాయం గోపీసంఘై స్సహ యదా విహరసి)** – నీవు బృందావనములో మాటిమాటికి వేణువు నూది, గోపికలతో లీలారసమును అనుభవించిన వేళలో – **(రాసారంభోత్సవబహువిధప్రేమసీమంతినీనామ్ చేతః తవ చ చేతః తదా కాం దశా మన్వభూతామ్)** – రాసారంభోత్సవమనగా – రాసక్రీడ. దీనికి తమిళభాషలో **"కురవైకూత్తు"** అని పేరు. **"అఙ్గనా మఙ్గనా మంతరే మాధవః మాధవం మాధవం చాంతరేణాంగనా"** అనురీతిలో ఒక్కొక్క గోపిక ప్రక్కన ఒక్కొక్క కృష్ణుడుగా రూపములను పరిగ్రహించి, ఆడిన ఒక విలక్షణమైన నాట్యము. అపుడు **"ఇత్థ మాకల్పితే కుండలే మధ్యగః సంజగౌ వేణునా దేవకీనందనః"** అని ఆ రాసక్రీడామండలములో నడుమనునుండి శ్రీకృష్ణుడు అద్భుతముగా వేణుగానమును చేసెను. అపుడు ఆ గోపికలకు కల్గిన అనుభూతి వాచామగోచరము. అట్టి మాటలకు అందని ప్రేమనుకల గోపికల చిత్తములును, శ్రీకృష్ణుని చిత్తమును అపుడు ఏ స్థితిలో ఉండియుండుననుటను గూర్చి ఆ స్వామినే ప్రశ్నింపనగును. **"నారీ సీమంతినీ వధూః"** అను నిఘంటువచనమునుబట్టి సీమంతినీపదము ఇచట స్త్రీసామాన్యవాచకము.

ఇట్లు సుందరబాహుస్వామిని ఉద్దేశించి ప్రశ్నించిన కూరేశులకు ఏ సమాధానము లభించియుండును అనినచో – "ఇపుడు మీరు, నేను కలసి వర్తించునపుడు మన ఇరువురి చిత్తములకు ఎట్టి స్థితి ఏర్పడినదో, ఆ స్థితియే అపుడును కల్గినది లెండు" అనెడి సమాధానమే

లభించియుండును – అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. ఈవిధముగా ప్రశ్నించుటలోని ఆంతర్యమేమనగా – నేనుకూడ అపుడు ఒక గోపికగా జన్మింపలేకపోయితినే! అయ్యో!" అని. దీనివలన ఆళ్వార్లవలె కూరేశులును భగవానుని విషయమున నాయికాభావనను పొందిరని స్ఫురించుచున్నది – అని వ్యాఖ్యానాంతరము. **"రాసక్రీడాసమయే సముత్థితః సుందరసుందరీజనమనసో రస్యసంవేద్యశృంగారరసోదయోఽవాఙ్మానసగోచర ఇత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"త్వయా తాభి శ్చ సంవేద్యేతి భావః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము మందాక్రాంత. మెల్లమెల్లగా భక్తుల మనస్సును ఆక్రమించు రాసలీలను మందాక్రాంత వృత్తమున వర్ణించుటలోని వృత్తౌచిత్యము సహృదయ హృదయైక భావ్యము.

**115. ఇంగితం నిమిషితం చ తావకం రమ్య మద్భుత మతిప్రియంకరమ్ ।**
**తేన కంసముఖకీటశాసనం సుందరాల్పక మపి ప్రశస్యతే ॥**

సుందర = సుందరబాహుస్వామీ! తావకం = నీకు సంబంధించిన, ఇంగితమ్ = భ్రూభంగాదులు, నిమిషితం చ = వీక్షణమును, రమ్యం = మనోహరములు, అద్భుతం = ఆశ్చర్యకరములు, అతిప్రియంకరమ్ = మిక్కిలి ప్రీతికరములును అగుచున్నవి, తేన = అకారణముచే, కంసముఖ = కంసుడు మొదలగు, కీటశాసనమ్ = కీటకములవంటి అల్పులను నిరసించుట, అల్పకమ్ అపి = (నీకు) మిక్కిలి చిన్న కార్యమే అయినను, ప్రశస్యతే = (భక్తులచే) కీర్తింపబడుచున్నది.

నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళిలో (5-10-2) **"అదువిదువుదు వెన్నలావనల్ల ఎన్నైయుమ్ ఉన్‌శెయ్‌కై నైవిక్కుమ్"** అనెడి సూక్త్యర్థమును దృష్టిలో నుంచుకొని కూరేశులు ఈ శ్లోకమును రచించిరని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. శ్రీకృష్ణావతారములో **"దేనుకన్ పిలమ్బన్ కాళియన్ ఎన్నుడ్డీప్పప్పూడుకళదఙ్గ వళ్క్కినదుమ్"** అనియు, **"వార్‌కడావరువి యానైమామలైయుమ్ మరుప్పిణై క్కువడిఉత్తిరుట్టు ఊర్‌కొళ్ తిణ్‌పాకనుయిర్ శెకుత్తు అరఙ్గన్ మల్లరైక్కొన్ఱు కఞ్జనై త్తకర్త్తదుమ్"** ఇత్యాదిగా కీర్తింపబడిన భగవానుని దుష్కృద్వినాశచరిత్రలు పలు కలవు. ఇవి సర్వశక్తియగు భగవానునకు క్రిమికీటనిరసనప్రాయములే తప్ప, విక్రమచరిత్రలలో చేరవు. అతిమానుషస్తవములో **"యా కంసముఖ్యనృపకీటనిబర్హణోత్థా సా నిర్జితత్రిజగత స్తవ నైవ కీర్తిః"** అనుచు కూరేశులీ అంశమును సుస్పష్టము చేసిరికదా! నిజమునకు ఈ విషయము ఇట్లున్నచో కంసాది అల్పుల నిబర్హణములు స్తోత్రములందు గొప్పగా కీర్తింబడుట ఎందులకు? అనెడి సందేహము జిజ్ఞాసువులకు కల్గుట సహజము. అందులకు పరిహారమును కూరేశులీ శ్లోకముద్వారా తెలుపుచున్నారు. చేసిన కృత్యము చిన్నదా, లేక పెద్దదా? అని భక్తులు చూడరు.



చేసినవారెవరు? అని మాత్రమే గమనింతురు. భగవానుడు చేసినది ఇది, శ్రీకృష్ణుడు చేసినది ఇది – అని తెలిసినచో, చిన్నది – పెద్దది అను వ్యత్యాసము లేకుండ, సకలవృత్తాంతములను సమానముగానే కీర్తించి, ఆనందింతురు – అనెడి పరమార్థము ఇందు వ్యక్తీకరింపబడినది – అని శ్రీ అణ్ణాస్వామివారి వివరణము.

**(సుందర! ఇంగితం నిమిషితం చ తావకమ్)** – సుందరబాహుస్వామీ! ఇంగితము కాని, కటాక్షముకాని – ఏదైనను అది నీకు సంబంధించినది అయినచో అది అంతయు – అని భావము. అభిప్రాయానురూపమైన చేష్టకులకు ఇంగితమని పేరు. కటాక్షవీక్షణములకు నిమిషితమని పేరు. మావంటి భక్తులకు నీ చరిత్రలవరకు పోవలిసిన పనిలేదు. నీ ఇంగితముకాని, కటాక్షము కాని – ఏదైనను చాలును మమ్ములని ద్రవీకరించుటకు – అని భావము.

**(రమ్య మద్భుత మతిప్రియంకరమ్)** – నీకు సంబంధించినది అంతయు మాకు రమణీయము, అద్భుతము. పరమభోగ్యమును.

**(కంసముఖకీటశాసనమ్ అల్పక మపి ప్రశస్యతే)** – కంసుడు మున్నగు కీటకములను దండించుట **"శిఖుచ్ఛేవకమ్"** అనునట్లు చిన్న, అనాయాసమైన కార్యమే అయినను, ప్రశంసింపబడును.

"కంసుడు మొదలగు దుష్టులను శిక్షించుటకు, భూభారమును తొలగించుటకును భగవానుడు అవతరించునని పురాణమునందు తెలియుచుండగా, వానినిగూర్చి స్తుతింపకుండ, కేవలము బాల్యలీలలనే మీరిట్లు ఎందులకు ప్రశంసించుచున్నారు? అను సందేహము కల్గునని తలచి, కూరేశులు ఇందు దానిని సమాధానించుచున్నారు. **"పరిత్రాణాయ సాధూనామ్"** అనుచు మొదటగా పేర్కొనిన ఫలమగు సాధుపరిత్రాణమే అవతారమునకు ముఖ్యప్రయోజనముగా గ్రహింపబడును. **"మృత్యు ర్యస్యోపసేచనమ్ క ఇత్థా వేద యత్ర సః"** అని, **"హరిం హరంత మనుయంతి దేవాః"** అనియును శ్రుతులు తెల్పినట్లు అన్నిటిని ప్రళయకాలమున **"ఉభే భవత ఓదనః"** అను రీతిలో ఒక కబళముగా లోనికి గ్రహించి, యముని సైతము **"మృత్యు ర్యస్యోపసేచనమ్"** అను విధమున ఊరగాయవలె గ్రసించు స్వామికి ఒక అల్పకీటకములవంటి కంసుడు మొదలగు దుష్టులను సంహరించుట ఏ మాత్రము పెద్దపని కాదు. చాలా అల్పము. అయినను, దానిని కూడా భక్తులు కీర్తింతురు. ఎందులకనగా – **"ఇంగితేన నిమిషితేన చేష్టితేన చ ఆచార్యాణాం ప్రవృత్తి రనుమీయతే"** అను మహాభాష్యకారుల (పతంజలి) వచనానుసారము ఇంగిత,

నిమిషిత, చేష్టితములు మహనీయులకు సంబంధించినవి అయినచో, అవి అందమైనవి, ఆశ్చర్యకరములైనవి, ఆనందకరమైనవియును అని–భావము – అని వ్యాఖ్యానాంతరము. **"ఇంగితమాత్రం పర్యాప్తం కంసాదిహవనాయేతి పర్యవసితమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **"అల్ప మనల్పం వా అల్పవిషయ మనల్పవిషయం వా త్వత్సంబంధి సర్వం శ్లాఘ్య మిత్యర్థః"** అని రామానుజాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

## 116.

**వారాణసీదహనపౌండ్రకభౌమభంగకల్పద్రుమాహరణశంకరజృంభణాద్యాః ।**
**అన్యా శ్చ భారతబలక్రథనాదయ స్తే క్రీడా స్సుసుందరభుజ శ్రవణామృతాని ॥**

సుసుందరభుజ = సుందరబాహుస్వామీ!, వారణాసీదహన = కాశీపురదహనము, పౌండ్రక = పౌండ్రకవాసుదేవునియొక్క, భౌమ = భూమిపుత్రుడగు నరకాసురునియొక్క, భంగ = వధ, కల్పద్రుమ + అహరణ = పారిజాతవృక్షమును (స్వర్గమునుండి) తీసికొనివచ్చుట, శంకరజృంభణాద్యాః = జృంభణాస్త్ర ప్రయోగముతో శంకరుని నిశ్చేష్టుని చేయుట మొదలగునవి, భారతబలక్రథన + ఆదయః = భారతయుద్ధములో పదునెనిమిది అక్షౌహిణుల సంఖ్యనుకల సైన్యమును నశింపజేయుట మొదలగు, అన్యాః = మిగిలిన, తే క్రీడాః చ = నీ లీలలు, శ్రవణ + అమృతాని = భక్తులకు వినుటకు అమృతమువలె ఆనందకరములు, పరమభోగ్యములును.

పూర్వశ్లోకమున **"అల్పక మపి"** అని పల్కిరి. అట్లు అల్పము కాకుండ, అనల్పమని లెక్కింపతగిన చేష్టలును కొన్ని కలవుకదా! అట్లున్న కొన్ని చరిత్రలను ప్రస్తావించుచు, ఇవి అన్నియు నీ భక్తులకు కర్ణామృతచరిత్రములు సుమా! అనుచు కూరేశులిందు పల్కుచున్నారు. ఈశ్లోకముతో కృష్ణావతార చరిత్ర పరిసమాప్తమగుచున్నది.

**(వారాణసీదహనపౌండ్రకభంగ)** – కాలమునుబట్టి పౌండ్రకవాసుదేవుని భంగము ముందు, వారాణసీదహనము తరువాత జరిగినవి అగుటచే, క్రమమునుమార్చి అన్వయింపనగును. పౌండ్రకవాసుదేవుడొక ప్రభువు. వాసుదేవుడను పేరును కలవాడు. కొందఱు మూర్ఖులు అతని చుట్టు చేరి, "నీవే నిజమైన వాసుదేవుడవు" అనుచు అతనిని పొగడి, గొప్పగా పల్కుచుండిరి. అతడును పరమమూర్ఖుడగుటచే వారి మాటలను నిజమని నమ్మి, తననే వాసుదేవునిగా భ్రమించి, వక్షఃస్థలమును కాల్చుకొని, శ్రీవత్సమను మచ్చను ఏర్పరచుకొని, శంఖచక్రములను, కిరీటమును నిర్మింపజేసి, వానిని దాల్చి, ఒక దూతను పిలచి – "నీవు కృష్ణుని వద్దకుపోయి, నా పేరును చెప్పి, నేను వాసుదేవుడనైయుండగా, నీవు శంఖచక్రములను ధరింపరాదు. నేటినుండి వానిని నీవు విడువవలెను. లేనిచో, యుద్ధమునకు సన్నద్ధుడవగుము" అని తెలిపి రమ్మనెను. అతడును అట్లే శ్రీకృష్ణునివద్దకు పోయి తెలుపగా,



కృష్ణుడు అందులకు నవ్వి, పౌండ్రకునిపై కోపించి, గరుడారూఢుడై అతనితో యుద్ధము చేసి, సుదర్శనముతో వధించెను. ఈ వార్తను అతని స్నేహితుడగు కాశీరాజు విని, కృష్ణుని, మిగిలిన యాదవులను, ద్వారకానగరమును నశింపజేయవలెనని తలచి, ఒక పిశాచమును సృష్టించి ప్రయోగించెను. ఆ పిశాచము ద్వారకకు పోయి జనులను బాధింపసాగినది. ఈ విషయమును వినిన శ్రీకృష్ణుడు అపుడు ద్యూతములో ఆసక్తుడైయుండుటచే, తాను స్వయముగా పోకుండ, తన మనస్సును తెలిసి ప్రవర్తించు **"అఱముయలాఴి"** అని కీర్తింపబడు శ్రీ సుదర్శనమును ప్రయోగింపగా, ఆదివ్యాయుధము ఆ పిశాచమును కాశివరకు తఱిమి కొట్టి, దానివెంట వచ్చిన గణములను, ఆ కాశీనగరమును దహించి, తిరిగివచ్చెను – అను ఐతిహ్యము పురాణప్రసిద్ధము. ఇది **"వారణాసీ హరపురీ భవతా విదగ్ధా"** అను అతిమానుషస్తవశ్లోకములో కూడ కూరేశులచే ప్రస్తుతము.

**(భౌమభంగకల్పద్రుమాహరణ)** – భౌమబ్దము ఇచట భూమీసుతుడగు నరకాసురుని తెలుపును. భగవానుడు వరాహావతారమును ఎత్తి, భూమిని తన దంష్ట్రతో గుచ్చి, ఉద్ధరించినపుడు, భగవానుని స్పర్శవలన భూదేవికి కుమారుడుగా నరకుడు జన్మించెను. అసమయములో జరిగిన కలయికవలన జన్మించినవాడగుటచే ఆసురప్రకృతిని కల్గిన నరకుడు ప్రాగ్జ్యోతిషమను పట్టణమును రాజధానిగా చేసికొని, సకలజనులను హింసించుచు, దేవసిద్ధగంధర్వాది కన్యలను పలువురను బలాత్కారముగా అపహరించుకొని పోయి, వారిని వివాహము చేసికొనదలచి, తన అంతఃపురములో బంధించెను. అతడు వరుణుని ఛత్రమును, మందరగిరిశిఖరమగు రత్నపర్వతమును. దేవమాతయగు అదితి కుండలములను అపహరించుటయే గాక, ఇంద్రుని ఐరావతమను గజమును బలవంతముగా తీసికొనిపోవలెనని వేచియుండగా, దీనిని గమనించి భీతిల్లిన ఇంద్రుడు శ్రీకృష్ణునివద్దకు వచ్చి కాపాడుమని మొఱపెట్టెను. అపుడు శ్రీకృష్ణుడు గరుడుని పిలిపించి, సత్యభామాసహితుడై, గరుడునిపై అధిరోహించి నరకుని నగరమును, చేరి, చక్రాయుధమును ప్రయోగించి, అతని మంత్రులగు మురుడు మొదలగు పలువురు అసురులను, చివరకు ఆ నరకుని సంహరించెను. అతడు చెఱలో పెట్టిన పదునాఱువేలనూర్గురు కన్యకలను తాను స్వీకరించి, నరకుడు అపహరించిన అదితికుండలములను ఆమెకు తిరిగి ఇచ్చెను. సత్యభామతో పాటు గరుడునిపై ఎక్కి దేవలోకమునకు వెడలెను. అపుడు ఇంద్రుని భార్య ఇంద్రాణి సత్యభామకు సకలోపచారములను చేసినది. దేవతలకే తగిన పారిజాతపుష్పమును మానవవధువగు ఈమెకు సమర్పింపలేదు. అందుచే సత్యభామ ఎట్లయినను ఆ పారిజాతవృక్షమును సంపాదించవలెనను కోరికను కల్గినదై శ్రీకృష్ణునితో పారిజాత వృక్షమును ద్వారకకు తీసికొననిపోవలయునని పలుకగా, అపుడు శ్రీకృష్ణుడు ఆ వృక్షమును వేళ్ళతోకూడ పెకిలించి, గరుడునిపై ద్వారకకు సత్యాసమేతుడై బయలుదేరెను. ఈ సంగతిని విని ఇంద్రాణి శ్రీకృష్ణుని అడ్డగింపవలసినదిగా ఇంద్రుని ప్రేరేపించగా, అతడు శ్రీకృష్ణుని ఎదిరించి

భంగపడెను. పిమ్మట స్వామి ఆ దేవవృక్షమును ద్వారకకు తీసికొనివచ్చి, సత్యభామ ఉద్యానవనములో నాటెను – అను ఈ వృత్తాంతముకూడ పురాణప్రసిద్ధమే.

**(శంకరజృంభణాద్యాః)** – బాణాసురుని కుమార్తె అగు ఉష శ్రీకృష్ణుని పౌత్రుడగు అనిరుద్ధుని చిత్రములో చూచి మోహించెను. చిత్రలేఖ అను ఆమె సఖి తనయోగబలముతో అనిరుద్ధుని రాత్రిలో ద్వారకనుండి తీసికొని వచ్చి ఉషవద్దకు చేర్చగా, ఆమె అతనితో ఆనందించుచు ప్రతిదినము ఉదయము అగుసరికి తిరిగి అనిరుద్ధుని ద్వారకకు చిత్రలేఖద్వారా చేర్పించుచుండెను. కొన్నినాళ్లకు ఈ సంగతిని గ్రహించిన బాణుడు కోపించి, అనిరుద్ధుని బంధించెను. పౌత్రుడు బంధింపబడుటను విని రుక్మిణి దుఃఖింపగా, ఆమెను ఓదార్చి కృష్ణుడు బాణునిపై దండెత్తి, అతని వేయిబాహువులలో రెండిటిని తప్ప మిగిలిన అన్నిటిని ఖండించెను. అనిరుద్ధుని చెఱ విడిపించి, ఉషకు అతనికిని వివాహము జరిపించెను. బాణుడు తన భక్తుడగుటచే అతనిని రక్షించుటకై సతీసమేతముగా, సపరివారముగా వచ్చిన శంకరుని శ్రీకృష్ణుడు జృంభణాస్త్రప్రయోగముతో నిరుత్తరుని చేసెను. (జృంభణమనగా ఆవులింత – ఈ అస్త్రప్రభావమువలన ఆవులింతలు మాటిమాటికి వచ్చి నిద్రావశుడగును). ఈ విషయమును పరాశరమహర్షి శ్రీవిష్ణుపురాణములో **"జృంభణాస్త్రేణ గోవిందో జృంభయామాస శంకరమ్, జృంభాభిభూత స్తు హరో రథోపస్థ ఉపావిశత్"** అని తెలియజేసెను.

**(అన్యా శ్చ భారతబలక్రథనాదయః తే క్రీడాః)** – **"మలైపురైత్తోళ్ మన్నవరుమ్ మారతరుమ్ మఱ్ఱుమ్ పలర్కులైయ నూఱ్ఱువరుమ్ పట్టழియ పార్త్తన శిలైవళైయ త్తిణ్ తేర్మేల్ మున్ నిన్ఱ శెజ్గణ్''** అనుచు పెరియాழ్వార్లు (2-1-1) సాయించినరీతిలో భారతసంగ్రామమున **"కొల్లామాక్కోల్ కొలై శెయ్దు పారతప్పోర్ ఎల్లాచ్చేనైయుమ్ ఇరునిలై త్తువిర్త్త విత్తా"** అనునట్లు ఇరు పక్షములలోని బలమును చూర్ణము చేసిన లీల–మొదలగునవి అన్నియు

**(శ్రవణామృతాని)** – నీ విషయములో నీ మహిమనుబట్టి విస్మయమును కల్గించునవి అవి కాకున్నను, నీ ఒక్కొక్క చరిత్ర చెవులకు అమృతపుసోన కదా! **"శెవికళార నిన్ కీర్త్తిక్కని యెన్నుమ్ కవికళే కాలప్పుణ్ తేనుత్తెప్ప త్తుఱ్ఱు ప్పువియిన్ మేల్ పొన్నొదుమ్ శక్కరత్తున్నైయే యాదరిక్కు మెనదావియే''** అను తిరువాయ్మొழி (2979) పాశురము ఇచట అనుసంధేయము. ఆదిపదముద్వారా చైద్యక్షపణ (శిశుపాలవధ), మాలిత్రుటన (మాలివధ), కాలయవనహననాదులును గ్రాహ్యములు. **"గ్రంథవిస్తరభయనిబంధనః సంగ్రేహణోపన్యాస ఇతి మంతవ్యమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**117. త్వం హి సుందర! వనాద్రినాథ హే! వేంకటాహ్వయమహీధ్రమూర్ధని ।**
**దేవసేవితపదాంబుజద్వయః సంశ్రితేభ్య ఇహ తిష్ఠసే సదా ॥**



వనాద్రినాథ = వనాద్రిప్రభూ!, సుందర = సుందరబాహుస్వామీ! వేంకటాహ్వయ = వేంకటమను పేరును కల, మహీధ్రమూర్ధని = పర్వతశిఖరమునందు, త్వం = నీవు, దేవసేవిత = దేవతలచే ఆరాధింపబడిన, పద + అంబుజద్వయః = పాదపద్మముల జంటను కలవాడవై, ఇహ = ఈ కొండపై, సంశ్రితేభ్యః = (నీ) దాసులకొఱకు, సదా = ఎల్లప్పుడు, తిష్ఠసే హి = వేంచేసియుండి ప్రకాశించుచున్నావుకదా!

మత్స్యావతారముతో ప్రారంభించి (మత్స్య – కూర్మ – వరాహ – నృసింహ – వామన – పరశురామ – శ్రీరామ – శ్రీకృష్ణులను) విభవావతారములను క్రమమున స్తుతించుచు కూరేశులు పూర్వశ్లోకముతో కృష్ణావతార ప్రస్తావమును ముగించిరి. పిమ్మట క్రమానుసారము సంభవింపబోవు కల్కి అవతారమునుగూర్చి స్తుతింపవలసియున్నను, దానిని రాబోవు (120)వ శ్లోకములో స్తుతింపగోరినవారై, మధ్యలో మూడు శ్లోకములతో తిరుమల అనబడు వేంకటాచలము, పెరుమాళ్‌కోయిల్ అనబడు కంచి, తిరువరఙ్గమ్ పెరియకోయిల్ అనబడు శ్రీరంగము అను మూడు ప్రధాన దివ్యదేశములను స్తుతించుచున్నారు. కోయిల్ – తిరుమలై – పెరుమాళ్ కోయిల్ – అనుచు సంప్రదాయములోనున్న క్రమమును అనుసరింపకుండ, వ్యుత్క్రమముగా ముందు తిరుమలను ప్రస్తావించుటలో ఉద్దేశ్యమేమి? అనినచో ఇదియును ఒక విధమైన క్రమమే, **"తెన్ననుయర్ పొరుప్పుమ్ దెయ్వ వడమలైయు మెన్నుమివైయే ములైయా"** (పెరియ తిరుమడల్) అనురీతిలో దక్షిణదివ్యదేశమగు ఈ క్షేత్రముతోపాటు ఉత్తరదిక్కు ఎల్లలోనున్న వడతిరువేఙ్గడమ్ అనబడు తిరుమలకు ఒక సామ్యమున్నది. కావున, ఆ క్షేత్రమునకు పర్వతరూపమున ఒక సామ్యము ఉండుటచే, అనంతరము దానిని ప్రస్తావించిరి. తదనంతరము పరిశేషన్యాయమున శ్రీరంగమును ప్రస్తుతించిరి – అని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామి వారివ్యాఖ్య. **"అతిసన్నిహితకృష్ణావతారప్రసంగేన తత్సమానయోగ క్షేమావతారతయోపస్థితః త్వ మేవ సమాశ్రితజనసర్వప్రార్థితప్రదో౽సీతి సుందరబాహు మహిమానం శ్లోకత్రయేణాహ''** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. అర్చావతారములకును, విభవావతారములకును ఒక విధమైన (సౌలభ్యగుణమును) సామ్యము ఉండుటచేతను, పాంచరాత్ర వైఖానసాది శాస్త్రములలో ఆ విధముగానే తెలుపబడుటచేతను, విభవావతారములను ప్రస్తుతించు ఈ సందర్భములో అర్చావతారములను ప్రస్తావనచేయుట సంగతమేనని వ్యాఖ్యానాంతరము. అట్లే, త్రివ్యూహపక్షమువలె, పరము – వ్యూహము – విభవము అను మూడు రూపములనే గొని, అందు విభవమును నాల్గుగా విభజించి, **"విభవ శ్చ తచ్ఛాయః సురనరతిర్యగాదిః స్వవిభవసజాతీయః ఐచ్ఛః ప్రాదుర్భావవర్గః.......తత్ర ప్రాదుర్భావాః కేచిత్ సాక్షాత్ యథా – 1.మత్స్యకూర్మాదయః, అన్యే తు ఋష్యాదివిశిష్టపురుషాధిష్ఠానేన, యథా 2.భార్గవరామకృష్ణద్వైపాయనాదయః, అపరే కాలే శక్త్యావేశేన, యథా 3.పురంజయాదిషు,**

**ఇతరే చ వ్యక్తిషు స్వయమేవావతీర్య, యథా 4.అర్చావతార–ఇతి చతుర్ధా"** – అని పరాశరభట్టరు భగవద్గుణదర్పణములో వివరించుటను గమనింపవచ్చును. కావున అర్చావతారములును ప్రాదుర్భావవర్గములోనికి చెందినవి కావున కూరేశులు ఇట్లు మధ్యలో వానిని చేర్చిరి. ఇక, ముందుగా వేంకటాచలమును స్తుతించుట ఎందులకు? అనినచో, వృషగిరి, సింహాద్రి ఇత్యాది నామములు రెండిటికిని ఉండుటచేతను, స్త్రీలకు రెండు స్తనములవలె తమిళభూమికి ఉత్తరమున, దక్షిణమున ఈ రెండు (వేంకటాద్రి, వనగిరి) పర్వతములను తిరుమఙ్గైమన్నన్ స్తనములుగా పల్కుట చేతను – అని చెప్పనగును – అని వేఱొక వ్యాఖ్య.

**(దేవసేవితపదాంబుజద్వయః సన్)** – **"శురర్‌కళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే"** అని, **"మన్దిపాయ్ వడవేఙ్గడమామలై వానవర్‌కళ్ శన్దిశెయ్య నిన్ఱాన్"** అనియును కీర్తించురీతిలో నిత్యసూరులు సేవించు పాదపద్మద్వయిని కలవాడవై – అని అర్థము. **"శుమన్దు మామలర్ నీర్ శుడర్ తూపమ్ కొణ్డు అమర్‌న్దు వానవర్‌వానవర్‌కోనుడుమ్ నమన్ఱెழుమ్ తిరువేఙ్గడమ్"** అను సూక్తియు స్మరణీయము. **"పిన్నిట్ట శడైయానుమ్ పిరమను మిన్దిరనుమ్"** అను రీతిలో ప్రాకృతదేవతలును, **"ఈశన్ వానవర్‌క్కు"** అనునపుడు తెలుపబడిన **"యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"** అని కీర్తింపబడిన నిత్యసూరులును ప్రస్తుత శ్లోకములోని దేవశబ్దముచే సూచింపబడిరి.

**(ఇహ సంశ్రితేభ్య స్సదా తిష్ఠసే)** – ఈ దివ్యదేశములో (వనగిరిలో) భక్తులకు స్వాభిప్రాయమును తెలుపుచు నిత్యము వేంచేసియున్నావు. స్వాభిప్రాయము ఏది అనగా – సంసారబంధము సమూలముగా ఛేదించినగాని నేను ఇచటినుండి లేవను – అని. **"సమాశ్రితేభ్యః"** అనునపుడు చతుర్థీవిభక్తి. **"తిష్ఠసే"** అను ఆత్మనేపద ప్రయోగము వ్యాకరణశాస్త్రానుసారము ఇట్టి అర్థమునిచ్చును. **"ప్రకాశనస్థేయాఖ్యయో శ్చ"**, **"శ్లాఘాహుఙ్ స్థాశపా జ్ఞీప్స్యమానః"** అనియుగల పాణిని సూత్రము లిచట అనుసంధేయములు. వరదరాజస్తవములో **"విశ్వస్మైవం కరిగిరిపుర స్తిష్ఠసే ఇహ"** అను ప్రయోగము కలదు. భట్టరు శ్రీగుణరత్నకోశములోని **"యత్తస్మై తిష్ఠసేఽన్యః"** అను ప్రయోగము కూడ ఇట్టిదే. వేంకటశబ్దమునకు రెండు వ్యుత్పత్తులు కలవు. **"వేఙ్గడఙ్గళ్ మెయ్‌మ్మేల్ వినైముற్ఱవుమ్"** అను సందర్భమున ఆళ్వార్లు సాయించినరీతిలో పాపములను నశింపజేయునది – అనునది మొదటి అర్థము. **"సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే"** అను పౌరాణికవచనము అనుసంధేయము. అమృతమును, సంపదను అనుగ్రహించునది అను అర్థము రెండవది. **"వేంకారోఽమృతబీజం స్యాత్ కట మైశ్వర్య ముచ్యతే, అమృతైశ్వర్యసంయోగాత్ వేంకటాఖ్య మిదం స్థలమ్"** అను పౌరాణికవ్యుత్పత్తి, **"తిరువేఙ్గడమ్ నఙ్గట్కు శమన్‌కొళ్ వీడుతఱుమ్ తడమ్ కున్ఱమే"** ఇత్యాది దివ్యసూరి ప్రయోగములు ఇచట స్మరింపతగినవి. వృత్తము రథోద్ధత.



**118. హస్తిశైలనిలయో భవన్ భవాన్ సాంప్రతం వరదరాజసాహ్వయః ।**
**ఇష్ట మర్థ మనుకంపయా దదత్ విశ్వ మేవ దయతే హి సుందర ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, హస్తిశైలనిలయః భవన్ = హస్తిశైలమును నివాసముగా కల్గినవాడవై, వరదరాజసాహ్వయః = వరదరాజ అను తిరునామమును కలవాడవై, అనుకంపయా = దయతో, ఇష్టమ్ అర్థమ్ = వారు వారు కోరిన అర్థములను, సాంప్రతం = ఇపుడు, విశ్వమ్ ఏవ = లోకమునంతటికిని, దయతే హి = నీ దయకు లక్ష్యముగా చేయుచున్నావు కదా!

శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతముగా కీర్తింపబడు దేవాధిరాజస్వామియొక్క ఔదార్యము ఇందు స్తుతింపబడుచున్నది.

**(హే సుందర భవాన్ సాంప్రతం వరదరాజసాహ్వయః హస్తిశైలనిలయో భవన్)** – సుందరబాహుస్వామీ! (**"అழకర్"** అనుపేరునుకల స్వామీ) నీవు ఇపుడు **"వరన్దరుమ్ పెరుమాళ్"** అనుపేరును కలవాడవై, హస్తిగిరిలో వేంచేసియండి – అని భావము. **"వేణ్డిற்ఱెల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్ వళ్ళల్ మణివణ్ణన్"** అనునట్లు కోరిన వరములన్నిటిని భక్తులకు అనుగ్రహించు ఉదారుడుకదా స్వామి.

**(అనుకంపయా ఇష్టమ్ అర్థం దదత్ సన్)** – కృపతో **"అర్థితార్థపరిదానదీక్షితుడ"** వై – అని అర్థము. ఇచట **"అనుకంపయా"** అనునది పెరున్దేవిత్తాయార్ అని వ్యాఖ్యానాంతరము. ఈ వ్యాఖ్యలో **"అనుకంపయా (సహ) భవన్"** కృపారూపిణియైన దేవేరితో కలసినవాడవై అని అన్వయింపబడినది. **"కృపయా పర్యపాలయత్"**, **"దేవ్యా కారుణ్యరూపయా"** అను మొదలైన ప్రమాణములిచట స్మరణీయములు. **(విశ్వ మేవ హి దయతే)** – లోకమునంతటిని అనుగ్రహించుచున్నావు. వరదరాజస్వామి మూర్తి అభయముద్రతో సాక్షాత్కరించుచున్నను, హస్తమున వరదముద్ర లేకున్నను, వరదుడను పేరు ఏర్పడుటకు కారణము – అభయప్రదానముకంటె వేఱొక గొప్పవరము లేకుండుటయేనని వ్యాఖ్యానాంతరము. అట్లయినచో, వరదముద్ర – అభయముద్రలకే భేదము లేకుండపోవునుకదా! దేశికుల హస్తిగిరిమాహాత్మ్యములోని **"ఆదియుకత్తయన్ కణ్డిడ నిన్ఱ అరుళ్ వరదర్ కాదలుయర్‌త్త కళిற்ఱై త్తిరైత్తెయిల్ కాత్తళిత్తు. వాదుయర్ తేవకురువుక్కిరఙ్గి త్తువాపరత్తిల్ శోదియ నన్దన్ కలియిల్ తొழுతెழ నిన్ఱనరే"** అను సూక్తి స్వారస్యమునుబట్టి, **"వైశ్వానర మేవ సంప్రత్యధ్యేషి"** అను ఉపనిషత్‌సూక్తినిబట్టి ఇచటకూడ **"సాంప్రతమ్"** అనుటకు బాగుగా అని అర్థము అని వేఱొక వ్యాఖ్య. దిఙ్నాగములు (దిగ్గజములు) ఇచట స్వామిని సేవించుటచేతను, గజేంద్రుని స్వామి ఇచటనే కటాక్షించెనను ఇతిహాసము చేతను, ఏనుగు ఎత్తునుకల్గిన

కొండ అగుటచేతను, ఏనుగు ఎక్కలేని శిఖరముపై స్వామిని వేంచేపు చేసి, ఒకరాజు ఆరాధించుటచేతను – ఇంకను ఇట్టి అనేకకారణములచే కంచి వరదరాజస్వామి వేంచేసియున్నకొండకు హస్తిగిరి అను పేరు కల్గినది వ్యాఖ్యానాంతరము.

చతుర్ముఖబ్రహ్మ తానొక్కడు దర్శించి, ఆనందించుట కొఱకు అశ్వమేధయాగమును చేసి, వరదరాజస్వామిని పొందెను. **"చాతకః స్త్రిచతురాన్ పయఃకణాన్ యాచతే జలధరం పిపాసయా, సోఽపి పూరయతి విశ్వ మంభసా హంత! హంత! మహతా ముదారతా"** అని, **"నెల్లుక్కిఱైత్త నీర్ వాయ్క్కాల్ వళియోడి ప్పుల్లుక్కు మాఙ్గే పొశియుమాల్"** అనియును పలుకునట్లు ఫలము ఎవనికో ఒక్కనికి మాత్రము లభించుట అను సంకోచము లేకుండ, లోకమంతయు నీ కృపను, పొంది, ఉజ్జీవించుచున్నది – అని భావము – అని. శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి రమ్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**119. మధ్యే క్షీరపయోధిశేషశయనే శేషే సదా సుందర**
**త్వం తద్వైభవ మాత్మనో భువి భవద్భక్తేషు వాత్సల్యతః ।**
**విశ్రాణ్యాఖిలనేత్రపాత్ర మిహ సన్ సహ్యోద్భవాయా స్తటే**
**శ్రీరంగే నిజధామ్ని శేషశయనే శేషే వనాద్రీశ్వర ॥**

వనాద్రీశ్వర = వనాద్రిప్రభూ! సుందర = **"అழకర్"** అను పేరును కలవాడా! మధ్యేక్షీరపయోధి = పాలసముద్రమునడుమ, శేషశయనే = ఆదిశేషుడు అను శయనముపై, సదా శేషే = ఎల్లప్పుడు శయనింతువు, త్వం = నీవు, ఆత్మనః = నీ, తద్వైభవ = అట్టి ప్రసిద్ధమైన, విభవాతారములలోని గొప్పతనము, భువి = ఈ భూలోకమున, భవద్భక్తేషు = నీపట్ల భక్తిని కలవారియందు, వాత్సల్యతః = మిక్కిలి పాశముతో, విశ్రాణ్య = అనుగ్రహించి, ఇహ సహ్యోద్భవాయాః తటే = ఇచట సహ్యపర్వతమునుండి పుట్టిన కావేరీనదీతీరములో, అఖిలనేత్రపాత్రం సన్ = అందఱి కన్నులకు లక్ష్యభూతుడవై, నిజధామ్ని = నీ నివాసమగు, శ్రీరంగే = శ్రీరంగక్షేత్రమున, శేషశయనే = ఆదిశేషుడను పడుకయందు, శేషే = పరుండియున్నావు.

**"కుడిదిశై ముడియై వైత్తు క్కుణతిశై పాదమ్ నీట్టు వడదిశై పిన్బుకాట్టి త్తెన్ తిశై యిలఙ్గై నోక్కి క్కడల్నిఱైక్కడవుళెన్దై యరవణైత్తుయిలుమ్"** అని తిరుమాలై ప్రబంధములో స్తుతింపబడినట్లు శ్రీరంగములో శయనించియున్న శ్రీరంగనాథుని కూరేశులు ఇందు స్తుతించుచున్నారు. అర్చావతారముల కన్నిటికిని మూలకందముగా క్షీరాబ్ధినాథుని, శ్రీరంగములోని స్వామిని శాస్త్రములు తెలుపుచుండుటచే – వనగిరిలో సుందరబాహుస్వామియే కావేరీనదీతీరములో ఆదిశేషునిపై – **"యావరుమ్ వన్దడి వణఙ్గ"** అనునట్లు శయనించి, సేవను అనుగ్రహించుచున్నాడను ధర్మ్యైక్యభావనతో పల్కుచున్నారు.



నూటఎనిమిది దివ్యదేశములలో ఎక్కువగా శయనసన్నివేశములలోనే స్వామి అర్చామూర్తి సాక్షాత్కరించుటచే, ఇచట శయనసన్నివేశములోనున్న శ్రీరంగనాథుని గ్రహింపవచ్చును. **"నాకత్తుణైక్కుడన్దై వెక్కా తిరువెవ్వుళ్ నాకత్తుణై యరఙ్గన్ పేరన్బిల్, నాకత్తుణై పాఱ్కడల్ కిడక్కుమ్ ఆదినెడుమాల్ అణైప్పార్ క్కరుత్తనావాన్"** అను తిరుమழிశై ఆళ్వార్లసూక్తిని ప్రస్తుతము కూరేశుల మనస్సుననున్నట్లు తోచును. భగవానుడు పాలసముద్రములో పరుండి, సేవను అనుగ్రహించుటను వేదమును – **"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే"** అని, **"దృతిం న శుష్కం సరసీశయానమ్"** – ఇత్యాదిసూక్తులద్వారా స్పష్టము చేసినది – అని వ్యాఖ్యానాంతరము.

**"క్షీరసాగరతరంగశీకరాసారతారకితచారుమూర్తయే, భోగిభోగశయనీయ శాయినే మాధవాయ"**. అను రీతిలో కీర్తింపబడు క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై పరుండియుండు స్వామి సౌందర్యము అడవికాచిన వెన్నెలగాకదా ఉన్నది. ఇది అట్లుకాకుండ, కన్నులున్నవారు అందఱు దర్శించి, ఆనందించునట్లున్న. **"తిరువరఙ్గప్పెరునకరుళ్ తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ ఆడి వరుడ ప్పళ్ళికొళ్ళుమ్"** అను రీతిని ఇచట కూరేశులు ప్రస్తావించిరి.

**(హే వనాద్రీశ్వర! సుందర!)** తిరుమాలిరుమ్శోలైలోని పర్వతమునకు ప్రభూ! సుందరబాహుస్వామీ!

**(మధ్యే క్షీరపయోధిశేషశయనే సదా శేషే)** – క్షీరాబ్ధిలో ఆదిశేషుడను పర్యంకముపై ఎల్లప్పుడు పరుండియున్నావు.

**(ఆత్మనః తద్వైభవం భువి భవద్భక్తేషు విశ్రాణ్య)** – నీ శేషశాయిత్వరూపములోని వైభవమును ఈ భూలోకములోని నీ భక్తులకు వాత్సల్యాతిశయముతో అనుగ్రహింపగోరి –**(అఖిలనేత్రపాత్రమ్ సన్)** – అందఱి నేత్రములకు గోచరుడవై –

**(ఇహ సహ్యోద్భవాయా స్తటే)** – ఇచట కావేరీతీరమున –

**(నిజధామ్ని శ్రీరంగే)** – విశేషించి నీ స్థానమైన శ్రీరంగములో – **"ప్రత్యక్షం పరమం పదమ్"** అని భూలోక వైకుంఠముగా నిర్దేశింపబడిన శ్రీరంగములో. **"శేషశయనే శేషే క్షీరాబ్ధిశాయి సాక్షాత్కారాశక్తభక్తజనవాత్సల్యాత్ తత్సేవార్థం సమస్తార్చావతారమూలకందభూత శ్రీరంగశాయీ భవసీతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**120. కల్కీ భవిష్యన్ కలికల్మదూషితాన్ దుష్టా నశేషాన్ భగవన్ హనిష్యసి ।**
**స ఏష తస్యావసర స్సుసుందర! ప్రశాధి లక్ష్మీశ సమక్ష మేవ నః ॥**

లక్ష్మీశ = లక్ష్మీనాథా, భగవన్ = జ్ఞానాదిషాడ్గుణ్యమును కలవాడా! సుసుందర = **"అழకర్"** అను పేరునుగల సుందరబాహుస్వామీ! కల్కీ = కల్కమనబడు తెల్లని గుఱ్ఱమును వాహనముగా కల్గియుండుటచే కల్కి అను పేరును కలవాడవుగా, భవిష్యన్ = అగువాడవై,

కలికల్కదూషితాన్ = కలికాలమున జనించిన పాపములచే అయోగ్యులైన, అశేషాన్ దుష్టాన్ = అందఱు దుష్టులను, హనిష్యసి = వధింపగలవు. తస్య = అట్టి అవతారమునకు, అవసరః = తగిన సమయము, స ఏషః = అది, ఇదియే, నః సమక్షమ్ ఏవ = మా కంటిముందుగానే, దుష్టాన్ = దుష్టులను, ప్రశాధి = శాసింపుము.

కల్క్యవతారము భవిష్యత్తు అగుటచే, దానిని చమత్కారముగా ఇందు ప్రస్తావించుచున్నారు. ఎపుడో చాలా కాలమునకు పిమ్మట అవతరింపగోరినట్టి ఆ అవతారమును మహాక్రూరులు నిండియున్న ఈ కాలములోనే స్వీకరింపుమనుచు కూరేశులు ఇందు స్వామిని ప్రార్థించుచున్నారు.

**(హే లక్ష్మీశ! భగవన్!)** – శ్రియఃపతినైన తిరుమాలిరుమ్‌శోలై స్వామీ!
**(కల్కీ భవిష్యన్)** – రాబోవు కాలమున కల్కివై,

**(కలికల్కదూషితాన్ అశేషాన్ దుష్టాన్ హనిష్యసి)** – కలిపాపముచే భ్రష్టులైన దుష్టశక్తులను అందఱిని సంహరింపగలవు. అందులకు నీవు ఆ సమయము కొఱకువేచియుండవలెనా?
**(తస్య స ఏషః అవసరః సుసుందర)** – సుందరబాహుస్వామీ! అందులకు ఈ సమయమే మిక్కిలి తగినదిసుమా!

**(నః సమక్ష మేవ ప్రశాధి)** – మాకంటిముందే పాపులను పాఱద్రోలవలెను. కల్క్యవతారమును ఎత్తి తొలగింపవలసిన పాపులు అపుడే నిండియున్నారని కూరేశుల వాక్కువలన స్పష్టమగుటచే, ఆ సమయము ఎంత క్లిష్టమైయుండెనో అర్థమగుచున్నది.

కలియుగము చివరలో భగవానుడు శంబలగ్రామములో కౌశికగోత్రమునకు చెందిన విష్ణుయశస్సు అను మహానుభావునకు కుమారుడై జన్మించి, **"తురుష్కయవనాదిభిః జగతి జృంభమాణం భయమ్"** అనునట్లు దుష్టులవలన సత్పురుషులకు ఏర్పడిన క్లేశములను బాపి, రక్షించును – అని ఇతిహాస పురాణములలో కలదు. తెల్లని గుఱ్ఱముపైకి ఎక్కి ఖడ్గమును ఆయుధముగా ధరించి, సేన వెంటనే రాగా, ఈ లోకములో దుష్టులున్నచోటికి వెడలి, వారిని నిరసించు రీతిలో **"పునః యుగాంకురం భువి కృపాణధారాధరః"** అనుచు శ్రీదేశికులు సాయించినట్లు ఈ అవతారము సంభవింపగలదు. సుందరబాహుస్వామీ! నీవు కల్కివి అగుటకు కలియుగాంతమువరకు వేచియుండవలసిన అవసరము లేదు. ఇపుడు క్రిమికంఠుడు, నాలూరాన్ మొదలగువారు సత్పురుషులకు చేయు అపకారములు చాలవా! ఈ సమయమే కదా ఆ అవతారమును ఎత్తదగిన కాలము – అనుచున్నారు కూరేశులు. మిగిలిన అవతారములను నీవు ఎత్తినపుడు **"నైవాలభామహి జనిం హతకా స్త ఏతే"** అనురీతిలో నిర్వేదముతో "నేను ఆ సమయమున పుట్టలేకపోతినే!" అనుచు విచారించిన నా కొఱత తీఱునట్లు ఇపుడే కల్కివై అవతరించి, మాకంటిముందే దుష్టనిబర్హణమును



చేసి, కృపజేయము అనుచున్నారు. **"సర్వేషు చావతారేషు విష్ణోః శ్రీ రనపాయినీ"** అను పరాశరమహర్షి, సూక్తినిబట్టి, కల్క్యవతారమునందుకూడ లక్ష్మీసంబంధవను నిర్దేశింపగోరి **"లక్ష్మీశ"** అని సంబోధించిరి – అని వ్యాఖ్యానాంతరము. **"త్వయా ఇదానీ మేవ కల్క్యవతారం కృత్వా, దుష్టానాం శిక్షా న కృతా చేత్ ఆశ్రితానా మస్మాకం నాశో భవే దితి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము ఉపజాతి.

**121. ఈదృశా స్త్వదవతారసత్తమాః సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్ ।**
**త్రాతు మేవ న కదాచి దన్యథా తేన సుందర! భవంత మాశ్రయే ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, ఈదృశాః = పూర్వము వర్ణింపబడిన అవతారములవంటివి, సర్వ ఏవ = అన్నియును, త్వత్ అవతారసత్తమాః = నీ అవతారములలో గొప్పవి, భవత్ + ఆశ్రితాన్ = నిన్ను శరణుపొందిన, జనాన్ = జనులను, త్రాతుమ్ ఏవ = కాపాడుటకొఱకే అయినవి, కదాచిత్ = ఏసమయమునందైనను, అన్యథా న = వేరు ప్రయోజనములు కల్గినవి కావు, తేన = ఆ కారణముచే, భవంతమ్ = నిన్ను, ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను.

ఈ శ్లోకములో కూరేశులు వనగిరిలోని స్వామి చరణములందు స్వాభిమతసిద్ధికొఱకు ప్రపత్తిని చేయుచున్నారు. ప్రపత్తిని చేయుటకు ఆపేక్షితములైన పలు గుణములను పూర్వము అనేకవిధములుగా ప్రస్తావించియుండుటచే, ఇందు ప్రపత్తిని చేయుచున్నారు. **'ఏవం బహుప్రకారేణ ఆశ్రితజనోపకారకాన్ అవతారాన్ త్వమేవాఽకరోరితి బహుశోఽభిహితం సుందరబాహువిహార ముపసంహృత్య, తత స్త్వమేవాఽశ్రయణీయ ఇతి శరణం వ్రజతి"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక.

**(సుందర! ఈదృశాః త్వదవతారసత్తమాః సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్ త్రాతు మేవ)** – సుందరబాహుస్వామీ! ఇట్టి నీ మిక్కిలి గొప్పవైన అవతారములన్నియు **"పరిత్రాణాయ సాధూనామ్"** అనెడి సూక్తినిబట్టి సాధుపరిత్రాణముకొఱకే.
**(కదాచిత్ అన్యథా న)** – అవతారముల కన్నిటికిని ఇదియే ప్రయోజనముతప్ప, వేఱు ప్రయోజనము లేదు.
**(తేన భవంతమ్ ఆశ్రయే)** – ఈ క్షేత్రమున నీవు వేంచేసియుండుటయును సాధుపరిత్రాణము కొఱకే కావున, నన్ను కూడ ఒక సాధువుగా తలచి రక్షింపవలెనని నిన్ను శరణుపొందుచున్నాను – అని తాత్పర్యము. **"తేన – సుందరత్వేనావతారస్యాపి ఆశ్రితపరిత్రాణఫలత్వే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. భూభారములను తొలగించుటకై భగవానుడు పరిగ్రహించిన అవతారములు దశావతారములనుచు, వానిని ఒక క్రమములో పెద్దలు నుడువుదురు. ఆ క్రమములో కూరేశులు ఆ అవతారములను ఇంతవరకు పలు

శ్లోకములందు అనుభవించిరి. ఈ నాటికిని కళ్ళ్ఁర్ వేగైనదిలో చిత్రాపౌర్ణమినాడు విహరించుచు, రాత్రి అంతయు దశావతార అలంకారవైభవముతో సేవను అనుగ్రహించుటను ప్రత్యక్షముగా దర్శింపవచ్చును. “భగవదవతారములు ఇన్నియే అని భావింపరాదు. హంస హయగ్రీవ పద్మనాభ న్యగ్రోధశాయి – శ్రీపతి – నర – నారాయణ – ధర్మాత్మజ – దధివామన – సారస్వత – గజేంద్రవరదాది అవతారములును పలు కలవు. వీని సన్నివేశములు, ప్రయోజనములు, వీనికి సంబంధించిన ప్రమాణములును శ్రీపరాశరభట్టరు భగవద్గుణదర్పణములో వివరముగా తెలిపిరి. ఈ విధమైన అవతారములు 37 కలవు అని పెద్దలు లెక్కించిరి. అంశ – ఆవేశాద్యవతారము లిందు చేరవు. మత్స్య – వామన – కూర్మ – హంస – దత్తాత్రేయాది అవతారములలోవలె సాధ్యమైనంతవరకు ఎవరికిని వధింపకుండ, సాధుపరిత్రాణము మాత్రమే లక్ష్యముగా ఎత్తిన అవతారములే ఎక్కువ. దుష్కృద్వినాశమును చేయకుండ సాధుపరిత్రాణము సాధ్యము కాని స్థితిలోనే దుష్టులను స్వామి శిక్షించును. ఇది స్ఫురించుటకొఱకే **“పరిత్రాణాయ సాధూనామ్”** అనుచు మొదటగా సాధుపరిత్రాణమును తెలిపి, పిమ్మట దుష్టనిబర్హణమును అనుషంగికఫలముగా శ్రీకృష్ణుడు తెలిపెను. ఈ అంశమును కూరేశులు ప్రస్తుతశ్లోకమున వివరించిరి” అని వ్యాఖ్యానాంతరము. **“జ్ఞానశక్తిసౌశీల్యవాత్సల్యాదిగుణసంపన్న మాశ్రితరక్షణైకదీక్షితం భవంతం శరణం గతోఽస్మీత్యర్థః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము రథోద్ధత.

**122. త్వా మామనంతి కవయః కరుణామృతాబ్ధిం**
**త్వా మేవ సంశ్రితజనిఘ్న ముపఘ్న మేషామ్ ।**
**యేషాం వ్రజ న్నిహ హి లోచనగోచరత్వం**
**హై సుందరాహ్వ! పరిచస్కరిషే వనాద్రిమ్ ॥**

హై సుందరాహ్వ = **“అఁకర్”** అను పేరునుకల స్వామీ!, కవయః = యథార్థజ్ఞానమునుకల ఋషులు. నిత్యసూరులును, త్వాం = నిన్ను, కరుణామృతాబ్ధిం = కరుణ అనెడి అమృతముయొక్క సముద్రముతో సమానముగా, అమనంతి = పల్కుదురు, త్వామ్ ఏవ = నిన్నే, సంశ్రితజనిఘ్నం = శరణాగతుల జన్మను నశింపజేయువానినిగా, ఏషాం = ఈ శరణాగతులకు ఉపఘ్నం = అలంబనముగా, అమనంతి = పల్కుదురు, ఏషామ్ = ఇట్టి శరణాగతుల, లోచనగోచరత్వం = కన్నులకు కనపడు స్థితిని, ఇహ = ఈ ప్రకృతమండలములో, వ్రజన్ = పొందుచు, త్వం = నీవు, వనాద్రిం = తిరుమాలిరుమ్శోలై పర్వతమును, పరిచస్కరిషే హి = అలంకరించుచున్నావు కదా!

పూర్వశ్లోకమున చేసిన శరణాగతి తప్పక ఫలించియే తీరవలెననుటను నాల్గు శ్లోకములలో కూరేశులు అనుగ్రహించుచున్నారు.



**(సుందరాహ్వ! త్వాం కవయః కరుణామృతాబ్ధిమ్ ఆమనంతి)** – సుందరబాహుస్వామీ! అప్రత్యక్షతత్త్వార్థసాక్షాత్కారసమర్థులగు పరాశరపారాశర్యాదులు నిన్ను కరుణాసముద్రుడవని పల్కుచున్నారు. **“కవయః క్రాంతదర్శినః”** అని కదాసూక్తి. **“కవయః కవనశీలాః భగవద్వాల్మీకి పరాశరపారాశర్యపరాంకుశపరకాలప్రభృతయ ఇత్యర్థః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **“కరుణామృతాబ్ధిమ్”** అనుటకు **“కరుణైవ అమృతమ్, తస్య అబ్ధిమ్ ఉత్పత్తిస్థానమ్”** అని, **“యద్వా, కరుణాయా అమృతాబ్ధిమ్ క్షీరసాగరమ్ కరుణాపరిపూర్ణమ్”** అను ఈ రెండు శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని వివరణములు అనుసంధేయములు.

**(త్వా మేవ సంశ్రితజనిఘ్నమ్ ఏషాం ఉపఘ్నమ్ అమనంతి)** – ఆశ్రితుల సంసారవిమోచకునిగా, వారికి ఆచార్యునిగా నిన్నే పల్కుదురు.

**(ఇహ హి ఏషామ్ లోచనగోచరత్వం వ్రజన్ వనాద్రిం పరిచస్కరిషే)** – ఈ భూమిలో వీరి కన్నులకు గోచరుడవై, వనగిరిని అలంకరించువాడవై – అనగా – వనగిరికే అలంకారమైయున్నావు – అని అర్థము. పరాశరపారాశర్యాది మహర్షుల వచనములు వట్టివి కాకుండునట్లు అనుగ్రహించి తీరవలెను సుమా! – అని కూరేశహృదయము. **“ఓయుమ్ మూప్పు ప్పిఱప్పిఱప్పు ప్పిణి వీయుమాఱు శెయ్‌వాన్ తిరువేఙ్గడత్తాయన్”** అని, **“పఱ్ఱిలార్ పఱ్ఱనిన్రాన్”** అనియు ఆళ్వార్లు కీర్తించినట్లు **“యావరుమ్ వన్దు అడివణఙ్గ”** అనునట్లు వనగిరిలో అందఱికి సమాశ్రయణీయుడవై వేంచేసియున్న నీ సౌలభ్యమెంతటిది! అని కూరేశులు ఆశ్చర్యపడుచున్నారని వ్యాఖ్యానాంతరము. ఆశ్రితులకు పట్టుకొమ్మవు, శరణాగతులకు సులభుడవు నీవే – అని అందు తెలుపబడినది. **“నిర్హేతుకకృపాపరిపూర్ణత్వాత్, శరణ్యత్వాత్, శరణత్వాచ్చ శరణవరణసౌకర్యాయ సమాశ్రితనేత్రపాత్రం భవన్ వనాద్రిభవనో భవతీతి భావః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**123. ఆశక్యం నో కించి త్తవ న చ న జానాసి నిఖిలం**
**దయాళుః క్షంతా చాఽ ప్యహ మపి న చాఽగాంసి తరితుమ్ ।**
**క్షమోఽత స్త్వచ్ఛేషో హ్యగతి రితి చ క్షుద్ర ఇతి చ**
**క్షమస్వైతావన్నో బల మిహ హరే! సుందరభుజ ॥**

సుందరభుజ = సుందరబాహుస్వామీ! హరే = హరీ!, తవ = నీకు, కించిత్ = కొంచెముకూడ, నో అశక్యమ్ = సాధ్యముకానిది లేదు, నిఖిలం = సమస్తమును, న జానాసి = తెలియవు, ఇతి న చ = అనునదియులేదు (అన్నిటిని తప్పక తెలిసికొందువు), దయాళుః = దయాస్వభావుడవు, క్షంతా చ = క్షమించువాడవును, అసి = అగుచున్నావు, అహమ్ అపి = నేనుకూడ, ఆగాంసి = బలీయములైన పాపములను, తరితుమ్ =

అనుభవించియో, ప్రాయశ్చిత్తముచేతనో పోగొట్టుకొనుటకు, న క్షమః హి = సమర్థుడను కానుకదా!, అతః = అందుచే, త్వచ్ఛేషః = నీకు శేషభూతుడను, అగతిః ఇతి చ = గతిలేనివాడను అనియును, క్షుద్రః ఇతి చ = **"శీలమిల్లా చ్చిఱియన్"** అనునట్లు క్షుద్రుడను కావున, క్షమస్వ = (నేను చేసిన పాపములను) క్షమింపుము, ఇహ = ఈస్థితిలో, నః = మాకు (నావంటివారికి), ఏతావత్ = ఇంత మాత్రమే, బలమ్ = బలము.

అన్ని పాపములను అనుభవించి తీర్చుకొనుటయో, లేక, వానిని ప్రాయశ్చిత్తము ద్వారా నశింపజేసికొనుటయో నాకు సాధ్యము కాదు. "దీనికి నేనేమి చేయగలను" అని సర్వశక్తివి అగు నీవు పలుకరాదు. **"ఉళ్ళువారుళ్లిరెల్లామ్ ఉడనిరున్దఱిది"** అనునట్లు నన్ను సంస్కరించి, నీకు దాసునిగా చేసికొనుటకు నీకు వీలగును. "వీడు పల్కునది నిజమా! కాదా!" అని అన్నిటిని నీవే తెలియగలవు. **"మేరుమందరమాత్రోఽపి రాశిః పాపస్య కర్మణః, కేశవం వైద్య మాసాద్య దుర్వ్యాధి రివ నశ్యతి"** అనుచు గారుడమున తెలిపినట్లు అన్ని పాపములను నీవే పోగొట్టగలవు. "నీవు శేషివి - నేను శేషభూతుడను" అను శేషత్వజ్ఞానమును కలవాడను, ఉపాయదారిద్ర్యము, హేయపురుషార్థరుచి, కార్పణ్యాదులున్నందువలన క్షుద్రుడను. పిడికెడు ధాన్యముకొఱకు వెలకట్టుటకు వీలులేని మాణిక్యమును ఇచ్చువారివలె, **"పండితై రర్థకార్పణ్యాత్ పణ్యస్త్రీభి రివ స్వయమ్, ఆత్మా సంస్కృత్య సంస్కృత్య పరోపకరణీకృతః"** అని పరిహసించు స్థితిలో నున్నవాడను. వీనిని అన్నిటిని తలచి, నేను చేసిన, అనాదికాలప్రయుక్తమైన బంధహేతువులు, మోక్షప్రతిబంధకములును అగు పాపములును క్షమింపవలెను - అని భావము. **"అజ్ఞానాదథవా జ్ఞానాత్ అపరాధేషు సత్స్వపి, ప్రాయశ్చిత్తం క్షమస్వేతి ప్రార్థనేనైవ కేవలమ్"** అనెడి వచనమిచట స్మరణీయము - అని వ్యాఖ్యానాంతరము. ఇట్లు కూరేశులు తమను క్షుద్రుడని నిర్దేశించుకొనుట మనవంటివారు అనుసరింపతగిన విధమును తెలుపుకొఱకే. దీనిని **"అమర్యాదః క్షుద్రః"** ఇత్యాది యామునసూక్తిద్వారా, **"వాడినేన్ వాడి"** ఇత్యాది ఆళ్వార్ల సూక్తులద్వారా తెలియనగును. ఇట్లు కూరేశులచే ఈ శ్లోకములో గోప్తృత్వవరణము, మహావిశ్వాసము, అకించన్యము అనన్యగతిత్వము మొదలగునవి శరణాగతియొక్క సాక్షాత్ అంగములు అని తెలుపబడినవి. ఇచట **"సర్వజ్ఞోఽపి సర్వేశః సదా కారుణికోఽపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్షాపేక్షాం ప్రతీక్షతే"** అను ప్రమాణమును, **"పాపీయసోఽపి.....త్వత్ జ్ఞానశక్తికరుణాసు సతీషు"** అనెడి అతిమానుషస్తవసూక్తిని స్మరింపనగును. శ్లోకములో **"అతః"** అనుటకు - **"తవ సర్వజ్ఞత్వసర్వశక్తిదయాక్షమావిశిష్టత్వాత్, మమ చ దుష్కృతనిష్కృత్యక్షమత్వా చ్చ"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో అర్థము తెలుపబడినది. **"నః ఏతావత్ బలమ్"** అనుటకు నీ జ్ఞానశక్త్యాదులను అనుసంధించుటయు, దాసులమగు మా అజ్ఞాన - అశక్తులను అనుసంధించుటయు మాత్రమే ఇచట మావద్దగల బలము - అనగా - సాధనము అనియు అర్థము. నాల్గవపాదములో **"నో బలమ్"** అనునపుడు **"నః అబలమ్"** అని విడదీసి **"నః ఏతావత్ అబలమ్ క్షమస్వ"** అని అన్వయించువారును కలరు. ఇచట అబలమనగా అపచారము-అని అర్థము. శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో **"క్షుద్రః ఇతి క్షమస్వ"** అనునపుడు **"క్షుద్రపురుషార్థతృప్త ఇతి క్షమస్వ"** అని, **"యద్వా, క్షుద్ర ఇత్యకించన ఇతి చ అగాంసి క్షమావిషయం కురుష్వ"** అని, - **"భవతో జ్ఞానశక్తిదయాక్షమావైశిష్ట్యమ్ అనుసంహితమ్, మమ చ దాసత్వాకించన్యానన్యగతిత్వనిభృతత్వంచ బలం సాధనం మిత్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో తెలుపబడినది. వృత్తము శిఖరిణి.



**124. లంకాయుద్ధహతాన్ హరీన్ ద్విజసుతం శంబూకదోషా న్మృతం**
**సాందీపిన్యభిజ మ్మృతం ద్విజసుతాన్ బాలాం శ్చ వైకుంఠగాన్ ।**
**గర్భ శ్చార్జునిసంభవం వ్యదధర స్స్వేనైవ రూపేణ య**
**స్స్వాభీష్టం మమ మద్గురో శ్చ దదసే నో కిం వనాద్రీశ్వర ॥**

వనాద్రీశ్వర = వనాద్రి అను తిరుమాలిరుమ్‌శోలై పర్వతమునకు స్వామీ!, యః = ఏ నీవు (రామకృష్ణాద్యవతారములను ఎత్తినపుడు), లంకాయుద్ధహతాన్ = లంకలో జరిగిన యుద్ధములో వధింపబడిన, హరీన్ = వానరములను, శంబూకదోషాత్ = శంబూకుడనెడి, శూద్రమునియొక్క దోషముల వలన, మృతం = మరణించిన, ద్విజసుతం = బ్రాహ్మణపుత్రుని, మృతం = మరణించిన, సాందీపిన్యభిజం = సాందీపిని అనెడి నీ ఆచార్యునకు జన్మించిన, సుతం = కుమారుని, బాలాన్ = చిన్నవయస్సులోనున్నవారగు, వైకుంఠగాన్ = కార్యవైకుంఠలోకమునకు చేరిన, ద్విజసుతాన్ = వైదికపుత్రులను, అర్జునిసంభవం = అర్జునుని సుతుడగు అభిమన్యువునకు (ఉత్తరయందు) జన్మించిన, గర్భం చ = గర్భమును, స్వేన రూపేణ ఏవ = అదే రూపముతో, వ్యదధరః = విశేషముగా ఉద్ధటించితివో (రక్షించితివో), సః = ఆ నీవు, మమ = నాకు, మద్గురోః చ = నా ఆచార్యులు అగు భగవద్రామానుజులకును, అభీష్టం = అపేక్షితమును, కిం నో దదసే = ఎందులకు ఇచ్చుటలేదు?

పూర్వము రామకృష్ణాద్యవతారములో భగవానుడు చేసిన అతిమానుషమహోపకార విశేషములను ఇందు కూరేశులు ప్రస్తావించుచు, అట్టి విలక్షణశక్తి యుక్తుడవగు నీవు మా అపేక్షితమును పూర్తిచేయకుండనుందువేమి స్వామీ! అని హార్దముగా పల్కుచున్నారు.

**(లంకాయుద్ధహతాన్ హరీన్)** - లంకలో నడచిన రాక్షసయుద్ధములో వధింపబడిన వానరవీరులను ఇంద్రుడు శ్రీరాముని ఆజ్ఞానుసారము బ్రతికించిన ఘట్ట మిది. లంకాయుద్ధసమయమున శ్రీరామునికొఱకు పోరాడి, పలువురు వానరులు మరణించిరి. యుద్ధానంతరము దేవేంద్రుడు శ్రీరామునివద్దకు వచ్చి, ఏదైనను కైంకర్యమును చేయు అవకాశమును తనకీయవలసినదని ప్రార్థించెను. అపుడు శ్రీరాముడు - **"మమ హేతోః**

**పరాక్రాంతాః యే గతాః యమసాదనమ్, తే సర్వే జీవితం ప్రాప్య సముత్తిష్ఠంతు వానరాః "** అని అనుగ్రహింపగా, ఇంద్రుడు – **"సముత్థాస్యంతి హరయః సుప్తా నిద్రాక్షయే యథా"** అని పల్కి వానరులు పునరుజ్జీవితులగునట్లు చేసెను.

**(శంబూకదోషా న్మృతం ద్విజసుతమ్)** – తపస్సును చేయుటకు తగని శూద్రకులసంభవుడైన శంబూకుడు తపస్సు చేయగా, తత్ఫలముగా అకాలమృత్యువు వాతపడిన అయోధ్యలోని బ్రాహ్మణకుమారుడు భగవదనుగ్రహముచే తిరిగి బ్రతికెను. త్రేతాయుగమున శ్రీరాముడు రాజ్యము చేయునపుడు శంబూకుడు అను శూద్రుడు తలక్రిందుగా నిలచి, తపస్సు చేయసాగెను. ఈ పాంచభౌతికశరీరముతోనే దేవలోకమునకు పోవలెనని అతని కోరిక. ఆ యుగధర్మానుసారము శూద్రుడు తపస్సును చేయుటకు అర్హుడు కాదు. **"రాజదోషైః విపద్యంతే ప్రజా హ్యవిధిపాలితాః, అసద్వృత్తే హి నృపతౌ అకాలే మ్రియతే జనః"** అనునట్లు, అట్టి అధర్మఫలముగా అయోధ్యలోని బ్రాహ్మణ బాలకుడొకడు అకాలమున మరణించెను. చనిపోయిన తన కుమారుని శ్రీరాముని సమక్షమునకు తీసికొచ్చిన అతని తండ్రి, నా బాలుడు నీ అధర్మపాలనమువలననే మరణించెను. ఇతని బ్రతికించి పుణ్యము కట్టుకొనుము" అని రోదించెను. అతనిని ఓదార్చిన శ్రీరాముడు, జరిగిన సంగతిని నారదుని వలన తెలిసికొని, పుష్పకవిమానము రప్పించి, దానిపైనెక్కి, శంబూకుని వద్దకు పోయి, అతనిని వధించెను. అపుడు దేవేంద్రాది దేవతలు అచటికి వచ్చి శ్రీరాముని స్తుతించునపుడు, బ్రాహ్మణబాలుని బ్రతికింపవలసినదిగా స్వామి పల్కెను. దేవతలపుడు – **"యస్మిన్ ముహూర్తే కాకుత్థ్స శూద్రోఽయం వినిపాతితః, తస్మిన్ ముహూర్తే బాలోఽసౌ జీవేన సమయుజ్యత"** అనిరి. వెంటనే ఆ బాలుడును తిరిగి బ్రతికెను – అను ఈ కథ ఉత్తరామాయణములోని 76వ సర్గలో కలదు.

**(సాందీపిన్యభిజం మృతమ్)** – ఈ వృత్తాంతము కృష్ణావతారసందర్భములోని, **"మాదవత్తోన్ పుత్తిరన్ పోయ్ మతికడల్ మాణ్డానై"** అని పల్కినట్లు ప్రభాసతీర్థములో మునిగి మరణించిన సాందీపిని అను తన ఆచార్యుని పుత్రుని శ్రీకృష్ణుడు తిరిగి బ్రతికించిన వృత్తాంతమిది.

**(వైకుంఠగాన్ ద్విజసుతాన్ బాలాం శ్చ)** – **"పిఱప్పకత్తే మాణ్డొళిన్ద పిళ్ళైకళై నాల్వరైయుమ్"** అనెడి భట్టనాథుల సూక్తిలో తెలుపబడినట్లు కార్యవైకుంఠమును చేరిన బ్రాహ్మణపుత్రులను నల్గురను స్వామి తిరిగి జీవింపజేసిన వృత్తాంతముకూడ శ్రీకృష్ణావతారములోనిదే.

**(అర్జునిసంభవం గర్భం చ)** **"మరుమకన్‌తన్‌శన్తతియై ఉయిర్‌మీట్టు"** అని, **"ఉత్తరైతన్ శిఱువనైయు ముయ్యక్కొణ్డ వుయిరాళన్"** అనియుగల పెరియాళ్వార్ పాశురములో తెల్పిన రీతిలో అశ్వత్థామ ప్రయోగించిన అపాండవాస్త్రఫలముగా కాలిన కట్టెవలె పుట్టిన అభిమన్యు పుత్రుని **"పాదేన కమలాభేన పస్పర్శ"** అనురీతిలో తన శ్రీపాదముతో అపాదమస్తకము



స్పృశించి. **"యది మే బ్రహ్మచర్యం స్యాత్......తేన జీవతు బాలకః"** అని ప్రతిజ్ఞ చేసి, శ్రీకృష్ణుడు బ్రతకించిన ఉదంతమిది. ఈ మూడును **"సంజీవయ న్నపి మృతం సుత ముత్తరాయాః"** (58) ఇత్యాది అతిమానుషస్తవశ్లోకములో ప్రస్తావింపబడినవి. (ఆస్తవవ్యాఖ్యలో వివరింపబడినవికూడ.)

**(మమ మద్గురో శ్చ స్వాభీష్టం నో దదసే)** – దాసుడనగు నాకు, నా ఆచార్యులు అగు భగవద్రామానుజులకును అభీష్టమును అనుగ్రహింపకుండనుందువా! తప్పక అనుగ్రహింతువు అను నమ్మకమున్నది స్వామీ! అనియు భావము. కూరేశుల అభిమతము – భగవద్రామానుజుల పాదసన్నిధిలో వాసము, వారి నిత్యకైంకర్యమును. శ్రీరామానుజుల అభీష్టము శ్రీరంగసన్నిధివాసము, ఆ స్వామి కైంకర్యమును.

ఇచట **"యః స్వాభీష్టమ్"** అని తాళపత్రప్రతులలో పాఠము కన్పించుచున్నది. అపుడు **"మమ – స్వ"** అనునవి పునరుక్తి అగును. కావున దీనిని నివారించుటకై **"సు ఆ, అభి"** అను మూడు ఉపసర్గలున్నవని తలచి, అర్థమును చెప్పనగును. **"త్వత్పాదభక్తిజ్ఞానాభ్యాం ఫల మన్యత్ కదాచన, న యాచేత్ పురుషో విష్ణుం యాచనా న్నశ్యతి ధ్రువమ్"** అని పురాణములు తెలుపుచుండగా, ఇట్లు క్షుద్రులలె కూరేశులు భగవానుని ప్రార్థింపతగునా? అని శంకింపనవసరము లేదు. నిత్యము మనము **"శ్రీరంగ శ్రీ శ్చ వర్ధతామ్"** అనుచు ప్రార్థించినట్లే ఇదియును. దేశికులును **"భక్తిజ్ఞానాభివృద్ధిం పరిచరణగుణాన్ సత్య మృద్ధిం చ యుక్తాం, నిత్యం యాచే దనన్య స్తదపి భగవత స్తస్య యద్వాఽప్తవర్గాత్"** అని న్యాసవింశతిలో పల్కిరికదా! – అని వ్యాఖ్యానాంతరము. **"రామానుజగురో రభిలషితం శ్రీరంగనాథసన్నిధి వాసతత్పరిచర్యాదికం, మమాభిలషితం భగవద్రామానుజసన్నిధివాసం తత్పరిచర్యాదిక మితి వివేకః. కాలాంతరమృతాన్ అపునరావృత్తియుక్తలోకాంతరగతా నపి మరణకాలీనాకారణేనైవ పునరానీతవత స్తవ ఆశక్యం న కిమపి, వయ మప్యాశ్రితాః, కిమిత్యభీష్టం న దదాసీ త్యర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

> **125.** **అయోధ్యికాన్ సపశుకీటతృణాం శ్చ జంతూన్**
> **కిం కర్మణో ను బత! కీదృశవేదనాఢ్యాన్ ।**
> **సాయుజ్యలభ్యవిభవాన్ నిజనిత్యలోకాన్**
> **సాంతానికా నగమయో వనశైలనాథ ॥**

వనశైలనాథ = వనగిరిప్రభూ!, అయోధ్యికాన్ = అయోధ్యానగరములోని, సపశుకీటతృణాన్ = పశువులతో, కీటకములతో, గడ్డిపోచలతో కూడిన, జంతూన్ చ =

ప్రాణులనుకూడ, కింకర్మణః = ఏమి కర్మయోగమును చేసినవారినిగా, కీదృశవేదనాధ్యాన్ = ఎట్టి జ్ఞానయోగమును అనుష్ఠించినవారినిగా (తలచి), సాయుజ్య = సాయుజ్యరూపమైన మోక్షమును, లభ్య = పొందదగిన, విభవాన్ = వైభవములను కలవారినిగా, నిజనిత్యలోకాన్ = నీయొక్క నిత్యమైన లోకములగు, సాంతానికాన్ = సాంతానికలోకములను, ఆగమయః = పొందించితివి, బత ను = ఇది ఏమి ఆశ్చర్యము!

**"మునివన్ వేణ్ణ త్తిఅన్ విళఙ్గు మిలక్కుమనై ప్పిరిన్దాన్"** అనురీతిలో (దుర్వాసముని వచనానుసారము) లక్ష్మణుని విశ్లేషించిన శ్రీరాముడు ఆ వియోగమును సహింపలేక, మిక్కిలి బాధపడి, రాజ్యమును పరిత్యజించి, వైకుంఠమునకు పోవుటకు ప్రయత్నించినపుడు, అయోధ్యానగరములోని ప్రాణులన్నియు శ్రీరాముని శరణువేడి. "స్వామీ! నీవు ఎచటికి పోయినను, మమ్ములను నీతో తీసికొనిపోవలయును" అని ప్రార్థించినవి. శ్రీరాముడు వాని ఆర్తిని చూచి, సంతోషించి, "అట్లే" అని అంగీకరించి, అందఱిని తనతోపాటు రమ్మని పల్కి, ప్రయాణమయ్యెను. అపుడు ఆ నగరములోని మనుష్యులు మాత్రమే కాకుండ, పశువులు, పక్షులు, మొదలగు సమస్తప్రాణులును భగవానుని అనుసరించినవి. అట్లు పలువురితో కలిసిన శ్రీరాముడు సరయూనదీ జలములో మునిగి, తన లోకమునకు వేంచేయునపుడు, తన పట్ల అవిచ్ఛిన్నమైన భక్తినికల్గి తనతోపాటు సరయానదిలో మునిగి, దేహమును త్యజించిన ప్రాణులన్నిటికిని బ్రహ్మలోకముకంటె వేఱయిన, పరమపదమువలెనే అపునరావృత్తిని కల్గియుండుట అను వైలక్షణ్యమునుకల సాంతానికమను లోకమును అనుగ్రహించెను. - అని ఐతిహ్యము. దీనిని కులశేఖరులు **"అన్ఱు శరాశరఙ్గళై వైకున్దత్తేఱ్ఱి"** (10-9) అను పాశురములో అనుగ్రహించిరి. నమ్మాళ్వార్లు తిరువాయ్మొழிలో **"కఱ్పార్ ఇరామపిరానై యల్లాల్"** (7-5-1) అనెడి పాశురమునకు ఈ ఇతిహాసమును విషయముగా చేసి, వ్యాఖ్యానించిన పూర్వాచార్యులు కలరు. ఈ ఇతిహాసమును ఆధారముగా చేసికొనియే కూరేశులు ప్రకృత శ్లోకమును రచించిరి - అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. ఇంచుమించుగా ఇదియే ప్రమేయము. అతిమానుషస్తవములోని **"హా హంత! హంత! భవత శ్చరణారవింద"** (29) అనెడి శ్లోకమునను ప్రస్తుతింపబడినది. "తానుగాని, తన కొఱకు ఇతరులుగాని శరణాగతిని అనుష్ఠించినతప్ప భగవానుడు మోక్షమును ఇవ్వడు అనునది భగవద్రామానుజులవారి సిద్ధాంతము. ఇట్లుండగా, అయోధ్యలో శ్రీరాముడు తన లోకమునకు పోవలెనని వెడలినపుడు అతని వెంట పోవుటకు అంగీకరించిన పశు, పక్షి, కీటక, తృణాదులను అన్నిటిని సాంతానికలోకమునకు చేర్చెననుచున్నారే! ఇవి ఎట్టి కర్మయోగమును చేసినవి? దేవతార్చన, తపస్సు, తీర్థయాత్రాదిరూపములైన కర్మయోగప్రకారములలో దేనిని ఇవి ఆచరించినవి? అట్లే, ఏ జ్ఞానప్రయోగమును అనుష్ఠించినవి? సాయుజ్యమోక్షమును పొందదగిన ఫలమగు కార్యవైకుంఠలోక ప్రాప్తిని ఇవి ఎట్లు పొందినవి? అను సందేహము కల్గును. **"తే వయం భవతా రక్ష్యాః**



**భవద్విషయవాసినః"** అను రీతిలో భగవానుడు వేంచేసియున్న దివ్యదేశమున వాసమును చేయుటను ఆలంబనముగాగొని, అచటికి వచ్చిన వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షుల శ్రీపాదసంబంధమును వీనికి కల్గించి, తన్మూలమున పరంపరయా మోక్షప్రాప్తిని కల్గింపగోరిన భగవానుడు గోలోకము, సాంతానికము, ఇతిహాసపురాణాదులలో కార్యవైకుంఠము అని పిలవబడు చోటికి చేర్చును - అని వ్యాఖ్యానాంతరములో తెలుపబడినది. **"అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః"** అనుచు వాల్మీకి రామవిరహమువలన చెట్లు మొదలగు స్థావరములు సైతము దుఃఖమును అనుభవించినవి అనుటచే, భగవద్విరహాసహిష్ణుత్వరూపమగు జ్ఞానవిశేషరూపమైన భక్తి వానికి కలదని ఏర్పడుటచే, జ్ఞానయోగానుష్ఠానముకూడ సూచింపబడినది. ఈ అంశము **"కీదృశవేదనాధ్యాన్"** అను ప్రయోగముద్వారా ధ్వనించుచున్నదని వ్యాఖ్యానాంతరము. కాని, ఈ వివరణము భగవానుడు నిర్హేతుకకృపతో కరుణించునను సిద్ధాంతమునకు అనుకూలముగా తోచదు. చేతనుని రక్షణకు అతడు చేయు ప్రపత్త్యాదులు హేతులు కావనికదా పరమసిద్ధాంతము.

**(సాయుజ్యలబ్ధవిభవాన్ నిజనిత్యలోకాన్ సాంతానికాన్ ఆగమయః) - "లోకేషు విష్ణోః నివసంతి కేచిత్ సమీప మృచ్ఛంతి చ కేచి దన్యే, అన్యే తు రూపం సదృశం భజంతే సాయుజ్య మన్యే స తు మోక్ష ఉక్తః"** అని నిర్దేశింపబడిన సాయుజ్యమోక్షములో పొందదగిన, సంపద నిండిన, శ్రీవైకుంఠముతో సమానములై, భగవదనుభవానుకూలములగు సాంతానికలోకవిశేషములను - అని అర్థము. **"సపశుకీటతృణాన్"** - అనునపుడు శ్రీరామాయణము ఉత్తరకాండలోని - **"తతః సస్త్రీపుమాంస స్తే సపక్షిపశుబాంధవాః .....తిర్యగ్యోనిగతాశ్చైవ సర్వే రామ మనువ్రతాః"** (109-15-22) అను వచనము, **"సాంతానికాన్"** అనునపుడు **"లోకాన్ సాంతానికాన్ నామ యాస్యంతీమే సమాగతాః"** అను వచనమును స్మరణీయములు.

**(కింకర్మణో ను కీదృశవేదనాధ్యాన్)** - ఆ ప్రాణులు ఏ కర్మయోగమును చేసిన కల్గినవిగా, ఏ జ్ఞానయోగమును చేసినవిగా నీవు తలచితివి? కర్మయోగాదులు వేనియందును అన్వయము లేకున్నను, నీ నిర్హేతుకకరుణతోనే అనుగ్రహించితివికదా! ఆ విధముగానే ప్రకృతమునను మమ్ములను నిర్హేతుకముగా కరుణింపరాదా! - అని తాత్పర్యము. ఈ శ్లోకములోని మొదటి పాదమున **"ఆయోధ్యగాన్"** అను పాఠమునుగొని, శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో - **"అయోధ్యాసంబంధినో దేశా ఆయోధ్యాః, తాన్ గచ్ఛంతీతి తథోక్తాః, సాక్షాదయోధ్యావాసిన ఏవ న, అయోధ్యాసంబంధిదేశవాసినోఽపీత్యర్థః"** అని వ్యాఖ్యానింపబడినది. ఇది క్లిష్టమైన పాఠము. **"అయోధ్యకాన్ - ఇత్యత్ర ధన్వయోపధాత్ వుఞ్" (4-2-121) ఇతి యోపధలక్షణో వుఞ్భవాద్యర్థే".** **"ఆయోధ్యికాన్"** అనునదియే పెద్దలు ఆదరించిన ప్రమాణము. **"అయోధ్యాయాం భవాః ఆయోధ్యికాః"** అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య. **"అయోధ్యికాన్.**

**అయోధ్యగాన్ ఇతి పాఠద్వయ మప్యసాధు"** అని వ్యాఖ్యానాంతరమున కలదు. సహృదయులైన పాఠక విద్వాంసులే ఇచట ప్రమాణము. రెండవపాదములో **'బత'** అనుటకు **'వద'** అను పాఠాంతరము కలదు. **"కింకర్మణః"** అనునది ఒకే పదము. **"కిం కీదృశం కర్మ యేషాం తాన్"** అని విగ్రహము. **'ను'** అనునది ప్రశ్నార్థకము. **"మత్వా"** అను అసమాపకక్రియను రెండవపాదము చివర అధ్యాహారము చేసికొనవలెను. **"స్వకీయవిషయవాసతృప్త స్త్వం ప్రబలఫలప్రదోఽసీత్యాహ శ్లోకచతుష్టయేన"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని అవతారిక. వృత్తము వసంతతిలక.

**126. హరితవారణభృత్యసమాహ్వయం కరిగిరౌ వరద స్త్వ మపూర్వికామ్ ।**
**దృశ మలంభయ ఏవ హి సుందర స్ఫుట మదా శ్చ పరశ్శత మీదృశమ్ ॥**

సుందర = సుందరబాహుస్వామీ!, త్వం = నీవు, కరిగిరౌ = హస్తగిరిలో, వరదః = వరదరాజస్వామివై, హరితవారణభృత్య = పచ్చైవారణదాసులను, సమాహ్వయం = పేరును కలవానికి, అపూర్వికామ్ = అంతకుముందులేని, దృశమ్ = దృష్టిని, అలంభయః ఏవ హి = పొందించితివికదా!, ఈదృశం = ఇట్టి, పరశ్శతమ్ = వందలకొలది అభీష్టములను, స్ఫుటమ్ = స్పష్టముగా అందఱికి తెలియునట్లు, అదాః చ = ఇచ్చితివి కూడ.

శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతమగు వరదరాజస్వామితో, తిరుమాలిరుమ్‌శోలైలోని సుందరబాహుస్వామికినికల అభేదమును ఒకానొక ప్రసిద్ధమైన ఐతిహ్యమును ఉట్టంకించుట ద్వారా కూరేశులు ఇందు తెలుపుచున్నారు. **"పచ్చైవారణదాసర్"** అను ఒకానొక పరమ భాగవతోత్తముడు తిరుక్కచ్చినంబి వంశమునకు చెందినవాడు. (ఇతడు తిరుక్కచ్చినంబికి తండ్రి అని కొందఱు, పితామహుడని కొందరు, పినతండ్రి అని కొందఱును చెప్పుట కలదు). ఇతడు పుట్టుగుడ్డిగానుండి వరదరాజస్వామి అనుగ్రహముతో దృష్టిని పొందెనను ఐతిహ్యము కలదు. శ్రీయామునులు వరదరాజస్వామి విషయమున అనుగ్రహించిన **"యస్య ప్రసాద కలయా"** అనెడి శ్లోకములోని **"అంధః ప్రపశ్యతి"** అను ప్రయోగము ఈ ఐతిహ్యమును దృష్టిలో నుంచుకొనియే. దేశికులను **"కచ్చితనిల్ కణ్‌కొడుక్కుమ్ పెరుమాళ్ వన్దార్"** అనుచు హస్తిగిరిమాహాత్మ్యములో దీనినిగూర్చి పల్కిరి.

**(సుందర! కరిగిరౌ వరద స్త్వమ్)** – సుందరబాహుస్వామీ! **"వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరి స్స్వయమ్, వరద స్సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే"** అనునట్లు హస్తిగిరిలో వరదరాజస్వామివై సేవను అనుగ్రహించుచున్నావు.

**(హరితవారణభృత్యసమాహ్వయమ్ అపూర్వికాం దృశమ్ అలంభయ ఏవ హి)** ఇది ద్వికర్మక ప్రయోగము. ప్రస్తుత చెన్నై నగరమునగల**"పూవిరున్దమల్లి"** అను క్షేత్రమునకు సమీపమున గల "దాశరథిపేట" అను పేరును గల ముదలియాణ్డాన్ (దాశరథి) సన్నిధిలో వేంచేసియుండు



అర్చామూర్తికి హరితవారణుడని పేరు. యుధిష్ఠిరుడు ఒక పర్యాయము యాగము చేసినపుడు భగవానుడు పచ్చని వర్ణమునుకల ఏనుగురూపములో సాక్షాత్కరించెనని స్థలపురాణవచనము. ఈ పూవిరున్దమల్లిలోనే జన్మించిన పచ్చైవారణదాసుడు అను భక్తుడు అచటి అర్చామూర్తికి అంతరంగకైంకర్యమును చేయుటచే, అతనికి ఆ పేరు నిరూపకముగా ఏర్పడెనట. జన్మతః అంధుడగు అతడు ఒక్కసారి అయినను వరదరాజస్వామిని సేవింపవలెనని ఆశపడగా, స్వామి అతనిని కంచికి పిలిపించి, నేత్ర దృష్టిని ప్రసాదించెనట. ఈ సంఘటన యామునుల కాలమున జరిగినదని కొందఱు పెద్దలందురు. కూరేశులు ఈ వృత్తాంతమును ఇచట ప్రస్తావించుటద్వారా, ఆ విధముగానే తనకుకూడ దృష్టిని అనుగ్రహింపుమని వేడుచున్నారు" – అని వ్యాఖ్యానాంతరము.

**(ఈదృశం పరశ్శతం స్ఫుటమ్ అదా శ్చ)** – యాదవప్రకాశులవద్ద విద్యను అభ్యసించు భగవద్రామానుజులు భవిష్యత్తులో విశిష్టాద్వైతదర్శన ప్రవర్తకులగునట్లు అనుగ్రహింపవలసినదిగా వరదరాజస్వామిని ప్రార్థించుచు శ్రీయామునులు అనుగ్రహించిన, ప్రసిద్ధమైన శ్లోక మిచట అనుసంధేయము. **"యస్య ప్రసాదకలయా బధిరః శ్రుణోతి పంగుః ప్రధావతి జవేన చ వక్తి మూకః, అంధః ప్రపశ్యతి సుతం లభతే చ వంధ్యా తం దేవ మేవ వరదం శరణం గతోఽస్మి"**. అనునదియే ఆ శ్లోకము. ఇందు ప్రస్తావింపబడిన ఒక్కొక్క విషయమునకు ఒక్కొక్క వృత్తాంతము మూలమని పెద్దలందురు. పుట్టుచెవిటివాడొకడు వరదరాజస్వామికరుణతో శ్రవణేంద్రియశక్తిని పొందెనని కాంచీమాహాత్మ్యమున కలదు. శంఖ – లిఖితులను ఇద్దరు సహోదరులు వరదుని వేడి, కంటిచూపును, చేతులను, కాళ్ళను పొందిరని స్థలపురాణమున కలదు. వీరిలో శంఖుడు మొండిచేతులను, మొండికాళ్ళను కలవాడు. ఇతడు చేతులను, కాళ్ళను స్వామి అనుగ్రహమువలన పొంది, నదిని ఈదెనట. దానికే **"శెయ్యాఱు"** – (బాహుదా నది) అని పేరు. లిఖితుడు దృష్టిని పొందెను. జన్మతః మూగవాడొకడు వరదుని ఉపాసించి, గొప్ప కవనశక్తిని పొంది, మూకకవిగా ప్రసిద్ధిని పొందెను. పిమ్మట అతడు వరదరాజస్వామినిగూర్చి మందస్మితశతకమును రచించెనట. ఇది ఇంకను అముద్రితమట. పుత్రసంతానహీనులైన బ్రాహ్మణదంపతులొకరికి వరదుడు సంతానప్రాప్తిని కల్గించెనని పురాణములలో కలదు. ఆ విధముగానే, శ్రీయామునులు ప్రార్థించిన రీతిలో భగవద్రామానుజులు విశిష్టాద్వైతదర్శన ప్రవర్తకాగ్రేసరులగుట వరదరాజస్వామి అనుగ్రహమువలననే. ఈ వృత్తాంతమునన్నిటిని దృష్టిలోనుంచుకొనియే కూరేశులు **"ఈదృశం పరశ్శతమ్ స్ఫుటమ్"** అని పల్కిరి – అని వ్యాఖ్యానాంతరము. ద్రుతవిలంబిత వృత్తము.

**127. ఇహ చ దేవ! దదాసి పరాన్ వరాన్ వరద! సుందర! సుందరదోర్ధర ।**
**వనగిరే రభిత స్తట మావసన్ అఖిలలోచనగోచరవైభవః ॥**

వరద = వరదుడవగు స్వామీ!, సుందరదోర్ధర = సుందరములగు బాహువులను కలవాడా! సుందర = **"అఴ్కర్"** అను పేరును కలవాడా! దేవ = దేవా!, వనగిరేః అభితః = వనగిరి చుట్టును, ఇహ చ = ఇచటను, తటమ్ = కొండచఱియను, ఆవసన్ = నివాసముగా కలవాడవై, నిఖిలలోచన = అందఱి కన్నులకు, గోచరవైభవః = కన్పించు వైభవమును కలవాడవై, పరాన్ వరాన్ = కోరిన వరములను, దదాసి = ఇచ్చుచున్నావు.

హస్తిగిరిలో **"కరుతవరమ్ తరుమ్ దెయ్వప్పెరుమాళ్"** అనునట్లు నిలచిన వరదుడే ఇచట వనగిరిలో సుందరుడై, అందఱికి అన్నిటిని అనుగ్రహించుచున్నాడనుచున్నారు. సుందరబాహుస్వామియే హస్తిగిరిలో వరదరాజస్వామిగానున్నాడని ముందు తెలుపగా, ఇందు హస్తిగిరిలోని వరదరాజస్వామియే వనగిరిలో సుందరబాహుస్వామిగా సేవను అనుగ్రహించుచున్నాడనుచున్నారని – వ్యాఖ్యానాంతరము. **"శేషాద్రినిలయ స్సన్ జనేభ్యోఽధికాన్ వరాన్ దదాసీతి భావః"** అనుచు శ్రీనివాసాచార్యవ్యాఖ్యలో ఈ శ్లోకము వివరింపబడుట గమనార్హము.

**(వరద! సుందర! సుందరదోర్ధర! దేవ!)** – వరదరాజా! సుందరా! సుందరబాహుస్వామీ! దేవా! అను ఈ సంబోధనలవలనకూడ హస్తిగిరిలోని స్వామికి, వనగిరిలోని స్వామికి మధ్యగల ధర్మ్యైక్యము స్పష్టము.

**(అఖిలలోకలోచనగోచరవైభవః దదాసి వరాన్ పరాన్)** – **"వరం వరయ తస్మా త్త్వం యథాభిమత మాత్మనః, సర్వం సంపత్స్యతే పుంసాం మయి దృష్టిపథం గతే"** అనుచు ధ్రువుని చూచి భగవానుడు అనుగ్రహించినట్లు, అందరి కన్నులకు గోచరుడగునట్లున్న స్వామివలన లభింపని ఫలమున్నదా!–అను అర్థమునిచ్చు పై ప్రమాణములోని పదముల భావమే నాల్గవపాదమున వ్యక్తీకరింపబడినది. వృత్తము పూర్వమువలెనే ద్రుతవిలంబితము.

**128. ఇద మిమే శ్రుణమో మలయధ్వజం నృప మిహ స్వయ మేవ హి సుందర ।**
**చరణసాత్కృతవా నితి తద్వయం వనగిరీశ్వర! జాతమనోరథాః ॥**

వనగిరీశ్వర = వనగిరీశ్వరా!, సుందర = సుందరబాహుస్వామీ!, ఇమే వయమ్ = ఈ మేము, ఇహ = ఈ వనగిరిలో, మలయధ్వజనృపమ్ = మలయధ్వజుడు అను ప్రభువును, స్వయమ్ ఏవ = స్వయముగానే, చరణసాత్కృతవాన్ = (నీ) పాదములకు దాసునిగా చేసికొన్నవాడవు, ఇతి ఇదమ్ = అను ఈ వృత్తాంతమును, శ్రుణుమః = (పెద్దలు చెప్పగా) వినుచున్నాము, తత్ = అందుచే, జాతమనోరథాః =



అంతరంగకైంకర్యమును చేయుటలో అభినివేశమును కలవారమై, భవామః = అగుచున్నాము.

పెరియాఴ్వార్ తిరుమొఴిలోని **"కొన్నవిల్ కూర్ వేలకోన్ నెడుమాఱన్ తెన్ కూడల్ కోన్, తెన్నన్ కొణ్డాడుమ్ తెన్‌తిరుమాలిరుమ్‌శోలైయే"** (4-2-7) అను సూక్తిలో వివక్షితమైన, శ్రీమణవాళమహామునులుదాహరించిన ఇతిహాసముయొక్క సారము ఏమనగా – అగస్త్యమహర్షి నివసించు పర్వతమగు మలయమును చేరిన, "ధర్మమునే ప్రవర్తింపజేయుదును" అనుచు మలయపర్వతమును తనధ్వజమును గుర్తుగా చేసికొనుటచే మలయధ్వజుడు పేరును కల పాండ్యదేశప్రభువు ఒకడు కాశీనగరములో గంగయందు స్నానము చేయవలెనని యాత్రగా రథముపై బయలుదేరెను. అతని రథము వనగిరివద్దకు రాగానే నిలచిపోయెను. ఎంత ప్రయత్నించినను రథము కదలలేదు. అపుడు మలయధ్వజుడు – "ఇచట ఏదైన తీర్థవిశేషముగాని, భగవత్సన్నిధిగాని ఉండియుండవలెను" – అని తలచి, రథమును దిగి విచారింపగా, ఆ ప్రదేశమున సుందరబాహుస్వామి వేంచేసియున్నాడని తెలిసెను. అపుడు ఆస్వామి ఆ ప్రభువును "నీవు ఇచటి నదిలో స్నానముచేయు" మని నియమింపగా, అతడు నదియొక్క పేరును తెలిసికొని స్నానము చేయవలెను కావున, "ఇచటి నది పేరేమి?" అని ప్రశ్నించెను. అపుడు భగవానుడు – "పూర్వము నేను త్రివిక్రమావతారము నెత్తి లోకములను కొలిచినపుడు బ్రహ్మ నా పాదమును కడుగగా, నా పదనూపురమునుండి ఉద్భవించిన జల మిందు చేరినది. కావున దీనికి **"నూపురగంగ"** – **"శిలమ్బాఱు"** అని పేరు" అని సమాధానము పల్కెను. పిమ్మట మలయధ్వజుడు ఆ నదిలో స్నానము చేసి, గంగాస్నానమనోరథమును విడచినవాడై, వనగిరిలో అచటి స్వామియందు విశేషమైన భక్తి ప్రపత్తులను కలవాడై, మంటపప్రాకారాది నిర్మాణములను చేసెనని ఇతిహాస కథనము. దీనిని దృష్టిలో నుంచుకొనియే పెరియాఴ్వార్లు **"కొన్నవిల్ కూర్‌వేల్ కోన్"** ఇత్యాదిగా సాయించిరి. ఇందు మలయధ్వజుడని విశేషముగా కీర్తింపబడిన ప్రభువే **"ప్పరుప్పదత్తు క్కయల్ పొఱిత్త పాణ్డియన్ కులపతిపోల్"** (5-4-7) అను పెరియాఴ్వార్ తిరుమొఴి సూక్తియందు ప్రస్తావింపబడినాడు. దీనిని శ్రీమణవాళమహామునులు వివరించుచు – **"పాణ్డియవంశత్తు నిర్వాహకనా యిరుప్పానొరు రాజా, తానిరున్ద దేశత్తిల్ నిన్ఱుమ్ మహామేరు వళవుమ్ వఴియలుళ్ళ కాడు శీయ్‌త్తు వన్నియమఱుత్తు, త్తనక్కుమ్ తన పరికరత్తుక్కుమ్ పోకుమ్బడి పెరియవఴి యాక్కికొణ్డు శెన్ఱు మహామేరువిలే తన్ వెఱ్ఱియెల్లామ్ తోఱ్ఱుమ్బడి తన్నుడైయాళత్తైయు ముట్టుప్పోన్దాన్ – పురూరవసుత శ్రీమాన్ ఇంద్రద్యుమ్నో మహాబలః, తస్య పుత్రో మహాబాహుః మలయాచలకేతుమాన్, స విజిత్య నృపాన్ సర్వాన్ మేరో ర్దక్షిణపార్శ్వగాన్, మేరౌ స్వనామచిహ్నేన లిఖిత్వా నృపసత్తమః – ఎన్నక్కడవదితే"** అని సాయించిరి. పెరియాఴ్వార్లను తన సభకు ఆహ్వానించి, పరతత్త్వనిర్ణయమును చేయించి, శుల్కమును సమర్పించిన, **"అణికోట్టియర్‌కోన్**

**అభిమానతుఙ్గన్ శెల్వన్"** అని కీర్తింపబడిన శెల్వనంబిని అమాత్యునిగాకల ప్రభువు ఇతడే కావచ్చునని వ్యాఖ్యానాంతరము. దేశికులు హంససందేశకావ్యములో **"ఈశా దస్త్రాణ్యధిగతవతాం క్షత్రియాణాం ప్రభావాత్"** అనెడి సూక్తిలో ఇతనిని గూర్చి ప్రస్తావించిరి.

ఇట్టి నీ భక్తుడగు మలయధ్వజుని నీ పాదసేవాధురంధరునిగా చేసికొంటివను ఐతిహ్యమును మేము పెద్దలవలన వింటిమి. స్వామీ! అతనివలెనే మమ్ములనుకూడ అనుగ్రహించి, నీ అంతరంగకైంకర్యమును చేసికొను అదృష్టమును కల్గింతువను ఆశతో నున్నాము - అని తాత్పర్యము. ఈ విధముగా 125 వ శ్లోకమునుండి ఈ 128వ శ్లోకమువరకు 4 శ్లోకములలో సుందరబాహుస్వామియొక్క వాంఛితఫలప్రదత్వము నిరూపింపబడినది. వృత్తము ద్రుతవిలంబితము.

**129. విజ్ఞాపనాం వనగిరీశ్వర! సత్యరూపా**
**మంగీకురుష్వ కరుణార్ణవ! మామకీనామ్ ।**
**శ్రీరంగధామని యథాపుర మేష సోఽహం**
**రామానుజాచార్యవశగః పరివర్తిషీయ ॥**

కరుణార్ణవ = కరుణాసముద్రా!, వనగిరీశ్వర = వనగిరిప్రభూ! మామకీనాం = నాయొక్క, సత్యరూపాం = నిజమైన, విజ్ఞాపనాం = విన్నపమును, అంగీకురుష్వ = అంగీకరింపుము, శ్రీరంగధామని = శ్రీరంగనగరమునందు, యథాపురం = పూర్వమువలె, ఏషః సః అహం = ఆ ఈ నేను, రామానుజార్యవశగః = భగవద్రామానుజుల అధీనములో నున్నవాడనై, పరివర్తిషీయ = (వారి) సమీపమున వర్తింతును గాక!

సుందరబాహుస్వామి కల్యాణగుణానుభవము పూర్వశ్లోకముతోనే పూర్తి అయినది. ఇకపై నాల్గుశ్లోకములలో తమ అభీష్టమును స్వామి సన్నిధిలో కూరేశులు విజ్ఞాపించుచు, స్తుతిపరిసమాప్తిని చేయుచున్నారు. ఈ స్తవమును కూరేశులు రచించునపుడు భగవద్రామానుజులు తిరునారాయణపురము (మేల్కోటె)లో వేంచేసియుండుటయు, వారిని విశ్లేషించిన, తాము శ్రీరంగములో నివసింపలేక, తిరుమాలిరుమ్‌శోలై క్షేత్రములో నివసింపవలసివచ్చుటయును సంభవించినది. ఆ విధముగా తమకు ఏర్పడిన ఆచార్యవిశ్లేషము సహింపరానిదియై యుండుటచే, ఈ విశ్లేషవ్యసనము తొలగవలెనని ఇందు కూరేశులు ప్రార్థించుచున్నారు. ఈ స్తుతిప్రారంభమున **"తత ఇహ సుందరోరుబాహుం స్తోష్యే తచ్చరణవిలోకనాభిలాషీ"** అని పల్కుటయు ఇచట స్మరింపనగును.

**(కరుణార్ణవ! వనగిరీశ్వర!)** కరుణాసముద్రుడవైన వనగిరిప్రభూ!

**(సత్యరూపాం మామకీనాం విజ్ఞాపనా మంగీకురుష్వ)** - దాసుడనగు నా యథార్థమైన



విన్నపమును అంగీకరింపుము. ఆ విజ్ఞాపనమేది? అని అందువా! వినుము. **"ఏష సోఽహమ్ - ఇదానీ మాచార్య విశ్లేషవిషణ్ణహృదయః, తత్సంశ్లేషార్థం భవత్స్తుతిప్రవృత్తోఽహమ్"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **(అహం యథాపురం శ్రీరంగధామని ఏకతః రామానుజాచార్యవశగః పరివర్తిషీయ)** - నేను పూర్వమువలెనే శ్రీరంగమున ఒకమూల భగవద్రామానుజుల పాదచ్ఛాయలో ఉజ్జీవింపవలెను. రామానుజులు శ్రీరంగమునకు చేరగా, నేను వారి పాదములను చేరి, జీవించునట్లు కృపజేయుమని తాత్పర్యము. కూరేశులు ప్రత్యేకముగా శ్రీరంగనాథుని స్తుతింపకున్నను, అతిమానుషస్తవప్రారంభములో రెండు శ్లోకములతో, ఇందు నాల్గుశ్లోకములతో శ్రీరంగనాథుని ప్రస్తుతించుటయేగాక, చివరగా శ్రీస్తవమును శ్రీరంగనాయకి విషయమున రచించిరి. భగవత్కైంకర్యముకంటె భాగవతకైంకర్యము, దానికంటె ఆచార్యకైంకర్యమును గొప్పవి - అను అర్థవిశేషమును కూరేశులిచట **"రామానుజార్యవశగః పరివర్తిషీయ"** ఇత్యాదిసూక్తిద్వారా సూచించిరి - అని వ్యాఖ్యానాంతరము. **"సుందరబాహోః సర్వాభీష్టప్రదత్వేఽపి తత్త్వజ్ఞైః శ్రీవత్సచిహ్నమిశ్రైః ఆచార్యవశవర్తిత్వస్యైన పరమపురుషార్థతయా ప్రార్థితత్వాత్ ఇద మేవ సర్వోత్తీర్ణ మితి నిర్ణయః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము వసంతతిలక.

**130. కిం చేదం చ విరించిభావన! వనాద్రీశ! ప్రభో! సుందర!**
**ప్రత్యాఖ్యానపరాఙ్ముఖో వరదతాం పశ్య న్నవశ్యం శ్రుణు ।**
**శ్రీరంగశ్రియ మన్వహం ప్రగుణయం స్త్వద్భక్తభోగ్యాం కురు**
**ప్రత్యక్షం సునిరస్త మేవ విదధత్ ప్రత్యర్థినాం ప్రార్థనమ్ ॥**

విరించిభావన = బ్రహ్మను సృష్టించినవాడా!, వనాద్రీశ = తిరుమాలిరుమ్‌శోలైలోని పర్వతమునకు అధిపతీ! ప్రభో = ప్రభూ!, సుందర = **"అழకర్"** అను పేరును కలవాడా! కిం చ ఇదం చ = పూర్వశ్లోకములో విన్నవించినదియేకాక, దీనినికూడ, ప్రత్యాఖ్యాన = నిరాకరించుటలో, పరాఙ్ముఖః = అభిప్రాయమును లేనివాడవై, వరదతాం = అర్థించిన వరముల నిచ్చు స్వభావమును, పశ్యన్ = కటాక్షించుచు (కల్గియున్నవాడవై), అవశ్యం = తప్పక, కురు = చేయుము, ప్రత్యర్థినాం = ఆశ్రితవిరోధుల, ప్రార్థనం = ప్రార్థనను, ప్రత్యక్షం = మాముందే, సునిరస్తం = బాగుగా నిరసింపబడినదిగా, విదధత్ ఏవ = చేయుచునే, అన్వహం = ప్రతిదినము, త్వద్భక్తభోగ్యాం = నీ పట్ల భక్తినికల భగవద్రామానుజులవంటివారికి భోగ్యమైన, శ్రీరంగశ్రియం = శ్రీరంగములోని సంపదను, ప్రగుణయన్ = మఱింతగా, మఱింతగా వృద్ధిచేయుచున్నవాడవై, కురు = చేయుము.

పూర్వశ్లోకమున విన్నవించిన ప్రార్థనయే ఇందు మరింతగా వివరింపబడుచున్నది.

**(విరించిభావన! వనాద్రీశ! ప్రభో! సుందర!)** – లోకములను రక్షింపగోరి, నాభీపద్మమున బ్రహ్మను సృష్టించిన సుందరబాహుస్వామీ!

**(వరదతామ్ పశ్యన్)** – దాసులు ప్రార్థించినవానిని ఇచ్చుట – అను స్వభావమును కలవాడవై, **(ప్రత్యాఖ్యానపరాఙ్ముఖః)** – ఉపేక్షింపకుండ – అని అర్థము. అనగా, **"నెతికాట్టి నీక్కుదియో"** అను రీతిలో సాధనాంతరములలో ప్రవేశించునట్లు చేయకుండ – అని భావము.

**(కించ ఇదం చ అవశ్యం శ్రుణు)** – పూర్వశ్లోకములో విన్నవించినదియే కాక, దీనిని కూడ వినుము. అది ఏమి? అనగా –

**(ప్రత్యర్థినాం ప్రార్థనం ప్రత్యక్ష మేవ సునిరస్తం విదధత్)** – "నావలెనే ప్రత్యర్థులును నిన్ను విపరీతముగా దేనినైనను ప్రార్థింపవచ్చును. ఆ ప్రార్థన సత్పురుషులకు హానికరము. కావున నీవు వానిని అనుగ్రహింపకుండ, మాముందే వానిని తిరస్కరింపుము" అని అనిష్టనివారణ ప్రార్థనము దీనిచే సూచింపబడినది.

**(శ్రీరంగశ్రియమ్ అన్వహం ప్రగుణయన్ త్వద్భక్తభోగ్యాం కురు)** – దీనిచే ఇష్టప్రాపణ ప్రార్థన చేయబడినది. శ్రీరంగక్షేత్రములోని సంపదను ప్రతిదినము వృద్ధిచేయుచు, దానిని నీ భక్తులకే భోగ్యమగునట్లు చేయుము. **"శ్రీమన్! శ్రీరంగ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ"** అని, **"శ్రీరంగనాథో జయతు శ్రీరంగ శ్రీ శ్చ వర్ధతామ్"** అని, **"అరఙ్గనకర్ వాழ்"** అనియు ప్రపన్నులు నిత్యము స్వామి ఆరాధన చివర ప్రార్థించుటకు మూలమిది. క్రిమికంఠుడు మొదలగు కొందఱు దుర్మార్గులు ఆ దినములలో భగవద్రామానుజ, కూరేశ, మహాపూర్ణాదులకు కల్గించిన పలు క్లేశములను దృష్టిలోనుంచుకొని, శ్రీరంగక్షేత్రమునకు ఏర్పడిన పలు ఉపద్రవములను మనసుననుంచుకొని కూరేశులు ఇట్లు ప్రార్థించిరి. సర్వజ్ఞుడగు సుందరబాహుస్వామికి ఇదికూడ తెలియదా! ఇట్లు ప్రార్థింపవలెనా? – అని భావింపరాదు. సత్పురుషులపట్ల గల గౌరవాతిశయమువలన ఇట్లు ప్రార్థింపబడినది – అని వ్యాఖ్యానాంతరము. **"ప్రత్యర్థినిరసన ప్రార్థనానుగుణః పర్యవసితోऽర్థః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. వృత్తము శార్దూలము.

**131. కారుణ్యామృతవారిధే! వృషపతే! హే సత్యసంకల్పన!**
**శ్రీమన్! సుందర! యోగ్యతావిరహితానుత్సార్య సద్వత్సల ।**
**క్షామ్యన్ సాధుజనైః కృతాం స్తు నిఖిలానేవాపచారాన్ క్షణాత్**
**తద్భోగ్యా మనిశం కురుష్వ భగవన్! శ్రీరంగధామశ్రియమ్ ॥**



కారుణ్య + అమృతవారిధే = కరుణ అను అమృతమునకు సముద్రమువంటివాడా!, వృషపతే = ధర్మమే మూర్తీభవించిన వృషాచలమనబడు వనగిరికి ప్రభూ!, హే సత్యసంకల్పన = తలచినది తలచినట్లు నిర్వహింపగల సామర్థ్యమును కలవాడా!, భగవన్ = జ్ఞానాదిగుణషట్కమును పూర్ణముగాకలవాడా!, శ్రీమన్ = లక్ష్మీసహితుడా! సుందర = **'అழகర్'** అను పేరును కలవాడా! యోగ్యతావిరహితాన్ = అయోగ్యులను, ఉత్సార్య = తఱిమి కొట్టి, సాధుజనైః = సత్పురుషులచే, కృతాన్ = చేయబడిన, నిఖిలాన్ = అపచారాన్ = సమస్తములైన, కృత్యాకరణ, అకృత్యకరణరూప అపచారములను (పాపములను), క్షణాత్ ఏవ = ఒక క్షణములోనే, క్షామ్యన్ = క్షమించుచు, శ్రీరంగశ్రియం = శ్రీరంగనాథుని సంపదను, తద్భోగ్యాం = ఆ సత్పురుషులకు భోగ్యమగునట్లు, అనిశం = ఎల్లప్పుడు, కురుష్వ = చేయుము.

పూర్వము రెండు శ్లోకములలో చేసిన ప్రార్థనకు శేషమే ఈ శ్లోకములోని ప్రార్థన కూడ. **"ఇత్థం ప్రార్థిత మర్థ మేవ ఆదరప్రకర్షేణ పున రపి ప్రకారాంతరేణ ప్రార్థయతే"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(కారుణ్యామృతవారిధే)** – కరుణకు అమృతసముద్రమువంటివాడా! పరదుఃఖాసహిష్ణుత్వమే కారుణ్యమగుటచే, దానినికల నీకు నేను ప్రార్థించుట అధికముగా తోచునుకదా! అని భావము. **"సామాన్యతః పరదుఃఖాసహిష్ణో రాశ్రితక్లేశోపేక్షా న యుక్తేతి భావః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **(వృషపతే)** – వృషాద్రిపతీ! అని భావము. వృషాద్రి అనబడు తిరుమాలిరుమ్‌శోలైకు ప్రభూ! శ్రీవైకుంఠము, క్షీరాబ్ధి మొదలగువానిని విడచి నీవు ఇచట వేంచేసియుండుటను భావింపవలెనని సారము. దీనివలన సౌలభ్యము సూచితము.

**(సత్యసంకల్పన)** – సత్యసంకల్పుడవగు నీకు ఏది అయిననూ సంకల్పమాత్ర సాధ్యమైయుండగా, ఆ సత్యసంకల్పమునకు ఇపుడు వచ్చిన దుర్భిక్షమేమి? అని హార్దభావము. **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః – ఇత్యాది భవదుక్తివత్, ద్వయ మర్థానుసంధానేన సహ సదేవం వక్తా యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖ మాస్స్వ ఇతి రామానుజార్య ముద్దిశ్య సంకల్పితం కిలేతి సంబుద్ధే రభిప్రాయః"** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(శ్రీమన్)** పురుషకారస్వరూపిణియైన లక్ష్మితో కూడియున్నవాడా.

**(భగవన్ సుందర!)** – జ్ఞానశక్త్యాదిగుణషట్కమును కలవాడా! నీ దివ్యరూపసౌందర్యములోనే ఆసక్తులమగు మేము ఈ అందమునకు **"నిత్య శ్రీః నిత్యమంగళమ్"**ను మంగళాశాసనము చేయవలెనే తప్ప, వేఱేమియు ప్రార్థించుట తగదు. అయినను ప్రార్థింపవలసినట్లు ఏర్పడినది – అని భావము. నీ జ్ఞానాదిగుణషట్కము అడవికాచిన వెన్నెల కాకుండ సఫలమగుటకు ప్రార్థించుచున్నాముసుమా!

**(సద్వత్సల)** – నీ వాత్సల్యమను గుణవిశేషము మమ్ములను ప్రార్థించునట్లు చేయుచున్నది.

**‘‘మధ్యే ప్రకృతిసంబంధనిబంధనాపచారప్రసంగశంకాయా మాహ’’** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(యోగ్యతావిరహితాన్ ఉత్సార్య) – “నల్లార్కళ్ వాழுమ్ నళిరరఙ్గమ్”** అని కీర్తింపబడినట్లు సత్పురుషులు మాత్రమే నివసించుచోటు అగు శ్రీరంగమున ఇపుడు వ్యాపించియున్నవారు అయోగ్యులే కదా! వారిని అచటినుండు పారదోలుము.

**(సాధుజనైః కృతాన్ నిఖిలాన్ ఏవ అపచారాన్ క్షణాత్ క్షమస్వ)** – నీకు ప్రాణసములగు సత్పురుషులు నీ వాత్సల్యమును నమ్మి, ప్రమాదవశమున అపచారపడినను, ఆ అపచారములను ఒక్క క్షణములో క్షమింపుము.

**(శ్రీరంగధామశ్రియమ్ అనిశం తద్భోగ్యాం కురుష్వ)** – శ్రీరంగములోని సంపద ప్రతిదినము సత్పురుషలకే భోగ్యమగునట్లు చేయవలెను. ఇంతకంటె వేఱు ప్రార్థన లేదు. **“రామానుజార్య తచ్ఛిష్యప్రశిష్యాదిసాత్త్వికజనానుభావ్యాం కురుష్వేత్యర్థః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్యలోని వివరణము.

**132. ఇదం భూయోభూయః పున రపి చ భూయః పున రపి**
**స్ఫుటం విజ్ఞీప్సామీత్యగతి రబుధోఽనన్యశరణః ।**
**కృతాగా దుష్టాత్మా కలుషమతి రస్మీత్యనవధే**
**ర్దయాయా స్తే పాత్రం వనగిరిపతే సుందరభుజ ॥**

వనగిరిపతే = తిరుమాలిరుమ్శోలై పర్వతమునకు ప్రభూ! సుందరభుజ = సుందరబాహుస్వామీ!, అగతిః = నీవు తప్ప వేఱు ఉపాయమును లేనివాడను, అబుధః = జ్ఞానహీనుడను, అనన్యశరణః = నీవు తప్పవేఱు శరణమును లేనివాడను అగు నేను, ఇదమ్ = దీనిని, స్ఫుటమ్ = స్ఫుటముగా, భూయః భూయః భూయః = మఱల, మఱల, మఱల, పున రపి పున రపి చ = మాటిమాటికిని, విజ్ఞీప్స్యామి = విన్నవించుచున్నాను, కృతాగాః = పాపములను చేయువాడనుగా, దుష్టాత్మా = దుష్టస్వభావమును కలవాడనుగా, అస్మి ఇతి = ఉన్నాను అని (కావుననే), తే = నీయొక్క, అనవధేః = అంతులేని, దయాయాః = దయకు, పాత్రమ్ = యోగ్యుడను, అస్మి = అగుచున్నాను.

కూరేశులు నైచ్యానుసంధానమే మూర్తీభవించినవారని ప్రసిద్ధి. శ్రీమణవాళమహామునులు యతిరాజవింశతిలో **“వాచామగోచరమహాగుణదేశికాగ్ర్యకూరాధినాథకథితాఖిలనైచ్య”** అని కూరేశులకు నైచ్యానుసంధానమే నిరూపకమని తోచునట్లు పల్కిరి కదా! అట్లు తమకు అసాధారణసంపద అగు నైచ్యానుసంధానమును వ్యక్తీకరించు ఈ శ్లోకముతో కూరేశులు ఈ స్తుతిని ముగించుచున్నారు. **“ఆగతిః, అబుధః, అనన్యశరణః, దుష్టాత్మా, కలుషమతిః”** అను విశేషణములు తమకు పర్యాయపదములుగా కూరేశులు



తలచిరి కాబోలు! **“నోற்ற நோன்பிலேன்”, “నీశనేన్ నిఱై వొన్ఱుమిలేన్, పుకలొన్ఱిల్లా వడియేన్”** అనియు నమ్మాళ్వార్లు, **“పావమే శెయ్దు పావియానేన్”** అని తిరుమఙ్గై మన్నన్ – ఇత్యాదిగా పలువురు దివ్యసూరులు, **“అమర్యాదః క్షుద్రః చలమతిః”** ఇత్యాదిగా ఆళవన్దార్వంటి పూర్వాచార్యులు అనుసంధించిన నైచ్యానుసంధానముయొక్క పరాకాష్ఠ కూరేశులయందు రూపొందినది.

**(వనగిరిపతే! సుందరభుజ!)** – వనగిరిపతీ! సుందరబాహుస్వామీ!

**(ఆగతిః)** – ఉపాయశూన్యుడను – కర్మయోగానుష్ఠానము చేయనివాడను – అని భావము.

**(ఆబుధః)** – జ్ఞానయోగరహితుడను. **“అబుధపదసమభివ్యాహారా దగతిపదం కర్మరాహిత్య పరమ్”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(అనన్యశరణః)** – కావుననే నీవుతప్ప వేఱు శరణము లేనివాడను. **“తదుభయసాధ్యభక్త్యభావస్య సిద్ధత్వాత్ త్వదేకశరణ ఇత్యర్థః”** అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య.

**(ఇదమ్ భూయోభూయః పున రపి చ భూయః పున రపి స్ఫుటం విజ్ఞీప్స్యామి)** – దీనినే మఱల మఱల, తిరిగి తిరిగి విన్నవించుచున్నాను. **“విజ్ఞీప్స్యామి”** అను పదముయొక్క తత్త్వమును తెలియనివారు దీనిని **“విజ్ఞాప్స్యామి”** అని మార్చిరి. కాని, అట్టి క్రియారూపమే రాదు. **“విజ్ఞీప్సామి”** అనగా **“విజ్ఞాపయామి”** అని అర్థము. **“విజ్ఞాపయితు మిచ్ఛామి”** – విన్నవింపగోరుచున్నాను–అను అర్థమున **“విజ్ఞీప్స్యామి”** అను రూపము వచ్చును – అని సంస్కృతవ్యాఖ్యాత తెలుపుట పూర్వోక్త అసాధ్యపాఠమును దృష్టిలోనుంచుకొనియే కావచ్చును” అని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య.

**(ఇతి)** – చేసిన విజ్ఞప్తినే మఱల మఱల చేయుచున్నాను – అను దోషము కారణమువలన, **(కృతాగా దుష్టాత్మా కలుషమతిః అస్మి ఇతి)** – అపరాధిని, దుష్టస్వభావుడను, కలుషితబుద్ధిని కలవాడనై యున్నాను, కావున

**(ఇతి)** – అని తలచి–అని భావము. ఇవి అన్నియు అధికారివిశేషణములు. కావున

**(తే దయాయాః పాత్రమ్)** – నీ దయకు పాత్రుడనగుచున్నాను. నీ దయాగుణము దాసుని పట్ల తప్పక ప్రసరించుటకు తగిన విషయము నాయందు పుష్కలముగా నున్నదని విన్నవించుచు – కూరేశులు స్తుతిని ముగించిరి **“సకృద్విజ్ఞాపనస్యైవ పర్యాప్తత్వేఽపి ఉన్మత్తచిత్తవత్ అసకృద్విజ్ఞాపన మపరాధ ఏవ. తతోః గురుచరణవిరహవిషణ్ణోఽహం పరదుఃఖాసహిష్ణుతారూపాయాః కేవలకృపాయాః పాత్ర మితి మత్వా విజ్ఞాపితం నిర్వర్తయేతి భావః”** – ఒకమాఱు విన్నపించిననే సరిపోవుచుండగా, పిచ్చివానివలె మాటిమాటికి విన్నపించినదానినే విన్నపించుట అపరాధమే అగును. అందుచే, ఆచార్యశ్రీపాదవిశ్లేషముచే మిక్కిలి దుఃఖించుచున్న నేను, పరదుఃఖాహిష్ణుతారూపమైన నీ సహజదయకు పాత్రుడనని తలచి, నా విజ్ఞాపనను సఫలము చేయుము – అని శ్రీనివాసాచార్యవ్యాఖ్య. **“కున్ఱనైయ**

**కుఱ్ఱమ్ శెయ్యినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** అను రీతిలో కొండలంత దోషములను కూడ గుణముగా తలచు స్వామి వాత్సల్యగుణమును ఇచట పునఃపునః **"సద్వృత్యల"** ఇత్యాదిగా ప్రధానముగా పేర్కొనుట శరణాగతిసాఫల్యార్థము - అని పెద్దల సుద్ది. వృత్తము శిఖరిణి. వనగిరి శిఖరనివాసి అయిన సుందరబాహు స్వామిని స్తుతించు ఈ స్తుతిని కవి శిఖరిణీవృత్తముతో ముగించుటయును ఒకవిధమైన వృత్తౌచిత్యమే. ఈ స్తుతిలోని శ్లోకసంఖ్య 132. ఈ సంఖ్యలోని అంకెలను కలుపగా వచ్చు సంఖ్య 1+3+2=6. **"షట్పదోఉ యమ్"** అని కీర్తింపబడు ద్వయమంత్రము యొక్క అర్థమును సమగ్రముగా అనుసంధించు ఈ స్తుతిలోని శ్లోకసంఖ్య ఈరీతిలో ద్వయ మంత్రమును లక్షించుటకూడ ఒక చమత్కారము.

**నూతనభూతపురప్రియ యతివర భవతః పదాబ్జయుగసవిధే ।**
**అర్పిత మేతత్ భక్త్యా స్వామిన్ స్వీకురు సుమం వాచామ్ ॥**

సుహృదాం రంగనాథార్యస్వామినాం ప్రేరణా దియమ్ ।
విజ్ఞప్తా భావనావ్యాఖ్యా సతాం మోదాయ కల్పతామ్ ॥

వాచామగోచరమహాగుణదేశికాగ్ర్య-
కూరాధినాథకథితాం మధురార్థపూర్ణామ్ ।
దేవస్య సుందరభుజస్య నుతిం వివవ్రే
ధ్యాయన్ తదీయచరణౌ హృది శింగరార్యః ॥

**జయతు జయతు దేవః కేశవః క్లేశహారీ**
**జయతు జయతు నాథో భాష్యకారో యతీనామ్ ।**
**జయతు జయతు నిత్యం కూరనాథో మహాత్మా**
**జయతు జయతు భవ్యా భారతీ తస్య దివ్యా ॥**

**శ్రీ సుందరబాహుస్తవ భావనా వ్యాఖ్యానము - సంపూర్ణము**

---

## అనుబంధము
## అఴకర్ అన్దాది

ద్రావిడభాషలో పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ అను మహనీయులు రచించిన అష్టప్రబంధము అనబడు ఎనిమిది ప్రబంధములలో **"అఴకర్ అన్దాది"** ఒకటి. ఇది అన్దాదిరీతిలో సుందరబాహుస్వామినిగూర్చి కట్టళైకలిత్తుఱై ఛందస్సులో రచింపబడిన 100 పాశురములను కల్గియున్నది. అత్యంతరస్యమగు ఈ ప్రబంధమునుండి ఉదాహరణకై రసపుంజములనదగిన నాల్గు పాశురములు సహృదయుల సన్నిధిలో నివేదింపబడుచున్నవి.



1. **నీరాఴివణ్ణనై ప్పాలాఴినాదనై నిన్మలనై**
**చ్చీరాఴియఙ్కై త్తిరుమకళ్కేళ్వనై ద్దెయ్వప్పుళ్ళూర్**
**కూరాఴిమాయనై మాలలఙ్కారనై క్కొఱ్ఱవెయ్యా**
**నోరాఴిత్తేర్ మఱైత్తానై యెఞ్ఞాన్ఱు మ్మఱై నెఞ్జమే**

మనసా! నీటితో నిండిన కడలివంటి నల్లని వర్ణమును కలవాడు, పాలకడలిలో పరుండియున్న స్వామి, దోషరహితుడు, చక్కని అంగుళీయకములను దాల్చిన, అందమైన చేతులనుకల లక్ష్మికి ప్రభువు, దివ్యమైన, గొప్పపక్షి అగు గరుత్మంతుని వాహనముగా గొని సంచరించువాడు పదునైన సుదర్శనమను ఆయుధమును కుడిచేతిలో ధరించినవాడు విచిత్రమైనశక్తిని కలవాడును, జయశీలుడగు సూర్యుని ఏకచక్రరథమును చక్రాయుధముతో మఱుగుపఱచినవాడును మహిమనుకలవాడును అగు సుందరబాహుస్వామిని ఎల్లప్పుడు స్తుతింతుము.

2. **వినైక్కు మరున్దరిక్కుమ్ పిణిమూప్పుక్కుమ్ వీకిన్టవై**
**తనైక్కు మరున్దన్న తాళఴకా శెయ్యతామరైయ -**
**జ్జనైక్కు మరున్దముదే యరుళాయ్ నిన్నై క్కాదలిత్తు**
**నినైక్కు మరున్దదితన్నుయిర్ వాఴ్క్కైనిలైపెఱవే**

నిన్ను శరణుపొందినవారి ద్వివిధకర్మలనెడి బాధలను నశింపజేయుటకు, మందులకు నయముకాకుండ బాధించు మిక్కిలి క్రూరములగు వ్యాధులు, వార్ధక్యము - అను వీనిని నిర్మూలించుటకు, మరణవేదనను పోగొట్టుటకును తగిన దేవామృతమువంటి శ్రీపాదములనుకల సుందరబాహుస్వామీ! ఎఱ్ఱతామరలో వేంచేసియున్న సుందరీమణి అగు లక్ష్మీదేవి అనుభవింపతగిన అమృతమువంటివాడా! నిన్ను కోఱి తలచియున్న, అరుంధతివంటి ఈకన్యకయొక్క ప్రాణోజ్జీవనము స్థిరముగా నుండునట్లు కరుణింపుము. (ఈపాశురమును కవి నాయికాభావనతో పల్కిరి. ఇందు నాయిక ప్రేమార్తిని ఆమె చెలికత్తె నాయకునితో తెల్పినది)

3. **అఴక్కన్టియ కరుఙ్కణ్ణిక్కు క్కణ్ణి యళిత్తిలరేల్**
**వఴక్కన్టి మున్ కొణ్డవాల్వళైకేళు మఱుత్తదుణ్డే -**
**ఱ్ఱఴక్కన్టిన్ పిన్కుఴలూదలఙ్కారర్క్కు క్కోదైనల్లీర్**
**కఴక్కన్టిల్ వాయ్పిళన్దాలుయ్యలా మెన్టు శాఱ్ఱుమినే**

పూమాలవలె సుకుమారులైన వనితలారా! కన్నీరు విడచి, దుఃఖించుటచే కందిపోయిన నల్లని కన్నులనుకల ఈ కన్యకొఱకు, తమ మాలికను నాయకుడు అను గ్రహించిపనివాడైనచో, అన్యాయముగా పూర్వము ఈమెనుండి బలవంతముగా అపహరించిన అందమైన గాజులను అయినను తిరిగి ఇమ్మనుడు. వాటినికూడ అతడు ఇవ్వకుండ

అడ్డముపెట్టినచో, లేతవయస్సులోనున్న గోవులవెంట పిల్లనగ్రోవిని ఊదుచు పోవు సుందరుడగు ఆ నాయకునితో, దుష్టమైన క్రౌంచపక్షినోటిని చీల్చినపుడే ఈమె జీవింపగలదని పల్కుడు. (ఈపాశురము – నాయిక విరహవేదనను చూచి సహింపలేని ధాత్రి, చెలికత్తెలద్వారా నాయకునివద్దకు సందేశమును పంపురీతిలో నున్నది)

**4. ఎనక్కావియజ్ముముదలిజ్మమాకి యిరుప్పదైచ్చ**
**న్దనక్కావియ జ్మున్దమరవణ్దీర్ శొల్లు న్తత్తువనూల్**
**కనక్కావియ జ్మవివల్లోర్ పుకழలజ్మారనుక్కు**
**వనక్కావియజ్మణ్ణి మామలరాణ్మణవాళనుక్కే**

చందనోద్యానములలో పరిమళమును ఆస్వాదించుటకై సంచరించు స్వభావమునుకల, మధురముగా ధ్వనించు తుమ్మెదలారా! తత్త్వశాస్త్రములలో, గొప్ప కావ్యములలో, కవిత్వమును చెప్పుటలో సమర్థులగు పెద్దలచే స్తుతింపబడిన సుందరుడు, నీటిలోనున్న నీలోత్పలమువంటి అందమైన కన్నులను కల్గినది, తామరపూవులో నివసించునది అగు లక్ష్మీదేవికి ప్రభువును అయిన నాయకునితో – "నా శరీరము మాత్రము ఇచట ఉన్నది తప్ప, ప్రాణములు అచటనే ఉన్నవి" – అని పలుకుడు.

(నాయకుని విశ్లేషించిన నాయకి తుమ్మెదలద్వారా నాయకుని వద్దకు దౌత్యమును పంపుచు, తన ప్రేమాతిశయమును, విరహవేదనను తెల్పురీతిలో ఈ పాశురము రచింపబడినది).

## శ్లోక సూచిక

**శ్లోకము - సంఖ్య**







**శ్లోకము - సంఖ్య**

**శ్లోకము - సంఖ్య**

**శ్లోకము - సంఖ్య**

